# భారతంలో చిన్నకథలు

రసమయ నీతికథాసాగరం

అక్టోబర్ 2006

| | | |
|---|---|---|
| ప్రతులు | : | 1000 |
| ముఖచిత్రం | : | |
| లోపలి బొమ్మలు | : | కరుణాకర్ |
| ముద్రణ | : | |
| వెల | : | రూ. 150/- ($10) |
| ప్రతులకు | : | ప్రయాగ రామకృష్ణ<br>12-2-828/ఏ/11, అంబా గార్డెన్స్,<br>మెహిదీపట్నం, హైదరాబాద్ 500 028<br>ఫోన్ : 23526555 ; సెల్ : 9849990107<br>ఈ-మెయిల్ : prayaga_air@yahoo.com |

◆ విశాలాంధ్ర బుక్ హౌస్ (అన్ని శాఖలు) ◆ నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, బడీచౌడీ, హైదరాబాద్ ◆ నవయుగ బుక్‌హౌస్, కోఠి, హైదరాబాద్ ◆ సాహిత్య నికేతన్, కేశవనిలయం, బర్కత్‌పుర, హైదరాబాద్ ◆ తెలుగు బుక్‌హౌస్, ఆర్యసమాజ్ మందిర్ ఎదురుగా, బడీచౌడీ, హైదరాబాద్ ◆ ప్రజాశక్తి బుక్‌హౌస్ (అన్ని శాఖలు) ◆ నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ ◆ న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్, విజయవాడ

# మంగళాశాసనం

*మహాభారతంలో లేని ధర్మబోధ లేదు. మనందరికీ అవసరమైన ధర్మాలన్నింటినీ ఒకచోట చేర్చిన కావ్యమే మహాభారతం. అయితే సర్వ ధర్మాలు, శాస్త్ర వాక్యాల వలె కాక కథల రూపంలో మహాభారతంలో బోధించబడ్డాయి. అటువంటి అనేక కథలను ఒకచోట చేర్చి, శ్రీ ప్రయాగ రామకృష్ణగారు చిన్న చిన్న తెలుగు మాటలతో అందరికీ సుబోధకంగా వ్రాశారు. ఇన్ని కథలొకచోట చేర్చడంలో శ్రీ రామకృష్ణగారు చేసిన పరిశ్రమ, ఆ మహాగ్రంథాన్ని వారు అవగాహన చేసుకున్న తీరు మనం తెలుసుకోవచ్చు. ఈ కథామంజరి సార్వజనీనమై రాణించగలదని విశ్వసింతును.*

*2. 2. 2006*

హైదరాబాద్

(కె. శివానందమూర్తి)

# కృతజ్ఞతలు

ఈ పుస్తకం ఇలా మీ హస్తభూషణం కావడానికి
కారణభూతులై నా కృతజ్ఞతలు అందుకోవలసిన
వారెందరో వున్నారు.

నా కథల్ని మెచ్చుకుని నన్నెంతో మర్యాద చేసి
నాకు కరావలంబమిచ్చిన సన్మిత్రులు శ్రీయుతులు
కె.మల్లికార్జునప్ప, బిట్రా శ్రీరామమూర్తి, కె.గణపతిశర్మ
కె.గోపాలకృష్ణ, అనంత్ టెక్నాలజీస్ సుబ్బారావు,
వి.కె.భట్, సి.జి.కులకర్ణి, శ్రీనాథ్ .....ఇంకా ఎందరో!
వీరందరికీ,
ఈ కథలను నాచేత రాయించిన
స్వర్గీయ పురాణం సుబ్రహ్మణ్యశర్మగారికీ
అవనత శిరస్కుణ్ణై నమస్కరిస్తున్నాను.

-ప్రయాగ రామకృష్ణ

# కథల క్రమం

# మహాభారతం

వేదవ్యాసుడు వ్రాసాడు. ఆయన అసలు పేరు కృష్ణ.
పరాశర సత్యవతుల సంతానం.
పుట్టగానే ద్వీపంలో వదిలి వేయబడ్డాడుగనుక కృష్ణ ద్వైపాయనుడని పేరు వచ్చింది.
వేదాలను వర్గీకరించాడు గనుక వేదవ్యాసుడుగా ప్రసిద్ధిచెందాడు.

క్రీస్తుపూర్వం 5 వ శతాబ్దానికి ముందు కౌరవ పాండవుల మధ్య చెలరేగిన దాయాది ఆస్తి వివాదం భారతంలోని కథావస్తువు.

ఈ కథను జనమేజయుడు పాండువంశానికి చెందిన వైశంపాయనుడికి వినిపించాడు.

భారతంలో 18 పర్వాలున్నాయి.
పంచమ వేదంగా కీర్తిపొందింది.
భారతంలో దొరకనిదేదీ భారతదేశంలో దొరకదనేది సంస్కృత సూక్తి.
'తింటే గారెలు తినాలి. వింటే భారతం వినాలి' అన్నది బహుళ ప్రచారంలో వున్న తెనుగు నానుడి.

రసవన్మయ నీతి కథాసాగరం భారతం.

# కౌరవ పాండవుల వంశవృక్షం

శంతనుడికి భార్యలు ఇద్దరు : గంగాదేవి, సత్యవతి

కుమారులు ముగ్గురు : గంగాదేవివల్ల దేవవ్రతుడు (భీష్ముడు)

సత్యవతివల్ల చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు

విచిత్రవీర్యుడికి ఇద్దరు భార్యలు : అంబిక, అంబాలిక

అంబిక కుమారుడు : ధృతరాష్ట్రుడు

అంబాలిక కుమారుడు : పాండురాజు

ధృతరాష్ట్రుని కుమారులు కౌరవులు. వాళ్ళు నూరుగురు. పెద్దవాడు దుర్యోధనుడు.

పాండురాజు కుమారులు పాండవులు. వాళ్ళు అయిదుగురు. పెద్దవాడు ధర్మరాజు.

# పాండురాజు సంతతి (పాండవులు)

ధర్మరాజు
భీముడు
అర్జునుడు
నకులుడు
సహదేవుడు

# ధృతరాష్ట్ర సంతతి (కౌరవులు)

దుర్యోధన
దుశ్శాసన
దుస్సహ
దుశ్శల
జలగంధ
సామ
సహ
వింద
అనువింద
దుర్ధర్శ
సుబాహు
దుష్ప్రదర్శన
దుర్మర్శన
దుర్ముఖ
దుష్కర్ణ
కర్ణ
వికర్ణ
శాల
సత్వ
సులోచన
చిత్ర
ఉపచిత్ర
చిత్రాక్ష
చారుచిత్ర
శరాసన

దుర్మద
దుర్విగాహ
వివిత్సు
వికటానన
ఊర్ణనాభ
సునాభ
నంద
ఉపనంద
చిత్రభాను
చిత్రవర్మ
సువర్మ
దుర్విమోచ
అయోబాహు
మహాబాహు
చిత్రాంగ
చిత్రకుండల
భీమవేగ
భీమబల
బలాకి
బలవర్ధన
ఉగ్రాయుధ
సుసేన
కుండధార
మహోదర
చిత్రాయుధ

నిశాంగి
పాశి
బృందారక
దృఢవర్మ
దృఢక్షత్ర
సోమకీర్తి
అనుదార
దృఢసంధ
జరాసంధ
సత్యసంధ
సదాసువాక్
ఉగ్రశ్రవస
ఉగ్రసేన
సేనాని
దుష్పరాజయ
అపరాజిత
కుండశాయి
విశాలాక్ష
దురాధర
దృఢహస్త
సుహస్త
వాతవేగ
సువర్చస
ఆదిత్యకేతు
బహ్వాశి

నాగదత్త
అగ్రయాయి
కవచి
క్రథన
భీమవిక్రమ
ధనుర్ధర
వీరబాహు
ఆలోలుప
అభయ
దృఢకర్మణ
దృఢరథాశ్రయ
అనాధృష్య
కుండభేది
విరావి
చిత్రకుండల
ప్రమథ
అప్రమథ
దీర్ఘరోమ
వీర్యవంత
దీర్ఘబాహు
సువర్మ
కనకధ్వజ
కుండాశి
విరజ
యుయుత్సు

కౌరవుల ఏకైక సోదరి దుస్సల



# వ్యాసగణేశులు

**ప**రాశర మునీంద్రుడికి, సత్యవతికి జన్మించినవాడు వ్యాసుడు. సత్యవతి అసలుపేరు కాళి. మత్స్యగంధి అనికూడా అంటారు. బెస్త పిల్ల.

చేది దేశపు రాజు ఒకసారి వేటకని అడివికి వెళ్ళాడు. అక్కడ క్రీడిస్తున్న జంతువుల జంటను చూసి ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయాడు. కాళిందీ నదీతీరాన జరిగిందిది. శాపవశాన చేపరూపాన ఆ నదిలో వున్న అద్రిక అనే దేవకన్య ఆ రేతస్సును స్వీకరించింది.

చేప గర్భం ధరించింది. కడుపులో వున్న చేప కదలలేక మెదలలేక బెస్తవాడి వలకు చిక్కింది. తీరా దాన్ని ఇంటికి తీసుకువెళ్ళి కోస్తే ఆ చేప కడుపులో ఇద్దరు పసికందులున్నారు. ఆ ఇద్దరిలో మగ పిల్లవాణ్ణి బెస్తరాజుగారికే ఇచ్చేశాడు. ఆడపిల్లను తానే అల్లారుముద్దుగా పెంచుకున్నాడు. ఆ అమ్మాయికి 'కాళి' అని పేరు పెట్టాడు.

కాళి పెరిగి పెద్దదైంది. పెళ్ళీడు పిల్లయింది.

పరాశర మహర్షి ఒకరోజు కాళిందీ నది దగ్గరకు వచ్చి ఆవలి ఒడ్డుకు వెళ్ళేందుకు పడవ కోసం చూస్తున్నాడు. ఆ సమయంలో కాళి తండ్రి నది ఒడ్డున అప్పుడే చద్దిమూట విప్పుకుని భోజనానికి కూర్చోవడం వల్ల మహర్షిని ఆవలి ఒడ్డుకు తీసుకువెళ్ళమని కూతుర్ని పురమాయించాడు. మత్స్యగంధి సరేనంది. మహర్షి పడవలోకి ఎక్కాడు. పడవ నడుస్తోంది. ఎగిసిపడే అలలు, ఎగిరెగిరిపడే చేపపిల్లలు, పడవ నడిపే వయ్యారి–పరాశరుడికి చిత్తచాపల్యం కలిగించాయి.

కామోద్రేకంతో ఆమెను సమీపించాడు. మునిపుంగవుని కోరికను పసిగట్టి దూరంగా జరిగింది కాళి. పరాశరుడు వినలేదు. పడవ చుట్టూ పొగమంచు సృష్టించాడు. కాళి శరీరం నుంచి కస్తూరి పరిమళాలు గుప్పుమనేట్టు చేశాడు. నది మధ్యలో ఒక దీవిని సృష్టించాడు. ఇద్దరూ అక్కడికి వెళ్ళి అమరసుఖాలు అనుభవించారు. కాళి గర్భం ధరించింది. పరాశరుడు ఆమెను ఓదారుస్తూ, “నీవు గర్భం ధరించినా నీ కన్యత్వానికేమీ దూషణ వుండదు. నీకు పుట్టబోయే పిల్లవాడు విష్ణు అంశతో జన్మిస్తాడు. సద్గుణశీలుడు, సర్వవిద్యాపారంగతుడు అయి ముల్లోకాల్లోను కీర్తింపబడతాడు. జగద్గురువవుతాడు. ఏక రాశిగా వున్న వేదాలను ఋక్ యజుస్సామ అధర్వణాలుగా విభాగం చేసి వాటికి సూత్రభాష్యాలు రచిస్తాడు. మహా తపస్వీ, మహా మహిమాన్వితుడూ అవుతాడు. ఇప్పుడు నీ ఒంటికి అబ్బిన కస్తూరి పరిమళం శాశ్వతమై నువ్వు ‘యోజనగంధి’వి అవుతావు” అని దీవించాడు.

మహర్షి అన్నట్టుగానే కాళింది పండంటి పిల్లవాణ్ణి కన్నది. అతను చిన్నతనం నుంచే దైవభక్తితో పెరిగాడు. పెద్దల ఎడ వినయ విధేయతలతో మెలిగాడు. పెద్దయ్యాక, “తల్లీ! నా గురించి విచారించకు. తపస్సు చేసుకునేందుకు నేను అడవులకు వెళ్తున్నాను. నీకు ఎప్పుడైనా దుఃఖం కలిగినా, కష్టం కలిగినా, లేదా చూడాలనిపించినా నన్ను తలచుకో. నేను నీ ముందుకు వచ్చి నిలుస్తాను” అని చెప్పి అడవులకు వెళ్ళిపోయాడు. అతనే కృష్ణద్వైపాయనుడయ్యాడు. అతని తల్లే చంద్రవంశానికి చెందిన శంతను మహారాజును పెళ్ళి చేసుకుంది. ఆ విధంగా కురుపాండవులకు చాలా దగ్గరవాడు వ్యాసుడు. ఇరువర్గాలకు ఆధ్యాత్మిక గురువు కూడా ఆయనే. పరిపాలనాసంబంధమైన విషయాలలో కురుపాండవులు కృష్ణద్వైపాయనుడి సలహాలు తీసుకునేవారు. అయితే ఆయన హస్తినాపురంలో కన్నా అడవులలో తపస్సు చేసుకుంటూ వున్న కాలమే చాలా ఎక్కువ.

కురుపాండవ సంగ్రామం ముగిసిన తరువాత ఆయన భారతగాథ ఆమూలాగ్రం ఊహించాడు. కాని దీనిని గ్రంథస్తం చేసి లోకంలో చదివించడం ఎలా, ఈ కథను వ్రాసేవారెవరు అన్న ప్రశ్న వచ్చింది. వెంటనే సృష్టికర్త అయిన బ్రహ్మదేవుణ్ణి ధ్యానించాడు. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు.

"మహర్షీ! నీకేం కావాలి?" అని బ్రహ్మ అడిగాడు.

వ్యాసమహర్షి పరమేష్ఠికి నమస్కరించి తన మనోవేదన వెల్లడించాడు. అప్పుడు బ్రహ్మ "మహర్షీ! ఈ కథ వ్రాయడానికి విఘ్నేశ్వరుణ్ణి ధ్యానించు. నీవు సంకల్పించిన గ్రంథం వ్రాయగలవాడు గణపతి ఒక్కడే. నీ కోరిక సిద్ధిస్తుంది" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

అప్పుడు వ్యాసుడు సిద్ధివినాయకుణ్ణి ప్రార్థించాడు. వెంటనే ఆయన ప్రత్యక్షమయ్యాడు. వ్యాసమహర్షి గజాననుడికి నమస్కరించి "లంబోదరా! మహాభారత మహాగ్రంథాన్ని నేను మనస్సులో ఊహించుకున్నాను. అది నేను చెబుతూవుంటే మీరు వ్రాసుకుపోతూ వుండాలి. ఏమంటారు స్వామీ" అని అడిగాడు.

అందుకు వినాయకుడు ఒక షరతు పెట్టాడు. "నేను వ్రాస్తూ వున్నప్పుడు నా లేఖిని క్షణమైనా ఆగడానికి వీలులేదు. అలా నీవు ఆపకుండా చెప్పుకుపోగలవా?" అని అడిగాడు.

ఇది చాలా కఠినమైన నిబంధన. అయినా వ్యాసుడు ఒప్పుకున్నాడు. బదులుగా, "దేవా! నేను చెప్పేదాని భావం సంపూర్ణంగా తెలుసుకుని వ్రాసుకుపోతుండాలి. అందుకు తమరు సిద్ధమేనా" అని ఎదురు ప్రశ్నించాడు మహర్షి.

గణనాథుడు చిరునవ్వు నవ్వి "సరే" అన్నాడు.

ఆ విధంగా వ్యాసుడు చెబుతూవుంటే వినాయకుడు వ్రాయడం వలన మహాభారత కథ గ్రంథస్థమై అలరారింది. దానిని మొట్టమొదట తన కుమారుడైన శుకుడికి చెప్పాడు మహర్షి. ఆ తరువాత ఆయన శిష్యులు అనేకులు ఈ కథ చెప్పుకున్నారు.

ఈ కథను దేవలోకంలో దేవతలకు వినిపించినవాడు నారదుడు. గంధర్వులకు, యక్షులకు, రాక్షసులకు చెప్పినవాడు శుకయోగీంద్రుడు. ఇక ఈ మహాభారత పుణ్యకథను మానవలోకానికి చెప్పిన మహనీయుడు వ్యాసులవారి ముఖ్య శిష్యుడు వైశంపాయనుడు.

**మహాసముద్రంతో పోల్చదగిన మహాభారతంలో లేని ధర్మసూక్ష్మ మంటూ లేదు. ధర్మజ్ఞులు దీనిని ధర్మశాస్త్ర మన్నారు. ఆధ్యాత్మిక తత్త్వవిదులు దీనిని వేదాంతసార మన్నారు. నీతికోవిదులు నీతిశాస్త్రమని, కవి పండితులు మహా కావ్యమని, లాక్షణికులు సర్వ లక్షణ సంగ్రహమని, ఐతిహాసికులు మహా ఇతిహాసమని, పౌరాణికులు సకల పురాణాశ్రయమని శ్లాఘించారు.**

విద్యలకు వేలుపు అయిన వినాయకుడు వ్రాయడం వలన భారత కథ సావధానచిత్తులై వినినవారికి ధర్మార్థ సంసిద్ధి కలుగుతుందని ప్రసిద్ధి. ●

# భారతకథ

ఒకప్పుడు శంతన మహారాజు హస్తినాపురాన్ని పరిపాలిస్తుండేవాడు. మంచి పరిపాలకుడని పేరు పొందాడు. ఆయన పరిపాలనలో ప్రజలు సుఖ సంతోషాలు పొందారు. ఆయన తరువాత ఆయన కుమారులు చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు రాజ్యం ఏలారు. వీరిలో విచిత్రవీర్యుడికి ఇద్దరు కొడుకులు – ధృతరాష్ట్రుడు, పాండురాజు.

ధృతరాష్ట్రుడు గుడ్డివాడు. అందుకని చిన్నవాడైన పాండురాజుకి పట్టాభిషేకం చేశారు. పాండురాజుకి ఇద్దరు భార్యలు. కుంతి, మాద్రి. కుంతికి ముగ్గురు, మాద్రికి ఇద్దరు కొడుకులు పుట్టారు. వాళ్ళే పంచపాండవులు.

పాండురాజు రాజ్యపాలన చేస్తున్నప్పుడు ఒకనాడు వేటకు వెళ్ళాడు. ఆ సమయంలో అక్కడ ఒక ఋషీ ఆయన భార్యా జింకలరూపంలో స్వేచ్ఛగా విహరిస్తున్నారు. అవి మామూలు జింకలే అనుకున్నాడు పాండురాజు. మగ జింకను

బాణం వేసి కొట్టాడు. అది ప్రాణాలు విడుస్తూ 'దుర్మార్గుడా! నేను నా భార్యతో ఆనందంగా ఉన్నప్పుడు నన్ను బాణంతో కొట్టి నా ప్రాణాలు తీశావు గనుక నీవు కూడా నీ భార్యను కలిసిన తక్షణం చనిపోతావు' అని పాండురాజును శపించింది. దానితో ఆయన కుంగిపోయి భార్యలిద్దర్నీ వెంటబెట్టుకుని అడవులకు వెళ్ళాడు. పుత్రసంతానం లేకుండా చనిపోకూడదని, మంత్ర మహిమవల్ల పుత్రుల్ని కనవలసిందిగా భార్యల్ని కోరాడు. ఆ కోరిక ప్రకారం కుంతి, మాద్రి దేవతలను వేడుకుని పాండవులను కన్నారు. తరువాత పాండురాజు ఆ అడవుల్లోనే చనిపోయాడు.

అందుకని పంచపాండవుల్ని చిన్నప్పుడు అడవుల్లో ఋషులే పెంచారు.

తరువాత కొంచెం పెద్దయ్యాక వాళ్ళ తాతగారైన భీష్మాచార్యులవారికి అప్పగించారు. అక్కడ వాళ్ళు వేద వేదాంగాలు చదువుకున్నారు. అస్త్రవిద్య, శస్త్రవిద్య నేర్చుకున్నారు. అందరిచేత శహభాష్ అనిపించుకున్నారు.

ఇది చూశారు. ఇంకేముంది! ధృతరాష్ట్రుడి కొడుకులకు ఒళ్ళంతా కారం రాసుకున్నట్టయింది.

అల్లరి చిల్లరగా తిరుగుతూ ఆగడాలు చేస్తూ అందర్నీ వేధిస్తూ అందరిచేత ఛీ ఛా అనిపించుకునే వాళ్ళని మన పెద్దవాళ్ళు ధృతరాష్ట్ర సంతతి అంటూంటారు.

అవునా!

ఇంతకీ ధృతరాష్ట్ర సంతతి ఎవరు?

కౌరవులు!

కౌరవులు నూరుగురు.

వాళ్ళల్లో పెద్దవాడు దుర్యోధనుడు. అతను తన చినతండ్రి పిల్లలైన పాండవుల్ని నానా బాధలూ పెట్టాడు. ఇది చూసి భీష్మాచార్యుల వారికి కష్టం కలిగి కౌరవుల్నీ, పాండవుల్నీ పిలిపించి మందలించి ఇద్దరికీ సంధి కుదిర్చారు. అంటే ఇకమీదట మళ్ళీ చీటికిమాటకీ తగవులాడుకోకుండా ఒక ఒప్పందం కుదిర్చారు.ఆ ఒప్పందం ప్రకారం కౌరవులు హస్తినాపురంలోనూ, పాండవులు ఇంద్రప్రస్థంలోనూ ఎవరికి వారు వేరువేరుగా రాజ్యాలు ఏలుకుంటూ వచ్చారు.

కాని, దుర్మార్గుల ఆశకు అంతం వుంటుందా?

ఏదో ఒక మిషతో పాండవుల్ని తమ రాజ్యానికి పిలిపించి అంతం

చేయాలనుకున్నాడు దుర్యోధనుడు. ఆ రోజుల్లో రాజులు జూదమాడేవారు. 'అత్యంత శోభాయమానంగా జూదగృహాన్ని నిర్మించాం. మీరు మా దేశం వచ్చి మా ఆతిథ్యం స్వీకరించి సరదాగా మాతో పాచికలాడి వెళుదురుగాని రండి' అని దుర్యోధనుడు పాండవులకు కబురు చేశాడు.

రాననటం రాచరికానికి తలవంపులు. ధర్మరాజు వెంటనే బయల్దేరి వెళ్ళాడు.

కౌరవులూ, పాండవులూ జూదంలోకి దిగారు. ఆ జూదంలో కౌరవుల పక్షాన శకుని పాచికలు ఆడాడు. శకుని పాచికలు వెయ్యటంలో దిట్ట. నక్కజిత్తులతో ధర్మరాజుని ఓడించాడు.

ఫలితంగా పాండవులు రాజ్యాన్ని, సకల భోగభాగ్యాల్ని వదులుకుని పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక ఏడాది అజ్ఞాతవాసం చేయాల్సి వచ్చింది. అరణ్యవాసం చేసి వచ్చిన తరువాత కూడా వారి రాజ్యం వారికి ఇవ్వడానికి దుర్యోధనుడు ఒప్పుకోలేదు.

ఆ కారణాన కౌరవులకీ పాండవులకీ మధ్య యుద్ధం జరిగింది.

ఆ యుద్ధంలో పాండవులు కౌరవుల్ని చంపి రాజ్యం చేజిక్కించుకున్నారు. క్లుప్తంగా ఇదీ అన్నదమ్ముల కథ.

అయితే ఈ కథతోపాటు భారతంలో మనకు పనికొచ్చే ఉపకథలు ఎన్నో ఉన్నాయి.

మహాభారతం మహాసముద్రం లాంటిది. అందులో ముత్యాలు ఉన్నాయి, రత్నాలు ఉన్నాయి. అవే **భారతంలో చిన్నకథలు**. ●

# దేవవ్రతుడు

**శం**తనమహారాజు చంద్ర వంశానికి చెందినవాడు. హస్తినాపురాన్ని పరిపాలిస్తుండేవాడు.

ఒకనాడు శంతనమహారాజు గంగానది వైపు వెళ్ళాడు. అక్కడ ఆయనకు ఓ చక్కదనాల చుక్క కనిపించింది. రాజుగారికి ఆ అమ్మాయి మీద ప్రేమ కలిగింది. 'నన్ను పెళ్ళి చేసుకుంటావా?' అని అడిగాడు. అందుకా అమ్మాయి నవ్వుతూ 'నేనెవరో తెలుసా?' అంది.

"నువ్వెవరివైనా సరే, నన్ను వివాహమాడు. నా రాజ్యం, నా డబ్బు, నా ప్రాణం, సర్వస్వం నీ కిచ్చేస్తాను" అని బ్రతిమాలాడు.

అప్పుడు ఆ అమ్మాయి, "మహారాజా! మీ ఇష్టప్రకారమే మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటాను. కానీ కొన్ని షరతులు కోరతాను. వాటికి మీరు ఒప్పుకోవాలి" అంది.

ఆవేశంలో "అలాగే!" అని మాట యిచ్చాడు శంతనుడు.

వెంటనే ఇద్దరూ పెళ్ళి చేసుకున్నారు.

ఇంతకీ ఆ అమ్మాయి ఎవరో కాదు-గంగాదేవి.

పెళ్ళి జరిగాక గంగాదేవి రాజుగారికి మరింత ఇష్టురాలైంది. వారిద్దరికీ చాలామంది పిల్లలు పుట్టారు. అందరూ పచ్చగా, పనసపండ్లలా వున్నారు. అయితే పుట్టిన ప్రతి బిడ్డనూ ఆమె గంగానదిలో వదిలేసేది. ఆవిడ ప్రవర్తన చూసి శంతనుడికి ఒక వంక ఆశ్చర్యం, మరో వంక దుఃఖం వచ్చేవి. కాని ఏమీ అనటానికి వీల్లేదు. ఆవిడ పెట్టిన షరతుల్లో "నువ్వెవరు? ఎక్కడనుంచి వచ్చావు? ఇలా ఎందుకు చేస్తున్నావు?" అని అడగటానికి వీల్లేదు. అందుకని శంతనుడు పల్లెత్తుమాట కూడా అనేవాడు కాదు.

ఏడుగురు కొడుకులు పుట్టారు. ఏడుగురూ ఏటిపాలయ్యారు.

చివరకు ఎనిమిదవ బిడ్డ పుట్టాడు. ఆ పిల్లవాడ్ని కూడా గంగలో వదిలేయ బోతుంటే శంతనుడు సహించలేక "నువు తల్లివి కావూ...ఎందుకింత పాపం చేస్తున్నావు?" అని అడిగాడు.

వెంటనే ఆమె "మహారాజా ! మీరు మరిచిపోయినట్టున్నారు, నన్ను గురించీ నేను చేసే పనుల గురించీ ఎప్పుడూ ఏమీ అడగనని మాటయిచ్చి వరించారు. ఇక నేను క్షణం కూడా ఇక్కడ వుండను. ఇప్పుడే వెళ్ళిపోతున్నాను. ఈ పిల్లవాణ్ణి నేను చంపను. నేనెవరో మీకు తెలీదు. మునులూ, మహర్షులూ నిత్యం పూజించే గంగానదికి అధిదేవతను నేను.

"పూర్వం ఒకానొకప్పుడు అష్ట వసువులు తమ భార్యల్ని వెంటబెట్టుకుని వశిష్ట మహాముని ఆశ్రమ ప్రాంతాలకు విహారానికి వెళ్ళారు. అప్పుడు అక్కడ వారికి నందిని అనే ఆవు కనిపించింది. అది వశిష్టులవారి పాడి ఆవు. అది చాలా అందంగా వుంది! అష్ట వసువులు, వారి భార్యలు ఆ గోవును చూసి చాలా ఆనందపడ్డారు. అందులో ఒకామె ఆ ఆవు తనకు కావాలని తన భర్తను అడిగింది.

'ఈ ఆవు వశిష్ట మహామునిది. మనం ఆ ఆవును తీసుకుంటే ఆయన కోపానికి గురి కావల్సి వస్తుంది. వద్దు' అని చెప్పాడు భర్త.

ఆవిడ ససేమిరా వినలేదు. తనకు నందిని కావల్సిందేనని భర్తను బలవంత పెట్టింది.

చివరకు ఎలాగైతేనేం అతను 'సరే' అన్నాడు. ఎనిమిది మంది వసువులూ కలిసి ఆ ఆవును దూడతో సహా తోలుకుపోయారు.

"వశిష్టుడికీ సంగతి తెలిసింది. పట్టరాని కోపంతో, 'మీరంతా మానవులై పుట్టండి' అని శపించాడు.

అష్టవసువులు పరుగు పరుగున వచ్చి వశిష్టుల వారికి నందినిని అప్పగించి క్షమాపణ చెప్పుకున్నారు. శాపాన్ని ఉపసంహరించమని ప్రార్థించారు.

కానీ వశిష్ట మహర్షి, 'నా శాపానికి తిరుగులేదు పొండి!' అన్నాడు. వసువులు ప్రాధేయపడ్డారు. 'నా ఆవును తోలుకుపోయిన వసువు మాత్రం భూలోకంలో మహా వైభవంతో చాలాకాలం జీవిస్తాడు. తక్కిన ఏడుగురూ భూలోకంలో పుట్టిన వెంటనే మరణించి శాపవిముక్తులౌతారు. ఇంతకంటే నేను చేయగలిగిందేమీ లేదు!' అని చెప్పాడు. పోనీ కొంతలో కొంత ఇదైనా మేలే అని సంతోషించి అష్టవసువులు తిరిగి వెళ్ళిపోయారు.

"ఆ తర్వాత ఆ వసువులే నా దగ్గరకు వచ్చి, 'గంగాభవానీ! నువ్వే మాకు తల్లివి కావాలి. మా కోసం నువ్వు భూలోకానికి వెళ్ళు, అక్కడ ఓ పునీతుడ్ని వరించు. మేము నీ పుణ్యగర్భాన జన్మిస్తాం. మాకు త్వరగా శాపవిమోచనం కలగాలి, మేం పుట్టిన వెంటనే గంగలో విడిచిపెట్టు తల్లీ!' అని మొరపెట్టుకున్నారు. అందుకని నేను భూలోకానికి వచ్చి మిమ్మల్ని పెళ్ళి చేసుకున్నాను. అష్టవసువులే మనకు జన్మించారు. ఈ చివరి సంతానాన్ని నేను కొంతకాలం పెంచి మీకు అప్పగిస్తాను' అని చెప్పి గంగాదేవి అంతర్థానమైంది.

ఆ పిల్లవాడే దేవవ్రతుడు.

వశిష్ట మహాముని వద్ద వేద వేదాంగాలు చదువుకున్నాడు.

శుక్రాచార్యుల వారివద్ద శాస్త్రాలన్నీ నేర్చుకున్నాడు.

విలువిద్యలో ఆరితేరాడు. రాజనీతి కోవిదుడుగా పేరు పొందాడు..

ఆ దేవవ్రతుడే తర్వాత భీష్ముడయ్యాడు. ఆయన కౌరవ, పాండవ వంశాలకు పితామహుడు. ●

# అంబ

గంగాదేవి తనను వీడి వెళ్ళినప్పటినుంచి శంతనమహారాజు వైరాగ్యంతో ఉన్నాడు. కాని ఒకరోజు యమునాతీరానికి వాహ్యాళికని వెళ్ళి అక్కడ జగన్మోహినిలా ఉన్న ఓ అమ్మాయిని చూసి ఆ పిల్లను తన భార్యగా చేసుకోవాలనుకున్నాడు. తనను పెళ్ళి చేసుకోమని ఆ అమ్మాయిని అడిగాడు.

"నా తండ్రి దాశరాజు. బెస్తలందరికీ నాయకుడు. మీరు ఆయనతో మాట్లాడి ఆయన అనుమతి తీసుకోండి. అది మీకూ నాకూ మంచిది'' అని బదులు చెప్పిందాపిల్ల.

శంతనుడు వెళ్ళి దాశరాజును కలిశాడు. ఆయన నవ్వుతూ "మా అమ్మాయిని మీ చేతుల్లో పెడతాను కాని నా కూతురివల్ల మీకు కలగబోయే పిల్లవాడే మీ తరువాత రాజు కావాలి" అన్నాడు.

శంతనుడు ఒప్పుకోలేదు.

దేవవ్రతుణ్ణి తోసేసి మరొకరికి పట్టాభిషేకం చేయడం కుదరదన్నాడు.

అయితే ఈ పెళ్ళే జరగదన్నాడు దాశరాజు.

దిగులుతో హస్తినాపురానికి తిరిగి వచ్చాడు శంతనుడు. దేవవ్రతుడు తండ్రి మనసులోని విచారాన్ని ఆయన రథసారథి ద్వారా తెలుసుకుని వెంటనే దాశరాజు దగ్గరకు వెళ్ళి "నీ కూతురుకు పుట్టబోయే బిడ్డే రాజవుతాడు. నాకు రాజ్యం అక్కర్లేదు. నా పట్టాభిషేకాన్ని ఇప్పుడే పరిత్యాగం చేస్తున్నాను" అని శపథం చేశాడు. అప్పుడా పల్లెరాజు తన కూతుర్ని శంతనుడికిచ్చి పెళ్ళి చేశాడు. అయినా దాశరాజు భయం పోలేదు. దేవవ్రతుడు కాకపోయినా అతని సంతతివారెవరైనా ముందుముందు అవరోధాలు కలిగించవచ్చు కదా అని సందేహించాడు. దేవవ్రతుడు అది గ్రహించి తాను ఆజన్మబ్రహ్మచారిగా ఉంటానని ప్రమాణం చేశాడు. అప్పుడాపల్లెరాజు సంతోషించి తన కూతుర్ని శంతనుడికిచ్చి పెళ్ళిచేశాడు.

ఆ అమ్మాయి పేరు సత్యవతి.

శంతనుని వల్ల ఆమెకు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అనే ఇద్దరు పిల్లలు కలిగారు. వాళ్ళు చిన్నవాళ్ళుగా ఉండగానే శంతనుడు మరణించాడు. అన్నమాట ప్రకారం దేవవ్రతుడు చిత్రాంగదుణ్ణి సింహాసనం ఎక్కించాడు. ఇతను అధికారదర్పంతో, అహంకారంతో కన్నూ మిన్నూ గానకుండా ప్రవర్తించి చివరకు ఒక గంధర్వుడి చేతిలో చావుదెబ్బ తిన్నాడు. అనంతరం విచిత్రవీర్యునికి పట్టం కట్టారు. తమ్ముడికి పెళ్ళి చేయాలనుకున్న భీష్ముడు కాశీరాజు స్వయంవరం ప్రకటిస్తే విచిత్రవీర్యుణ్ణి అక్కడకు తీసుకుపోయాడు.

కాశీరాజుకు ముగ్గురు కూతుళ్ళు.

అంబ, అంబిక, అంబాలిక అని వాళ్ళకు పేర్లు.

ముగ్గురూ ముచ్చటగా ఉంటారు.

వాళ్ళకోసం అక్కడకు చేరిన రాజులందరూ పోట్లాడుకోవడం మొదలుపెట్టారు.

భీష్ముడు వాళ్ళందర్నీ ఓడించి రాజకుమార్తెలు ముగ్గుర్నీ రథమెక్కించుకుని హస్తినాపురానికి తీసుకువచ్చాడు.

వెంటనే పెళ్ళికి ఏర్పాటు చెయ్యమని మంత్రుల్ని ఆదేశించాడు. అంబ నీళ్ళు నిండిన కళ్ళతో భీష్ముడి దగ్గరకు వెళ్ళి "గాంగేయా! నా మనసంతా సాళ్వభూపతి

మీద ఉంది. నాకు యుక్తవయస్సు వచ్చినప్పటి నుంచి అతనే నా భర్త కావాలని కోరుకుంటున్నాను. అతనే నా ప్రాణనాయకుడు. అతనే నా సర్వస్వం. మనసు లేని మనువు క్షేమం కాదు. నా మాట విను. మనసులు కలవని దాంపత్యం వల్ల ప్రయోజనం లేదు. నన్ను సాళ్వుని దగ్గరకు చేర్చు. నా చెల్లెళ్ళిద్దర్నీ నీ తమ్ముడికిచ్చి పెళ్ళిచెయ్యి" అని వేడుకుంది. భీష్ముడు సరేనని అంబను సాళ్వదేశానికి పంపాడు.

సాళ్వుడు అంబను చూస్తూనే "నువ్వంటే నాకూ ఇష్టమే. నిన్ను పెళ్ళి చేసుకోవాలని నేనూ అనుకున్నాను. కాని రాజులందరూ చూస్తూఉండగా భీష్ముడు నిన్ను రథమెక్కించుకుని తీసుకుపోయాడు. అప్పటినుంచి అక్కడే ఉన్నావు. ఉన్నట్టుండి ఇప్పుడెందుకొచ్చావో తెలీదు నాకు. విచిత్రవీర్యుణ్ణి పెళ్ళాడబోయి అతని ఇంట్లో కొన్నాళ్ళు గడిపొచ్చిన నిన్ను ఏ ముఖం పెట్టుకుని పెళ్ళి చేసుకోమంటావు?" అని పరుషంగా అన్నాడు. అంబ ఏడుస్తూ భీష్ముడి దగ్గరకు వెళ్ళి జరిగినదంతా చెప్పింది. "నీవల్లే నాకు అపకారం జరిగింది. నా ప్రణయనాథుడు నాకు కాకుండా పోయాడు. నా చిర సంకల్పం భగ్నమైంది. ఇంక చేసేదేంలేదు. వచ్చిన అపవాదు ఎలాగో వచ్చింది. నీ తమ్ముణ్ణే పెళ్ళి చేసుకుంటా" అంది.

భీష్ముడు ఒప్పుకోలేదు.

"సాళ్వుడే నా ప్రియుడని బాహాటంగా ప్రకటించిన పిల్లవు. నా తమ్ముణ్ణెలా చేసుకుంటావు? మనసొకచోట మనువొకచోట కుదరదని నువ్వేగా చెప్పావు. కాబట్టి నీకూ మా తమ్ముడికీ పొసగదు. నీ దోవన నువ్వు పోవడం మంచిది" అన్నాడు. అంబ మొహంలో నెత్తురుచుక్క లేకుండా పోయింది. భీష్ముడి కంఠంలో కఠినతకు ఆమె కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. నెమ్మదిగా తల పైకెత్తి, "నా కలలన్నీ చిరిగి పీలికలవడానికి నువ్వే కారణం నా బ్రతుకు అల్లరిపాలు కావడానికి నువ్వే మూలం. నీ మీద ప్రతీకారం తీర్చుకోకపోతే నేను కాశీరాజు కూతుర్నే కాదు" అని విసవిస వెళ్ళిపోయింది. అడవుల్లోకి వెళ్ళి తపస్సు ప్రారంభించింది.

ఒకరోజు హోత్రవాహనుడనే రాజర్షి వచ్చి, అంబ సంగతంతా విని ఆమె తన కూతురిబిడ్డ అని తెలుసుకుని విచారించాడు. ఆమెను ఓదార్చి మహేంద్ర పర్వతానికి వెళ్ళి పరశురాముణ్ణి ఆశ్రయిస్తే తగిన సహాయం చేస్తాడని చెప్పాడు. ఆమె బయలుదేరే సమయంలో పరశురామ శిష్యుడు అకృతవ్రణుడనేవాడు వచ్చి, హోత్రవాహనుడ్ని చూసేందుకు పరశురాముడే అక్కడికి వస్తున్నాడని చెప్పాడు.

అంబ ఆగిపోయింది.

మర్నాడే పరశురాముడు వచ్చాడు.

అంబ ఏడుస్తూ ఆయన పాదాలమీద పడి తన కథంతా చెప్పుకుంది.

ఆయన జాలిపడి "అమ్మా! నీకు రెండువైపులా పరాభవం కలిగింది. సాళ్వుణ్ణి చక్క చెయ్యమంటావా? భీష్ముడికి నచ్చ చెప్పమంటావా?" అని అడిగాడు.

"మహర్షీ! సాళ్వుడెలాగా నన్ను అంగీకరించడు. భీష్ముడంటే కోపంగా ఉంది నాకు. అతణ్ణి సాధించడానికే తపస్సు చేస్తున్నాను" అంది.

"అమ్మా! తపస్సు చేసేటంత కష్టమెందుకు నీకు! భీష్ముడు నా మాట వినకపోతేగా?" అని అంబను భీష్ముడి దగ్గరకు తీసుకువెళ్ళాడు పరశురాముడు.

"గాంగేయా! ఈ పడుచును బలవంతంగా తీసుకువచ్చావు. ఇప్పుడు కాదనడం ధర్మం కాదు. ఈ పిల్లను నీ తమ్ముడికిచ్చి పెళ్ళి చెయ్యి" అన్నాడు.

"పరపురుషుని మీద వ్యామోహం ఉన్న కన్యను నా తమ్ముడికిచ్చి వివాహం చెయ్యడం మాత్రం ధర్మమా మహాత్మా" అన్నాడు భీష్ముడు.

"ఏమో అదంతా నాకు తెలీదు. నేను చెప్పింది చెయ్యడమే నీ కర్తవ్యం. లేకపోతే నిన్నూ, నీ స్నేహితుల్నీ, నీ బంధువుల్నీ కూడా చంపుతాను" అన్నాడు పరశురాముడు.

"అయ్యా! ఇది అధర్మం" అన్నాడు భీష్ముడు చేతులు జోడిస్తూ.

"నాకు ధర్మాధర్మాలు నేర్పేవాడవయ్యావా?" అని మండిపడ్డాడు పరశురాముడు.

"స్వామీ! మీరు నాకు విలువిద్య నేర్పిన గురువులు. నిష్కారణంగా శిష్యుడి మీద కోపగించుకోవడం న్యాయం కాదు" అన్నాడు భీష్ముడు. ఆ మాటలతో మరింత కోపం వచ్చిందాయనకు.

"నేను గురువునని తెలిసేనా, నా మాట తిరస్కరిస్తున్నావు? పైగా ఏవేవో ధర్మాలు బోధిస్తున్నావు నాకు. మాటల వల్ల ప్రయోజనం లేదు. ఈ అమ్మాయిని మీ తమ్ముడికిచ్చి పెళ్ళి చేస్తే నా కోపం చల్లారుతుంది. లేదా..." అని పరశురాముడు ఇంకా ఏదో అంటుండగానే "అధర్మకార్యం మాత్రం నేను చెయ్యను" అన్నాడు భీష్ముడు.



దానితో ఇద్దరూ యుద్ధానికి దిగారు.

పరశురాముడు బాణాలవర్షం కురిపించాడు. భీష్ముడు తెలివిగా రథాన్ని ఆకాశానికి ఎత్తేసరికి ఆయన మొహం పాలిపోయింది. పరశురాముడు ఏ అస్త్రం ప్రయోగించినా భీష్ముడు దాన్ని తిప్పికొడుతున్నాడు. ఇంతలో జమదగ్ని మహాముని పితృదేవతలతో సహా వచ్చి "నాయనా! భీష్ముణ్ణి జయించడం ఎవరికీ సాధ్యం కాదు. నారాయణసఖుడైన నరుడు అర్జునుడై పుట్టి ఈ భీష్ముణ్ణి చంపుతాడు. నువ్వూరుకో" అని పరశురాముణ్ణి శాంతింపజేశాడు. పరశురాముడు భీష్ముణ్ణి కౌగలించుకుని గౌరవించాడు.

భీష్ముడు క్రౌర్యం విడిచి గురువుగారికి సాష్టాంగ నమస్కారం చేశాడు.

పరశురాముడు అంబను పిలిచి "అమ్మాయీ! నన్ను భీష్ముడు గెలిచాడు. ఇంక నేనేం చెయ్యలేను. నీ ఇష్టం మరి" అన్నాడు. అంబ మౌనంగా రోదిస్తూ వెళ్ళిపోయింది.

ఆ తరువాత యమునాతీరంలో కుటీరం ఏర్పరచుకుని తీవ్రంగా తపస్సు చేసింది. ఒకనాడు గంగాదేవి కనిపించి "ఏమిటింత కఠినంగా తపస్సు చేస్తున్నావు?" అని అడిగేసరికి "వచ్చే జన్మలో భీష్ముణ్ణి చంపాలి అందుకూ ఈ తపస్సు" అంది అంబ.

"నువ్వు కుటిలసంచారిణివి. కనుక ఈ శరీరం విడిచి ఏరై ప్రవహించు. అంతకంటే ఇంకేం చెయ్యలేవు నువ్వు" అంది కోపంగా గంగ.

అంబ తన తపఃప్రభావంలో సగం ధారపోసి అంబానదిగా ప్రవహించి మిగిలిన సగభాగంతోనూ తన శరీరాన్ని నిలబెట్టుకుంది. చివరకు ఆమె తపస్సుకు మెచ్చి పరమేశ్వరుడు ప్రత్యక్షమై "మరుజన్మలో భీష్ముణ్ణి చంపగలవు" అని సెలవిచ్చాడు.

"స్వామీ! అదెలా సంభవం?" అని అంబ అడిగింది.

"నువ్వీ శరీరం విడిచి ద్రుపదుడికి మొదట కూతురివై పుడతావు. తరువాత కొడుకుగా మారి శిఖండి అనే పేరుతో ప్రసిద్ధికెక్కి గాంగేయుని వధిస్తావు" అని చెప్పి అంతర్ధానమయ్యాడు శివుడు.

అంబ చితి పేర్చుకొని 'వచ్చే జన్మలో భీష్ముణ్ణి చంపుదునుగాక" అంటూ అగ్నిలో ప్రవేశించింది. అదీ అంబ కథ. ●

# విదురుడు

విదురుడు ధర్మశాస్త్రంలోనూ, రాజనీతిలోనూ బాగా ఆరితేరినవాడు. కోపతాపాలు, ఈర్ష్యాసూయలు లేని మహాత్ముడు. పెద్దలందరిచేతా మంచివాడని పించుకున్నాడు. ధృతరాష్ట్ర మహారాజుకు మహామంత్రిగా పనిచేశాడు. విదురుడికి సాటివచ్చే విజ్ఞానవంతుడూ ధర్మనిష్ఠుడూ ముల్లోకాల్లోనూ ఎవరూ లేరు.

పాండవులతో జూదం ఆడటానికి దుర్యోధనుడు తన తండ్రి అనుమతి కోరినప్పుడు విదురుడు ధృతరాష్ట్రుడి చేతులు పుచ్చుకుని, "మహారాజా! మీరు ఈ జూదానికి ఒప్పుకోవద్దు. ఈ జూదం వల్ల అన్నదమ్ముల మధ్య విరోధం వస్తుంది. కౌరవ రాజ్యానికే దీనివల్ల ముప్పు కలుగుతుంది" అని ఎన్నో విధాల చెప్పాడు.

ధృతరాష్ట్రుడికి విదురుడిమీద అపారమైన నమ్మకం. అందుచేత అతను చెప్పిన మాటలు విని కొడుకుతో, "అబ్బాయీ! ఈ జూదం మనకు వద్దు. పాచికలతో పరాచికాలు కాదని విదురుడు చెబుతున్నాడు. అతడు ఏది చెప్పినా మన మేలుకోరి

చెబుతాడు. అతడు చెప్పిన ప్రకారం చేస్తే మనకు శుభం జరుగుతుంది. బుద్ధిలో బృహస్పతిలాంటివాడు. జరిగిందీ, జరగబోయేదీ అన్నీ చెప్పగలడు. ఈ జూదం వల్ల మీ అన్నదమ్ముల మధ్య తగాదా వస్తుందని విదురుడు చెబుతున్నాడు. అది సుతరామూ నాకిష్టం లేదు" అని శతవిధాల చెప్పాడు.

కానీ అవేవీ దుర్యోధనుడి చెవికెక్కలేదు. కుమారుడి మీద గల మితిమీరిన ప్రేమకొద్దీ ధృతరాష్ట్రుడు చివరికి తప్పనిసరై అతను జూదమాడటానికి సరేనన్నాడు.

ఆ తరువాత విదురుడు చెప్పినట్టే జరిగింది. కౌరవ వంశమంతా నాశనమైంది. చెట్టుకొకరు పుట్టకొకరు అయ్యారు.

అసలింతకీ ఈ విదురుడు ఎవరంటే–

ఊరికి దూరంగా ఒక వనంలో ఆశ్రమం కట్టుకుని మాండవ్య మహాముని జీవిస్తుండేవాడు. ఒకనాడు ఆయన తన ఆశ్రమం వెలుపల తపస్సు చేసుకుంటూ వుండగా కొందరు దొంగలు అటువైపు వచ్చారు. వారిని కొందరు రాజభటులు తరుముకొస్తున్నారు. వారిని తప్పించుకునేందుకు దొంగలు మాండవ్యముని ఆశ్రమంలోకి జొరబడ్డారు. దోచుకుతెచ్చిన సొమ్ములన్నీ ఓమూల పడేసి మరోమూల వాళ్ళు దాక్కున్నారు.

రాజభటులు దొంగలు పారిపోయిన జాడ కనిపెట్టి ఆ దారినే ఆశ్రమం వద్దకు వచ్చారు.

అక్కడ తపస్సు చేసుకుంటున్న మాండవ్యముని కనిపించాడు వాళ్ళకు.

"ఏమయ్యా ఇప్పుడే కొందరు దొంగలు ఇటు వచ్చారే, నువ్వేమైనా చూశావా? వాళ్ళు ఎటు వెళ్ళారు?" అని అడిగారు. ధ్యానంలో నిమగ్నమైన మాండవ్యుడు బదులు చెప్పలేదు.

రాజభటులు మళ్ళీ గట్టిగా అడిగారు.

సమాధానం లేదు.

ఇంతలో కొందరు రాజభటులు ఆశ్రమంలోకి వెళ్ళి సోదా చెయ్యటం మొదలుపెట్టారు. లోపల ఓ మూల దొంగలెత్తుకొచ్చిన నగలు, డబ్బు కనిపించాయి.

మరో మూల దొంగలు కూడా కనిపించారు.

'ఒహో! ఇదా కథ! ఈ బ్రాహ్మణుడు కపట సన్యాసన్నమాట. దొంగల

నాయకుడు బహు గొప్పగా ముని వేషం వేసుకుని ఉలక్కుండా పలక్కుండా వున్నాడు. ఇతడి సలహా మీదనే ఈ దొంగతనం జరిగి వుంటుంది' అని రాజభటులు తీర్మానించుకుని వాళ్ళ చేతులకు బేడీలు వేశారు. వెంటనే ఈ విషయం రాజుగారికి చెప్పారు. రాజుగారికి చాలా కోపం వచ్చింది. కపట సన్యాసిని వెంటనే శూలానికి గుచ్చి కొరత వెయ్యండని ఆజ్ఞాపించాడు. రాజుగారి ఆజ్ఞ ప్రకారం మాండవ్యుణ్ణి శూలానికి గుచ్చి, ఆశ్రమంలో దొరికిన సొమ్మంతా రాజుగారికి అప్పగించారు. ఇంత జరుగుతున్నా దొంగలు నోరు మెదపలేదు. కాని, మాండవ్యముని ధ్యానంలో వుండటంవల్ల శూలంపోట్లు ఆయనను ఏమీ చెయ్యలేకపోయాయి.

ప్రాణం నిలిచే వుంది. అడవిలో వున్న మునులందరికీ ఈ విషయం తెలిసి ఆయనను చూడటానికి వచ్చారు.



"ఇంతటి ఘోరానికి ఒడికట్టిందెవరు మహానుభావా?" అని దుఃఖిస్తూ అడిగారు.

"ఎవరని చెప్పను నాయనా? ఎవరి ధర్మం వాళ్ళు నెరవేర్చారు. రాజభటులు పట్టుకున్నారు, రాజుగారు నాకీ శిక్ష విధించారు" అని మాండవ్య ముని సమాధానం చెప్పాడు.

శూలానికి వ్రేలాడుతున్న మనిషి అన్నం, నీళ్ళూ లేకపోయినా ఇంకా అలాగే ప్రాణాలతో బ్రతికి వుండటం రాజుగారికి ఆశ్చర్యం కలిగించింది. మౌని మహనీయుడని గ్రహించాడు. వెంటనే ఆయన్ను శూలం నుంచి దింపమని భటులను ఆజ్ఞాపించాడు.

మహాముని కాళ్ళమీద పడి క్షమించమని వేడుకున్నాడు.

ఇంత జరిగినా మాండవ్యమునికి రాజుగారిమీద కోపం రాలేదు.

తిన్నగా యమధర్మరాజు దగ్గరకు వెళ్ళి "స్వామీ! ఇంతటి కఠిన శిక్షను నా కెందుకు విధించారు?" అని అడిగాడు.

యమధర్మరాజు మాండవ్యుడికి కలిగిన కష్టానికి విచారిస్తూ, "మహామునీ! మీరు చిన్న పిల్లవాడుగా వున్నప్పుడు పక్షులను, తుమ్మెదలను హింసించారు. పాపం ఎంత కొద్దిగా చేసినా దాని ఫలం చాలా ఎక్కువగా అనుభవించాలి" అన్నాడు.

"పసితనంలో తెలియక చేసిన తప్పుకి ఇంత పెద్ద శిక్ష విధిస్తావా? సరే – నువ్వు చేసిన పాపానికి భూలోకంలో మానవుడవై జన్మించు" అని ముని యమధర్మరాజుని శపించాడు.

ఆ విధంగా ధర్మదేవత మాండవ్యముని శాపంవల్ల అంబాలిక దగ్గర వున్న దాసీవనిత కడుపున పుట్టాడు. అతడే విదురుడు.

అందుకని ధర్మదేవత అవతారమే ధర్మకోవిదుడైన విదురుడని పెద్దలు చెబుతారు. ●

# ద్రోణుడు

భరద్వాజ మహాముని పుత్రుడు ద్రోణుడు. వేద వేదాంగాలన్నీ అభ్యసించాడు. ధనుర్విద్య ఆసాంతం నేర్చుకున్నాడు. పాంచాలదేశపు రాజకుమారుడు ద్రుపదుడు కూడా ద్రోణుడితోపాటు చిన్నప్పుడు అస్త్రవిద్య నేర్చుకున్నాడు. దానితో వారిద్దరికీ గాఢస్నేహం కుదిరింది. ఆ స్నేహం కొద్దీ, తాను రాజ్యం చేపట్టిన వెంటనే తన రాజ్యంలో సగభాగం ఇస్తానని ద్రుపదుడు ద్రోణుడికి మాట ఇచ్చాడు.

ఆశ్రమవాసం పూర్తి అయిన తరువాత ద్రోణుడు కృపాచార్యుడి చెల్లెలిని పెళ్ళి చేసుకున్నాడు. అశ్వత్థామ అనే కుమారుణ్ణి కన్నాడు. ద్రోణుడికి భార్య అన్నా, కొడుకు అన్నా అపరిమితమైన ప్రేమ. కానీ బీదరికం వల్ల వాళ్ళను సుఖపెట్టలేక పోయాడు. అందువల్ల ఏదో ఒక విధంగా ధనం సంపాదించి వాళ్ళను సంతోష పెట్టాలనే ఆశ ద్రోణుడ్ని పీడిస్తూ వుండేది. పరశురాముడు తన ధనమంతా బ్రాహ్మణులకు దానం ఇస్తున్నాడని తెలిసింది. కొండంత ఆశతో ఆయన దగ్గరకు వెళ్ళాడు. కానీ అంతకు కొంచెం ముందే పరశురాముడు తన దానధర్మాలన్నీ పూర్తిచేసి

అరణ్యాలకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నాడు. ద్రోణుడ్ని చూసి, "స్వామీ! నాకున్నదంతా అయిపోయింది. ఇక మిగిలిందల్లా ఈ శరీరమూ, నేను నేర్చిన అస్త్రవిద్యలూ మాత్రమే. ఆ విద్యలు నేర్పమంటారా?" అని అడిగాడు.

"ఆ అస్త్ర విద్యలు చాలు, అవే బోధించండి నాకు" అన్నాడు ద్రోణుడు.

పరశురాముడు సమస్త విద్యలూ ద్రోణుడికి నేర్పాడు.

కొంతకాలానికి పాంచాల దేశపు రాజు పరమపదించాడు. ద్రుపదుడు రాజయ్యాడు. ద్రోణుడు పట్టరాని ఆనందంతో ద్రుపదరాజు ఆస్థానానికి వెళ్ళి తనను తాను ఫలానా అని పరిచయం చేసుకున్నాడు. ద్రుపదుడు ముఖం పక్కకు తిప్పుకున్నాడు. ఐశ్వర్య మదంతో కన్నూ మిన్నూ గానక ద్రోణుడ్ని ఏవగించుకున్నాడు. ''నువ్వెవరో నాకు తెలీదు. అయినా ఏమిటీ సాహసం? నీకూ నాకూ స్నేహమంటున్నావు. సింహాసనం ఎక్కిన మహారాజుకూ, అదృష్టం, ఐశ్వర్యం లేని అష్టదరిద్రుడికీ స్నేహమంటే ఎవరైనా నమ్ముతారా? ఏదో చెప్పి నా జట్టు కలవాలని చూస్తున్నావు. ఆ పప్పులేమీ వుడకవు. దరిద్రుడికీ ధనికుడికీ, మూర్ఖుడికీ విద్వాంసుడుకీ, పిరికివాడికీ వీరుడికీ ఎలా మైత్రి కుదురుతుందనుకున్నావు?" అన్నాడు.

ద్రోణుడు పరాభవంతో వెనక్కి వెళ్ళాడు.

ఇలా వుండగా హస్తినాపురంలో ఒకనాడు రాకుమారులు నగరం వెలుపల ఉద్యానవనంలో బంతి ఆట ఆడుకుంటున్నారు. ఆటలో బంతి వెళ్ళి అక్కడున్న బావిలో పడింది. దానితోపాటు ధర్మరాజు వేలి ఉంగరం కూడా పడిపోయింది. అందరూ బావిచుట్టూ చేరారు. ఇంతలో ఆ సమయానికి ఒక బ్రాహ్మణుడు వచ్చాడు అక్కడికి. "రాకుమారులారా! మీరు క్షత్రియులు కదా! నీళ్ళలోపడిన బంతిని పైకి తీయలేకపోతున్నారే! నేను ఒకే ఒక్క బాణంతో ఆ బంతిని పైకి తీస్తాను. మరి నాకేమిస్తారు?" అని అడిగాడు ఆ బ్రాహ్మణుడు.

"కృపాచార్యుల వారింట్లో మీకు షడ్రసోపేతమైన భోజనం పెట్టిస్తాం" అన్నారు.

బ్రాహ్మణుడు నవ్వుతూ ఒక పుల్ల తీసుకుని మంత్రించి నీళ్ళలో వున్న బంతికి గురిపెట్టి విసిరాడు. అది బాణంలా రివ్వున వెళ్ళి బంతిని కొట్టుకుంది. అలా ఒకదానికొకటి గుచ్చినట్టు పుల్లలను విసిరేటప్పటికి అది తాడులా తయారైంది. దాన్ని పట్టుకుని పైకిలాగి బంతిని రాకుమారులకిచ్చాడు. రాజకుమారులు ఆశ్చర్యపోయారు.

ఉంగరం కూడా తీసిపెట్టమని బ్రతిమాలారు.

అప్పుడు ఆయన ఒక బాణాన్ని నీళ్ళలోకి వేసేటప్పటికి అది సూటిగా వెళ్ళి ఉంగరానికి గుచ్చుకొని పైకి తేలివచ్చింది. రాకుమారులు ఈ విచిత్రం చూసి విస్తుపోయారు. "స్వామీ! మీరెవరు? మా వల్ల కాదగిన ఉపకారం ఏదైనా వుంటే చెప్పండి చేస్తాం" అన్నారు.

"భీష్ముణ్ణి అడగండి, నేనెవరో ఆయనకు తెలుసు" అని పిల్లల్ని పంపించేశాడు.

రాకుమారులు చెప్పిన లక్షణాల్ని బట్టి ఆ బ్రాహ్మణుడు ద్రోణాచార్యుడని గుర్తించిన భీష్ముడు ఆయనను సకల మర్యాదలతో రప్పించాడు. తన నూట అయిదుగురు మనవళ్ళకూ అస్త్రవిద్యలు గరపమని కోరాడు. అలా ద్రోణాచార్యుడి వద్ద కౌరవ పాండవులు అస్త్రవిద్యలన్నీ నేర్చుకున్నారు. చివరికి గురువుగారు దక్షిణ కోరుతూ ద్రుపదరాజును ప్రాణాలతో పట్టితెచ్చి అప్పగించవలసినదని కర్ణుణ్ణీ, దుర్యోధనుణ్ణీ పంపారు. కానీ వాళ్ళ వల్ల ఆ పని కాలేదు. తరువాత ద్రోణుడు అర్జునుడ్ని పంపాడు. అతను ద్రుపదరాజుని మంత్రితో సహా కట్టితెచ్చి ఆచార్యుల వారిముందు నిలబెట్టాడు.



"ద్రుపదరాజా! నీ ప్రాణాలకేమీ ముప్పు లేదు, భయపడకు. చిన్నతనంలో నాతో ఎంతో స్నేహంగా ఉన్నావు. తరువాత రాజ్యాధికారం రాగానే నన్ను అవమానించావు. రాజుతో స్నేహం చెయ్యడానికి రాజే కావాలన్నావు. కయ్యానికైనా వియ్యానికైనా సమాన హోదా ఉండాలన్నావు. ఆ కారణం వల్లనే ఇప్పుడు నేను నీతో యుద్ధం చేయవలసి వచ్చింది. కానీ మళ్ళీ నేను నీతో స్నేహంగా ఉండాలనుకుంటున్నాను. నేను నీతో స్నేహం చెయ్యాలంటే నువ్వు అష్ట దరిద్రుడుగా ఉండటానికి వీల్లేదు. అందుకని నీ దగ్గర గెలుచుకున్నదాంట్లో సగం రాజ్యం ఇస్తాను తీసుకో" అన్నాడు ద్రోణుడు.

ద్రుపదరాజు అవమానంతో తల దించుకున్నాడు. చేసిన పరాభవం చాలనుకుని ద్రోణుడు అతడిని ఉచితరీతిన సత్కరించి సాగనంపాడు. ●

# అర్జునుడు

అర్జునుడు పాండవులలో మూడవవాడు. అతను పుట్టినప్పుడు "కుంతీ! నీ కుమారుడు పరమశివునితో సరితూగేటంత శక్తిమంతుడౌతాడు. ఇంద్రుని వలె అజేయుడౌతాడు. రాజులందర్నీ జయించిన తరువాత మూడుసార్లు అశ్వమేధం చేస్తాడు. శివుడ్ని ప్రసన్నం చేసుకుని పాశుపతదివ్యాస్త్రాన్ని సంపాదిస్తాడు" అని అశరీరవాణి పూలవానలు కురిపిస్తూ పలికింది.

పాండవులు చిన్నప్పుడు కౌరవులతో కలసి హస్తినాపురంలో వుంటుండేవారు. బాల్యంలోనే అర్జునుడు అస్త్రవిద్య, సంగీతం, నాట్యం క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. మొట్టమొదట అర్జునుడికి ధనుర్వేదంలో పాఠాలు చెప్పిందీ, బాణాలు వేయడం నేర్పిందీ శుకమహర్షి. తరువాత కృపాచార్యుడు, ఆ తరువాత ద్రోణుడు అర్జునుడ్ని మేటి విలుకాడుగా మలచారు.

ఓసారి ద్రోణుడూ, ఆయన శిష్యులూ గంగానదిలో స్నానం చేస్తుండగా ఆచార్యుని కాలు ఒక తిమింగలం పట్టుకుంది. శిష్యులందరూ ఎంత ప్రయత్నించినా తిమింగలం పట్టు నుంచి గురువుగార్ని విడిపించలేకపోయారు. చివరికి అర్జునుడు వేసిన బాణంతో తిమింగలం ద్రోణుణ్ణి వదలి పలాయనం చిత్తగించింది. ద్రోణుడు సంతోషించి అర్జునుడికి "బ్రహ్మశిరాస్త్రం" ఉపదేశించాడు. ఆ అస్త్రాన్ని మానవుల మీద ప్రయోగించటానికి వీల్లేదు. మానవాతీతమూర్తుల మీదే అది పనిచేస్తుంది.

ఇలా వుండగా దుర్యోధనుడికి పాండవులందర్నీ హతమార్చి రాజ్యం మొత్తం చేజిక్కించుకోవాలన్న దురాశ కలిగి వాళ్ళందర్నీ 'వారణావతం' అనే పట్టణానికి పంపాడు. పాండవులకి దుర్యోధనుడి కుట్ర తెలిసిపోయింది. అక్కడినుంచి యుక్తిగా తప్పించుకుని వాళ్ళందరూ బ్రాహ్మణ వేషాలలో ఏకచక్రపురం చేరారు. ఆ సమయంలో పాంచాల రాజు ద్రుపదుడు తన కుమార్తె ద్రౌపదికి స్వయంవరం చాటించాడు.



స్వయంవరమంటపం ఎంతో సొగసుగా నిర్మించారు. ఉక్కు తీగలతో పురిపెట్టిన అల్లెత్రాడు గల పెద్దవిల్లు ఒకటి వేదిక మీద ఉంచారు. ఆ విల్లు వంచి, నారిని సంధించి, బాణం ఎక్కుపెట్టి, పైన చాలా ఎత్తులోవున్న చేపను ఒకేదెబ్బలో కొట్టాలి. మధ్యలో ఒక చక్రం గిర్రున తిరుగుతూ వుంటుంది. దానికి ఏమాత్రం తగలకుండా, దాని మధ్యగుండా బాణం వేయాలి. అలా వేయగలిగిన యోధుడ్ని ద్రౌపది పెళ్ళాడుతుంది. దుర్యోధనుడు, కర్ణుడు, శిశుపాలుడు, జరాసంధుడు వంటి యోధానుయోధులు ఆ స్వయంవర మహోత్సవానికి హాజరయ్యారు. బ్రాహ్మణ వేషాలలో వున్న పాండవులూ వెళ్ళారు. క్షత్రియ వీరులూ, రాకుమారులూ ప్రయత్నించి విఫలమయ్యారు. కర్ణుడు విర్రవీగుతూ వెళ్ళి వెల్లకిలా పడ్డాడు. చివరికి మారువేషంలో వున్న అర్జునుడు ధనుస్సు ఎత్తి చాలా తేలికగా లక్ష్యాన్ని కొట్టగలిగాడు. పాంచాలి అర్జునుడి మెడలో వరమాల వేసింది.

అర్జునుడి కపికేతనం గురించి చిత్రమైన కథ వుంది. ఒకసారి దేశయాత్రకు వెళ్ళిన అర్జునుడు రామేశ్వరం నుంచి లంక వరకూ శ్రీరాముడు నిర్మించిన వారధిని చూసి విస్తుపోయాడు. అయితే వంతెన నిర్మాణానికి కోతుల సాయం తీసుకోవడం మాత్రం అర్జునుడికి నచ్చలేదు. 'గొప్ప ధనుర్విద్యా నిపుణుడైన శ్రీరామచంద్రుడు బాణాలతో వంతెన నిర్మించుకోవలసింది' అనుకున్నాడు. సముద్ర తీరాన కూర్చుని రామాయణం పఠిస్తున్న ఒక పండితుడి దగ్గరకు వెళ్ళి ఇదే ప్రశ్న వేశాడు. ఆయనా సరైన సమాధానం చెప్పలేకపోయాడు. అప్పుడొక కోతిపిల్ల వచ్చి "శ్రీరాముడు బాణాలతో వంతెన నిర్మిస్తే, కోతులన్నీ దాని మీదనుంచి నడిచివుంటే ఆ వారధి ఆనాడే కుప్పకూలి వుండేది" అని సమాధానమిచ్చింది.

"శ్రీరాముడు బాణాలతో వంతెన నిర్మిస్తే కోతుల బరువుకే అది కూలటమా!" అని సవ్యచాచి బిగ్గరగా నవ్వాడు. పిల్లకోతికీ, అతనికీ మధ్య వాదోపవాదం చెలరేగింది.

"రాముడి సంగతి అలా వుంచు. నేను బాణాలతో వంతెన కడతాను. నువ్వు పడగొట్టగలిగితే నేను అగ్నిలో దూకి ప్రాణాలు విడుస్తాను. నేను జయిస్తే ఎప్పటికీ మీ వానరజాతి అంతా నాకు బానిసలుగా, సేవకులుగా వుండాలి. సరేనా?" అన్నాడు.

సరేనంది మర్కటం.

అర్జునుడు బాణాలతో వంతెన ఏర్పరిచాడు. కోతి అడుగు పెట్టగానే అది పుటుక్కుమంది. మళ్ళీ వంతెన కట్టాడు. మళ్ళీ కూలిపోయింది. అర్జునుడు మంట

చేసి ఆ జ్వాలల్లోకి దూకటానికి సంసిద్ధుడయ్యాడు. ఇంతలో ఒక బాలుడు వచ్చి, "న్యాయమూర్తిగా వ్యవహరించే పెద్దమనిషి లేకుండా మీరు వేసుకున్న పందెం ధర్మసమ్మతం కాదు. నీ ఆత్మత్యాగం చెల్లదు" అన్నాడు అర్జునుడితో.

అర్జునుడు అతని మాటలు వినకుండా మంటల్లోకి దూకబోతుంటే "సరే, మరోసారి పందెం కాయండి, ఈసారి నేను న్యాయం చెబుతాను. అప్పుడు కూడా ఓడిపోతే మీ యిష్టం" అన్నాడు బాలుడు. వానరం, అర్జునుడు అందుకు సరేనన్నారు.

అర్జునుడు మళ్ళీ వంతెన నిర్మించాడు. పిల్లకోతి చకచక ఎక్కి నిలబడింది. ఈసారి వంతెన చెక్కుచెదరలేదు. పిల్లకోతి శరీరాన్ని పెంచింది. పర్వతమంత ఎత్తు ఎదిగింది. అయినా వంతెన తొణకలేదు. కోతికి అర్థమైంది "రామచంద్రప్రభో!" అంటూ వెళ్ళి బాలుడికి పాదాభివందనం చేసింది. "శ్రీకృష్ణా!" అంటూ వెళ్ళి పార్థుడు బాలుడి పాదాలు పట్టుకున్నాడు.

పిల్లవాడు చిరునవ్వు నవ్వుతూ ఇద్దర్నీ లేవనెత్తి "ఇకమీదట అర్జునుడి పతాకం మీద నీ గుర్తు వుంటుంది" అని కోతిని ఆశీర్వదించాడు. ●

# గురుదక్షిణ

ద్రోణుడు పరశురాముడి శిష్యుడు. ఆయన దగ్గర శస్త్రాస్త్ర విద్యలన్నీ నేర్చుకున్నాడు. భీష్ములవారు ద్రోణాచార్యుడి ధనుర్విద్యాశక్తిని గురించి విని ఆయనను పిలిపించి కురుపాండవులకు శిక్షణ ఇప్పించాడు.

హస్తినాపురంలో ద్రోణాచార్యులు ధనుర్విద్య నేర్పుతున్న సంగతి ఆ నోట ఆ నోట అందరికీ తెలిసింది. కర్ణుడు కూడా విద్యాభ్యాసం కోసం వచ్చాడు.

అందరూ ఎంతో శ్రమపడి విద్య నేర్చుకుంటున్నా, అందరికంటే దీక్షగా అర్జునుడు చేసే సాధన ఆచార్యునికి సంతోషం కలిగించింది. అందుకని మరింత ఓపికతో, ప్రేమతో అతనికి పాఠాలు చెప్పేవారు. ఒకనాడు భోజన సమయంలో పెనుగాలికి దీపం ఆరిపోయింది. అయినా అలవాటు ప్రకారం అర్జునుడు భోజనం ముగించి చీకటిలో కూడా విద్యాభ్యాసం ఆరంభించాడు. నిద్రపోతున్న గురువుగారు అర్జునుడి ధనుష్టంకారం విని లేచారు. శిష్యుడి ఏకాగ్రతకు, దీక్షకు పరవశించి

గాఢాలింగనం చేసుకుని "అస్త్రవిద్యలో నీ అంతటివాడు వుండడు" అని వెన్నుతట్టారు.

రోజులు గడుస్తున్నాయి.

కురుపాండవుల విలువిద్యాశక్తిని పరిశీలించేందుకు ద్రోణాచార్యులవారు ఒకనాడు ఓ పరీక్ష పెట్టారు. ఒక పిట్ట బొమ్మని తయారు చేయించి దానిని ఒక చెట్టు చిటారుకొమ్మకు కట్టి శిష్యులందరినీ పిలిపించారు. ముందుగా ధర్మరాజును పిలిచి "చిటారుకొమ్మన పక్షిని చూశావా? నేనూ, నీ సోదరులూ, చెట్టూ కనిపిస్తున్నాయా?" అని అడిగారు.

అన్నీ చూస్తున్నానన్నాడు ధర్మరాజు.

అలాగే దుర్యోధనాదులందరినీ పిలిచి అడిగారు.

అందరూ గొప్పగా తలలూపారు.

చివరికి అర్జునుడ్ని పిలిచి అడిగితే "ఆచార్యా! పక్షి తప్ప మరేమీ కన్పించటం లేదు నాకు" అన్నాడు.

"ఆ పక్షి అవయవాలు ఎలా వున్నాయి?" గురువుగారు మరో ప్రశ్న వేశారు.

"దాని శిరస్సు తప్ప మరే అవయవమూ నా దృష్టిలో లేదు" అన్నాడు అర్జునుడు.

దాని శిరస్సు పడగొట్టమన్నాడు ద్రోణుడు.

అనటమే ఆలస్యం– అర్జునుడి ధనుస్సునుండి బాణం దూసుకుపోయింది. పక్షి తల నేల రాలింది.

ద్రోణుడు శిష్యుడ్ని గాఢాలింగనం చేసుకున్నాడు.

అర్జునుడు గురువుగారికి పాదాభివందనం చేశాడు.

అయితే, ఆ రోజుల్లోనే అర్జునుడికి దీటైనవాడు మరొకడు ధనుర్విద్యలో ఆరితేరాడు. అతను హిరణ్యధన్వుడనే ఎరుకరాజు కుమారుడు ఏకలవ్యుడు. అతను ధనుర్విద్య నేర్పమని ద్రోణాచార్యులవారిని బ్రతిమాలితే ఆయన తిరస్కరించాడు. అయినా బాధపడక గురువుగారి పాదాలకు నమస్కరించి వెనక్కితిరిగి వెళ్ళిపోయాడు. అడవికి వెళ్ళాక ద్రోణుని విగ్రహం ఎదుట వుంచుకొని, ఆ ప్రతిమనే గురువుగా భావించి పూజిస్తూ ధనుర్విద్య అభ్యసించటం మొదలుపెట్టాడు.

ఒకనాడు కురుపాండవులు వేటకు వెళ్ళి అడవి జంతువులను సంహరిస్తుండగా వారి వేటకుక్క ఏకలవ్యుడ్ని చూసి మొరిగింది. అది నోరు తెరచి మొరుగుతూన్న క్షణంలో ఏకలవ్యుడు ఒకేసారి దాని నోట్లోకి ఏడు బాణాలు వదిలాడు.

అది అలాగే పాండవుల దగ్గరకు వెళ్ళింది.

పాండవులకు ఆశ్చర్యం కలిగింది.



అంతటి విలుకాడెవరా అని వెదికి వెదికి చివరకు ఏకలవ్యుడని తెలుసుకున్నారు. కుతూహలం చంపుకోలేక "నీ గురువు పేరేమిటి?" అని అడిగారు పాండవులు. "ద్రోణాచార్యులు" అని వినయంగా సమాధానం చెప్పాడు అతను. అతను కూడా ద్రోణుని శిష్యుడే అని తెలియగానే హస్తినాపురం వస్తూనే అర్జునుడు నేరుగా గురువుగారి దగ్గరకు వెళ్ళాడు. "ఆర్యా! మీ శిష్యులలో నన్ను మించినవాడు లేడన్నారు. కానీ మీ శిష్యుడు ఏకలవ్యుడు విలువిద్యలో నాకంటే ఆరితేరాడు" అనగా, ద్రోణుడు అర్జునుడితో అడవికి వచ్చి ఏకలవ్యుణ్ణి చూశాడు. ఆ వీరుడు ద్రోణుడికి నమస్కరించి గురుదక్షిణగా ఏం కావాలన్నా యిస్తానన్నాడు. వెంటనే కుడిచేతి

బొటనవేలు కోసి యిమ్మన్నాడు. ఏకలవ్యుడు సంతోషంగా గురువు  కోరిన ప్రకారం దక్షిణ  అర్పించాడు.

"నిన్ను మించిన విలుకాడు ఉండటానికి వీల్లేదు" అని ద్రోణుడు అర్జునుడికి చేసిన వాగ్దానం కోసం ఏకలవ్యుని అంగుష్ఠం గ్రహించి తిరిగి వచ్చాడు. ●

# రాజనీతి

**న్యా**యమైన ఖర్చులకు ఎంత అవసరమో అంతకంటే ఎక్కువ ప్రజల వద్దనుంచి పన్నుల రూపంలో తీసుకోకూడదు.

ఈ రాజనీతిని చెప్పడానికి వ్యాసులవారు మనకో మంచి కథ చెప్పారు. ఈనాటికీ పనికొచ్చే నీతి కథ యిది. అదేమిటంటే-

ఓసారి అగస్త్యముని దారినపోతూ కొన్ని ప్రాణులు చెట్టు కొమ్మలు పట్టుకుని తలక్రిందులుగా వేలాడటం చూశాడు.

"ఓ జీవులారా! మీరెవరు? ఎందుకింత కఠినమైన తపస్సు చేస్తున్నారు?" అని అడిగాడు. అప్పుడా జీవులు, "నాయనా, మేము నీ పూర్వీకులం. నీ తాత ముత్తాతలం. నీవు పెళ్ళి చేసుకోకుండా ఉన్నావు కాబట్టి నీ తరువాత మాకు పితృకార్యాలు చేసేవాళ్ళు లేరు. అందుకని మేమీ తపస్సు చేస్తున్నాం. నీకు సంతానం కలిగితే మాకీ దుర్గతి తప్పుతుంది" అన్నాయి.

అగస్త్యుడు అది విని, వెంటనే వివాహం చేసుకోవడానికి నిశ్చయించుకున్నాడు. అదే సమయంలో విదర్భదేశపు రాజుగారు తనకు సంతానం కలగలేదని బాధపడుతూ, చివరికి అగస్త్యులవారిని దర్శించి, ఏదైనా ఉపాయం చెప్పమని ప్రార్థించాడు.

"మహారాజా! నీకు సంతానం కలుగుతుంది. ఓ అందమైన అమ్మాయి పుడుతుంది. ఆ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చెయ్యండి" అని చెప్పి అగస్త్యుడు ఆశీర్వదించాడు. ఆ వరప్రసాదంవల్ల రాజుగారి భార్య గర్భవతి అయింది. కుందనపు బొమ్మలాంటి కూతురు పుట్టింది. ఆ పిల్లకు లోపాముద్ర అని పేరు పెట్టారు. ఆమె పెరిగి పెద్దదైంది. లోపాముద్ర గుణగణాలు, రూప లావణ్యాలు లోకప్రసిద్ధి పొందాయి. కానీ ఆమెను వరించడానికి ఏ రాకుమారుడూ ముందుకు రాలేదు. వరిస్తే అగస్త్యులవారు ఎక్కడ శపిస్తారోనని ప్రతి ఒక్కరికీ భయం.

ఒకనాడు అగస్త్య మహాముని విదర్భరాజు వద్దకు వచ్చి, "రాజా! ఇదివరకు నీవు నాకు వాగ్దానం చేసిన ప్రకారం నీ కుమార్తెను నాకిచ్చి పెళ్ళి చెయ్యి" అని అడిగాడు. కానీ, వందలాది దాసదాసీజనుల సేవలందుకునే తన కూతురు ఓ మునిపత్నిగా అడవులలో అవస్థలు పడటం రాజుగారికి ఇష్టం లేకపోయింది. ఆ మాట చెబితే ముని ఆగ్రహిస్తాడేమోనని భయపడ్డాడు రాజుగారు.

రాజు, రాణి దుఃఖంలో ఉన్నారు. లోపాముద్ర యిది గమనించి, "నాన్నగారూ! మీరు నా గురించి దిగులు పెట్టుకోవద్దు. ముందు మాట ఇచ్చిన ప్రకారం నన్ను అగస్త్యునికి ఇచ్చి పెళ్ళి చేయండి. మీ మాటా నిలుస్తుంది, ముని ఆగ్రహమూ తప్పుతుంది. నాకు కూడా అంగీకారమే" అంది.

ఆ తరువాత రాజుగారు లోపాముద్రను అగస్త్యునికిచ్చి పెళ్ళిచేశారు. లోపాముద్ర ఆశ్రమనియమాలు పాటిస్తూ అగస్త్యునికి అనుగుణంగా మెలగసాగింది.

ఒకనాడు భార్యమీద ప్రేమ కలిగి అగస్త్యుడు ఆమెను దగ్గరకు తీసుకున్నాడు.

"స్వామీ! నాదో కోరిక!" అంది లోపాముద్ర నమ్రతగా.

"ఏమిటీ?" అన్నాడు అగస్త్యుడు.

"మా అమ్మగారి ఇంట్లో ఉన్నప్పుడు నేను కట్టుకున్న పట్టువస్త్రాలు, పెట్టుకున్న నగలతోనే మీరు నన్ను అలంకరించి ఆనందింపచేయాలి" అంది.

"నువ్వు చెప్పినట్టు చేయడానికి నావద్ద సొమ్ము లేదే?" అన్నాడు అగస్త్యుడు.

"అలా అనకండి. మీరు శక్తిసంపన్నులు. తపోబలం కలవారు. మీరడిగితే ఏ రాజు కాదనగలడు?" అంది లోపాముద్ర.

సరేనని రాజులను అర్థించడానికి బయలుదేరాడు అగస్త్యుడు.

చాలా భాగ్యవంతుడని పేరు పొందిన ఒక రాజుగారి దగ్గరకు వెళ్ళి, "నాకు దానం చేసినందువల్ల మీకు నష్టంకానీ, మరొకరికి కష్టంగానీ కలగకుండా ఉంటే నాకు కొంత ధన సహాయం చేయండి" అని కోరాడు. అప్పుడా రాజుగారు తన రాజ్యం తాలూకు ఆదాయవ్యయాలను దాచకుండా లెక్కలన్నింటినీ మునికి చూపించాడు. ఆ లెక్కలన్నీ చూస్తే రాజ్యంలో వచ్చే రాబడికీ ఖర్చులకూ సరిగ్గా సరిపోయింది. మిగులనేది లేనేలేదు. ఎవరి దగ్గరకు వెళ్ళినా అదే తీరు!

"మీ వద్ద దానం తీసుకుంటే మీ ప్రజలు కష్టపడవలసి వస్తుంది. నాకు ఎంతైతే సహాయం చేస్తారో మళ్ళీ అంతా ప్రజలమీద పన్ను వేయాల్సి వస్తుంది. కాబట్టి ఏమీ వద్దు" అని అగస్త్యుడు వెళ్ళిపోయాడు.

ధర్మం తప్పక పరిపాలించే ఏ రాజు వద్దనైనా సరే ఎవరైనా దానం పుచ్చుకుంటే, ఆ మేరకు ప్రజలు కష్టమూ నష్టమూ పడవలసి వస్తుందని అగస్త్యులవారు అప్పుడు తెలుసుకున్నారు. ●

# సుందోపసుందులు

హిరణ్యకశిపుని వంశంలో నికుంభుడనే రాజుగారికి ఇద్దరు పిల్లలు కలిగారు. వారే సుందోపసుందులు, అల్లరిలో ఒకరికొకరు తీసిపోరు. రాజుగారి పిల్లలవటం చేత మరీ గారాబంగా పెరిగారు. వాళ్ళిద్దరూ ఎంత అన్యోన్యంగా వుండేవాళ్ళంటే ఏ క్షణంలోనూ, ఏ విషయంలోనూ వారు ఒకరినొకరు విడిచి వుండేవారు కాదు.

వారికి చిన్నప్పుడే ప్రపంచమంతా జయించాలన్న కోరిక కలిగింది. కానీ అది కుదరదే! త్రిలోకాల్లో దేవతలు, మునులు, చక్రవర్తులు, యోధులు యెందరో వుంటారు. వాళ్ళందర్నీ ఓడించటానికి కేవలం భుజబలం వుంటే సరిపోదు. దైవబలం కూడా వుండాలి. అందుకని నార వస్త్రాలు కట్టి జటాజూటాలతో వింధ్యపర్వతం మీద తపస్సు చేశారు.

తలను నేలకు ఆన్చి, చేతులు గాలిలో నిలిపి అతి కఠోరంగా తపస్సు చేశారు.

ఆ తపస్సు నుంచి పుట్టిన వేడికి దేవతలు భయపడ్డారు. ఎన్నో విఘ్నాలు కలిగించారు, ఎన్నో విధాల నచ్చ చెప్పారు. అయినా సుందోపసుందులు చలించలేదు.

ప్రకృతే వారి తపోదీక్షకు స్తంభించిపోయింది.

వింధ్యపర్వతాలు కదిలాయి.

లోకాలన్నీ ఉక్కిరి బిక్కిరయ్యాయి.

దేవతలు అల్లల్లాడారు. వాళ్ళంతా బ్రహ్మ వద్దకు పరుగెత్తి, "మహానుభావా! రక్షించండి. సుందోపసుందుల తపస్సును ఆపి పుణ్యం కట్టుకోండి" అని ప్రార్థించారు. వెంటనే విరించి సుందోపసుందుల ఎదుట ప్రత్యక్షమై "నాయనా! మీ తపస్సుకు మెచ్చాను. మీ కోరికలేమిటో చెప్పండి" అని అడిగాడు.

సాష్టాంగపడ్డారు ఇద్దరూ.

"స్వామీ! ఎక్కడికి కావాలంటే అక్కడికి ఏ క్షణాన్నయినా వెళ్ళగలిగే కామగమన విద్యనూ, ఏ రూపం కావాలనుకుంటే ఆ రూపం పొందగలిగే కామరూప విద్యనూ, వాటికితోడుగా సకల మాయా ప్రదర్శన శక్తినీ అనుగ్రహించండి. ఎవరివల్లా మాకు చావు లేకుండా అమరత్వాన్ని కూడా ప్రసాదించండి" అని వేడుకున్నారు.

"ఏమిటీ అమరత్వమా–అబ్బే! అది కుదరదు. అయితే ఎవరి వల్లా మీకు చావు రాదు. మీ వల్ల మీరే మరణిస్తారు. ఇక తపస్సు ఆపి ఇళ్ళకు వెళ్ళండి" అన్నాడు బ్రహ్మ.

'మా చేతిలో మేము చావటమా–అది జరిగే పని కాదు' అనుకుని వారు సంతోషంతో దండయాత్రలు ప్రారంభించారు. మునుపే రాజుగారి పిల్లలవటం చేత వచ్చిన అతిశయం, ఇప్పుడు కొత్తగా తోడైన బ్రహ్మదేవుని వరాలు– ఇక అడ్డా ఆపా? తోక తెగిన కోతుల్లా లోకంమీద పడ్డారు.

ప్రజలు, రాజులు, బ్రహ్మర్షులు వారి ధాటికి తట్టుకోలేకపోయారు. జపతపాలు ఆగిపోయాయి. యజ్ఞయాగాలు నిలిచిపోయాయి. మున్యాశ్రమాల మీదకి మదపుటేనుగుల్లా, తోడేళ్ళలా, సింహాల్లా కామరూపాలలో విరుచుకుపడేవారు. ప్రపంచమే సుందోపసుందుల ఆగడాలకు అల్లకల్లోలమైంది.

వారి హింసాకాండను భరించలేక దేవ గంధర్వ సిద్ధ గణాలు బ్రహ్మను మళ్ళీ ప్రార్థించాయి.

అప్పుడు బ్రహ్మ విశ్వకర్మను పిలిపించి, "నీ ప్రతిభనంతా వుపయోగించి ఒక అతిలోక సౌందర్యరాశిని సృష్టించాలి" అన్నాడు.

ఆయన తన శక్తినంతా వినియోగించి ఒక సౌందర్యరాశిని సృష్టించాడు. బ్రహ్మ ఆమెకు ప్రాణం పోశాడు. ఆ అందాలభామే తిలోత్తమ. ఆమె అందానికీ, శరీర లావణ్యానికీ అందరూ అబ్బురపడ్డారు.

బ్రహ్మ ఆ అమ్మాయిని దగ్గరకు పిలిచి, "నువ్వే ఈ ఆపదను తొలగించాలి. నీ మూలంగా సుందోపసుందుల మధ్య విరోధం రావాలి. ఆ కోపంలో ఇద్దరూ ఒకరినొకరు చంపుకోవాలి. ఎలా ఈ పని జరుపుకొస్తావో నీ ఇష్టం. వాళ్ళిద్దరికీ అన్ని మాయలూ తెలుసు. అంతకు మించిన మాయలు చూపాలి నీవు" అన్నాడు. తిలోత్తమ బ్రహ్మ ఆజ్ఞను శిరసావహించింది.

వెళ్ళి సుందోపసుందుల దృష్టిపడేలా సంచరించింది.

ఆవిడ్ని చూస్తూనే ఆనందపరవశులయ్యారిద్దరూ.

"ఈమె నా ప్రాణం" అని అన్నగారంటే, "ఈ అతిలోక సౌందర్యవతి నా భార్య. తమ్ముడి భార్య నీకు మరదలవుతుంది. దూరంగా ఉండు" అని ఉపసుందుడన్నాడు. కుడిచేతిని ఒకరు పట్టుకుంటే ఆవిడ ఎడమచేతిని మరొకరు పట్టుకున్నారు.

అంతే –

అంతవరకూ పరస్పర వాత్సల్యంతో వున్న ఆ అన్నదమ్ములిద్దరూ పిడిగుద్దులు గుద్దుకున్నారు. ఆమె తనకు దక్కాలంటే తనకు దక్కాలని ఘోరంగా పోట్లాడుకున్నారు.

చివరికి ఒకరినొకరు పొడుచుకొని రక్తం కక్కుతూ నేలకూలారు. అది విని ముల్లోకాలూ పండుగ చేసుకున్నాయి.

అన్నదమ్ముల మధ్య కలహానికి మోహం కారణమవుతుందని చెబుతూ నారదమహర్షి ధర్మరాజుకీ కథ చెప్పాడు.

అన్నదమ్ములయిదుగురికీ ద్రౌపదీ దేవి భార్య గనుక ఎటువంటి క్లేశం రాకుండా అన్యోన్యానురాగంతో మెలగండని పాండవులకు హితవు చెబుతూ దేవముని యీ కథ చెప్పాడు. ●

# పరశురాముడు

పరశురాముడి చరిత్రే చాలా చిత్రమైనది. పరశురాముడి తాత ఋచీకుడనే ఋషి. ఆయన గాధిరాజు దగ్గరకు వెళ్ళి రాకుమారి సత్యవతిని తనకిచ్చి పెళ్ళి చేయమని కోరాడు. తాపసికి పిల్లనివ్వడం ఇష్టంలేక, నల్లటి చెవులున్న తెల్లటి గుర్రాలను వేయింటిని తెచ్చి కానుకగా ఇస్తే తన కూతుర్నిచ్చి పెళ్ళి చేస్తానని షరతు పెట్టాడు గాధిరాజు. ఋచీకుడు ఇంద్రుణ్ణి ప్రసన్నం చేసుకుని అశ్వసహస్రాన్ని సాధించి తెచ్చి సత్యవతిని పెళ్ళిచేసుకున్నాడు.

తరువాత ఒకసారి గాధిరాజదంపతులు పుత్రసంతానం కోసం ఏమేమి పూజలు చేయాలో చెప్పమని ఋచీకుడ్ని అర్థించారు. అప్పుడాయన రెండు రకాల హోమద్రవ్యాలు తయారు చేశాడు.

"ఇదిగో చూడు! ఈ హవ్యం తింటే క్షత్రియ నాశకుడూ, అజేయుడూ అయిన క్షత్రియ కుమారుడు పుడతాడు. ఇది మీ అమ్మకు ఇవ్వు. ఇలా చూడు, ఈ హవ్యం

నీ కోసం ప్రత్యేకంగా తయారుచేశాను. ఇది తింటే తపస్సూ, శమదమాలూ గల ఉత్తమ ద్విజుడు పుడతాడు" అని భార్యతో చెప్పి ఋచీకుడు స్నానానికి వెళ్ళాడు.

అతను వెళ్ళిన కాసేపటికి అత్తమామలు రానే వచ్చారు. సత్యవతి తల్లికి భర్త చేసిన హవ్యాలు చూపించింది. వాటి ప్రభావం వర్ణించింది. ఆమె సంతోషించి శుచిగా స్నానం చేసి వచ్చి పొరపాటున తాను సేవించవలసిన హవ్యం కూతురికి ఇచ్చి, కూతురి వంతు హవ్యం తాను తిన్నది. ఋచీకుడు ఆశ్రమానికి వచ్చి దివ్యదృష్టితో జరిగినదంతా తెలుసుకున్నాడు.

"ఈ పొరపాటు వల్ల నీ తల్లికి బ్రహ్మతేజం గల పుత్రుడు, నీకు పరమ క్రూరుడయిన కొడుకు పుడతార"ని ఋచీకుడు భార్యతో చెప్పాడు.

సత్యవతి బాధపడింది. ఋచీకుడు జాలిపడి ఆ క్రౌర్యం తన మనుమడికి వచ్చేటట్టు అనుగ్రహించాడు.

ఋచీకుని హోమద్రవ్య ఫలంగా గాధిరాజుకు జన్మించిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అయ్యాడు.

ఋచీకుని కొడుకు జమదగ్ని మహాముని. అతనికి పరశురాముడు పుట్టి క్రూరత్వానికి మారుపేరై సంహారకాండ కావించాడు.

ఒకప్పుడు పరశురాముడి తల్లి రేణుకాదేవి చిత్రరథుడనే గంధర్వున్ని చూసి లిప్తకాలం మోహపడింది.

అందుకు జమదగ్ని ఆగ్రహించి భార్యను చంపవలసిందిగా అక్కడ వున్న కుమారుల్ని ఆదేశించాడు. వాళ్ళు ఆ పని చెయ్యలేమన్నారు. అంతలో పరశురాముడు అక్కడికి వచ్చాడు. కోపంతో కణకణలాడుతున్న తండ్రిని సంగతేమిటని అడిగాడు. తండ్రి ఆజ్ఞ ప్రకారం తల్లినీ, సోదరుల్ని పరశువుతో నరికి చంపాడు. ఆ తరువాత, శాంతించిన తండ్రి అనుగ్రహంతో మళ్ళీ వారందరినీ బ్రతికించుకున్నాడు.

వీరాధివీరుడు కార్తవీర్యార్జునుడు హైహయ వంశీయుడు, మాహిష్మతీ పురాధీశుడు. వెయ్యి చేతులున్నాయతనికి. అగ్నిదేవుడు వెళ్ళి అడిగితే గిరులూ, నగరాలూ, అరణ్యాలూ, గ్రామాలూ, కొండల కింది కుగ్రామాలూ ఆహారంగా ఇచ్చాడాయనకు. అవన్నీ దహిస్తూ, ఒకనాడు, వశిష్టుడు లేని సమయంలో, ఆయన ఆశ్రమం వున్న అరణ్యాన్ని దహించసాగాడు అగ్నిదేవుడు. ఆ అగ్నిని రక్షిస్తూ కాపలా

కాస్తున్నాడు కార్తవీర్యుడు. ఇంతలో వశిష్టుడు వచ్చాడు. "ఇతర వనాలతో సమానంగా భావించి నా తపోవనాన్ని దహింప చేశావు. నీ సహస్ర బాహువులు పరశురాముడి చేత నరకబడుగాక" అని శపించాడు.

ఒకనాడు పరశురాముడు లేని సమయంలో కార్యవీర్యార్జునుడు జమదగ్ని ఆశ్రమానికి వచ్చాడు. తనవద్ద ఉన్న కామధేనువు దయతో రాచపరివారానికి షడ్రసోపేతంగా విందు చేశాడు మహర్షి. రాజు ఆ గోవును తన కిమ్మన్నాడు. మహర్షి కాదనేసరికి బల ప్రయోగంతో కార్తవీర్యార్జునుడు ధేనువును మాహిష్మతీ పురానికి తీసుకువెళ్ళాడు.

పరశురాముడికీ సంగతి తెలిసింది. కోపోద్రిక్తుడై కార్తవీర్యార్జునుడి మీదికి దండెత్తి వెళ్ళి అతని వేయి చేతులూ ఖండించి శిరచ్ఛేదం చేశాడు.

అందుకు ఆగ్రహోదగ్రులైన కార్తవీర్యుడి కొడుకులు పదివేల మందీ పరశురాముడు లేనప్పుడు దండెత్తి వచ్చి, జమదగ్నిని చంపి పగ తీర్చుకున్నారు.

పరశురాముడు రాగానే జరిగినదంతా చెప్పి భోరున ఏడ్చింది తల్లి రేణుకాదేవి.

పరశురాముడు మాట్లాడలేదు.

గొడ్డలి చేత పట్టుకున్నాడు.

ఆమడ దూరానికో అడుగు వేస్తూ కదలివెళ్ళాడు.

మాహిష్మతీపురం ఒక్కటే కాకుండా మారుమూల వున్న పల్లెలతో సహా వెదకి వెదకి గర్భాలలో వున్న పిండాలతో సహా క్షత్రియులందర్నీ నాశనం చేశాడు.

తరువాత అశ్వమేధయాగం చేసి భూమినంతటినీ కశ్యపమహర్షికి దక్షిణగా ఇచ్చాడు. అప్పటినుంచి భూమికి 'కాశ్యపి' అనే పేరు వచ్చింది.

"భూమిని నాకిచ్చేశావు. ఇంక దీనిమీద హక్కులేదు నీకు. దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళు" అన్నాడు కశ్యపుడు. పొరపాటున తప్పించుకున్న రాజవంశపు మొలకలు ఏమైనా మిగిలితే వాటిని రక్షించవచ్చన్న ఉద్దేశంతో ఆయన అలా ఆదేశించాడు.

సరేనన్నాడు పరశురాముడు.

అతనికి భయపడి దక్షిణ సముద్రం చీలి చాటంత ప్రదేశాన్ని ఆయనకు

సమర్పించింది.

క్షత్రియులు లేకపోవటం వల్ల మిగిలిన జాతులు అవధులు దాటి ప్రవర్తించసాగాయి. అరాజకత్వ దోషంతో ధర్మకాంతి క్షీణించింది. అధర్మాన్ని సహించలేక భూమి పాతాళానికి కృంగిపోతుంటే కశ్యపుడు తన తొడ ఆధారంగా చేసి భూమిని నిలబెట్టాడు. ఊరువులతో ఎత్తబడినందుకే దానిని 'ఉర్వి' అన్నారు.

"మహాత్మా! పరశురాముని బారినుంచి కొందరు రాజకుమారుల్ని రక్షించి నాలో దాచుకున్నాను. వాళ్ళందరూ ఉత్తమ జాతి క్షత్రియులే. వాళ్ళను పిలిపించి నాకు అధిపతుల్ని చేస్తే నేను సుఖంగా ఉంటాను" అంది భూదేవి.

కశ్యపుడు వాళ్ళందర్నీ పిలిపించి ఆమె చెప్పినట్లే అభిషిక్తుల్ని చేశాడు.

నేలతల్లి సంతోషించింది. ●

# శిబిచక్రవర్తి

భృగుతుంగ పర్వతం మీద ఓసారి పెద్ద ఎత్తున యజ్ఞం చేశాడు శిబిచక్రవర్తి. ఎందరో మహర్షులు ఆ యజ్ఞానికి హాజరయ్యారు.

అందరికీ ఘనంగా మర్యాదలు జరిగాయి. అందర్నీ గొప్పగా సత్కరించాడు చక్రవర్తి. ఆయన ఔదార్యానికి, దాననిరతికి తాపసులందరూ ఆశ్చర్యపోయారు.

శిబిచక్రవర్తి దానశీలతను పదేపదే ప్రజలందరూ ప్రశంసించారు. ఈ వార్త ఇంద్రుడి వరకూ వెళ్ళింది.

ఆయన చక్రవర్తి ఔదార్యాన్ని పరీక్షిద్దామనుకున్నాడు.

• • •

యజ్ఞవేదికమీద కూర్చుని ఉన్న శిబిచక్రవర్తి ఒడిలో ఒక పావురం వాలింది. అది మనుష్యభాషలో, “మహారాజా! రక్షించు! నన్ను ఒక డేగ తరుముకొస్తోంది. నన్ను చంపి తినాలని చూస్తోంది. దాని బారినుంచి నన్ను కాపాడు, నాకు ప్రాణభిక్ష పెట్టు” అని దీనంగా వేడుకుంది.

శిబిచక్రవర్తి పావురాన్ని ప్రేమగా నిమురుతూ, “నిన్ను కాపాడే బాధ్యత నాది. నీకు ఎవరినుంచీ ప్రమాదం రాదు” అని హామీ ఇచ్చాడు.

పావురం మనసు కుదుటపడింది.

అంతలో అక్కడికి డేగ వచ్చింది.

రాజుగారికి ఎదురుగా ఎత్తయినచోట వాలి పావురం వైపు కొరకొర చూసింది.

పావురం భయంతో వణికింది!

డేగ కూడా మానవభాషలో, “మహారాజా! ఈ పావురం నా ఆహారం. తప్పించుకుని వచ్చి మీ శరణుజొచ్చింది. దయతో దానిని నాకు వదిలిపెట్టండి” అంది. రాజుగారికీ, సభలో వున్నవారికీ అందరికీ ఆశ్చర్యంగా ఉంది– ఏమిటీ పావురమూ, డేగా రెండూ మనుష్యభాషలో మాట్లాడుతున్నాయని.

“ఈ పావురానికి నేను అభయమిచ్చాను. ఆడినమాట తప్పను. అయినా నీకు మాత్రం అంత పట్టుదల ఎందుకు? దీన్ని వదలి మరో ఆహారం వెతుక్కో” అన్నాడు శిబిచక్రవర్తి.

“రాజా! నీవు ధర్మప్రభువువి, న్యాయంగా ఆలోచించు. నేను ఆకలితో నకనకలాడుతున్నాను. ఈ పావురం దొరికినట్లే దొరికి తప్పించుకొని పారిపోయి నీ దగ్గరకు వచ్చింది. నోటిముందరి ఆహారాన్ని తీసివేయడం ధర్మం కాదు. మహాపాపం కూడా! నా కోరికేమీ అన్యాయమైనది కాదు. పావురాలను డేగలు తినటం సహజమే. ఇప్పుడు ఈ ఆహారం లేకపోతే నేను ఆకలిబాధతో మరణిస్తాను. కనుక నా ఆహారాన్ని నాకు విడిచిపెట్టండి” అంది డేగ.

డేగ మాటలకు సభలోని వారంతా ఆశ్చర్యపోయారు.

శిబిచక్రవర్తి కూడా ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ “ఓ శ్యేనరాజమా! చూడబోతే నీవు ధర్మాధర్మ విచక్షణ తెలిసిన దానిలా వున్నావు. శరణన్న వారిని రక్షించటం

రాజధర్మం. నీ ఆకలిబాధ తీరడానికి ఏ ఆహారం కావాలో చెప్పు. నువ్వు కోరిన ఆహారాన్ని నీకు ఇస్తాను. ఈ పావురాన్ని మాత్రం నీకు వదలిపెట్టను" అన్నాడు.

"నేను కోరిన ఏ ఆహారమైనా ఇస్తారా" అని గట్టిగా అడిగింది డేగ.

"నిరభ్యంతరంగా!"

"అలాగైతే రాజా! నీ శరీరంలో ఈ పావురమంత మాంసాన్ని కోసి నాకివ్వు" అంది డేగ.

శిబిచక్రవర్తి నవ్వుతూ, "అలాగే! నీకు సంతోషం కలిగించటం కంటే నాకేం కావాలి?" అని అప్పటికప్పుడు ఒక కత్తి, త్రాసు తెప్పించాడు.



సదస్యులందరూ నిశ్చేష్టులయ్యారు.

శిబిచక్రవర్తి ఆ పదునైన కత్తిని తీసుకున్నాడు.

తన శరీరం నుంచి మాంసాన్ని కోసి త్రాసులో వేశాడు.

పావురం బరువుకు సరికాలేదు.

మరికొంత మాంసం కోసి వేశాడు. ఉఁహుఁ... అప్పుడూ సరిపోలేదు.

మరికొంత జోడించాడు. ప్రయోజనం లేకపోయింది.

అది చూడలేక సభలోని వారంతా కళ్ళు మూసుకున్నారు.

మరికొంత వేశాడు.

అయినా పావురం బరువుతో సరితూగ లేదు.

ముఖంలో బాధను కనపడనీయకుండా చిరునవ్వు నవ్వుతూ చక్రవర్తి మరికొంత మాంసాన్ని కోసి త్రాసులో వేశాడు.

ఫలితం లేకపోయింది. త్రాసు మొగ్గలేదు.

రాజుగారి శరీరం రక్తం ఓడుతూంది.

చివరకు తానే వెళ్ళి పళ్ళెంలో కూర్చున్నాడు.

తనను తానే దానంగా సమర్పించుకున్నాడు.

అప్పుడు ప్రత్యక్షమయ్యారు–ఇంద్రుడు, అగ్ని.

"రాజా! నీ దానగుణం నిరుపమానమైంది. నీవంటి ఉత్తముడు ఇంతవరకూ ఈ పుడమిపై పుట్టలేదు. నీ ఔదార్యాన్ని పరీక్షించడానికి నేను డేగగా, అగ్ని పావురంగా వచ్చాము. నీ కీర్తి చిరస్థాయిగా వర్ధిల్లుతుంది" అని ఆశీర్వదించాడు ఇంద్రుడు.

ఆయనకు మళ్ళీ తేజోరూపం ప్రసాదించాడు. కృతజ్ఞతగా శిబిచక్రవర్తి చేతులు జోడించాడు. అప్పటికీ, ఇప్పటికీ దానం విషయంలో శిబిచక్రవర్తికి సాటి వచ్చేవారు లేరు. ●

# స్నేహపం

**చ్య**వన మహాముని గంగాయమునల సంగమప్రదేశాన ధ్యానసమాధిలో ఉన్నాడు. చేపలు ఆయన శరీరమంతా ఎక్కి హాయిగా తిరగటం మొదలుపెట్టాయి. ఆయన దయతో వాటిని మన్నించాడు. వాటి చేష్టలకు మిన్నకున్నాడు. అలా పన్నెండేళ్ళు గడిచిపోయాయి. ఒకసారి జాలరులు ఆ ప్రాంతానికి వచ్చి వల వేశారు. చేపలతో పాటు చ్యవనుడు కూడా ఆ వలలో చిక్కుకున్నాడు. వలను పైకితీసిన బెస్తలు ఆ మహామునిని చూసి భయపడ్డారు. తప్పు క్షమించమని ఆయన కాళ్ళమీద పడ్డారు.

"ఈ చేపలతో కొన్నేళ్లుగా సహవాసం చేయడం వల్ల వాటిమీద నాకు మక్కువా, హక్కూ ఏర్పడ్డాయి. వాటితో సహా ప్రాణాలు విడవడం కూడా ఇష్టమే నాకు. కనుక వాటితో పాటు నన్నూ చంపండి. లేదా మీకో ఉపాయం చెబుతాను. ఈ చేపల్ని మీరు ఎలాగో అమ్ముకుంటారుగా! వాటితోపాటు నన్ను కూడా అమ్మెయ్యండి"

అన్నాడు. జాలరులు భయపడుతూ వెళ్ళి నహుషమహారాజుతో సంగతి చెప్పారు. ఆయన భయసంభ్రమాలతో మంత్రిపురోహితులను వెంటబెట్టుకుని ఆ మహాముని దగ్గరకు వెళ్ళి "మహాత్మా! తెలీక అపరాధం చేశారు బెస్తలు. పాపపరిహారమేమిటో సెలవియ్యండి" అని అర్థించాడు వినయంగా.

"మహారాజా! బెస్తలు తమ వృత్తిధర్మం చేశారు. అందులో వారి తప్పేముంది? పాపం వాళ్ళు చాలా శ్రమపడ్డారు! అందుచేత నా శరీరానికి తగిన వెల వాళ్ళకివ్వు" అన్నాడు చ్యవన మహర్షి. ఆయన మనస్సులో కోపం లేనందుకు నహుషుడు సంతోషించాడు.

మంత్రిని పిలిచి "ఈ బెస్తలకు వెయ్యి మాడలు ఇవ్వండి" అన్నాడు.

"ధర్మంగా ఇవ్వు మహారాజా" అన్నాడు ముని.

"అయితే పదివేలివ్వండి."

"చాలదు."

"లక్ష!"

"న్యాయం కాదు."

"సరే, కోటి."

"ఉంహూ."

"పోనీ నా రాజ్యంలో సగం ఇస్తాను."

"నువ్వూ నీ మంత్రులూ ఆలోచించుకుని తగిన వెల ఇవ్వండి. దీనికింత చర్చేమిటి!"

"నా రాజ్యమంతా ఇచ్చేస్తాను."

చ్యవనుడు నవ్వుతూ "సరిపోదు" అన్నాడు.

నహుషుడు విచారపడిపోయాడు.

"ఇంకేం చేద్దాం" అని మంత్రులందరితో సమాలోచన చేశాడు.

ఇంతలో అక్కడికి గవిజాతుడనే మహాముని వచ్చాడు. నహుషుడి సమస్యేమిటో అడిగి తెలుసుకున్నాడు. "మహారాజా! చింత విడిచిపెట్టు. గోవులకూ, విప్రులకూ భేదం లేదు. ఆ యిద్దరూ హవిస్సుకీ, మంత్రాలకూ ఆధారమైన వాళ్ళు. సకల

వేదాలకూ ఆశ్రయమైన మహర్షికి వెల నిర్ణయించడం దుర్లభమైన పని. బ్రాహ్మణుడితో సమానమైనదే గోవు కూడా. కనుక గోవు నివ్వు. వెల సరిపోతుంది" అని ఉపాయం చెప్పాడు.

నహుషుడు సంతోషించాడు. చ్యవనుడి దగ్గరకు వెళ్ళి, "మహాత్మా! నన్ను దయ చూడు. మీకు వెల కట్టడం ఎవరికి సాధ్యం? గోవునిస్తాను. అనుగ్రహించు" అన్నాడు.

చ్యవనుడు సంతోషించాడు. "తగిన మూల్యమే నిర్ణయించావు. అలాగే ఇవ్వు" అన్నాడు.



నహుషుడు గోవును జాలరుల కిచ్చాడు. జాలరులు గోవుతో సహా చ్యవనుడి దగ్గరకు వెళ్ళారు. "అయ్యా! మమ్మల్ని చూసింది మొదలు మామీద అనుగ్రహం చూపిస్తున్నావు. కరుణించి ఈ గోవును మీరే తీసుకోండి" అని వేడుకున్నారు. కాదనలేకపోయాడు చ్యవనుడు. "సరే అలాగే ఇవ్వండి" అని ఆ గోవును వాళ్ళ దగ్గర నుంచి తీసుకుని, "మీరూ, ఈ చేపలూ స్వర్గానికి వెళ్ళండి" అని దీవించాడు.

వెంటనే ఆ బెస్తలూ, చేపలూ కూడా శరీరాలతో ఎగసి స్వర్గానికి వెళ్ళారు. నహుషుడూ, ఆయన పరివారం అదిచూసి ఆశ్చర్యపోయారు. అప్పుడు చ్యవనుడూ, గవిజాతుడూ కలిసి నహుషుణ్ణి పిలిచి, "నీకు మేము చెరో వరం ఇస్తాం. ఏం కావాలో కోరుకో!" అన్నారు.

"మీరు తృప్తిపొందడం కంటే నాకింకేం కావాలి" అన్నాడు నహుషుడు వినయంగా.

"రాజా! నీకు ధర్మపరత్వం, దేవేంద్ర వైభవం కలుగుతాయి" అని దీవించి వాళ్ళిద్దరూ అంతర్హితులయ్యారు.

నహుషుడు పరమానందభరితుడయ్యాడు.

సజ్జనసాంగత్యం వల్ల ఉత్తమ ఫలితాలుంటాయని చెబుతూ నారదుడు ధర్మరాజు కీ కథ చెప్పాడు. ●

# కచుడు-దేవయాని

దేవతలకు గురువు బృహస్పతి. వేదమంత్రాలన్నీ ఆయన గుప్పిట్లో వున్నాయి.

రాక్షసులకు గురువు శుక్రాచార్యుడు. జ్ఞానమంతా ఆయన కాచి వడపోశాడు. యుద్ధంలో చనిపోయిన వాళ్ళందర్నీ శుక్రాచార్యుడు 'మృత సంజీవని' విద్యవల్ల మళ్ళీ బ్రతికించేవాడు. దానితో మరణించిన రాక్షసులందరూ లేచి కూర్చుని దేవతలతో మళ్ళీ యుద్ధానికి దిగేవారు.

ఇలా లాభం లేదనుకుని దేవతలంతా బృహస్పతి కుమారుడైన కచుడి దగ్గరకు వెళ్ళారు.

"నాయనా! నీవు మెల్లగా శుక్రాచార్యుల వారి వద్దకు వెళ్ళి ఆయన అనుగ్రహం సంపాదించాలి. ఎలాగైనా సరే ఆయనవద్ద ఉన్న మృతసంజీవనీ విద్యను నేర్చుకుని రావాలి" అని బ్రతిమాలారు.

కచుడు సరేనన్నాడు.

వెంటనే శుక్రాచార్యుని ఆశ్రమానికి బయలుదేరివెళ్ళి, “మహాత్మా! నేను అంగీరస మహర్షి మనవణ్ణి. బృహస్పతి కుమారుణ్ణి. నా పేరు కచుడు. మీ వద్ద శుశ్రూష చేసి విద్య నేర్చుకుందామని వచ్చాను” అన్నాడు.

శుక్రాచార్యులవారికి కచుడి వినయ విధేయతలు నచ్చాయి. వెంటనే శిష్యుడిగా స్వీకరించారు.

అలా శుక్రుడి అనుగ్రహంతో కచుడు ఆశ్రమంలో ఉంటూ, విద్యాభ్యాసంతో పాటు గురువుగారి కుమార్తె దేవయాని చెప్పిన అన్ని పనులూ చేస్తూ ఆమెను ఆటపాటలతో సంతోషపెడుతూ కాలం గడుపుతున్నాడు.



మృతసంజీవనీ విద్య కోసం కచుడు తమ గురువుగారి వద్ద శిష్యుడుగా చేరాడని రాక్షసులు గ్రహించారు. ఒకనాడు కచుడు అడవిలో గురువుగారి ఆవులను మేపుతూ వుండగా అతణ్ణి పట్టుకుని చంపి ముక్కలు ముక్కలు చేసి కుక్కలకూ, నక్కలకూ వేశారు.

ఎంతసేపటికీ కచుడు ఆశ్రమానికి తిరిగి రాకపోయేసరికి దేవయాని కంగారుపడింది. తండ్రి దగ్గరకు వెళ్ళి, “నాన్నగారూ చీకటి పడింది. ఆవులు ఇంటికి వచ్చాయి. కాని, ఇంతవరకూ కచుడు రాలేదు. అతనికేదో ఆపద వచ్చి వుంటుంది,

అతన్ని మీరే రక్షించాలి" అంది.

శుక్రాచార్యులవారు మంత్రం జపించి, "నాయనా కచా! ఎక్కడికి వెళ్ళావు? వెంటనే ఆశ్రమానికి రా!" అని గట్టిగా పిలిచారు. మంత్రప్రభావంతో కచుడు జంతువుల కడుపులు చీల్చుకుని ఎప్పటిలాగా వచ్చి గురువుగారి ఎదుట నిలబడ్డాడు.

"ఏమయింది?" అని అడిగింది దేవయాని.

"ఆవుల్ని తోలుకు వస్తూంటే రాక్షసులు నా చుట్టూ చేరి 'ఎవరు నువ్వు?' అని అడిగారు. 'బృహస్పతి కుమారుణ్ణి' అని చెప్పాను. వెంటనే నా మీద పడి నన్ను చంపారు" అని చెప్పాడు కచుడు.

ఇంకోసారి, దేవయాని కోసం పూలు తీసుకుని రావడానికి కచుడు అడవికి వెళ్ళాడు. అక్కడ మళ్ళీ రాక్షసులు అతడ్ని పట్టుకున్నారు. అతన్ని కొట్టి, చంపి శరీరాన్ని పొడి చేసి సముద్రంలో కలిపారు.

కచుడు ఎంతకూ ఇంటికి రాకపోయేసరికి మళ్ళీ దేవయాని తండ్రితో మొరపెట్టుకుంది. మునుపటిలాగే ఆచార్యులవారు సంజీవనిని ప్రయోగించారు. దాంతో బతికి బయటపడ్డాడు కచుడు.

ఇక లాభం లేదనుకుని ఈసారి రాక్షసులు కచుని శరీరాన్ని కాల్చి బూడిద చేసి మద్యంలో కలిపి అది తమ గురువుకే తాగమని ఇచ్చారు. ఆ మద్యం శుక్రాచార్యుడు సేవించాడు.

మేతకు వెళ్ళిన ఆవులు తమ దారిన తాము తిరిగి వచ్చాయి. కానీ కచుడు రాలేదు. దేవయాని తండ్రిని సమీపించి కంటతడి పెట్టింది.

"అమ్మా! ఇప్పటికి రెండుసార్లు కచుణ్ణి బతికించాను. ఎన్నిసార్లు బతికించినా రాక్షసులు అతనిని హతమార్చాలని పట్టు పట్టినట్లుంది. అయినా ఎవరో మరణిస్తే నువ్వు ఏడవటం ఏమిటి? కాలం ఖర్మం మూడితే ఎవరైనా చావక తప్పదు" అని ఆచార్యుడు కూతుర్ని ఓదార్చాడు.

అయినాసరే, కూతురు మంకుపట్టు విడవలేదు. కచుడు వచ్చేవరకూ అన్నపానాలు ముట్టనంది. శుక్రాచార్యులవారు గత్యంతరం లేక సంజీవనీ మంత్రం జపించి కచుడ్ని రమ్మని పిలిచాడు. మంత్రబలం వల్ల కచుడికి ప్రాణం వచ్చింది.

"గురుదేవా! అనుగ్రహించండి. నేను తమరి పొట్టలోనే వున్నాను" అన్నాడు. శుక్రాచార్యుల వారికి ఆశ్చర్యం వేసింది. అప్పుడు గర్భస్థ శిష్యుడు జరిగిన కథంతా గురువుగారికి విన్నవించాడు.

మహానుభావుడూ, మహాతపశ్శాలీ అయిన శుక్రాచార్యుడు తన తప్పు తెలుసుకున్నాడు. సురాపానం మూలంగా తను మోసపోయినట్టు గ్రహించాడు. "ఎంతటి దారుణానికైనా ఒడిగట్టించే ఈ మద్యపానాన్ని నేటినుంచి నిషేధిస్తున్నాను. **ఎవరైతే జ్ఞానం లేకుండా మద్యపానం చేస్తారో వారి నుంచి ధర్మం తప్పుకుంటుంది. వాళ్ళను అందరూ అసహ్యించుకుంటారు. ఈసడిస్తారు.** ఇది నా ఆజ్ఞ. దీనిని ప్రజలందరూ పాటించాలి. పాటించనివాళ్ళు పతనమౌతారు'' అన్నారు శుక్రాచార్యులవారు.

"నాయనా! దేవయాని కోసం నేను నిన్ను బతికించాలి. నిన్ను బతికిస్తే నాకు మరణం తప్పదు. ఇందుకు ఒకటే మార్గం. నేను నీకు ఇప్పుడే సంజీవనీ విద్య ఉపదేశిస్తాను. నీవు అది నేర్చుకున్న తరువాత నా పొట్ట చీల్చుకుని బయటకు రా. తిరిగి నీ విద్యవల్ల నన్ను బతికించు" అన్నాడు.

కచుడు సరే అన్నాడు. చెప్పినట్లే చేశాడు.

తరువాత చాలాకాలం అక్కడే విద్యాభ్యాసం చేసి గురువుగారి వద్ద సెలవు తీసుకుని దేవలోకానికి బయల్దేరి వెళ్ళాడు. ●

# ధర్మసూక్ష్మం

పూర్వం త్రేత, ద్వాపరయుగాల సంధిలో ప్రజలు చేసిన పాపాలవల్ల వర్షాలు లేక పన్నెండేళ్ళపాటు కరువు సంభవించింది. భూమి బీటలు వారింది. ఏరులూ, చెరువులూ, కుంటలూ ఎండిపోయాయి. వ్యవసాయపు పనులు మందగించాయి. చెట్లూ, లతలూ వసివాడిపోయాయి. పశువులు మేత లేక చచ్చిపోయాయి. రాజులు ధర్మం తప్పి ప్రజల ధనధాన్యాల్ని లాక్కున్నారు. యాగాలూ, దేవతార్చనలూ కుంటుపడ్డాయి. వర్ణాశ్రమ ధర్మాలు తప్పిపోయాయి. తినటానికి తిండిలేక జనులంతా మలమల మాడసాగారు. ఎక్కడ చూసినా శవాల గుట్టలతో ఘోరంగా వుంది.

ఆ సమయంలో ఒకసారి విశ్వామిత్ర మహాముని ఆకలికి ఓర్చుకోలేక, తిండి కోసం యాచించి, ఎక్కడా దొరకక ఆకలిదప్పులతో తల్లడిల్లిపోయాడు. కొంచెం దూరం అలాగే వెళ్ళేసరికి అక్కడ కొన్ని పూరిగుడిసెలు కన్పించాయి. చుట్టూరా

పశువుల ఎముకల గుట్టలు! కుక్కల పుర్రెలు! పరమ అసహ్యంగా వుంది. దుర్గంధం ముక్కు బ్రద్దలు చేస్తోంది. అక్కడికి వచ్చేసరికి విశ్వామిత్రుడిలో అడుగుతీసి అడుగువేసే శక్తి కూడా పోయింది. కుప్పకూలిపోయాడు.

'అయ్యో! ప్రాణం పోయేటట్టుంది! ఎలాగైనా ప్రాణం నిలుపుకోవడం పరమధర్మం. ఇప్పుడు ఏం ఉపాయం ఉంది?' అని ఆలోచించటం మొదలుపెట్టాడు. అటూ ఇటూ గాలించి చూసేసరికి అప్పుడే చర్మం ఒలిచి, గాలికి ఆరబెట్టిన కుక్కమాంసం కనిపించింది. విశ్వామిత్రుడికి ప్రాణం లేచివచ్చింది. కానీ మళ్ళీ అంతలోనే విచారం కలిగింది.

'ఇది తప్ప ప్రాణాల్ని రక్షించుకోటానికి గత్యంతరం లేదిప్పుడు. ఇది కూడా అపహరించి తినవలసిన దుర్గతి పట్టింది! ప్రాణం కాపాడుకునేందుకు వేరే ఉపాయమేదీ లేనప్పుడు దొంగతనం చేయడం, నీచులధనం ఆశించటం తప్పు కాదన్నారు. ఇదే మంచి అదను. అర్థరాత్రి సమయం! అందరూ నిద్రపోతున్నారు' అనుకుని నిస్సత్తువగా పాకుతూ వెళ్ళి ఆ కుక్కమాంసం పట్టుకుని లాగాడు విశ్వామిత్రుడు. అక్కడకు దగ్గరలోనే పడుకున్న బోయవాడు అలికిడికి నిద్రలేచాడు. విశ్వామిత్రుణ్ణి చూశాడు.

"ఎవడురా నువ్వు. నేను నిద్రపోతున్నాననుకుని మాంసం దొంగిలిస్తున్నావా? నీ ప్రాణాలు తీస్తాను వుండు" అని ముని మీదకు వచ్చాడు వాడు.

విశ్వామిత్రుడు గడగడలాడిపోయాడు. "నేను విశ్వామిత్రుణ్ణి" అన్నాడు హీనస్వరంతో.

కిరాతుడు అదిరి పడ్డాడు. భయపడిపోయాడు. కన్నీరు కారుస్తూ వెళ్ళి ఆయన పాదాల దగ్గర సాష్టాంగపడ్డాడు. "మహాత్మా! ఎవరో అనుకుని నోటికి వచ్చినట్టు మాట్లాడాను. తప్పు క్షమించండి! అయినా స్వామీ ఎందుకిలా చేస్తున్నారు? దీని అంతరార్థమేమిటి?" అని వినయంగా అడిగాడు.

"నాయనా! ఆకలితో శరీరం దహించుకుపోతోంది. పాపమని తెలిసి కూడా గత్యంతరం లేక ప్రాణం రక్షించుకోడానికి ఈ కుక్క మాంసం దొంగిలించబోయాను" అన్నాడు విశ్వామిత్రుడు.

"అయ్యో! మృగాలన్నిటిలో నీచమైనది కుక్క. దీని మాంసం తిని ధర్మహాని ఎందుకు తెచ్చుకుంటారు? మరో మార్గం వెతుక్కోండి మహాత్మా" అన్నాడు బోయ.

"ప్రాణం నిలబెట్టుకోవడం కోసం ఏం చేసినా ధర్మమే! అదీగాక సర్వభక్షకుడైన అగ్నిహోత్రుడు నాలో వున్నాడు. అగ్నిస్పర్శతో సర్వదోషాలూ నశిస్తాయి. బతికివుంటే తపస్సు వల్లా విద్యవల్లా పాపం పోగొట్టుకుంటాను. ఈ మాంసం ఇప్పుడు నా ప్రాణాధారం. నువ్వెన్ని చెప్పినా తినక మానను" అన్నాడు.

"ఇది చాలా నీచం స్వామీ!" అన్నాడు కిరాతుడు మళ్ళీ.

"అగస్త్యుడు రాక్షస మాంసం తిన్నాడు. అంతమాత్రంచేత ఆయన తేజస్సూ, పెంపూ నశించాయా? నా ఆత్మ బ్రహ్మజ్ఞానం కలది. అందుచేత నేను ఈ మాంసం తినడం వల్ల నాకు ఏ పాపమూ అంటదు. నువ్వు మాత్రం నాకు అడ్డు రాకు" అన్నాడు విశ్వామిత్రుడు.

"అయ్యా! మాంసం పోతుందనే చింతలేదు నాకు. ఈ పనివల్ల మీకు తేజోహాని కలుగుతుందని దిగులుగా వుంది" అన్నాడు బోయ.

"నాయనా! నీకు నా మీద దయ అనేది వుంటే ఈ మాంసాన్ని నువ్వే నాకు ఆహారంగా ఇచ్చి ప్రాణాలు నిలబెట్టి పుణ్యం కట్టుకో. దానివల్ల నాకు దొంగతనం చెయ్యవలసిన అవసరమూ వుండదు" అన్నాడు ముని.

"అయ్యా! మహిమాన్విత పుణ్యదీప్తుడవు నువ్వు. నీచుడైన నాదగ్గరనుంచి ఏదైనా యాచించటం... నాకు భయంగా వుంది స్వామీ! మీ ఇష్టం వచ్చినట్టు చెయ్యండి" అంటూ బోయ కుక్కమాంసం ఇచ్చేశాడు. దాన్ని తిని ప్రాణం నిలుపుకుని వెళ్ళిపోయాడు విశ్వామిత్రుడు.

తరువాత ఇంద్రుడు కరువుతీరేలా వర్షించాడు. విశ్వామిత్రుడు నియమంతో తపస్సుచేసి తన దోషాన్ని పోగొట్టుకున్నాడు.

కనుక ఆపద సమయాలలో అనుసరించతగిన ధర్మాలు సాధారణ ధర్మాలకు భిన్నంగా వుంటాయని తెలుసుకోవాలి. ●

# జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం

**చా**లా ఏళ్ళక్రితం మన దేశమంతా అరణ్యాలతో నిండి వుండేది. ఒకచోటి నుండి మరొకచోటికి ప్రయాణం చెయ్యడమంటే చాలా కష్టంగా వుండేది. ఎందుచేతనంటే ఆ అరణ్యాలు రాక్షసులకు, క్రూరజంతువులకు వునికిపట్టుగా వుండేవి.

దక్షిణహిందూ దేశంలోని అడవుల్లో వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు భయంకరులైన రాక్షసులు నివసిస్తూ వుండేవారు. వాళ్ళిద్దరూ అన్నదమ్ములు. మనుష్యులను చంపి తింటుండేవారు. ఆ చంపి తినే పద్ధతి కూడా చాలా చిత్రంగా ఉండేది. ఇల్వలుడు బ్రాహ్మణ రూపం ధరించి ఆ అడవి వెంబడి వెళ్ళే ప్రయాణికులని తన ఇంటికివచ్చి ఆతిథ్యం స్వీకరించమని వినయంగా అడిగేవాడు. పాపం వాళ్ళు ఇల్వలుడి మాటలు నమ్మి అతని ఇంటికి వెళ్ళేవారు. వాళ్ళని స్నానం చేసి విశ్రాంతి తీసుకోమని చెప్పి వంట చేయడానికని ఇల్వలుడు వంటింట్లో దూరేవాడు. అక్కడ వాతాపిని చంపి ముక్కలు చేసి ఆ మాంసంతో వంటకాలు చేసేవాడు. వంట అయిపోయాక అతిథుల్ని పిలిచి స్వయంగా వడ్డించేవాడు. ఇల్వలుడు వడ్డించిన

పదార్థాలన్నీ బాటసారులు సుష్టుగా తినేవారు. భోజనం పూర్తిచేసి వాళ్ళు పీటమీద నుంచి లేవబోయే సమయానికి ఇల్వలుడు వాళ్ళముందు నిలబడి, "వాతాపీ! ఓ వాతాపీ! రా! త్వరగా బయటికి రా" అని పిలిచేవాడు. అతిథుల కడుపులో మాంసరూపంలో వున్న వాతాపి ఈ పిలుపు వినగానే మళ్ళీ ప్రాణం పోసుకుని వాళ్ళ పొట్టలు చీల్చుకుని బయటకు వచ్చేవాడు. పాపం! ఆ అతిథులు పొట్ట పగిలి చనిపోయేవారు. అప్పుడు అన్నదమ్ములిద్దరూ చనిపోయిన అతిథుల మాంసాన్ని లొట్టలేసుకుంటూ తినేవారు.

చాలాకాలం వరకు ఈ మోసాన్ని ఎవరూ కనిపెట్టలేకపోయారు. కొన్నాళ్ళకు ఈ రహస్యం బయటకు పొక్కింది. అప్పుడు ఆ అరణ్యాలలో వుండే మునులంతా అగస్త్యమహర్షి దగ్గరకు వెళ్ళి జరిగిందంతా చెప్పారు. అగస్త్యమహర్షి గొప్ప పండితుడు, జ్ఞాని. చాలా మంత్రశక్తులు ఉండేవి ఆయనకు. మహాసముద్రాలను, పర్వతాలను కూడా శాసించగలిగేవాడు. అగస్త్యుడు వెంటనే ఇల్వలుడు, వాతాపి ఉండే ప్రదేశానికి బయలుదేరాడు.

మహర్షిని చూడగానే ఇల్వలుడు యథాప్రకారం బ్రాహ్మణరూపంలో ఎదురువెళ్ళి ఆ రోజుకు తన అతిథిగా వుండమని కోరాడు. అగస్త్యుడు వెంటనే అంగీకరించాడు. ఇల్వలుడు ఇల్లు చేరుకోగానే వినయంగా చేతులు కట్టుకుని, "మహాత్మా! తమరు స్నానం చేసి జపం చేసుకుంటూ వుండండి. నేను క్షణంలో వంట చేస్తాను" అన్నాడు. తరువాత వంటింట్లోకి వెళ్ళి ఎప్పటిలాగే వాతాపిని చంపి ఆ మాంసంతో వంటకాలు చేశాడు.

తర్వాత ఇల్వలుడు మహర్షిని విందుకు పిలిచాడు. కొసరి కొసరి తను వండిన వంటకాలన్నీ వడ్డించాడు. తను ఏం తింటున్నదీ మహర్షికి తెలియకపోతే కదా!

ఆనందంగా భోజనం చేసి ఎడం చేత్తో పొట్టమీద రాసుకుంటూ మెల్లగా "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం" అనుకున్నాడు.

అది ఇల్వలుడికి వినపడలేదు.

ఆయన చెయ్యి కడుక్కోటానికి లేచి నిలబడగానే ఇల్వలుడు "వాతాపీ! ఓ వాతాపీ! బయటకు రా!" అని గట్టిగా పిలిచాడు. కాని ఎంతసేపటకీ వాతాపి బయటకు రాలేదు. ఇల్వలుడికి భయం వేసింది.

అగస్త్యుడు చిరునవ్వు నవ్వుతూ "ఏ వాతాపిని నాయనా నువ్వు పిలుస్తున్నావు? నీ తమ్ముడే అయితే అతను ఎప్పుడో నా పొట్టలో జీర్ణమైపోయాడు" అన్నాడు. తన ఎదుట ఉన్నది అగస్త్యులవారనీ, ఆయనకు మహత్తరశక్తులు ఉన్నాయనీ అప్పుడు అర్థమయింది ఇల్వలుడికి. ఒణికిపోతూ మహర్షి కాళ్ళమీద పడి "మహాత్మా! దయచేసి నన్ను ప్రాణాలతో విడిచిపెట్టండి. మరెప్పుడూ ఇటువంటి పాపం చెయ్యను" అన్నాడు.



తాపసి దయతలచి సరే అన్నాడు.

ఇల్వలుడు మరెప్పుడూ ఎవర్నీ చంపనని ప్రమాణం చేసి, ఆ అడివి వదలిపెట్టి వెళ్ళిపోయాడు.

"ఇల్వల" అంటే చెడునడత గలిగిన మనసు అని అర్థం.

"వాతాపి" పేరు సర్వప్రాణుల్నీ హరించేవాడు అనే అర్థాన్నిస్తుంది. అంటే 'మరణం' అన్నమాట.

ఇల్వలుడనే చెడు మనసుగల వాని జిత్తులు జ్ఞాని అయిన అగస్త్యుణ్ణి ఏమీ చెయ్యలేకపోయాయి. ●

# అహం వినాశకారి

**పి**ల్లలు చిన్నతనం నుంచీ వినయ విధేయతలు నేర్చుకోవాలి. మర్యాద తప్పకూడదు.

మనకంటే గొప్పవాళ్ళు లేరని విర్రవీగకూడదు.

పెద్దల యెడ భయభక్తులు కలిగి ఉండాలి.

మనిషిలో గర్వం పెరిగితే ఎప్పుడో ఒకప్పుడు దెబ్బతింటాడు.

భరద్వాజమహర్షి కుమారుడు యవక్రీతుడు.

వేదవిద్యలన్నీ నేర్చుకున్నాడు. గొప్ప పండితుడయ్యాడు.

'నేనుగదా తపస్సుచేసి ఇంద్రుడి వల్ల వరం సంపాదించి ఇంత పాండిత్యం పొందాను' అని ఎప్పుడూ గర్వపడుతుండేవాడు. కుమారుడి ప్రవర్తన భరద్వాజుడికి నచ్చేది కాదు. తన స్నేహితుడు రైభ్యుడితోను, అతని పిల్లలతోనూ ఏ క్షణాన తగాదా పెట్టుకుని విరోధం తెచ్చుకుంటాడో అని భయపడేవాడు. ఆ భయం కారణంగానే ఒకరోజు భరద్వాజుడు కుమారుడికో కథ చెప్పాడు. అదేమిటంటే –

అప్పుడెప్పుడో చాలా ఏళ్ళ క్రితం బాలదిహి అనే ఒక ముని ఉండేవాడు. ఆయన చాలా గొప్పవాడు. ఆయనకు ఒక్కడే కొడుకు. పాపం ఆ కొడుకు కాస్తా ఉన్నట్టుండి చనిపోయాడు. దాంతో ఆ ముని చాలా దుఃఖపడ్డాడు. ఈసారి చావు లేని కుమారుణ్ని పొందాలనుకుని ఘోర తపస్సు చేశాడు.

"మనిషై పుట్టాక ఎప్పుడో ఒకప్పుడు చనిపోవాల్సిందే. అసలు చావే లేకుండా వరం పొందడం కుదరదు. అందుచేత ఈసారి నీకు పుట్టబోయే కొడుకు ఎన్నాళ్ళు జీవించాలనుకుంటున్నావో చెప్పు, అన్నేళ్ళ ఆయుష్షు ఇస్తాం" అన్నారు దేవతలు.

"సరే! అలాగైతే – అదిగో ఆ ఎదురుగా కొండ ఉందే – అది ఉన్నంతకాలం నా బంగారుకొండ బతికుండాలి" అని బాలదిహి కోరుకున్నాడు. దేవతలు అలాగే వరం ఇచ్చారు. తరువాత వరప్రభావంతో మునికి ఒక కుమారుడు కలిగాడు. అతనికి 'మేధావి' అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచాడు ముని.

'నా ప్రాణానికి ముప్పు లేదు. కొండలాగా స్థిరంగా ఎంత కాలమైనా బతకొచ్చు' అనే గర్వం కలిగింది మేధావికి. దాంతో పెద్దాచిన్నా తారతమ్యం లేకుండా అందరితోనూ పొగరుగా ప్రవర్తించేవాడు.

ఒకరోజు ధనుసాక్షరి అనే మహాత్ముణ్ణి మేధావి తూలనాడాడు. అతని పట్ల చాలా అసభ్యంగా ప్రవర్తించాడు. ధనుసాక్షరి భగ్గున మండిపడి, "నీవు భస్మమైపోతావు పో!" అని శపించాడు.

కానీ మేధావికి శాపం తగల్లేదు.

కొండలా ఉన్నాడు.

అప్పుడు ధనుసాక్షరి మేధావికి గల వరాన్ని జ్ఞాపకం తెచ్చుకుని వెంటనే తపోమహిమ వల్ల తానొక అడవి దున్నగా మారిపోయి కొండను దభీమని ఢీకొట్టి దాన్ని బద్దలు చేశాడు. కొండ చీలిపోతూనే మేధావి తల కూడా రెండు ముక్కలైంది.

ఈ కథ వల్ల మనం తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి.

వరాలు పొందామని ఎన్నడూ గర్వపడకూడదు ; పెద్దల్ని యిష్టమొచ్చినట్టు మాట్లాడకూడదు. అందర్నీ గౌరవించడం నేర్చుకోవాలి.

ఇదీ భరద్వాజుడు కొడుక్కి చెప్పింది. ●

# బూరుగు గర్వభంగం

**బ**లవంతులతో దుర్బలులెప్పుడూ పోటీపడకూడదు. పెద్దరాయి కింద చెయ్యి పెట్టకూడదని అనుభవజ్ఞులు చెబుతుంటారు.

హిమవత్‌పర్వతం మీద ఒక పెద్ద బూరుగువృక్షం వుండేది. ఓసారి నారద మహర్షి ఆ దారిన వెడుతూ మధ్యలో బూరుగు దగ్గర ఒక క్షణం ఆగి "బూరుగా! ఈ హిమవత్ పర్వతంమీద ఎన్నాళ్ళనుంచి ఉన్నావు! ముదురుకొమ్మలతో, మూలబలంతో ఠీవిగా నిలబడ్డావు! నీ అంత పొడుగూ, వైశాల్యం కలిగిన చెట్టు మరేదీ లేదిక్కడ! ఎన్నో పక్షులు నిన్నాశ్రయించి జీవిస్తున్నాయి. గాలికి అన్ని చెట్లూ కూలిపోతాయి గానీ నువ్వు మాత్రం కూలకుండా ఉన్నావు? నీకూ వాయుదేవుడికీ ఏమయినా చుట్టరికం ఉందా? లేకపోతే అతడు దయతలచి పోన్లే పాపం కదా అని నిన్ను రక్షిస్తున్నాడా? ఏమిటి రహస్యం?" అని అడిగాడు.

బూరుగు వృక్షం ఆ మాటలకు ఉబ్బితబ్బిబ్బయింది.

"మునీంద్రా! తెలియక మాట్లాడుతున్నావు. నా ముందు వాయుదేవుడెంత? అతగాడి బలమెంత? అతని బలం నా బలంలో పదో వంతుకు కూడా రాదు" అంది కొమ్మలు విదిలిస్తూ గర్వంగా.

దేవర్షి చిన్నగా నవ్వి, "అమ్మమ్మ! అంత మాటనకు. వాయుదేవుడు తలుచుకున్నాడంటే కొండలే కూలిపోతాయి. ప్రభంజనుడంటే సర్వాన్ని చక్కగా విరిచేవాడని అర్థం! తెలుసా?" అన్నాడు.

"అదేమో నాకు తెలీదు. నా మొదలూ, కొమ్మలూ చూశావా ఎంత బలంగా ఉన్నాయో. నన్ను తాకితే అతనికున్న ప్రభంజనుడనే బిరుదు కాస్తా పోతుంది" అంది బూరుగు.

"సరే, జాగ్రత్త నీ కొమ్మలూ, రెమ్మలూ! వస్తా" అంటూ చిరునవ్వు నవ్వి కలహాశనుడు బయల్దేరాడు.

సంగతంతా చిటికలో అందించేశాడు వాయుదేవుడికి.

అతగాడు రానే వచ్చాడు.

"ఏమే బూరుగా! ఏం వాగావు– మళ్ళీ అను? నిన్ను తాకలేనా! పడగొట్టలేనా? నా ఆటలు నీదగ్గర సాగవా? నీకు చేటుకాలం వచ్చింది. మాటలెందుకు, కాచుకో!" అన్నాడు కోపంగా.

"తేలిగ్గా మాట్లాడకు. లోకంలో ఉన్న అన్ని వృక్షాలతో పాటే నన్నూ చూస్తున్నట్లున్నావు" అంది శాల్మలి.

పకపకా నవ్వాడు వాయుదేవుడు.

"ఓహో! ఎంత గర్వం? అన్ని వృక్షాలలాంటిదానవు కాక నీకేం కొమ్ములు మొలిచాయా? బ్రహ్మదేవుడు నీ నీడలో నిలబడ్డాడన్న గౌరవం కొద్దీ నిన్ను ఏం చెయ్యకుండా ఇన్నాళ్ళూ వదిలేశాను. అందుకే ఇప్పుడిలా పొగరెక్కి మాట్లాడుతున్నావు. ఇప్పుడు పనిలో ఉన్నాను. రేపు తేల్చుకుందాం బలాబలాలు" అంటూ ముందుకు దూసుకుపోయాడు.

వాయుదేవుడు వెళ్ళిపోయాక బూరుగు వృక్షానికి భయం పట్టుకుంది. 'అయ్యో, మహాబలుడైన వాయుదేవుడితో ఎరగకపోయి విరోధం తెచ్చుకున్నానే? రేపు నా గతేమిటి? నారదముని మాటలు వినకపోయాను కాదు' అని విచారించింది.

మరుక్షణం మళ్ళీ కొంచెం ధైర్యం తెచ్చుకుంది. 'వాయుదేవుడొస్తే ఏం చేస్తాడు? ఆకులు రాల్చేస్తాడు! కొమ్మలూ రెమ్మలూ విరిచేస్తాడు!! అంతేగా! ఆ పని నేనే చేసేసుకుంటే ఇంక అతనేం చేయగలడు – అతను ఓడిపోయినట్టేగా!' అనుకుని బలాన్నంతా కూడగట్టుకుని ఆకులు విదిలించుకుని, కొమ్మలన్నిటినీ తనకు తనే విరుచుకుని మోడై నిలబడింది శాల్మలి.

తెల్లవారింది.

భయంకరంగా ధ్వనిచేస్తూ ప్రతిజ్ఞ తీర్చుకునేందుకు వచ్చాడు వాయుదేవుడు. దుంగలా మిగిలిన బూరుగును చూస్తూనే పెద్దగా నవ్వుతూ, "నా పని నువ్వే చేసేశావే! మంచిది. ఇంక బుద్ధి తెచ్చుకో! ఒళ్ళు దగ్గరపెట్టుకుని బతుకు! నువ్వే కాదు – నీ బంధువులందరికీ కూడా చెప్పు" అని హేళన చేసి వెళ్ళిపోయాడు.

శాల్మలి సిగ్గుతో తలవంచుకుంది. ●

# మోక్షమార్గం

**పూ**ర్వం కౌశికుడనే మహర్షి వుండేవాడు. ఆయన ఒకనాడు చెట్టునీడన కూర్చుని వేదమంత్రాలు చదువుకుంటున్నాడు. అప్పుడు చెట్టుమీద వున్న ఒక పిట్ట ఆయన తలమీద రెట్ట వేసింది. కౌశికుడు కోపంగా తల ఎత్తి చూశాడు.

చెట్టుమీద కొంగ కనిపించింది. తీక్షణంగా దానినే చూసేసరికి ఆ కోపానికి తట్టుకోలేక కొంగ చెట్టుమీద నుంచి కిందపడి చచ్చిపోయింది.

ఆ తరువాత కౌశికుడు ఎప్పటిలాగే గ్రామంలోకి భిక్షాటనకి బయల్దేరాడు. ఇంటి గుమ్మం ముందు నిలబడి "భవతీ భిక్షాందేహి!" అని కేక వేశాడు.

అప్పుడు ఆ ఇల్లాలు ఇంటి పనిలో ఉంది. పని అయిన తరువాత తనకు భిక్షం వేస్తుందేమోనని కౌశికుడు వాకిట్లోనే కనిపెట్టుకుని నిలబడి ఉన్నాడు.

ఇంతలో బయటనుంచి ఆ ఇల్లాలి భర్త వచ్చాడు. వస్తూనే "ఆకలి ఆకలి"

అన్నాడు. అది విని భర్తకు కాళ్ళూ చేతులూ కడుక్కోవడానికి నీళ్ళిచ్చి, వంటింట్లో పీట వాల్చి, ఆకు వేసి అన్నం వడ్డించింది.

బయట బ్రహ్మచారి అలాగే నిలబడి ఉన్నాడు.

భర్త భోజనం చెయ్యడం పూర్తయిన తరువాత బ్రాహ్మణుడికి భిక్ష వేద్దామని బయటకు వచ్చి, "పాపం మిమ్మల్ని చాలాసేపు నిలబెట్టాను, క్షమించండి" అంది ఆ ఇల్లాలు.

కౌశికుడు కోపంతో మండిపడుతూ "అమ్మాయీ! ఎన్నో ఇళ్ళకు పోవలసిన వాణ్ణి. నన్ను అలక్ష్యం చేసి నీ ఇంటి దగ్గరే చాలాసేపు నిలబెట్టావు" అన్నాడు.

"స్వామీ! మన్నించండి. మా వారికి ఉపచర్యలు చేస్తూ ఉండడం వల్ల కొంచెం ఆలస్యమైంది" అంది ఆ అమ్మాయి.

"భర్తకు సేవ చేయడం ధర్మమే కానీ ఆ కారణంగా నన్ను అవమానించడం క్షమించరాని నేరం" అన్నాడు కౌశికుడు కోపంగా.

"అనవసరంగా కోప్పడకండి మహాత్మా! పతిని పూజించే స్త్రీమీద అభాండాలు వేయకండి. నేనేమీ కొంగను కాదు, మీ చూపులకు కిందపడి గిలగిల తన్నుకు చావడానికి! భర్తసేవను మించిన సేవ లేదు ఇల్లాలికి. మీ కోపం నామీద పనిచేయదు" అంది ఆమె.

కొంగను గురించి ఆమెకు ఎలా తెలిసిందా అని కౌశికుడు ఆశ్చర్యపోయాడు. అదే అడిగాడు.

"మహాత్మా! **మనిషికి కోపానికి మించిన శత్రువు లేదు. ఆవేశమే అన్ని అనర్థాలకు మూలకారణం.** దయయుంచి మీరు మిథిలానగరానికి వెళ్ళి అక్కడ ధర్మవ్యాధుడ్ని కలుసుకోండి. అతను మీకు హితవు చెబుతాడు" అంది ఆ ఇల్లాలు.

"తల్లీ! నువ్వు నా కళ్ళు తెరిపించావు. నీకు శుభం కలుగుగాక" అని పలికి కౌశికుడు మిథిలకు పయనమయ్యాడు.

ధర్మవ్యాధుడి కోసం కౌశికుడు నగరమంతా వెదకడం మొదలుపెట్టాడు. ఎక్కడా కనిపించలేదు. చివరికి ఒక కసాయి దుకాణంలో మాంసం అమ్ముతున్న మనిషిని చూపించి అతనే ధర్మవ్యాధుడని చెప్పారందరూ.

కౌశికుడికి దిగ్భ్రమ కలిగింది. ముక్కు మూసుకుని దూరంగా నిలబడ్డాడు.

అప్పుడు ధర్మవ్యాధుడే బ్రాహ్మణుడి దగ్గరకు వచ్చి "మహాత్మా! మహా పతివ్రత అయిన ఆ ఉత్తమఇల్లాలు మిమ్మల్ని నా దగ్గరికి పంపించి ఉంటుంది, రండి" అని ఆహ్వానించాడు.



కౌశికుడు విస్తుపోయాడు.

"స్వామీ! మీరు వచ్చినపని నాకు తెలుసు. దయచేయండి" అంటూ ధర్మవ్యాధుడు కౌశికుడ్ని తన ఇంటిలోకి తీసుకెళ్ళాడు.

అతిథికి అర్ఘ్యం ఇచ్చిన వెంటనే వృద్ధులైన తల్లిదండ్రులకు పరిచర్యలు చేశాడు ధర్మవ్యాధుడు. వారికి సేవలు చేసిన తరువాత కౌశికుని వద్దకు వచ్చి కూర్చున్నాడు. కుశలప్రశ్నలయ్యాయి.

ఆ తర్వాత మాటల మధ్యలో "మునీంద్రా! ఏ పని చేసినాసరే ధర్మం తప్పకుండా చేస్తే అది దైవోపాసన– జీవిక కోసం కులవృత్తి చేసుకోవడం జీవనధర్మం. తల్లిదండ్రుల్ని పూజించడం, భార్యను ప్రేమతో చూడటం, తీరికవేళల్లో సజ్జనుల సేవచేసి తరించటం, సద్గోష్ఠిలో పాల్గొనడం– వీటికంటే ధర్మం వుందని నేననుకోను. సమస్త ప్రాణుల్లోనూ, అన్ని వస్తువుల్లోనూ భగవంతుడున్నాడు. భగవంతుడ్ని

నమ్మినవాడు ఎన్నటికీ చెడడు. కసాయి దుకాణమైనా, కల్లు దుకాణమైనా తాను చేస్తున్న పనిని ధర్మం తప్పకుండా చేస్తే ముక్తిని పొందవచ్చు" అన్నాడు వినయంగా ధర్మవ్యాధుడు.

కౌశికుడికి జ్ఞానోదయం కలిగింది. ఇంతకాలంగా తాను అలక్ష్యం చేసిన తల్లిదండ్రుల పట్ల తన బాధ్యతను గుర్తించి వెంటనే యింటికి పయనమయ్యాడు.

వేదాంత తత్త్వజ్ఞానంతో, అధ్యయనాలతో, తపస్సుతో, పరిశ్రమతో పొందే జ్ఞానాన్ని, మోక్షాన్ని ఉత్తమ ప్రవర్తనతో సాధించవచ్చు. ●

# అష్టావక్రుడు

పాండవులు తీర్థయాత్రలు చేస్తూ చేస్తూ ఒకనాడు ఉద్దాలక మహర్షి ఆశ్రమం చేరుకున్నారు. లోమశుడు ఆ మహర్షికి సంబంధించిన ఒక కథను ధర్మరాజుకు చెప్పాడు.

వేదాంతం ఉపదేశించగల పెద్దలలో గట్టివాడు ఉద్దాలకుడు. ఆయన వద్ద కహోలుడనే శిష్యుడుండేవాడు. అతను చాలా బుద్ధిమంతుడు. మంచి గుణగణాలు, నీతినియమాలు కలిగినవాడు. కాని అతని దగ్గర ఒకే ఒక లోపం వుంది. అదేమిటంటే నిలకడ లేదు మనిషిదగ్గర. అందుకని ఏ విద్యా పూర్తిగా నేర్చుకోలేకపోయాడు.

అయినప్పటికీ ఉద్దాలకుడికి కహోలుడి పట్ల ప్రేమ వుండేది. అందుకని తన కూతురు సుజాతనిచ్చి పెళ్ళి చేశాడు.

కహోలుడికీ, సుజాతకూ ఒక కొడుకు కలిగాడు. తల్లి కడుపులో వున్నప్పుడే తాత చదివే వేదాలన్నీ విని నేర్చుకున్నాడు. కాని, తండ్రి కహోలుడు వేదాధ్యయనం

చేసేటప్పుడు తప్పులు దొర్లేవి. ఆ అపశబ్దాలు వినలేక ఆ పిల్లవాడు తల్లి గర్భంలోనే వంకరలు వంకరలుగా ముడుచుకుపోయేవాడు. ఆ వంకరలు చివరకు అతని శరీరంలో అలాగే నిలిచిపోయాయి. అలా ఎనిమిది వంకర్లతో పుట్టడంవల్ల అతనికి అష్టావక్రుడన్న పేరు వచ్చింది.

అష్టావక్రుడు చిన్నతనంలోనే గొప్ప విద్వాంసుడైనాడు. పన్నెండేళ్ళు వచ్చేసరికి వేద వేదాంగాలన్నీ చదువుకున్నాడు. ఒకసారి జనక మహారాజు మిథిలా నగరంలో పెద్దయాగం చేస్తున్నాడని తెలిసింది. తన బంధువూ, మిత్రుడూ అయిన సువేదకేతువును వెంటపెట్టుకుని అష్టావక్రుడు మిథిలకు వెళ్ళాడు. అక్కడ రాజభటులు వాళ్ళిద్దర్నీ లోపలకు పోనీయలేదు. అప్పుడు అష్టావక్రుడు రాజభటులతో "నాయనలారా! గుడ్డివాళ్ళకు, కుంటివాళ్ళకు, స్త్రీలకు మహారాజే తప్పుకుని దారి ఇవ్వాలి. వేదాలు, ఉపనిషత్తులు చదువుకున్న విద్వాంసులూ, పెద్దలూ దారిన పోతుంటే – రాజైనా సరే – వారిని పక్కకు తొలగిపొమ్మనకూడదు. ఇది నేను చెబుతోంది కాదు, శాస్త్రం చెబుతోంది" అన్నాడు.

ఈ వాదం రాజు గారి చెవికి చేరింది.

ఆ పిల్లవాడి తెలివితేటలకు ఆనందపడి 'నిజమే! ఆ బాలకుడు చెప్పినదాంట్లో అబద్ధమేమీ లేదు. నిప్పుకి మన తన భేదం లేదు. కాలుతుంది, కాలుస్తుంది. పిల్లవాడు చిన్నవాడైనా ఉద్దండుడిలా వున్నాడు' అనుకుని, "ఆ బాలకులిద్దర్నీ వెంటనే లోపలికి పంపండి" అని భటుల్ని ఆదేశించాడు.

ఆజ్ఞ ప్రకారం అష్టావక్రుడ్నీ సువేదకేతువునీ లోపలికి పంపారు.

కానీ, మరోచోట ఇంకో ద్వారపాలకుడు అడ్డగించాడు. "ఇక్కడికి మీబోటి చిన్నపిల్లలు రాకూడదు. వేదం చదివిన పెద్దలు మాత్రమే రావాలి" అన్నాడు.

"మేం చిన్నపిల్లలం కాము. వేదాలు అధ్యయనం చేసాం. అయినా **పైపై మెరుగులు చూసి, ఆకారం చూసి, వయస్సు చూసి ఎవర్నీ పెద్ద, చిన్న అని అంచనా వెయ్యకూడదు. ఆకారాన్ని బట్టి పాండిత్యం రాదు. వయస్సు వచ్చినంత మాత్రాన వృద్ధులు గారు–జ్ఞానంచేత పండినవారే వృద్ధులు. తెలివి వున్నవాడే మనిషి**" అని సుదీర్ఘంగా ప్రవచించాడు అష్టావక్రుడు.

ఇలా వాదన జరుగుతున్న సమయంలో రాజుగారు అక్కడకు వచ్చి, "మా పండితులందరూ మహా విద్వాంసులు. అటువంటి వాళ్ళతో వాదించాలనే కోరిక

నీ కెందుకు కలిగిందో నాకు అర్థం కావటం లేదు. ఒకవేళ నువ్వు ఆ వాదంలో ఓడిపోతే వాళ్ళు నిన్ను సముద్రంలోకి తోస్తారు. అందుకు సిద్ధమేనా?" అని అడిగాడు.

"మహారాజా! మీరు చెప్పినట్లే కానివ్వండి. కాని వాళ్ళు నాతో వాదించలేరు. ఆ సంగతి నాకు తెలుసు. పండితులమనీ, అన్నీ తెలిసినవాళ్ళమని అహంభావంతో వున్నారు వాళ్ళు. వాళ్ళు చేసిన అవమానం వల్లే మా తండ్రి సముద్రంలో దూకి ప్రాణాలు పోగొట్టుకున్నట్టు మా అమ్మ చెప్పింది. అందుకని పట్టుదలతో వచ్చాను. మీ పండితుల్ని ఎదిరించి వాదించగలను. లేకపోతే నేను కూడా సముద్రంలోకి దూకుతాను. ముందు నన్ను లోపలికి రానీయండి" అని కోరాడు అష్టావక్రుడు.

అందుకు జనక మహారాజు ఒప్పుకున్నాడు. అష్టావక్రుడి ప్రశ్నలకు ఎవరూ సరిగా సమాధానం చెప్పలేకపోయారు.

అష్టావక్రుడు గెలిచినట్టు ప్రకటించారు. పందెం ప్రకారం వాదంలో ఓడిపోయిన వాళ్ళందరూ సముద్రంలో దూకారు. తన ప్రతిభాపాండిత్యాలతో తండ్రి కహోలుడికి ఆత్మశాంతి కలిగించాడని అష్టావక్రుణ్ణి లోకం కొనియాడింది.

అదీ కథ.

కనుక చదువు సంధ్యలు లేని తల్లిదండ్రులకు పుట్టిన పిల్లలు స్వయంకృషితో, పెద్దల ప్రోత్సాహంతో మేధావులుగా రూపొందవచ్చు. పండితుడి కడుపున పరమ శుంఠ జన్మించవచ్చు. దేహబలం లేని తండ్రికి బలాఢ్యులైన పిల్లలు పుట్టవచ్చు. కేవలం ఆనువంశిక లక్షణాల్ని బట్టి, పైపై ఆకారాలనుబట్టి ఎవర్నీ అంచనా వెయ్యకూడదు. ●

# అష్టావక్రుడి పెళ్ళి

ఒకసారి అష్టావక్రుడు అలకానగరానికి వెళ్ళాడు. కుబేరుడు సగౌరవంగా ఆహ్వానించి అతిథి మర్యాదలు చేశాడు.

"అయ్యా! మీ వంటి మహనీయుణ్ణి ఆరాధించగలిగాను! తరించాను!! మీకేం కావాలో చెప్పండి" అని వినయంగా అడిగాడు కుబేరుడు.

"అలకాధిపతీ! నేను బ్రహ్మచారిని. తపస్సు చేసుకుంటూ వుండే వాణ్ణి. ఇప్పుడు పెళ్ళి చేసుకోవాలనే బుద్ధి పుట్టింది. వదాన్యుడనే మునీంద్రుడికి సుప్రభ అనే కూతురుంది. ఆమెకు, నాకు పెళ్ళి చేయమని అడిగాను.

'నువ్వు నా కుమార్తెకు తగినవాడవు. తప్పకుండా ఇస్తాను. కాని పెళ్ళయే లోపల ఒకసారి ఉత్తర దిక్కుకు వెళ్ళిరావాలి' అన్నాడాయన.

'ఉత్తర దిక్కుగా ఎంతదూరం వెళ్ళను? ఎక్కడికి వెళ్ళను? ఏం పని చెయ్యను?' అని అడిగాను.

'అలకానగరం దాటి, హిమాలయంలో గిరీశుని కోసం గిరిజ తపస్సు చేసిన ప్రదేశం చూసి ఇంకా ముందుకు వెళ్ళు. నీప వృక్షాలతో కూడిన అడవి కనిపిస్తుంది. అక్కడ ప్రాయంలో వున్న ఒక స్త్రీ వుంటుంది. ఆమెను చూసిరా! రాగానే పెళ్ళి ముహూర్తం పెట్టిస్తాను' అన్నాడు వదాన్యుడు. అందుకని బయలుదేరాను. నాకు నీ వల్ల ప్రత్యేకంగా కావల్సిందేమీ లేదు, వెళ్ళొస్తాను" అన్నాడు అష్టావక్రుడు. హిమపర్వతం ఎక్కి ఈశ్వర క్రీడాస్థానం చూసి ప్రదక్షిణ నమస్కారాలు చేశాడు. కొంత దూరం ముందుకు వెళ్ళేసరికి నీప వృక్షాలు కనిపించాయి. వాటిమధ్య బంగారు మణిమయ సౌధాలు అనేకం కనిపించాయి. వాటిలో ఒక మేడ మహోన్నతంగా మహావైభవంగా కనిపించింది. అష్టావక్రుడు అక్కడికి వెళ్ళాడు. "అమ్మాయీ! లోపలికి వెళ్ళి అష్టావక్రుడు వచ్చాడని చెప్పు" అన్నాడు గుమ్మం దగ్గరున్న పరిచారికను చూసి.

ఆమె లోపలికి వెళ్ళింది.

కాసేపటికి చందనపు బొమ్మల వంటి కన్యలు కొందరు వచ్చి వినయంగా నమస్కరించి ఆయనను లోపలికి తీసుకువెళ్ళారు. సుందరాంగులు వాళ్ళు. అయినా చలించలేదాయన. తిన్నగా వాళ్ళ వెంట అంతఃపురానికి వెళ్ళాడు. అక్కడొక రత్నపర్యంకం వుంది. దానిమీద యవ్వనం, సౌందర్యం మూర్తీభవించిన ఒక స్త్రీ కూర్చుని వుంది. రత్నాభరణాలతో, తెల్లని వస్త్రాలలో మెరిసిపోతోంది. అష్టావక్రుణ్ణి చూడగానే లేచి నిలబడిందామె.

"వీళ్ళందరూ ఎందుకిక్కడ?" అన్నాడు పరిచారికలను చూపిస్తూ. ఆమె కనుసైగతో వాళ్ళంతా వెళ్ళిపోయారు. ఆమె, అష్టావక్రుడు భోజనాలు చేసి హాయిగా కబుర్లాడుకోసాగారు. చీకటిపడింది.

"పొద్దుపోయింది – పడుకుందామా?" అని అడిగింది ఆమె. అంగీకరించాడు ముని.

ఇద్దరూ విడివిడి శయ్యల మీద పడుకున్నారు. కొంచెంసేపటికి ఆమె లేచి అతని దగ్గరకు వెళ్ళింది. అతనిలో ఏ చలనం లేకపోయేసరికి గట్టిగా కౌగలించుకుని, "మగవాళ్ళు భోగపరులు. ఇటువంటి పరిస్థితుల్లో ఓర్పు స్త్రీకి వుంటుంది కాని పురుషులకి వుండదు. కానీ, మీ వైఖరి విపరీతంగా వుంది. నా అంతట నేను వలచి దగ్గరకు వస్తే నన్ను నిరాదరిస్తారేమిటి? నన్ను, నాతోపాటు ఈ సంపదను చేపట్టి దివ్య భోగాలనుభవించండి. నేను మీదానను. మీమాట జవదాటను. నన్ను

బాధ పెట్టకండి. నన్ను మీ దానిగా చేసుకోండి" అని బతిమాలింది.

"అతివా! పరస్త్రీని పొందటం తగదు. అదీగాక నేను అస్ఖలిత బ్రహ్మచారిని. ఇటీవలనే నాకు పెళ్ళి చేసుకోవాలన్న తలంపు కూడా వచ్చింది. నన్నిలా అడగడం తగదు" అన్నాడు అష్టావక్రుడు.

"నీ అందానికి చిక్కాను నేను. నన్ను కాదనకు" అంది.

"నీవంటి స్త్రీకి ఇటువంటివి తగునా? ఈ ప్రవృత్తి మార్చుకో! నేను వెళ్ళి వస్తాను" అని లేచాడాయన.

"మీరు వచ్చిన పని పూర్తయ్యాక వెడుదురుగానిలే! అంతవరకూ వుండండి" అంది.



"నువ్వు నాదగ్గరకు రాకుండా వుండేట్టయితే వుంటాను. ధర్మమార్గంలో సంచరించు. ఇటువంటి పనులు చెయ్యకు" అని వారించాడు అష్టావక్రుడు. "సరే" అందామె. అక్కడినుంచి వెళ్ళిపోయింది.

అష్టావక్రుడు నిద్రపోయాడు. తెల్లవారాక నిద్ర లేపిందామె. పన్నీటితో జలకమాడించింది. చెవుల కింపైన కబుర్లు చెబుతూ, జిహ్వాకింపైన భోజనం పెట్టింది. ఆటపాటలతో వినోదం కల్పించింది. మళ్ళీ రాత్రి అయింది. "నేను మీ దగ్గరకు రానా?" దీనంగా అడిగిందామె.

"వద్దు"

"పోనీ నన్ను పెళ్ళాడు."

"నిన్ను నువ్వే ఇచ్చుకుంటే పెళ్ళాడడం మంచిదికాదు" అన్నాడు.

ఇంకొంచెం దగ్గరకు వెళ్ళి నిలబడిందామె.

మరింత హొయలు చిలికింది.

మరిన్ని వయ్యారాలు పోయింది.

"నేను వెళ్ళొస్తాను" అని లేచాడు అష్టావక్రుడు.

"మహాత్మా! నీవల్ల ప్రీతి పొందాను నేను. నిన్ను పరీక్షించాలనే ఉద్దేశ్యంతో వదాన్యుడే నాదగ్గరకు పంపాడు నిన్ను. నేను ఉత్తర దిశను. నీ నిష్ఠకు సంతోషించాను. ఆయన కూడా నిన్ను మెచ్చుకుంటాడు. నువ్వు కోరుకున్న సుప్రభ నీకు భార్య అవుతుంది. ఇంక సంతోషంగా వెళ్ళు" అందామె.

ఆమెకు నమస్కరించి బయలుదేరాడు అష్టావక్రుడు. జరిగినదంతా వదాన్యుడితో చెప్పాడు.

ఆయన సంతోషించి అష్టావక్రుడికి తన కూతుర్నిచ్చి పెళ్ళి చేశాడు. ●

# కర్ణుడు

**కుం**తీదేవి యదువంశీయుడైన శూరసేనుని కుమార్తె, కుంతిభోజుడి దత్తపుత్రిక. కుంతిభోజుడి ఇంటిదగ్గర పెరుగుతూన్న రోజులలోనే కుంతి దుర్వాసమహర్షిని సేవించి ఆయన అనుగ్రహానికి పాత్రురాలైంది. అప్పుడాయన ఆమెకో మంత్రం ఉపదేశించి ఆ మంత్ర జపంతో ఏ దేవతను ఆహ్వానిస్తే ఆ దైవం వచ్చి సంతానాన్ని అనుగ్రహిస్తాడని చెప్పాడు.

మంత్రమహిమను పరీక్షించాలన్న చాపల్యంతో కుంతి ఆ మంత్రం జపించి సూర్యుణ్ణి ఆహ్వానించింది. సూర్యుడు దివ్యతేజస్సుతో ఆమె ఎదుట సాక్షాత్కరించాడు. కుంతి భయపడిపోయి “స్వామీ! నన్ను మన్నించండి. ఆకతాయితనంతో మహర్షి మంత్రప్రభావం పరీక్షిద్దామని పిలిచాను. క్షమించి మీరు వెళ్ళిపోండి” అంది.

సూర్యుడు నవ్వి, “కుమారీ! మంత్రశక్తి వృథా కాదు. నువ్వేమీ భయపడకు. నా వల్ల కలిగే కుమారుడు సహజ కవచకుండల శోభితుడై, మహాదాతగా,

తేజశ్శౌర్యగాంభీర్యధైర్యాలలో తనకు తానే సాటిగా ప్రఖ్యాతుడవుతాడు" అంటూ కుంతిని సమీపించాడు. ఫలితంగా ఆమెకు ఒక కుమారుడు కలిగాడు. అతనే కర్ణుడు.

కన్యాత్వానికి అపప్రధ వాటిల్లుతుందన్న భయంతో కుంతి ఆ పసివాణ్ణి గంగలో విడిచింది. నదీ ప్రవాహంలో కొట్టుకుపోతున్న ఆ బాలుణ్ణి అతిరథుడనే సూతుడు, అతని భార్య రాధ పెంచి పెద్దవాణ్ణి చేశారు. ఊహ తెలిసిన దగ్గర్నుంచి ఎవరు ఏది దానం అడిగినా లేదనకుండా ఆ బాలుడు సంతృప్తి పరచి పంపుతున్నాడు. కర్ణుడి దానగుణం జగద్విఖ్యాతమవుతోంది.



ఈ సూర్యపుత్రుడి వల్ల తన కుమారుడైన అర్జునుడికి ముందు ముందు ఆపద రాబోతోందని గ్రహించిన దేవేంద్రుడు ఒకనాడు పేద బ్రాహ్మణుడి వేషంలో కర్ణుడి దగ్గరకు వెళ్ళి అతడి కవచకుండలాలు దానం ఇమ్మని అర్థించాడు. ఇలాంటి మోసమేదో జరుగుతుందని ఊహించిన సూర్యుడు, "దేవేంద్రుడు విప్రరూపంలో వచ్చి నీ కవచకుండలాలు ఇమ్మంటాడు. అవి మాత్రం ఇవ్వకు" అని కుమారుణ్ణి

ముందుగానే హెచ్చరించాడు. కాని, సహజ దానశీలి అయిన కర్ణుడు తన ప్రత్యర్థి అర్జునుడికి మేలు జరుగుతుందని తెలిసినప్పటికీ జంకలేదు. వెంటనే కత్తితో కోసి తన కవచాన్ని, కుండలాల్ని ఇచ్చేశాడు.

దేవేంద్రుడు దిగ్భ్రాంతి చెంది వరం కోరుకొమ్మనగా ఆ పసివాడు, "దేవరాజా! ఎంతటి శత్రువులనైనాసరే అవలీలగా చంపగల మీ శక్తి ఆయుధాన్ని అనుగ్రహించండి" అని అడిగాడు.

"అలాగే తీసుకో! కానీ ఒక్కమాట! యుద్ధంలో నీవీ శక్తిని ప్రయోగిస్తే ఎటువంటివాణ్ణయినా సరే యిది సంహరిస్తుంది. అయితే ఒక్కణ్ణే చంపుతుంది. మరుక్షణం మళ్ళీ ఈ ఆయుధం నా దగ్గరకు వచ్చేస్తుంది" అని చెప్పి ఇంద్రుడు అంతర్థానమయ్యాడు.

ఇలా వుండగా దుర్యోధన సోదరులకు, పాండవులకు ద్రోణాచార్యులవారు ఒకనాడు ధనుర్విద్యలో పోటీలు నిర్వహించారు. ఆ పోటీలు చూడటానికి హస్తినాపురంలోని జనమంతా వచ్చారు. అందరిలోకి అర్జునుడు చూపిన ధనుర్విద్యాకౌశలం ప్రేక్షకులను అమితంగా ఆకర్షించింది. ద్రోణుడు ప్రియశిష్యుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు. దుర్యోధనుడు ఓర్వలేకపోయాడు. ఇంతలో కర్ణుడు మత్తగజంలా అడుగులు వేస్తూ సభామధ్యానికి వచ్చి "అర్జునా! ఈపాటి విద్యలు నేనూ ప్రదర్శించగలను. కావాలంటే అంతకంటే గొప్పవిద్యలు కూడా చేసి చూపిస్తాను. ధైర్యముంటే ముందుకురా" అని సవాలు చేశాడు.

ఆ మాటలు వినగానే నిశ్చేష్టులయ్యారు ప్రేక్షకులు. అసూయతో రగిలిపోతున్న దుర్యోధనుడి మనస్సు మాత్రం ఆనందంతో పరవళ్ళు తొక్కింది. ద్రోణుడు కర్ణుణ్ణి చూసి, "నాయనా! ద్వంద్వయుద్ధానికి దిగేవారి కులశీలాలు సమానం కావాలి. అర్జునుడు పాండురాజనందనుడు! కుంతీకుమారుడు, కురు వంశీయుడు. మరి నువు ఏ రాజ వంశానికి చెందినవాడవో, నీ తల్లిదండ్రులెవరో చెప్పి ముందుకురా. కులం, కులాచారం తెలియందే రాజకుమారులు సమయుద్ధం చెయ్యరు" అన్నాడు.

ఆ మాటలు వినగానే కర్ణుడు తల వాల్చుకున్నాడు.

అప్పుడు దుర్యోధనుడు లేచి "ఆచార్యా! మీరు ఆదేశించినట్టు కర్ణుడు రాజయితే తప్ప అర్జునుడితో యుద్ధానికి దిగడానికి అవకాశం లేకపోతే ఈ క్షణమే కర్ణుణ్ణి నేను రాజును చేస్తాను" అని ప్రకటన చేశాడు. ఆ వెంటనే పవిత్రజలాలు, రత్నకిరీటం,

కనకాంగద కేయూరాలు, వడ్డాణాలు, రత్నహారాలు తెప్పించి కర్ణుణ్ణి అంగరాజ్యానికి ప్రభువును చేశాడు.

సంతోషం పట్టలేక కర్ణుడు సుయోధన చక్రవర్తిని గాఢాలింగనం చేసుకుని, "ఈ జీవితాన్ని మీకు అంకితం చేస్తున్నాను. మీ ఆజ్ఞ నాకు ఎల్లవేళలా శిరోధార్యం" అని వినయంగా అన్నాడు.

కొడుకు రాజయిన సంగతి తెలుసుకుని సూతుడు వచ్చాడక్కడికి. కర్ణుడు సింహాసనం దిగివచ్చి పితృభక్తితో నమస్కరించాడు.

భీమసేనుడు అది చూసి హేళనగా "ఓహో! నువ్వు సూతపుత్రుడవా! ఇంకేం? కొరడా చేతపట్టి గుర్రాలు తోలుకో! అర్జునుడితో యుద్ధమేం చేస్తావు?" అన్నాడు.

సభలో కలకలం బయలుదేరింది.

సూర్యాస్తమయం కావడంతో వెలుతురు కూడా తగ్గింది.

ఆ నాటికి విద్యా ప్రదర్శన కూడా ఆగింది. కర్ణుడి చెయ్యి పుచ్చుకుని దుర్యోధనుడు నిష్క్రమించాడు. ●

# కర్ణుడి శాపాలు

భీష్మద్రోణులు వీరస్వర్గం పొందినా మిగిలిన కొంచెం సైన్యంతోనే పాండవుల్ని దుర్యోధనుడు గెలవాలనుకోవడం కేవలం కర్ణుణ్ణి నమ్ముకునే! కురుక్షేత్ర సంగ్రామంలో కర్ణుడిని ధనుంజయుడికి ప్రతివీరుడుగా నిర్ణయించారు. సవ్యసాచి రథసారథి కృష్ణుడు.  అందుచేత యుద్ధచాతుర్యంలో, అశ్వజ్ఞానంలో కృష్ణుడితో సమానమైన శల్యుణ్ణి కౌరవులు కృష్ణుడికి ప్రతిగా, రాధేయుడికి సారథిగా నిలిపారు. శత్రువులకు హృదయశల్యంగా ఉంటాడు కనుక ఆయనకు 'శల్యుడ'ని పేరు వచ్చింది.

"హితం చెప్పవలసి వచ్చినప్పుడు పొగడడమూ, నిందించడమూ కూడా జరుగుతుంది. నువ్వు బుద్ధి కలిగి అన్నీ ఓర్చుకోవాలి. దేవేంద్రుడి రథం కూడా నడపగలిగినవాడ్ని నేను. తగిన సలహా చెబుతూ నువ్వెప్పుడూ ఏమరకుండా

చూస్తాను. అందుకు ఇష్టమైతే చెప్పు" అన్నాడు శల్యుడు కర్ణుడితో.

కర్ణుడు సరేనన్నాడు.

శల్య సారథ్యంతో కర్ణరథం యుద్ధభూమికి బయలుదేరింది. రథచక్రం యుద్ధభూమిని తాకుతూనే కర్ణుణ్ణి చూసి కౌరవ బలమంతా సంతోషంతో పొంగింది. సింహనాదాలు చేసింది. అదిచూసి కర్ణుడు అతిశయంతో, "నేను విల్లంది విక్రమించానంటే దేవేంద్రుణ్ణయినా గడ్డిపరకతో సమానంగా చూస్తాను. అలాంటిది పాండుకుమారులో లెక్కా! దేవతలడ్డుపడినా సరే – ఒక్క చేత్తో ఆ ధనుంజయుణ్ణి చంపి తీరుతాను" అన్నాడు.

"ఊరుకో! ఊరుకో! ఉత్తుత్తి ప్రగల్భాలు పలకకు. కృష్ణార్జునులను ఒంటరిగా ఎదిరించడం ముక్కంటికి కూడా సాధ్యం కాదు. నామాట విని తగిన యోధుల్ని సాయం తీసుకుని మరీ వెళ్ళు" అన్నాడు శల్యుడు.

"నువ్వెన్ని చెప్పినా మానను. ఈ రోజు వాళ్ళో నేనో ఎవరో ఒక్కరమే మిగులుతాం" అని చుట్టూ వున్న రాజులందర్నీ చూసి కర్ణుడు మళ్ళీ శల్యుడితో ఇలా చెప్పాడు:

"తలచుకుంటే మనస్సుని నలిపేటంత బాధ కలిగించేవి రెండే రెండున్నాయి! అవి పరశురాముడి కోపమూ, బ్రాహ్మణుని శాపమూను! అవే లేకపోతే నేను కృష్ణార్జునుల్ని లెక్కచేస్తానా?

"నేను విలువిద్య నేర్చుకోవడం కోసం పరశురాముని ప్రార్థించేందుకు మహేంద్ర పర్వతానికి వెళ్ళాను. ఆ మహాముని దయాసముద్రుడు. నా విన్నపాన్ని మన్నించి, నా కులాన్ని గురించి అడిగాడు. బ్రహ్మాస్త్రం కోసమని నేను బ్రాహ్మణుడనని బొంకాను. ఆయన నమ్మాడు. నేను ఆయనను భక్తితో సేవిస్తూ వచ్చాను. నా సేవకు మెచ్చుకుని ఆయన బ్రహ్మాస్త్రం ఇచ్చి ఆపద సమయంలో తప్ప ప్రయోగించవద్దని చెప్పాడు. ఆ మరునాడు ఆయన నా తొడమీద తల పెట్టుకుని నిద్రపోతుంటే ఏదో పురుగు నా తొడ కింద చేరి తొలవడం ప్రారంభించింది! కదిలితే ఆ మహానుభావుడికి నిద్రాభంగం కలుగుతుందని అలాగే ఓర్చుకుని కూర్చున్నాను. తర్వాత కాసేపటికి ఆయన మేల్కొని నెత్తురు ప్రవాహం

చూసి, ఆశ్చర్యపడి నా వైపు చూశారు. నేను జరిగిన దంతా చెప్పాను. అది విని నా ఓర్పుకి, ధైర్యానికి ఆశ్చర్యపడి 'నువ్వు బ్రాహ్మణుడవు కావు. బ్రాహ్మణుడవైతే ఇంత ఓర్పుండదు. నువ్వెవరు? నిజం చెప్పు' అని గద్దించాడు. భయపడిపోయి శూద్రుడనని చెప్పేశాను. ఆయన కోపించి, 'కపటంగా బ్రహ్మాస్త్రం గ్రహించావు కనుక అది నీకు అవసరమైనప్పుడు స్ఫురించకుండా వుండుగాక' అని శపించాడు.

ఇంక బ్రాహ్మణశాపం సంగతి చెబుతా వినండి–

"ఒకనాడు నేను విలువిద్యా పరిశ్రమ చేసుకుంటుంటే హఠాత్తుగా ఒక ఆవుదూడ అడ్డం వచ్చింది! కర్మవశాన నా బాణం దెబ్బకు అది ప్రాణం విడిచింది. దాని యజమాని అది చూసి మండిపడ్డాడు. 'ఇది హోమధేనువు దూడ. నిష్కారణంగా దీన్ని శల్యంతో చంపావు. నువ్వు పొంగిపొరలే ఉత్సాహంతో పట్టుదలగా యుద్ధం చేసే సమయంలో నీ రథచక్రం భూమిలో దిగుబడుగాక! ఎవరిని ఎదుర్కొని చంపాలని ఇంత పరిశ్రమ చేస్తున్నావో వాళ్ళ చేతుల్లోనే నీకు చావు మూడుతుంది' అని శపించాడు.

'అయ్యా! పొరపాటున ఇలా జరిగిపోయింది. నీకు వెయ్యి ఆవులూ, ఆరు వందల ఎడ్లూ, వంద రథాలూ, వందమంది కన్యలూ, ఏడు వందల ఏనుగులూ ఇస్తాను. శాంతించి శాపం ఉపశమింప చెయ్యి' అని వేడుకున్నా ఆయన కోపం చల్లారలేదు. విసవిసా నాలుగడుగులు నడిచి, వెనక్కు తిరిగి, 'నువు చేసిన పాపం నిన్ను పరలోకంలో బాధించకుండా నీకిదే ప్రాయశ్చిత్తం అవుతుంది ఫో' అన్నాడు.

"ఉన్న సంగతి చెప్పేశాను. ఇవీ నన్ను బాధిస్తున్న శాపాలు" అన్నాడు కర్ణుడు.

చేవ లేక చచ్చాడని ఎవరూ అనుకోకుండా ఇప్పుడీ రాజులందరికీ ఈ శాపగాథలు చెప్పాడు కాబోలనుకుని శల్యుడు చిన్నగా నవ్వి రథాన్ని అర్జునుడివైపు మళ్ళించాడు. ●

# బుద్ధిహీనులు

'ఒక అడవిలో ఒకానొకప్పుడు ఒక మహర్షి తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన ఆత్మనిష్ఠ, సాధుతత్త్వం, సజ్జన స్వభావం ప్రభావాన అక్కడ ఉన్న జంతువులన్నీ పరస్పర వైరాన్ని మరచి కలసిమెలసి ఉండేవి. ఆశ్రమ ప్రాంతానికి వచ్చినప్పుడల్లా అవి మహర్షి దగ్గరకు వెళ్ళి ఆయన చుట్టూరా తిరిగి బుద్ధిగా ఆయన ముందు కాసేపు కూర్చుని వాటిదోవన అవి పోతుండేవి. ఇలా ఉండగా, ఒకసారి గ్రామాల్లో తిరిగే ఒక శునకం ఆశ్రమప్రాంతానికి వచ్చింది. వచ్చి అక్కడే ఉండిపోయింది. అది కూడా మహర్షిమీద అవ్యాజమైన అభిమానం పెంచుకుంది. ఇలా ఉండగా ఒకనాడు మంచి ఆకలిమీద ఉన్న చిరుతపులి ఒకటి ఆశ్రమప్రాంతానికి వచ్చి శునకాన్ని చూసి లొట్టలేసింది. అది చూసి శునకం భయపడి పరుగెత్తుకుంటూ వచ్చి మహర్షిని శరణువేడింది. గజగజ వణికిపోతున్న కుక్కకు మహర్షి అభయమిచ్చి దానిని కూడా చిరుతపులిగా మార్చేశాడు. ఈ అనూహ్య సంఘటనతో మొదటి చిరుత తోక ముడిచింది. దాంతో చిరుతరూపంలో ఉన్న గ్రామసింహానికి ఎక్కడలేని

ధైర్యం వచ్చి అడవంతా యథేచ్ఛగా తిరగడం ప్రారంభించింది. ఆ తరువాత కొన్నాళ్ళకు మళ్ళీ ఇలాగే జరిగింది. అడవిలోకి కొత్తగా వచ్చిన ఒక పెద్దపులి చిరుతరూపంలో ఉన్న శునకాన్ని భయపెట్టింది. అది గోలుగోలున ఏడుస్తూ మహర్షిదగ్గరకు వెళ్ళింది. మహర్షి దానిని కూడా వ్యాఘ్రంగా మార్చాడు. పెద్దపులిగా మారిపోవడంతో కుక్కకు అప్పటివరకూ ఉన్న సాత్విక స్వభావం, విశ్వాసం అన్నీ క్రమంగా సన్నగిల్లాయి. మాంసాహారానికి అలవాటుపడింది. కానీ తన సహజ లక్షణాల్లో ఒకటైన భయం మాత్రం కుక్కలో తొలగలేదు. ఇంకెప్పుడో ఒకసారి మదపుటేనుగును చూసి, మరోసారి సింహాన్ని చూసి భయపడితే మహర్షి కుక్కను కూడా ఏనుగుగా, సింహంగా మార్చేశాడు. అయితే, కుక్క ఎప్పుడైతే సింహంగా మారిందో అప్పటినుంచి అది భయంకరమైన క్రూరత్వాన్ని ప్రదర్శిస్తూ అడవిలోని జంతువుల్ని ఆశ్రమప్రాంతానికి రాకుండా చేసింది.



'ఇలా కొంతకాలం గడిచాక ఎనిమిది కాళ్ళు, నెత్తిమీద కళ్ళూ ఉండి, సింహ–గజాలు కలగలిసిన రూపంతో ఉన్న అతిభయంకరమైన శరభమృగం అడవినంతా చికాకుపరుస్తూ అక్కడకు వచ్చింది. మళ్ళీ కథ మామూలే. మహర్షి దయవల్ల కుక్క శరభంగా మారిపోయింది. దాన్నిచూసి మొదటి శరభం సత్తువకొద్దీ పరుగెత్తింది. శరభరూపంలో ఉన్న కుక్క అది చూసి విరగబడి నవ్వింది. ఇంక దానికి పట్టపగ్గాలు లేకుండాపోయాయి. దాని ప్రవర్తన పూర్తిగా మారింది. ప్రతి జంతువునూ హింసించేది. ప్రతి చిన్నప్రాణినీ భయపెట్టేది. అవి దీనంగా ఏడుస్తూ విలవిలలాడుతుంటే శరభరూపంలో ఉన్న కుక్క రాక్షసానందం అనుభవించేది. అలా ఉండగా, ఒకరోజు దానికో అనుమానం కలిగింది. 'ఈ మహర్షి ఇన్నాళ్ళూ నారూపాన్ని నేను కోరినట్టు మార్చాడు. అయితే, నాలాగే ఈయనను శరణుకోరి బతుకుతున్న జంతువులు అనేకం ఈ అడవిలో ఉన్నాయి. వాటికి కూడా నాలాగే ఎప్పుడో అప్పుడు ఏ ఆపదో ముంచుకొచ్చి ఈయనను శరణుకోరితే వాటిని కూడా మహర్షి పులిగానో, సింహంగానో, అంతకంటే ఇంకా ఏదైనా పెద్దజంతువుగానో మార్చవచ్చు. అప్పుడు నా గతేమిటి!?' అనుకుంది.

ఆలోచించగా దానికి ఒకటే మార్గం తోచింది. మిగిలిన జంతువులు వేటికీ తనలాంటి అదృష్టం పట్టకుండా ఉండాలంటే మహర్షిని హతమార్చడమే పరిష్కారం అనుకుంది. తనను చేరదీసి అన్నివిధాలా కాపాడుతూ వచ్చిన మహర్షి పట్ల దానికి కాస్తంతైనా విశ్వాసం లేకపోయింది. పైగా ఘాతుకానికి కూడా ఒడిగట్టింది.

'తనే అందరికన్నా అధికురాలిగా ఉండాలన్న స్వార్థం, తనకు కలిగినంత ఉన్నత స్థితి మరెవరికీ లభించకూడదన్న ఓర్వలేనితనం కుక్కను నిలువెల్లా ఆవహించి అసలు మహర్షినే అంతం చేయాలన్న హీనమైన ఆలోచనకు వచ్చింది. త్రికాలజ్ఞాని అయిన మహర్షికి శరభరూపంలో ఉన్న కుక్క మనసులోని చెడు ఆలోచన తెలిసిపోయింది. మరుక్షణంలో దానిని మునుపటి శునకరూపానికి మార్చేసాడు.'

ఈ కథ చెప్పి నారదుడు, "ధర్మరాజా! చూశావా? అందుకే అనర్హులు ఆదరణీయులు కారు. ఎవరికైనా ఏదైనా ఇచ్చేటప్పుడు వాళ్ళ వ్యక్తిత్వం అందుకు అర్హమా కాదా అన్నది చూడాలి. కులం చూసుకుని గుణగణాలు వదిలెయ్యకూడదు. **శౌర్యం, సత్యం, మంచిచెడుల విచక్షణ, వినయ విధేయతలు, భక్తిభావం, గాంభీర్యం కలిగిన మనిషి ఏ కులంవాడైనా అన్ని పదవులకూ అర్హుడే. వారి వారి స్వభావాన్ని అనుసరించి మనుష్యులలో ఉత్తమ, మధ్యమ, అధముల్ని నిర్ణయించుకుని వాళ్ళకు ఆయా పదవులు ఇస్తూ ఉండాలి.** నేర్పూ, సాహసం, భక్తి, సత్ప్రవర్తనా గల పరివారం

గనుక ఉంటే ప్రభువు లోకాలన్నీ ఏలగలడు. ప్రజల మనస్సులను గెలవగలడు" అని బోధించాడు.

రాజు మెత్తగా, మృదువుగా మాట్లాడాలి. తన మంత్రాంగాలేవీ బయటకు రానీయకూడదు. ఎక్కడికైనా ఏ క్షణాన్నయినా చొచ్చుకుపోగల చతురత కలిగిన వాళ్ళను పంపి శత్రువుల సంగతులు తెలుసుకుంటూ వుండాలి. ప్రభువు సూర్యుడిలా ప్రకాశించాలి.

"రాజుగారి ఆగ్రహానికీ, అనుగ్రహానికీ కూడా ఫలితం ఉండాలి. ఆదాయ వ్యయాలను సరిచూసుకుంటూ, ధనాగారాన్ని రక్షించుకుంటూ అప్రమత్తుడై ఉండటం రాజుల లక్షణం" అని నారదమహర్షి హితవు చెప్పాడు.

"ఒకరి సహాయం తనకు అక్కరలేదనే గర్వం లేక, ఎన్నడూ అలసత్వం లేకుండా ప్రవర్తించేవాడు అందరికంటే ఎక్కువ సుఖపడతాడు" అని ఒంటె కథ చెప్పాడు.

"పూర్వం ఒక ఒంటె బ్రహ్మదేవుడి గురించి చాలాకాలం తపస్సు చేసింది. చివరికి చతుర్ముఖుడు ప్రత్యక్షమయ్యాడు.

'మహానుభావా! నా మెడ నూరు యోజనాల పొడుగు పెరిగేటట్టు అనుగ్రహించండి' అని వరం కోరుకుంది.

'అలాగే' అని వరమిచ్చి విరించి అంతర్ధానమయ్యాడు.

వరం సంపాదించాననే గర్వంతో ఎవరి సహాయమూ కోరకుండా, ఎవరితోనూ కలిసి మెలిసి ఉండక, ఒంటరిగా, బద్ధకంగా, జడపదార్థంలా ఉంటూ ఉండేది ఒంటె. ఓసారి కదలకుండా పడుకుని తన పొడుగాటి మెడ సాచి అడవిలో ఒకచోట మేస్తోంది. అప్పుడే పెద్ద గాలీవానా వచ్చాయి. ఆ ఒంటె వెంటనే తన తలను ఒక గుహలో దూర్చి హాయిగా నిద్రపోయింది. ఇంతలో ఒక నక్క తన భార్యను వెంట పెట్టుకుని ఆ గుహలోకి వచ్చింది. రెంటికీ ఆకలి మండిపోతోందేమో ఎదురుగా వున్న ఒంటె మెడ అమృతంలా కనిపించింది.

ఆబగా కొరుక్కు తినడం ప్రారంభించాయి. ఒంటెకు నొప్పి కలిగి మెడ విదిలించేసరికి నక్కలు రెండూ ఇంకా గట్టిగా కొరికాయి. పాపం ఒంటె ఇంక మెడను వెనక్కి తీసుకునే అవకాశం లేక చచ్చి, ఆ నక్కలకు ఆహారమైంది. అందుకే అలసత్వం పనికిరాదు" అని ముగించాడు మహర్షి. ధర్మరాజు కృతజ్ఞతగా చేతులు జోడించాడు. ●

# హరహరమహాదేవ

**హి**మవత్ పర్వతం మీద కేళీవనంలో దేవదారు వృక్షాలను అల్లుకుని మల్లెతీగలూ, అచ్చర కన్నెల్లా దేవ మందారాలూ వున్నాయి. రంగురంగుల పూలచుట్టూ తుమ్మెదలు గంతులేస్తున్నాయి. తేనెలు తాగుతూ వినోదిస్తున్నాయి. దేవ గంధర్వ కన్యలు తనువు మరచి విహరిస్తున్నారు. ఆ మనోహర వనంలో శార్దూల చర్మధారియై, భుజంగాభరణుడై కూర్చుని వున్నాడు పరమేశ్వరుడు. కాసేపటికి పార్వతీదేవి వచ్చింది. తన్మయత్వంలో వున్న భర్తను చూసింది. మెల్లగా వెనక వైపునుంచి వెళ్ళి, తామరమొగ్గల వంటి చేతులతో మృదువుగా ఆయన కళ్ళు రెండూ మూసింది. వెంటనే లోకమంతా చీకట్లు కమ్మాయి. భూతాలన్నీ ఘోష పెట్టాయి. అప్పుడు శివుడు ఫాలనేత్రం తెరిచాడు. ఆ కంటిలోంచి పుట్టిన అగ్నిజిహ్వలు హిమవత్ పర్వతాన్ని కప్పేశాయి. పాపం పార్వతి భయపడిపోయింది. గజగజ వణికింది. కేళీవనంలో ఒంటరిగా విభుడు దొరికాడు కదా అని చిన్న సరస మాడబోతే ఇదేమి వైపరీత్యమని కంగారు పడింది. గభాలున ముందుకొచ్చి భర్త పాదాలపైన

పడింది. పరమేశ్వరుడు ఫాలనేత్రం మూసి కరుణ చూపడంతోనే మంచుకొండ మామూలుగా ప్రకాశించింది. భూతాలన్నీ శాంతించాయి. జగత్తంతా మళ్ళీ సుందరంగా కనిపించింది. "ప్రభూ! ఏమిటిదంతా! అసలు మీరు మూడోకన్ను ఎందుకు తెరిచారు? ఏమిటీ రహస్యం" అంబిక జరిగినదంతా చూసి ఆశ్చర్యపడుతూ అడిగింది.



"భవానీ! నీకు చెప్పకూడని రహస్యాలు ఏమున్నాయి" చిరునవ్వు నవ్వాడు శివుడు.

"మరి..."

"నేను లోకాత్ముడను. నాకు ఏ స్థితి కలిగితే లోకాలన్నిటికీ ఆ స్థితి కలుగుతుంది. నువ్వు నా కళ్ళు మూశావు. అందుచేత లోకాలన్నింటా కూడా చీకటి ఆవరించింది. కాని సుకుమారమైన నీ చేతులు తీసెయ్యగలనా? అందుకే నా కళ్ళమీద నీ చేతులు అలాగే వుంచుకుని, లోకాల చీకట్లు తొలగించడం కోసం ఫాలనేత్రం తెరిచాను. నేను మూడవకంటిని తెరవగానే శివుడు రుద్రుడయ్యాడనుకుని సృష్టి

గజగజలాడింది. అంతే" అన్నాడు.

చివురుటాకులా వణికిపోయిన పార్వతి తేలికగా నిట్టూర్పు విడిచింది. శివుడి కళ్ళల్లోకి చూస్తూ "స్వామీ! మీకు నాలుగు ముఖాలుండటానికి కారణం ఏమిటి?" అని అడిగింది.

"సుందోపసుందులనే రాక్షసులు ఇద్దరుండేవారు. మహా శౌర్య సంపన్నులు. శస్త్రాస్త్రాల వల్ల చావరు వాళ్ళు. వాళ్ళను చంపడం కోసం, యముడు లోకంలో వున్న అందమైన పదార్థాలన్నింటినుంచీ నువ్వుగింజంత సారాన్ని తీసుకుని ఒక అప్సరసను సృష్టించాడు. ఆమెకు 'తిలోత్తమ' అని పేరుపెట్టి నా దగ్గరకు తీసుకువచ్చాడు. ఆ అమ్మాయి నా చుట్టూరా ప్రదక్షిణం చేస్తుంటే 'ఈవిడ తప్పకుండా దైవకార్యం నెరవేరుస్తుంది' అనుకుంటూ ఆవిడ తిరిగిన దిక్కుకు ఒక్కొక్క ముఖం చొప్పున ధరించి ఆమెను పరీక్షించాను. అప్పటినుంచీ నాలుగు ముఖాలు వచ్చాయి" అన్నాడు.

"మరి ఈ కంఠంలో నలుపేమిటి?" అంది పార్వతి.

"దేవదానవులు అమృతం కోసం సముద్రమథనం చేసినప్పుడు హాలాహలం పుట్టింది. అది నేను తాగి వాళ్ళను రక్షించాను. ఆ విషాన్ని కంఠంలో దాచుకోడం వల్ల నలుపు కనబడుతోంది. అందుకే నన్నందరూ నీలకంఠుడని స్తుతిస్తారు."

"పినాకమంటే ప్రియమెందుకు మీకు?" మళ్ళీ అడిగింది భవాని.

"ఆదియుగంలో హణ్వుడనే మహర్షి వుండేవాడు. అతడు నిష్ఠతో తపస్సు చేస్తుంటే శరీరం మునిగిపోయేటంత పుట్ట పెరిగిందతనిమీద. ఆ పుట్టమీద వెదురు పుట్టింది. ఆ వెదురు మామూలు వెదురులా కాకుండా బ్రహ్మాండమైన పొడుగూ, వెడల్పూ పెరిగింది. కొంతకాలానికి బ్రహ్మ అతనికి ప్రత్యక్షమై కోరిన వరం ఇచ్చాడు. అతని మీద పెరిగిన వెదురు తీసుకుని లోకహితం కోరి దానితో రెండు ధనువులు చేశాడు. కొనముక్కతో గాండీవమనే వింటిని నిర్మించాడు. మొదటి రెండు విల్లుల్నీ నాకూ, శ్రీహరికీ యిచ్చి గాండీవాన్ని బ్రహ్మ తన లోకానికి తీసుకువెళ్ళాడు. ఆ ధనువే ఈ పినాకం. సృష్టికర్త కానుకగా యిచ్చిన వింటిని ప్రియంగా ధరిస్తాను కనుక నన్ను 'పినాకపాణి' అంటారు."

కథ వింటూ కలగంటూ ఆదమరిచింది పార్వతి. ●

# అక్షయపాత్ర

అనుద్యూతంలో కూడా ఓడిపోయాక అన్నమాట ప్రకారం పాండవులు రాజభోగాలన్నీ విడిచిపెట్టారు. నారచీరలూ, కృష్ణాజినమూ ధరించారు. కందమూల ఫలాలు తింటూ పన్నెండేళ్ళు అరణ్యవాసమూ, ఒక ఏడాది అజ్ఞాతవాసమూ చేయడానికి సంసిద్ధులయ్యారు.

ముఖాన్ని వస్త్రంతో కప్పుకుని పాండవాగ్రజుడు తరలిపోయాడు. ఇనుపదండేల్లా భయంకరంగా వున్న బాహువులు రెండూ పెద్దవిగా చాచి భీమసేనుడు బయల్దేరాడు. ఇసుక చల్లుతూ అర్జునుడు అన్నను అనుసరించాడు. ధూళి ధూసర శరీరుడై వెళ్తున్న నకులుణ్ణి సహదేవుడు తల వంచుకుని అనుసరించాడు. జుత్తు విరబోసుకుని రోదిస్తూ ద్రౌపది వెళ్ళింది.

అలా వెళ్తున్న వాళ్ళను చూసి-

"ఏమున్నా ఏం లేకపోయినా ఈ పరమదుష్టుడు దుర్యోధనుడి రాజ్యంలో

మాత్రం మనం వుండలేం. అసలు వాడే దుర్మార్గుడు. పైగా వాడికి జర, వ్యాధి, మృత్యువుల్లాగ కర్ణుడు, సైంధవుడు, శకుని తోడయ్యారు. ఇటువంటి పుణ్యపురుషుడు రాజ్యం చేస్తుంటే ఇంక ఈ దేశంలో ధర్మం ఏం నిలుస్తుంది కనుక! పదండి, మనం కూడా పాండవులతో వెళ్ళి వాళ్ళెక్కడుంటే అక్కడే వుందాం'' అని ఆక్రోశిస్తూ పౌరులంతా పాండవుల వెంట పరుగెత్తారు.

"నాయనలారా! సవతి సోదరుల కపటంవల్ల సర్వమూ పోగొట్టుకున్నాం. కందమూలాలు తింటూ అరణ్యవాసం చేయబోతున్నాం. మాతోపాటు మీరు కూడా కష్టపడటమెందుకు? మామీద అనుగ్రహముంచి వెనక్కి వెళ్ళిపోండి" అని పాండవులు బ్రతిమాలారు.

"ధర్మరాజా! నీవున్న అరణ్యమే మాకు శరణ్యం. ఆశ్రయించినవాళ్ళు శత్రువులైనా విడిచిపెట్టకూడదంటారు. అలాంటప్పుడు నీమీద భక్తి కలిగి నిన్నాశ్రయించిన మమ్మల్ని విడిచిపెట్టడం మీకు భావ్యమా?" అని ఒక వృద్ధ బ్రాహ్మణుడు ప్రశ్నించాడు. ఏం చేయాలో పాలుపోక ధర్మరాజు విచారగ్రస్తుడయ్యాడు. అప్పుడే శౌనక మహాముని అక్కడకు వచ్చాడు.

"మహాత్మా! అతిథులను, అభ్యాగతులనూ అర్చించడం గృహస్థులకు ధర్మమని మీకు తెలుసుకదా! అలాంటిది ఆశ్రయించి వచ్చిన వీరిని ఎలా ఉపేక్షించను?" అని ధర్మరాజు సంశయం వెల్లడించాడు.

"నాయనా! తపస్సువల్ల సాధించరానిది ఏదీ లేదు. అందుచేత నువ్వు నియమవంతుడవై తపస్సు చేసి నీ మనోరథం సఫలం చేసుకో" అని శౌనకుడు ధర్మరాజుకు తగిన సందేశ మిచ్చి ప్రయాణమయ్యాడు.

'శౌనక మహాముని చెప్పినట్టు తపస్సు చెయ్యాలి! కాని ఎవరి నుద్దేశించి తపస్సు చెయ్యాలి?' ఇంకో ధర్మసందేహం వచ్చింది ధర్మరాజుకు. వెంటనే ధౌమ్యులవారికీ సంగతి చెప్పాడు.

ధౌమ్యుడు చాలాసేపు ఆలోచించి "ధర్మరాజా! పూర్వం భూతజాలమంతా ఆహారం కోసం పరితపించింది. ఆ ఆర్తనాదాలు విని కమలబాంధవుడు కరుణతో కరిగిపోయాడు. ఉత్తరాయణంలో ప్రవేశించి ఉర్వీరసాన్ని గ్రహించాడు. దక్షిణాయనంలో ప్రవేశించి పర్జన్యుడై ఓషధులు సంగ్రహించాడు. రాత్రివేళల్లో చంద్రకిరణాల్లో వున్న అమృతంతో ఆ ఓషధులను తడుపుతూ అభివృద్ధిపరచాడు.

వాటిల్లోంచి అన్నం పుట్టి ప్రజా సంరక్షణం జరిగింది. అందుకే అన్నం ఆదిత్యమయమంటారు. పూర్వం రాజర్షులందరూ సూర్యభగవానుణ్ణి ప్రార్థించి అన్నం సంపాదించి ప్రజలందర్నీ ఆపదలపాలు గాకుండా కాపాడారు. పాండవాగ్రజా! ఆదిత్యుడు లోకానికి ఆధారమైనవాడు. త్రిమూర్తుల స్వరూపాలు అతనిలో ఉన్నాయి. ముల్లోకాలు అతని కనుసన్నల్లో సుఖంగా జీవిస్తున్నాయి. అతడు అంధకారాన్ని మింగి లోకానికి వెలుగును అందించే ప్రత్యక్షదైవం! కనుక నువ్వు కూడా ఆ కరుణామయుణ్ణి భజించి అతని అనుగ్రహం సంపాదించు" అని ధౌమ్యుడు కర్తవ్యం బోధించాడు. ధర్మరాజు ధౌమ్యుడు ఉపదేశించిన మంత్రాలను భక్తితో గ్రహించి తపస్సు చేశాడు. అతని జపానికి మెచ్చి తపనుడు ప్రత్యక్షమయ్యాడు.

"పాండునందనా! ఇదిగో ఈ తామ్రపాత్ర గ్రహించు. ఈ పన్నెండు సంవత్సరాలూ నీ వంటింట్లో ద్రుపదకుమారి వండిన కందమూలాలన్నీ అక్షయములైన నాలుగు రకాల ఆహార పదార్థాలవుతాయి" అని సూర్యభగవానుడు ధర్మరాజుకు అక్షయపాత్రను ప్రసాదించి అంతర్ధానమయ్యాడు. ధర్మరాజు అపరిమితానందంతో ఆ పాత్రను తీసుకుని పర్ణశాలకు తిరిగి వచ్చాడు. అప్పటినుంచి అక్షయపాత్ర వల్ల ద్రౌపదీదేవి అడిగినవారికి లేదనకుండా భోజనాలతో సంతృప్తులను చేస్తూ వుండేది. ●

# సేవకావృత్తి

దుర్యోధనుడితో చేసుకున్న ఒప్పందం ప్రకారం పాండవులు పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక ఏడాది అజ్ఞాతవాసం చేయాలి. అజ్ఞాతవాసం చేసే పన్నెండు నెలలూ తామెవరో ఎవరికీ తెలియకుండా గడపాలి.

ఆ ప్రకారం పన్నెండేళ్ళూ అరణ్యవాసం పూర్తిచేసి అజ్ఞాతవాసానికి బయలుదేరబోతుంటే పాండవుల పురోహితుడు ధౌమ్యుడు ధర్మరాజును సమీపించి సాంత్వన వచనాలు పలికాడు.

"నాయనలారా! మీరు వివేకవంతులు. మంచీ చెడూ తారతమ్యం తెలిసినవారు. ధైర్యంగా వుండి ఇకముందు చేయవలసిన కర్తవ్యాన్ని గురించి ఆలోచించండి. రోజులు ఎల్లకాలం ఒకేలా వుండవు. కష్టసుఖాలు ఎవరికైనా తప్పవు. రావణాసురుణ్ణి చంపడం కోసం శ్రీ మహావిష్ణువు దశరథుడి కొడుకుగా పుట్టి అరణ్యాలలో అష్టకష్టాలు పడలేదా? మీరు కూడా కాలం మనది కాదనుకుని ఈ

పన్నెండు నెలలూ కళ్ళు మూసుకుని మీ కార్యం నెరవేర్చుకోండి. మీకు సర్వశుభాలు కలుగుతాయి" అని దీవించాడు ధౌమ్యుడు.

ధౌమ్యుడికి పాదాభివందనం చేసి, అజ్ఞాతవాసానికి తగిన ప్రదేశాల గురించి చర్చించుకున్నారు పాండవులు. చివరకు 'మత్స్యదేశం' తమకు అనుకూలంగా వుంటుందని నిర్ణయించుకున్నారు.

ఆ దేశాన్ని విరాటరాజు పరిపాలిస్తున్నాడు. అతను గొప్ప బలశాలి. పైగా పాండవులంటే ఇష్టం. ధర్మ ప్రవర్తన కలిగినవాడు, వయసులో పెద్దవాడు. అందువల్ల విరాట రాజు కొలువులో తలదాచుకొని అజ్ఞాతవాసం చేయడం మంచిదనుకున్నారు.

విరాటుడి ఆస్థానంలో రాజోద్యోగి కంకుభట్టుగా ధర్మరాజు, వలలుడు అనే పేరుతో వంటవాడిగా భీమసేనుడు, విరాటరాజు అంతఃపుర స్త్రీలకు సేవ చేసి నవ్వించే నపుంసకుడిగా బృహన్నల వేషంలో అర్జునుడు, దామగ్రంథి అనే పేరుతో గుర్రపుశాలలో సేవకుడిగా నకులుడు, తంత్రీపాలుడు పేరుతో పశువుల కాపరిగా సహదేవుడు, విరాటరాజు అంతఃపురంలో పనిచేసే పరిచారికగా సైరంధ్రి వేషంలో ద్రౌపది పని చేయడానికి నిశ్చయించుకున్నారు.

అప్పుడు ధౌమ్యులవారు వారిని ఆశీర్వదిస్తూ సేవకావృత్తిలో వుండేవారు ఎలాంటి జాగ్రత్తలు పాటించాలో చక్కగా చెప్పారు. ఎవరికైనా, ఏనాటికైనా సరే పనికివచ్చే మంచి మాటలవి.

"రాజుగారి దగ్గర పనిచేయడానికి కుదిరేవాళ్ళు చాలా జాగ్రత్తగా వుండాలి. ఎక్కువ మాట్లాడకూడదు. రాజుగారి మనస్సు తెలుసుకుని పరిచర్యలు చెయ్యాలి. అడిగినప్పుడే సలహా ఇవ్వాలి. అడగనిదే ఏదీ చెప్పకూడదు. సమయం చూసి ఏలికను పొగడుతూ వుండాలి.

"ఏ చిన్న పని చేసినా రాజుగారితో చెప్పి చెయ్యాలి. **ప్రభువు నిప్పులాంటివాడు. మితిమీరిన స్నేహం పనికిరాదు. అదేమని నిర్లక్ష్యం చెయ్యకూడదు. ఎంతో నమ్మకంతో అధికారమిచ్చి, ఎంత చనువుగా మాట్లాడినా, ఎప్పటికప్పుడే పని నుండి తొలగించవచ్చునని భయభక్తులతో మెలగాలి.** అధినేత అనుగ్రహం వుంది కదా అని అతను కూర్చునే ఆసనం మీద కానీ, రథం మీద కానీ, ప్రయాణం చేసే వాహనం మీద కానీ ముందే ఎక్కి కూర్చోకూడదు. రాజుగారి దగ్గర పని చేసేవాడు సోమరి కాకూడదు. రాజువల్ల గౌరవం పొందినా, అగౌరవం పొందినా ఆ సంతోషం

కానీ, సంతాపం కానీ బయటకు కనిపించకూడదు.

రహస్యాలు బయటకు పొక్కనీయకూడదు. ప్రజల వద్దనుంచి లంచాలు పుచ్చుకోరాదు. తోటి ఉద్యోగుల్ని చూసి అసూయపడకూడదు. రాజు ఒక్కోమారు తెలివిగల వాళ్ళనీ, బుద్ధిమంతుల్నీ వదిలేసి మూఢుల్నీ, తెలివితక్కువవాళ్ళనీ పెద్ద పెద్ద పదవులలో నియమించవచ్చు. అది చూసి బాధపడకూడదు. అంతః పురాంగనలతో అతిజాగ్రత్తగా వ్యవహరించాలి. వాళ్ళతో స్నేహం మంచిది కాదు" అని ధౌమ్యుడు రాజసేవకుల కష్టసుఖాలు తెలియచెప్పాడు.

"అబ్బాయిలూ! ఓర్పు వహించి నేను చెప్పిన విషయాలన్నీ మనసులో పెట్టుకుని విరాటుని దగ్గర ఒక ఏడాదిపాటు కాలం వెళ్ళదీసి రండి. తరువాత మళ్ళీ మీ రాజ్యం మీకు వస్తుంది. సుఖంగా వుందురుగాని" అని పాండవులను దీవించి పంపాడు.

పెద్దవాళ్ళ దగ్గర ఎలా మసలుకోవాలో వ్యాసుల వారు ఈ కథ ద్వారా మనకు తెలియచెప్పారు. ●

# గోవుమాలక్ష్మికి కోటి దండాలు

నృగ మహారాజు ఎన్నో పుణ్యకార్యాలు చేశాడు. ఆయన నిరంతరం గోదానం చేసేవాడు. నవనీతం వంటి హృదయం ఆయనది. ఎవరికీ ఏ కష్టం కలగకుండా ప్రజలను పాలించేవాడు. ఓసారి ఆయనవల్ల ఒక చిన్న పొరపాటు జరిగింది. ఒకరికి దానం చేసిన గోవునే మళ్ళీ ఇంకో బ్రాహ్మణుడికి దానమిచ్చాడు. గోవు నాదంటే నాదని ఆ విప్రులిద్దరూ తగవులాడుకున్నారు. చివరికి రాజుగార్నే అడుగుదామనుకుని ఆ యిద్దరు బ్రాహ్మణులూ నృగమహారాజు దగ్గరకు వెళ్ళారు. వాళ్ళ తగాదా విని రాజుగారు విచారపడ్డాడు. తనవల్ల జరిగిన పొరపాటు తెలుసుకున్నాడు. "అయ్యా! దీన్ని ముందు మీకిచ్చినమాట నిజమే. ఇది మా ఆవులలో కలిసి మేస్తుంటే మాదేననుకుని గోపాలకులు తీసుకువచ్చారు! తెలియక నేను దాన్ని మళ్ళీ ఈయనకు దానమిచ్చాను. పొరపాటుకు క్షమించండి. మీకు మంచి గోవులు నూరువేలిస్తాను. ఈ ఆవును ఆయనకు ఇచ్చేయండి" అన్నాడు మొదటి బ్రాహ్మణుడితో.

“మహారాజా! ఇది చాలా శ్రేష్ఠమైన ఆవు. నా కుమారుడు పాలకు ఎప్పుడు ఏడిస్తే అప్పుడు పాలు తీసుకోనిస్తుంది. అంత మంచి స్వభావం దీనిది! ఈ ఆవు నా ఇంట్లో లక్ష్మిలా ఉంటే నాకు సంతోషం కాని, నువ్వు కోటి గోవులిచ్చినా తీసుకోను నేను” అని వెళ్ళిపోయాడా బ్రాహ్మణుడు.



“అయ్యా! మీరు కోరినన్ని రత్నాలూ, మణులూ, గోవులూ ఇస్తాను. ఈ ఆవును ఆయన కివ్వండి” అని మహారాజు రెండవ బ్రాహ్మణుణ్ణి వేడుకున్నాడు.

“ఈ ఆవు తప్ప నాకు నీ రాజ్యమంతా ధారపోసినా అక్కర్లేదు” అంటూ మొండిగా ఆ ఆవును తీసుకుని వెళ్ళిపోయాడతను.

కొన్నాళ్ళు గడిచాక నృగ మహారాజు కాలంచేశాడు. యమభటులు యమధర్మరాజు దగ్గరకు తీసుకువెళ్ళారు.

“మహారాజా! ఎన్నో పుణ్యకార్యాలు చేశావు. కాని ఒకరి కిచ్చిన గోవునే మరొకరికి దానమిచ్చి పొరపాటు చేశావు. విప్రుని మనసు కలతపెట్టావు. అందుచేత

కొంచెం పాపం సంప్రాప్తించింది. ముందు పాపం అనుభవిస్తావా? పుణ్యం అనుభవిస్తావా?" అని యముడు ప్రశ్నించాడు.

"పాపమే అనుభవిస్తాను" అన్నాడు. వెంటనే తలక్రిందుగా భూమిమీద పడ్డాడు. పడుతూ పడుతూ ఉండగా-

"రాజా! విచారించకు. కొన్నాళ్ళయ్యాక వాసుదేవుడు వచ్చి నిన్ను ఉద్ధరిస్తాడు. అప్పుడు నీకు శాశ్వత సౌఖ్యం కలుగుతుంది" అన్నాడు యమధర్మరాజు.

నృగుడు భూమిమీద తొండ రూపంలో తిరగసాగాడు. చాలారోజులు గడిచాక ఒకనాడు విధివశాత్తు ఒక నూతిలో చేరాడు. ఆ నూతిలోకి వచ్చిన మరుక్షణంలోనే అతని శరీరం విపరీతంగా పెరిగిపోయింది. యమధర్మరాజు అనుగ్రహం వల్ల అతనికి పూర్వజన్మ స్మృతి ఉంది. తనను చూసుకుని తానే ఆశ్చర్యపడ్డాడు.

నూతి దగ్గరకు వచ్చిన ప్రజలు ఆ తొండను చూసి, 'ఇది ఇందులో ఉంటే నీళ్ళు పాడైపోతాయి' అనుకుని పెద్దపెద్ద తాళ్ళు తెచ్చి దానికి కట్టి పైకి లాగబోయారు.

కానీ అది కదిల్తేగా! వాళ్ళకు భయం, ఆశ్చర్యం కూడా కలిగాయి. గబగబ వెళ్ళి సంగతంతా కృష్ణభగవానుడితో చెప్పారు. ఆయన వెంటనే ఆ నూతి దగ్గరకు వెళ్ళి ఆ తొండను బయటకు తీశాడు. అప్పుడు నృగుడు దివ్యరూపం ధరించి ఉత్తమ లోకాలకు వెళ్ళిపోయాడు.

"కృష్ణస్పర్శ వలన నృగుడికి ఉత్తమగతి కలిగినట్టే సజ్జనసాంగత్యం వల్ల సర్వసుఖాలు కలుగుతాయి'' అని మాంధాతృడికి బృహస్పతి చెప్పినట్టు మహాభారతంలో ఉంది.

దేవతలకు అమృతాన్ని ఆహారంగా ఇచ్చాడు బ్రహ్మ. ఆ అమృత పరిమళం లోంచి సురభి అనే ఆవు పుట్టింది. దాని సంతానం సౌరభేయులు. ఆ ఆవులన్నీ ఒకనాడు హిమవత్పర్వతం మీద సంచరిస్తూ ఉండగా ఒక దూడ తల్లి దగ్గరకు వెళ్ళి పాలు తాగడం మొదలుపెట్టింది. అప్పుడా పాలనురుగు గాలికి చెదిరి అక్కడే తపస్సు చేసుకుంటున్న ఈశ్వరుడి శిరస్సు మీద పడింది. ఆయన కోపగించుకుని మూడోకన్ను తెరిచాడు. ఆ కంటి మంటల వేడి సోకి ఆ ఆవుల శరీరాలకు కపిలవర్ణం వచ్చింది. దాంతో అవన్నీ భయపడి అక్కడినుంచి పారిపోయాయి.

అప్పుడు బ్రహ్మ వచ్చి పరమేశ్వరుణ్ణి ప్రార్థించి ప్రసన్నుణ్ణి చేశాడు. ఒక మంచి ఎద్దును కానుకగా ఇచ్చాడు. అప్పటినుంచీ ధూర్జటికి నంది వాహనమైంది.

శివుడి ధ్వజం మీద కూడా వృషభచిహ్నం ఉంటుంది.

శివుడు ప్రసన్నుడు కావడంతో ఆవులన్నీ మళ్ళీ ఆ పర్వతం మీదకు వచ్చాయి. వాటిని చూచి అవి సర్వత్రా సంచరించగలవిగానూ, మిగిలిన గోవులకంటే ఆ కపిల గోవులకు ఉత్తమత్వం కలిగేటట్టుగాను వరమిచ్చాడు శివుడు.

ఈనాటికీ గోవుల్ని లక్ష్మీస్వరూపాలుగా ఆరాధించటం, గోపంచకాన్ని పవిత్రమయినదిగా భావించటం జరుగుతోంది. భోజనం చేసే ముందు గోవులకు గుప్పెడు పచ్చిక వేస్తే కొండంత పుణ్యమని మనవాళ్ళు భావిస్తారు. ●

# సువర్ణష్ఠీవి

ఒకనాడు సృంజయ మహారాజు కొలువు కిటకిటలాడుతోంది. ఎత్తయిన సింహాసనం మీద నారదమహర్షి కూర్చుని ఉన్నాడు. మహారాజుతో పాటు రాజపురోహితులందరూ ఆ మహర్షిని భక్తిశ్రద్ధలతో పూజించారు.

"మునీంద్రా! మహారాజు మీకు కావలసినవాడు. పైగా ధర్మపరుడు. నిరంతరం అన్నదానాలు చేస్తూ వుంటాడు. మీలాంటి పెద్దల అనుగ్రహం ఉండి కూడా ఆయన కోరిక తీరకపోవడం భావ్యమా?" అని ఒక బ్రాహ్మణుడు నారదుణ్ణి వినయంగా ప్రశ్నించాడు.

"అలాగా! ఆ సంగతి నాకు తెలీదు. మహారాజా! ఏమిటి మీ దిగులు! ఇన్నాళ్ళూ నాకు ఎందుకు చెప్పలేదు?" అని నారదుడు అడిగాడు.

"మహర్షీ! మరేంలేదు. గుణవంతుడూ, రూపవంతుడూ అయిన కొడుకు కావాలి నాకు" అన్నాడు సృంజయ మహారాజు.

"అంతే కదా!"

"అంతేకాదు స్వామీ! వాడి మలమూత్రాలు, చెమట, కన్నీళ్ళు, లాలాజలం అంతా బంగారం కావాలి. అలాంటి కొడుకు కావాలి. ఈ వరం నాకు ప్రసాదించండి."

నారదుడు అనుగ్రహించాడు.

సృంజయ మహారాజు పొంగిపోయాడు. సార్వభౌముడై భూమినంతటినీ ఏలుతున్నా సంతానం లేని దిగులు ఇన్నాళ్ళూ ఆయనను వేధించింది. ఇప్పుడది లేదు. మహాముని వరం వల్ల ఆ కోరిక కూడా తీరబోతోంది. రాజు పరమానందభరితుడయ్యాడు.

మహర్షి మాట ప్రకారం కొన్నాళ్ళకు కొడుకు పుట్టాడు. వాడికి 'సువర్ణష్ఠీవి' అని సృంజయుడు పేరు పెట్టాడు. అతి గారాబంగా వాడ్ని పెంచుకున్నాడు. వాడి వల్ల లభించే బంగారంతో కోట మొదలు పీట వరకూ అన్ని వస్తువులూ బంగారుమయం చేసి వైభవంగా ప్రకాశించాడు.

అలా కొంతకాలం గడిచింది.

ఒకరోజు కొందరు దొంగలు అంతఃపురంలో ప్రవేశించి సువర్ణష్ఠీవిని అపహరించుకుపోయారు. దూరంగా ఒక అడవికి తీసుకువెళ్ళి, అతని కడుపులో బంగారం ఉంటుందనుకుని వాడి పొట్ట చీల్చి చూశారు. మాంసం, ఎముకలు, నెత్తురు తప్పితే ఇంకేం కనిపించలేదు.

అందులో బంగారం లేకపోయేసరికి ఆ శవాన్నక్కడే పారేసి వెళ్ళారు దొంగలు.

తెల్లవారాక సృంజయుడు కొడుకు కోసం అంతఃపురమంతా వెతికించాడు.

కనిపించకపోయేసరికి కంగారుపడి నేల నాలుగు చెరగులకూ సేవకుల్ని పంపాడు. చివరకు అడవిలో కొడుకు శవం చూసి బావురుమని ఏడ్చాడు. మృతదేహానికి అంత్యక్రియలు జరిగాక కూడా వాణ్ణే తలుచుకుని కుమిలి కుమిలి రోదించసాగాడు.

సరిగ్గా అదే సమయంలో మళ్ళీ నారదులవారు వచ్చారు. "మహారాజా! నువ్వు ఏడిస్తే మాత్రం చనిపోయిన నీ కొడుకు ప్రాణంతో తిరిగి వస్తాడా? కాలాన్ని తప్పించుకోవాలనుకోవడం అవివేకం. గుణవంతుడు, రూపసి అయిన కొడుకును కోరుకున్నావు. బాగానే వుంది. అంతటితో ఆగక వాడేది ముట్టుకుంటే అది బంగారపు ముద్ద కావాలంటివి! మనిషికి ఆశ ఉండవచ్చు కాని పేరాశ వుండకూడదు. ఉంటే

ఇదిగో ఫలితం ఇలాగే ఉంటుంది" అని ఓదారుస్తూనే దేవర్షి మెత్తగా మందలించాడు.

వైభవంగా రాజ్యాన్ని పాలించి, దానధర్మాలు చేసి, పుణ్యాత్ములుగా పేరుపొంది, దేవతల ఆశీస్సులందుకుని కూడా చిరంజీవులు కాలేకపోయిన మరుత్త మహారాజు, అంగరాజు, శిబిచక్రవర్తుల చరిత్రలు వివరించాడు. ఆ తర్వాత శ్రీరామచంద్ర ప్రభువు గురించి, భగీరథుడి గురించి, శశిబిందుడి గురించి రకరకాల కథలు చెప్పాడు నారదుడు.

"మునీంద్రా! నువ్వు చెప్పిన కథలన్నీ విన్నాక నా పుత్రశోకం తగ్గింది. నీ దయవల్ల నా మనస్సు నిర్మలమయింది'' అని సృంజయుడు నారదుడికి నమస్కరించాడు.

నారదుడు సంతోషించి, "నీకేం వరం కావాలో అడుగు ఇస్తాను" అన్నాడు.

"దేవా! నువ్వు ప్రసన్నుడవయ్యావు! ఇంతకంటే కావల్సిందేముంది నాకు?" అన్నాడు వినయంగా మహారాజు.

"సృంజయా! దొంగల మూర్ఖత్వానికి బలైపోయిన నీ కొడుకును మళ్ళీ నీకు తెచ్చి ఇస్తాను. శోకం మానెయ్యి" అన్నాడు నారదుడు.

ఆ దీవెనతో సువర్ణష్ఠీవి సజీవంగా చిరునవ్వు నవ్వుతూ కళ్ళెదుట కనిపించాడు. కొడుకుని చూసి బ్రహ్మానందపడిపోయాడు సృంజయుడు.

తర్వాత సువర్ణష్ఠీవి వివాహం చేసుకుని, సంతానవంతుడై భోగభాగ్యాలు అనుభవిస్తూ, యాగాలు చేస్తూ, దానాలు చేస్తూ చాలాకాలం సుఖంగా వున్నాడు. ●

# అసూయ

బృహస్పతీ, సంవర్తుడూ అన్నదమ్ములు. ఇద్దరూ బాగా చదువుకున్నారు. సంవర్తుడు మాట మంచితనంతో అందర్నీ ఆకర్షించేవాడు. ఆ కారణంచేత తమ్ముడిమీద బృహస్పతికి అసూయ ఏర్పడింది. తరచు సంవర్తుడికి అనేక ఉపద్రవాలు తెచ్చిపెడుతూ ఉండేవాడు. వాటికి తట్టుకోలేక అతను పాపం పిచ్చివాడిలా తిరుగుతూ వుండేవాడు.

ఒకసారి ఇక్ష్వాకు వంశానికి చెందిన మరుత్తుడు ఒక పెద్దయాగం చేయాలని సంకల్పించాడు. ఆ యాగానికి ఆధ్వర్యం వహించడానికి దేవగురువు అయిన బృహస్పతిని పిలిచాడు. ఆ యాగం చేయడంవల్ల మరుత్తుడు దేవతలకంటే ఎక్కువ మహిమలు పొందుతాడనే భయంవల్ల యాగనిర్వహణకు బృహస్పతి రానని చెప్పాడు. అప్పుడు మరుత్తుడు సంవర్తుణ్ణి ఆ యాగం జరిపించమని వేడుకున్నాడు. అతను ఒప్పుకున్నాడు. దీనితో బృహస్పతికి తమ్ముడిమీద మరింత ఈర్ష్య పెరిగింది.

సంవర్తుడు యాగం చేయిస్తున్నాడే అన్న ఈర్ష్య మనసులో పెట్టుకోవటం వల్ల బృహస్పతి చిక్కిశల్యమైనాడు. మనిషి పాలిపోయాడు. ఇంద్రుడు బృహస్పతి దగ్గరకు వచ్చి "స్వామీ! మీరెందుకిలా రోజు రోజుకు నీరసించి చిక్కిపోతున్నారు? మీ కష్టమేమిటి?" ఆత్రంగా అడిగాడు.

బృహస్పతి దుఃఖపడుతూ "సంవర్తుడు గొప్ప యాగం చెయ్యబోతున్నాడు. అందువల్ల నాకు ఈర్ష్య, దిగులు పట్టుకొన్నాయి. వాటి వల్ల ఇలా మారిపోయాను" అన్నాడు.

అది విని ఇంద్రుడు ఆశ్చర్యచకితుడైనాడు. "స్వామీ! అన్నీ తెలిసిన విజ్ఞులు మీరు. దేవతలంతటివాళ్ళకు పురోహితులుగా వుండి హితబోధలు చేస్తున్నారు. సంవర్తుడి వల్ల మీకు రాబోయే నష్టమేముంది? ఏం లేదే! అనవసరంగా ఈర్ష్య పెట్టుకుని ఎందుకు ఆరోగ్యం పాడుచేసుకుంటారు?"

"నీ శత్రువు వృద్ధిలోకి వస్తున్నాడంటే నువ్వు చూస్తూ వూరుకుంటావా? నేనూ అంతే! ఏ విధంగానైనా సరే సంవరుణ్ణి పడగొట్టి, ఆ యాగం నిలుపుచేసి, నా ఖేదాన్ని పోగొట్టు" అని బృహస్పతి ఇంద్రుణ్ణి వేడుకున్నాడు.

అప్పుడు ఇంద్రుడు అగ్నిదేవుణ్ణి పిలిచి, "నువ్వు వెళ్ళి ఎలాగైనా సరే మరుత్తుడు చేస్తున్న యాగం నిలుపుచేసి రావాలి" అని చెప్పాడు.

అగ్నిదేవుడు బయలుదేరాడు. మరుత్తుడి దగ్గరకు పోయి దేవతాస్వరూపంతో నిలబడి "రాజా! నీవీ సంవర్తుణ్ణి వదిలిపెట్టు. అవసరమైతే నీకు పౌరోహిత్యం జరపడానికి బృహస్పతిని తీసుకువస్తాను" అన్నాడు.

ఈ మాటలు సంవర్తుడు విన్నాడు.

"అనవసరంగా జోక్యం చేసుకోకు. నాకు కోపం వస్తే నా కంటి జ్వాలలతో నిన్ను నాశనం చెయ్యగలను జాగ్రత్త!" అని అగ్నిదేవుణ్ణి హెచ్చరించాడు సంవర్తుడు.

**అన్నింటినీ భస్మం చేసే అగ్నిహోత్రాన్ని కూడా బ్రహ్మచర్యం వల్ల పుట్టిన శక్తి భస్మీపటలం చేస్తుంది. బ్రహ్మచర్యం అంత గొప్పది.** ఈ సంగతి అగ్నిదేవుడికి తెలుసు. భయపడి పారిపోయి జరిగిన కథంతా ఇంద్రుడికి చెప్పాడు. దేవరాజు అది నమ్మలేదు.

"అగ్నిదేవా! నీవీ లోకమంతటినీ కాల్చగలిగినవాడివి. అలాంటి నిన్నే భస్మం చేయగల శక్తి మరొకరికి వుందా?" అన్నాడు ఇంద్రుడు.

"అదికాదు, దేవేంద్రా! బ్రహ్మబలం, బ్రహ్మచర్య శక్తి నీకు తెలీవు" అని అగ్నిదేవుడు చెప్పి, ఇంద్రుడు బ్రాహ్మణ ప్రభావంవల్ల పొందిన పరాభవాలన్నీ జ్ఞాపకం చేశాడు.

దానితో ఇంద్రుడికి కోపం వచ్చి ఓ గంధర్వుణ్ణి పిలిచి మరుత్తుడి యాగాన్ని భగ్నం చెయ్యమని ఆదేశించాడు. ఆ గంధర్వుడు మరుత్తరాజు దగ్గరకు వెళ్ళి "రాజా! నువు సంవర్తుణ్ణి వదిలేశావా సరేసరి, లేదా నిన్ను పగవాడుగా ఎంచుకుని దేవేంద్రుడు నీమీద కక్ష సాధిస్తాడు" అని చెప్పాడు.

"మిత్రద్రోహం మహాపాపం! నేను సంవర్తుణ్ణి విడిచిపెట్టటమూ అంతే! ఏది ఏమైనాసరే అతణ్ణి నేను విడిచిపెట్టేది లేదు" అని చెప్పాడు మరుత్తుడు.

''రాజా! నీ మీదకి ఇంద్రుడు వజ్రాయుధం ప్రయోగిస్తే ఎలా తప్పించుకోగలవు?'' అడిగాడు గంధర్వుడు.

ఇలా అడిగాడో లేదో–ఆకాశంలో మేఘాలు పెద్దపెట్టున ఉరిమాయి. ఇంద్రుడు వజ్రాయుధం ప్రయోగించాడు. ఫెళఫెళ ధ్వనులు పుట్టాయి. మరుత్తుడు భయపడ్డాడు. సంవర్తుణ్ణి శరణు వేడుకున్నాడు.

సంవర్తుడు కోపగించి ఇంద్రుడి బలాన్ని తన తపశ్శక్తితో నిలువరించటంతో ఇంద్రుడు అణగి శాంతరూపం ధరించాడు. యాగానికి హాజరై యాగఫలాలనూ, హవిస్సునూ స్వీకరించాడు.

బృహస్పతి అసూయవల్ల జరిగిందేమీ లేదు. అతడి పగ వృథా అయింది. బ్రహ్మచర్యానికే విజయం లభించింది ●

# దండనీతి

**బా**హుదా నదీతీరంలోని ఒక ఆశ్రమద్వారంలో కూర్చుని పళ్ళు ఆరగిస్తున్నాడొక మునికుమారుడు. అప్పుడే ఆశ్రమానికి వచ్చిన శంఖుడు "తమ్ముడూ! లిఖితా! ఈ ఫలాలు ఎక్కడివిరా?" అని అడిగాడు.

"అన్నయ్యా! నువ్వు లేనప్పుడు నీ ఆశ్రమంలోకి వెళ్ళి కోసుకొచ్చానీపళ్ళు" అని లిఖితుడు నిజం చెప్పాడు.

"తప్పు కదూ! అనుమతి లేకుండా కోస్తే దొంగతనం చేసినట్టే. నీకు ఆ పాపం అంటింది. మహారాజు దగ్గరకు వెళ్ళి దండన అనుభవించి పాపం పోగొట్టుకో" అన్నాడు శంఖుడు.

లిఖితుడు గబగబ రాజువద్దకు పరుగెత్తాడు. తాపస కుమారుని రాక గురించి తెలియగానే సుద్యుమ్న మహారాజు ఎదురేగి అపూర్వమైన పూజలు చేశాడు.

"మహారాజా! ఈ పూజలకు నేను అనర్హుణ్ణి. నేను మా అన్న ఆశ్రమంలోకి

వెళ్ళి అతని అనుమతి లేకుండా అక్కడ చెట్లకు వున్న పళ్ళు భుజించాను. కనుక నేను దొంగను. నన్ను దండించు. రాజదండన పొందినవాడికి యమదండన ఉండదని మా అన్న చెప్పాడు" అన్నాడు లిఖితుడు.

మహారాజూ, మంత్రులూ ఎందరు ఎంతగా నచ్చచెప్పినా లిఖితుడు తన పట్టు వదల్లేదు.

చివరికి సుద్యుమ్న మహారాజు దండనీతిని అనుసరించి లిఖితుడి రెండు చేతులూ తెగ్గొట్టించాడు. లిఖితుడు సంతోషించి రాజును దీవించి అన్న దగ్గరకు పరుగెత్తాడు.

శంఖుడు తమ్ముడి మొండిచేతులు చూసి, "నాయనా! మంచిపని చేశావు. నీవల్ల కులమంతా వెలిగింది. వెళ్ళి బాహుదానదిలో మునుగు.

"కల్లు తాగడం, గురువుగారి భార్యను ఆశించడం, విప్రుణ్ణి చంపటం, విప్రుని ధనం అపహరించడం– ఈ చతుర్విధ పాపాలూ చేసేవాళ్ళతో కలిసి తిరగడం మహాపాతకాలు. నువ్వు రాజదండన పొందావు, పుణ్యాత్ముడవు. వెళ్ళు" అన్నాడు.

లిఖితుడు వెళ్ళి బాహుదానదిలో మునిగాడో, లేదో అతని చేతులు యథాప్రకారం మొలిచాయి. ఆశ్చర్యంతో అన్న దగ్గరకు పరుగెత్తాడు.

"తమ్ముడా! నువ్వు పునీతుడవయ్యావు కనుక భగవంతుడు కరుణించాడు. నా తపశ్శక్తి నీకు మళ్ళీ చేతులు వచ్చేందుకు దోహదం చేసింది. సక్రమంగా దండనీతిని అనుష్ఠించడం వలన సుద్యుమ్నుడు కూడా ధన్యుడయ్యాడు" అన్నాడు శంఖుడు. లిఖితుడు పరమానంద భరితుడయ్యాడు.

"కనుక ధర్మరాజా! నువ్వు కూడా అలాగే దండనీతిని అనుసరించి రాజ్యపాలన చెయ్యి. అంతేకాని యుద్ధంలో జ్ఞాతులందరినీ చంపుకున్నానని పదేపదే ఎందుకు బాధ పడతావు? రాక్షసులు దేవతలకు జ్ఞాతులు కారా? మరి వాళ్ళను చంపేగా దేవతలు వృద్ధి పొందారు! బలశౌర్యాలతో రాజ్యం సంపాదించి యజ్ఞయాగాలు చేసి, పర్జన్యాదిదేవతలను తృప్తి పొందించడం రాజుల ధర్మమని వేదాలు చెబుతున్నాయి.

"శాంతం, ఉత్తమశీలం గల రాజు సౌఖ్యం పొందుతాడు. **రాజు, అమాత్యుడు, రాష్ట్రం, దుర్గం, కోశాగారం, స్నేహితులు, బలం అనే ఏడింటినీ ప్రకృతులంటారు. సప్తాంగాలని కూడా పిలుస్తారు. వీటికి హాని రాకుండా ప్రభువు**

**చూసుకోవాలి.** సత్ప్రవర్తన కలిగివుంటేనే అది సాధ్యపడుతుంది. వీటన్నిటికీ రక్ష దండనీతి. దుష్టశిక్షణ, శిష్టరక్షణ అవసరం.

"రాజు అతి మృదువుగా వుంటే మావటివాడు ఏనుగు నెక్కినట్టు ప్రజలు నెత్తికెక్కి కూర్చుంటారు. క్రూరుడైతే అందరూ తిడతారు. కనుక మార్దవం, కాఠిన్యం సమపాళ్ళలో ఉండాలి. రాజధర్మాల్లో ఇది చాలా ముఖ్యమైనది. తపస్సు, బ్రహ్మచర్యం రాజులకు పనికిరావు. యుద్ధానికి వెనుదీయడం, ప్రజలను రక్షించకపోవడం రాజులకు పాపాన్ని కలుగచేస్తాయి. ఎందుకు నువ్విలా అపమార్గంలో పడిపోతున్నావు?" అంటూ వ్యాసమహర్షి కురుక్షేత్ర సంగ్రామ బీభత్సానికి తల్లడిల్లిపోయిన ధర్మరాజును ఓదార్చి, మానసిక స్థైర్యాన్ని కలిగించాడు. ●

# గోరువంక తెలివి

అది రాజప్రాసాదం.

బ్రహ్మదత్త మహారాజు అంతఃపుర ప్రాంగణం.

ఎక్కడినుంచో ముక్కుతో తియ్యని పళ్ళు ఏరుకుని రివ్వు రివ్వున వస్తోంది గోరువంక. అంతఃపురంలో అందరికీ అదంటే ప్రేమ. దానికి రాజకుమారుడంటే ప్రాణం. ఇద్దరూ ఆట పాటలతో కాలం గడుపుతారు. గోరువంక ఈ మధ్యనే ఒక పిల్లను కూడా పెట్టింది. ఆ పిల్లకోసం పళ్ళు తెచ్చి, వాటిల్లో మంచివి ఏరి రాజకుమారుడికి ఇస్తుంది. అతను కూడా గోరువంక పిల్లతో ముద్దుగా ఆడుకుంటూ ఉంటాడు. 'తియ్యనిపళ్ళు యువరాజుచేత తినిపించాలి' అనుకుంటూ గోరువంక గబగబ వచ్చింది. అక్కడి దృశ్యం చూసి కొయ్యబారిపోయింది. కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

ముక్కున వున్న పళ్ళు జారి కిందపడ్డాయి.

'అయ్యో! ఈ రాజకుమారుడు ఎంత కృతఘ్నుడు! ఎప్పుడూ నేను తెచ్చిన పళ్ళు తింటూ నా బిడ్డతో కలసిమెలసి తిరుగుతూ ఆడుకుంటూ వుండేవాడు–ఎంత నిర్దయగా ఈ రోజు నా బిడ్డ గొంతు నులిమి చంపేశాడు! నా పసికూనను చంపడానికి వీడికి చేతులెలా వచ్చాయో? అయినా నా వెర్రికానీ వీడు రాచబిడ్డడు కదూ! ప్రభువులకు దయ ఏమిటి? దాక్షిణ్యం ఏమిటి? స్నేహం విలువ వాళ్ళకేం తెలుసు! వట్టి క్రూరులు! చేసిన ఉపకారం మరచిపోయే అహంభావులు. ఇలాంటివాళ్ళతో స్నేహం చేయడం నాదే తప్పు' అనుకుంటూ బిడ్డ మృతదేహం మీద పడి పెద్దగా ఏడ్చింది గోరువంక.

మళ్ళీ అంతలోనే పౌరుషం తెచ్చుకుని, 'ఈ అన్యాయానికి నేను పగ తీర్చుకోవాలి' అనుకుని అక్కడే నిలబడి వున్న రాకుమారుడి కనుగుడ్లు రెండూ గోళ్ళతో పీకి తటాలున పైకెగిరింది. తరువాత బ్రహ్మదత్త మహారాజు దగ్గరకు వెళ్ళి ఆయనకు కొంచెం దూరంగా నిలబడి, "మహారాజా! నీ కొడుకు క్రూరమైన పని చేశాడు. దానికి ఫలితం అనుభవించాడు. నేను తెచ్చిన పళ్ళు తింటూ నాతో స్నేహంగా వుండే నీ కుమారుడు ఈ వేళ నా పసిబిడ్డను అన్యాయంగా అమానుషంగా హతమార్చాడు. నాకు చేసిన అపకారానికి ప్రతిగా అతని కళ్ళు పీకేశాను. నన్ను క్షమించు, నేనిక నీ రాజ్యంలో వుండను, శలవు" అంది.

మహారాజుకు దుఃఖం కట్టలు తెంచుకుంది. అయినా గుండె నిబ్బరం చేసుకుని, "ఇందులో నీ తప్పేముంది! నాబిడ్డ నాకెంతో, నీ బిడ్డ నీకూ అంతే కదా? నువ్వు చేసిన పనికి నేనేమీ విచారించడం లేదు. కానీ నువు మా తోట విడిచి వెళ్ళిపోతే మాకేం తోస్తుంది? ఇన్నాళ్ళ మన స్నేహాన్ని నువు ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకో! పసివాడు తెలీక ఏదో చేస్తే అది మనసులో పెట్టుకుని నువ్వు వెళ్ళిపోతే నాకు బాధగా వుంటుంది. నువ్వు ఇక్కడే ఉండు" అన్నాడు రాజుగారు.

గోరువంక పేలవంగా నవ్వింది.

"మహారాజా! పరస్పరం మనలో రేగిన ఈ పగ అంత త్వరగా చల్లారుతుందని నేననుకోను. నీ మాటలకు పొంగిపోయి ఇప్పుడు నీ నీడన ఉండడం నాకు శ్రేయస్కర మంటావా? నువ్వే చెప్పు" అంది.

"చేసిన దానికి మారు చేశావు నువ్వు. ఆ పగ అంతటితో తీరిపోయింది. అదంతా మరచిపోయి మళ్ళీ మనం మునుపటిలా సఖ్యంగా ఉండటంలో తప్పేముంది! గుణవంతులు పగనూ, ద్వేషాన్నీ మనసులో అట్టేకాలం అట్టేపెట్టుకోరు"

అన్నాడు మహారాజు.

"మహారాజా! నీ మాటల తీపిలో పడి తాత్కాలికంగా నేను నా కడుపుమంట మరిచిపోయినా, **స్నేహం చెడిపోయాక వైరి చెంత చేరడం తగదు. అలా చేరితే చావో, చేటో, కీడో, మనస్సుకు కలతో- ఏదో ఒకటి మూడుతుంది. మేలు మాత్రం జరగదు.** పగ ఐదు విధాలుగా కలుగుతుంది. భూమిని అపహరించినా, దాయాదులైనా, మాటా మాటా పెరిగినా, నిష్కారణంగా ఒకరికి కీడు చేసినా పగ రగులుతుంది. కామం వల్ల కూడా కలుగుతుంది. పగ రానే రాకూడదు. వచ్చిందంటే మాత్రం పోదు. మానులో ఉన్న అగ్నిలా దాగి రాజుతూ ఉంటుంది. ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడైనా చేటు చేస్తుంది, తప్పదు. తల్లిదండ్రుల్నీ, స్నేహితుల్నీ, కొడుకుల్నీ కూడా నమ్మకూడదంటారు. అలాంటప్పుడు మనస్సులో పగ ఉన్న వాళ్ళను నమ్మడం తెలివితక్కువ కాదా? ఎందుకీ బూటకపు మాటలు?" అంది గోరువంక.

"పిచ్చిదానా! ఒకరికి కీడూ, మేలూ మనం చెయ్యాలనుకుంటే చెయ్యడం సాధ్యమా? కాలవశం వల్ల అన్నీ కలుగుతూ ఉంటాయి. నా మాట విను. మమ్మల్ని విడిచి వెళ్ళకు" అన్నాడు బ్రహ్మదత్తుడు.

గోరువంక మహారాజు ముఖం తేరిపార చూసి, "సముద్రంలో వున్న బడబాగ్నిలా యీ చల్లని మాటల వెనుక నీ కోపం మండుతోంది. నీ మాటలు నేనెందుకు నమ్ముతాను! వెళ్ళొస్తాను'' అని తుర్రున ఎగిరి వేరేచోటికి వెళ్ళిపోయింది. ●

# ధర్మనిర్ణయం

హిరణ్యాక్షుడు, హిరణ్యకశిపుడు ఇద్దరూ అన్నదమ్ములు. వాళ్ళిద్దరికీ ఓ గారాల చెల్లెలుంది. ఆ అమ్మాయి పేరు సింహిక. హిరణ్యాక్షుడు బ్రహ్మను అర్చించి ఆయనను ప్రసన్నం చేసుకుని అనేక వరాలు పొందాడు. ఆ గర్వంతో అందర్నీ తూలనాడుతూ ధిక్కరిస్తూ, అన్నీ నాశనం చేస్తూ భరించరానివాడుగా తయారయ్యాడు. ఒకసారి భూమిని మొత్తం చుట్టచుట్టి సముద్రంలోకి విసిరేడు. అదిచూసి మహావిష్ణువుకు తీవ్రంగా కోపం వచ్చింది. వెంటనే వరాహ రూపం దాల్చి హిరణ్యాక్షుడ్ని హతమార్చి సాగరంలోంచి భూమిని వెలికితీసి దానికి స్వస్వరూపం కల్పించాడు.

అన్నను చంపినందుకు హిరణ్యకశిపుడు శ్రీ మహావిష్ణువు మీద పగ పెంచుకున్నాడు. ఆయనపై కక్ష సాధించేందుకు అడవులకు వెళ్ళి బ్రహ్మదేవుని ధ్యానిస్తూ తపస్సు చేయసాగాడు.

హిరణ్యకశిపుడు అడవులకు వెళ్ళడం అదనుగా దేవతలు రాక్షసులతో తలపడ్డారు. అరాచకంతో అలమటిస్తున్నప్పటికీ అసురులే ఆ యుద్ధంలో విజయం పొందారు. ఇంద్రుడు పారిపోతూ గర్భవతిగా వున్న హిరణ్యకశిపుడి భార్య లీలావతిని బలాత్కారంగా తీసుకువెళ్ళాడు. ఆ అబల ఆర్తనాదాలు విన్న నారదమహర్షి ఇంద్రునికి నచ్చచెప్పి ఆమెను రక్షించాడు.

ఆ తరువాత ఆమె కొన్నాళ్ళు నారద మహర్షి ఆశ్రమంలోనే తలదాచుకున్నది. ఆమె గర్భంలో ఉన్న పిల్లవాడికి నారద మహర్షి ప్రతినిత్యం వేదాలు, ఉపనిషత్తులు బోధించాడు. శీలం, సత్ప్రవర్తన, ఆధ్యాత్మిక విలువల గురించి హితబోధ చేశాడు. ఆ తరువాత కొంతకాలానికి ఆమె చక్కని పిల్లవాణ్ణి ప్రసవించింది. ఆ పిల్లవాడి పేరే ప్రహ్లాదుడు.

తపస్సు వల్ల బ్రహ్మనుంచి వరాలు పొంది వచ్చిన హిరణ్యకశిపుడికి అతని భార్యనూ, పిల్లవాణ్ణీ సగౌరవంగా అప్పగించాడు నారదుడు.

ప్రహ్లాదుడు నారదుడి ఉపదేశ ప్రభావం వల్ల హరిభక్తి సంపన్నుడయ్యాడు. లిప్తపాటయినా ఏమరక శ్రీ మహావిష్ణు నామజపం చేసేవాడు. అందుకు కోపగించిన హిరణ్యకశిపుడు తానే సమస్త లోకాలకు అధిపతినని, నారాయణ నామం జపించరాదని, తననే ఆరాధించాలని ఆజ్ఞాపించాడు. పితృభక్తి వున్నప్పటికీ, జగత్పిత ఆదివిష్ణువేనన్న తన విశ్వాసాన్ని ప్రహ్లాదుడు మార్చుకోలేదు. తండ్రి ఆజ్ఞమేరకు రాజగురువులు ఉపదేశించబోయినా తలవొగ్గలేదు. కనిపించే ఈ సృష్టికి మూలం మహావిష్ణువేనని, అతను సర్వవ్యాపి అనీ త్రికరణశుద్ధిగా నమ్మాడు. ఫలితంగా తండ్రి చేతిలో అనేక బాధలకు, హింసలకు గురయ్యాడు. చివరికి ప్రహ్లాదుని కాపాడేందుకు హరి ఉగ్రనరసింహమూర్తియై వచ్చి హిరణ్యకశిపుని సంహరించాడు.

తండ్రి తరువాత రాజయిన ప్రహ్లాదుడు ధర్మనిరతితో పరిపాలించసాగాడు. అతనికి, విరోచన, కుంభ, నికుంభులు అని ముగ్గురు కొడుకులు కలిగారు. పెద్దవాడు విరోచనుడికి కూడా దైవమంటే ప్రీతి.

విరోచనుడూ, అంగీరసుడనే విప్రుని కొడుకు సుధన్వుడూ మిత్రులు. వాళ్ళిద్దరూ కేశిని అనే అమ్మాయిని ప్రేమించారు. అసురుడు భూసురుడి కంటే గొప్పవాడనీ, శక్తిసంపన్నుడనీ, అందుకని కేశిని తననే వరించాలని విరోచనుడు వాదించాడు. విప్రుడు అందరికంటే ఉత్తముడనీ, అన్నీ తెలిసిన ప్రాజ్ఞుడనీ, అందువల్ల

ఆ పిల్ల తనకే భార్య కావాలనీ సుధన్వుడు పట్టుబట్టాడు. అలా ఇద్దరిమధ్యా మాటా మాటా పెరిగింది. ప్రాణాలు తీసుకునేంతవరకూ వెళ్ళారు. చివరికి న్యాయం చెప్పమని ప్రహ్లాదుణ్ణి అర్థించారు.

"అయ్యా! నువ్వు ధర్మధర్మాలు బాగా తెలిసినవాడవు. నీ కొడుకు ఎక్కువ గుణవంతుడో, నేను ఎక్కువ గుణవంతుడనో, కేశిని వరించదగిన యోగ్యుడు ఎవరో పక్షపాతం విడిచి చెప్పు. ధర్మం తప్పావంటే మాత్రం ఇంద్రుని వజ్రాయుధం నీ తలను ఖండిస్తుంది" అని సుధన్వుడు ప్రహ్లాదుణ్ణి అడిగాడు.

ప్రహ్లాదుడు ఆ వివాద వృత్తాంతమంతా కశ్యప మహామునికి విన్నవించాడు. "ప్రహ్లాదా! సాక్షియైనవాడు, ధర్మదర్శియైనవాడూ ధర్మమార్గాన్ని తప్పి చరించకూడదు. **అధర్మం మరుగున ధర్మం అణిగివున్నప్పుడు న్యాయాన్ని అర్థిస్తూ ఎవరైనా సభకు వస్తే దానిని ఉపేక్షించిన సభ్యులు పాపాన్ని అనుభవిస్తారు. తమ కళ్ళెదురుగా జరుగుతూన్న అధర్మాన్ని ఆపకపోతే ఆ అధర్మంలో ఒక భాగం సభ్యులకు, ఒక భాగం భూపతికి, తక్కిన భాగం ఆ అధర్మం చేసినవాడికి చెందుతుంది.** కనుక సమగ్రంగా, సూక్ష్మంగా విచారించి న్యాయం చెప్పు" అని కశ్యపుడు ప్రహ్లాదుడికి ఉపదేశం చేశాడు.

ప్రహ్లాదుడు ధర్మమతియై విచారించి తన కొడుకు కంటే సుధన్వుడే సుగుణవంతుడని తేల్చి చెప్పాడు. పుత్రప్రేమ కూడా విడిచిపెట్టి ధర్మం చెప్పిన ప్రహ్లాదుణ్ణి అభినందించి సుధన్వుడు కేశినిని చేపట్టి వెళ్ళిపోయాడు. ●

# కాపవ్యుడు

పారియాత్ర పర్వతంమీద ఒక బోయ వుండేవాడు. అతడి పేరు కాపవ్యుడు. అతను చాలా ధర్మాత్ముడు. ధనుర్విద్యలో నిపుణుడు. మృగాల సమాచారాలన్నీ తెలుసు అతనికి. అరణ్యాలలో తిరుగుతూ వుండేవాడు. తల్లిదండ్రులంటే అమిత భక్తి. కందమూలాలూ, కల్లూ, మాంసం, మంచి అన్నం, కూరలూ, పాయసం సమకూర్చి ప్రతినిత్యం తల్లికీ, తండ్రికీ తృప్తిగా భోజనం పెట్టేవాడు. మెత్తని శయ్య అమర్చేవాడు.

కాపవ్యుడు కండబలం, గుండెబలం కలవాడు. ఎంతమంది శత్రువులనైనా అవలీలగా జయించేవాడు. ఆ పర్వత ప్రాంతంలో వున్న దొంగలందరూ అతని ధైర్యాన్నీ, తేజాన్నీ, బలాన్నీ చూసి ఆశ్చర్యపోయి, ఎలాగైనా అతన్ని ఒప్పించి తమకు రక్షగా, నాయకుడిగా నియమించుకోవాలనుకున్నారు.

ఒకనాడు అందరూ కలసి వెళ్ళి, "అయ్యా! నువ్వు బలవిక్రమ సంపన్నుడివి. ధైర్యశాలివి. మా అందరికీ నాయకుడివై, మమ్మల్ని రక్షిస్తూ వుండు. కొడుకుల్ని తండ్రి ఆజ్ఞాపించినట్లు మమ్మల్ని ఆజ్ఞాపించు. నీ ఇష్టం వచ్చిన పనులు మా చేత

చేయించుకో! నిన్ను సేవించే అవకాశం, అదృష్టం మాకు కలుగనివ్వు" అని బ్రతిమాలారు.

"దానికేం అభ్యంతరం లేదు! కానీ కొన్ని షరతులున్నాయి" అన్నాడు కాపవ్యుడు.

"సెలవివ్వండి" అన్నారు దొంగలు.

"ఎటువంటి సమయంలోనైనా సరే శిశువుల్నీ, స్త్రీలనూ, మునులనూ చంపకూడదు. అత్యాచారాలు జరపకూడదు. ఎదిరించి మీదబడితే తప్ప నిష్కారణంగా ఎవరితోనూ కొట్లాటకు దిగకూడదు. స్త్రీలను చెరబట్టకూడదు. ఇంకో విషయం! ఏ జంతుజాతుల్లోనైనా పెంటిని వధించరాదు. ఆడజంతువును చంపడం మహాపాపం. గోవుల్నీ, ఉత్తముల్నీ హింసించకూడదు. సస్యాలు పాడుచెయ్యకూడదు. ఎవరైనా పొట్ట చేతపట్టుకుని పట్టెడు అన్నం పెట్టమని చెయ్యి చాపితే లేదనకూడదు. దీనులను దయతో చూడాలి. మీరు ఈ ధర్మాలన్నీ తెలుసుకుని, నేను చెప్పినట్లు నడుచుకోడానికి అంగీకరిస్తే మీకు నాయకుడిగా వుండి మీ యోగక్షేమాలు చూసుకుంటూ వుంటాను" అన్నాడు కాపవ్యుడు.

దొంగలందరూ అతను చెప్పినదానికి అంగీకరించి అతని పరిపాలనలో ధర్మాత్ములై సుఖంగా వున్నారు.

"అందుచేత ధర్మరాజా! దొంగైనా సరే న్యాయం, ధర్మం, తప్పనివాడైతే ఆదరణీయుడే సుమా!

"ఎవరైనా ఏదైనా అడిగితే లేదని తిరస్కరించి కించపరచకుండా వున్నంతలో యిచ్చి యాచకులను కృతార్థుల్ని చేసి పంపే ఔదార్యం రాజుకుండాలి! అలా చేయనప్పుడు రాజ్యం యోగ్యులైన పౌరుల్ని కోల్పోయే ప్రమాదం వున్నది."

"ఒకసారి ఒక గుణవంతుడైన పురుషుడు ధనవంతుడైన ఒక రాజు దగ్గరకు వెళ్ళి కూడు, గుడ్డలకోసం ధనం యాచించాడు. కానీ అతని ఆశ నిరాశ అయింది. ఎందుకు చేయిచాచి అడిగానా అని ఎంతో సిగ్గుపడ్డాడు. ఇక అప్పటినుంచీ 'దేనిమీదా ఎవరిమీదా ఆశపెట్టుకోను' అని ప్రతిజ్ఞ చేసుకుని వ్రతం పట్టాడు. అప్పుడు కలిగిన వైరాగ్యంతో తపస్వి అయ్యాడు. ఆ తపస్వి ఎవరో తెలుసా? ఋషభుడు!

"విరక్తితో విజ్ఞాని అయిన ఆ ఋషభుడి ఆశ్రమానికి ఒకరోజు హైహయ వంశీయుడైన సుమిత్రమహారాజు వెళ్ళాడు. వేటలో అరణ్యమంతా పరిగెత్తి

అలసిపోయి ఆ మునివాటిక చేరుకున్నాడు. "మహారాజా! చాలా అలసినట్టున్నావు. ఈ పళ్ళు తిని, ఈ చల్లని నీళ్ళు తాగి కాసేవు విశ్రాంతి తీసుకో" అన్నాడు మహర్షి. ఆయన ఆతిథ్యానికి మహారాజు హృదయం ఆనందంతో పరవశమైంది.

"అయ్యా! ఈ మహారణ్యానికి నువ్వొక్కడవూ ఏం పనిమీద వచ్చావు? నీ ముఖంలో విచారం కనిపిస్తోంది–కారణమేమిటి?" అని ఋషభుడు ప్రశ్నించాడు.

"మునీంద్రా! వేట కోసం అరణ్యానికి వచ్చాను. నా గురి తప్పలేదు. కానీ ఆ బాణంతో సహా ఒక మృగం తప్పించుకు పారిపోయింది. ఎలాగైనా దాన్ని పట్టుకుందామనే ఆశతో ఇంతదూరం పరిగెత్తి పరిగెత్తి చివరకు నిరాశ పోగుచేసుకున్నాను. తన బారినుంచి మృగం తప్పించుకు పారిపోయిందంటే అది వేటాడేవాడికి చాలా అవమానం" అని సుమిత్రుడు విచారం ప్రకటించాడు.

"నాయనా! ఆశ చిత్రమైంది. తెగకోస్తే తప్ప తెగని పాశం అది. ఒకసారి నేను బదరికాశ్రమానికి వెళ్ళాను. అక్కడ దనుడనే మహాముని వున్నాడు. ఒకరోజున వీరద్యుమ్నుడు అనే మహారాజు ఆయన దగ్గరకు వెళ్ళి 'మునీంద్రా! నాకు ఒక్కడే కొడుకు. ఆటల మీద ప్రేమతో అరణ్యాలకు వెళ్ళాడు. ఇంతవరకూ తిరిగి రాలేదు. వాడి కోసం వెతికి వెతికి ఆశ చంపుకోలేక మీ అనుగ్రహం కోరి మీ సన్నిధికి వచ్చాను' అని శోకిస్తూ ప్రార్థించాడు. వీరద్యుమ్నుని దీనస్థితికి కరిగిపోయిన దనుడు, 'రాజా! **పరిస్థితులకు లొంగక ధైర్యంగా నిలబడేవాడికి ఎక్కడా, ఏదీ దుర్లభం కాదు. ఎవరైనా ఏదైనా ఇస్తామంటే ఆశ కలుగుతుంది. ఉచిత సంపదను అనుభవించాలన్న కోరిక మనిషిని నిలబడనీయదు. అవతలి వ్యక్తి ఇవ్వకుండా ఎన్నాళ్ళు తప్పించుకున్నా ఆశ పోదు.** ఆశలు సాగుతూనే వుంటాయి. వాంఛను వర్జించి మానవుడు సౌఖ్యం పొందాలి. ఎవరైనా ఏదైనా అడిగితే లేదనకుండా వున్నంతలో ఇచ్చి ఆ వచ్చిన వారిని సంతృప్తిపరచి పంపడమే ఉత్తమ మానవధర్మం' అని బోధించి రాజకుమారుడ్ని తన తపోమహిమ వల్ల ఆకర్షించి రప్పించి ఇచ్చాడు" అని చెప్పి ఋషభుడు, చెయిజారిన మృగాన్ని వెంటాడి సాధించాలన్న ఆశను విడచి ప్రశాంత చిత్తుడవు కమ్మని సుమిత్రునికి హితవు చెప్పాడు.

ధర్మరాజుకి యీ కథ చెప్పి "పాండవాగ్రజా! విన్నావా? ఆశ పనికిరాదు. కాంక్షను జయించు" అని బోధ చేసి నారదుడు వీడ్కోలు తీసుకున్నాడు ●

# నారదుడి పెళ్ళి

**నా**రద మహర్షి చెల్లెలి కొడుకు పేరు పర్వతుడు. వాళ్ళిద్దరూ ఒకసారి భూసంచారానికి వెళ్ళారు.

"మనిద్దరం ఒకరి మనసులో ఉండే అభిప్రాయాలు మరొకరికి చెప్పుకోవాలి. దాపరికం చేస్తే మాత్రం శాపం తప్పదు. ఏం?" అన్నాడు పర్వతుడు.

సరేనన్నాడు నారదుడు.

వాళ్ళిద్దరూ ఒకనాడు సృంజయ మహారాజు దగ్గరకు వెళ్ళారు. ఆయన రాజప్రాసాదంలో కొన్నాళ్ళు వుంటామన్నారు. సంతోషంగా అంగీకరించాడాయన. తన కూతురు సుకుమారిని పిలిచి వాళ్ళిద్దరికీ సపర్యలు చేయమని చెప్పాడు. ఆమె శ్రద్ధగా వాళ్ళకు సేవలు చెయ్యసాగింది. ఆమె అద్భుత సౌందర్యరాశి. ఆ రూప లావణ్యాలకు నారదుడు ముగ్ధుడయ్యాడు. నారాయణ జపం మానేశాడు. ఆమె మూర్తి అతని మనస్సులో పీఠం వేసింది. ఆ బరువు మొయ్యలేక కృశించిపోసాగాడు నారదుడు. అది చూసి పర్వతుడు "ఏమిటి మామా! ఏమిటిలా అయిపోతున్నావ్?

తరచూ పరధ్యాసలో పడుతున్నావు. దిగులుగా కనిపిస్తున్నావు. ఏమిటి కథ?” అని ప్రశ్నించాడు.

సిగ్గుపడ్డాడు నారదుడు.

ఏమీ చెప్పలేదు!

పర్వతుడు దివ్యదృష్టి సారించాడు. అంతా అర్థమైంది.

“ఔరా! అన్నమాట తప్పావు. రాజుగారి కూతురుమీద మనసు కలిగితే ఆ సంగతి నువ్వు నాతో చెప్పలేదు. మనం చేసుకున్న ప్రతిజ్ఞ ప్రకారం నేనిప్పుడు శాపం ఇవ్వాలి నీకు. పెళ్ళి అవగానే నీకు మర్కట రూపం వస్తుంది'' అని మేనమామను శపించాడు.

“నువ్వు దేవలోకానికి వెళ్ళకుందువుగాక'' అని నారదుడు మేనల్లుడికి ప్రతిశాపమిచ్చాడు. పర్వతుడు అక్కడినుంచి నిష్క్రమించాడు.

తరువాత నారదుడు సృంజయ మహారాజును అర్థించి ఆయన కూతురు సుకుమారిని పెళ్ళి చేసుకున్నాడు. పెళ్ళికూతురి మెడలో మంగళసూత్రం కట్టగానే కోతిరూపం వచ్చింది నారదుడికి. కాని సుకుమారి మహాసాధ్వి. భర్తను ఏవగించుకోకుండా పూజించింది. కొన్నాళ్ళు గడిచాయి.

ఒకనాడు హఠాత్తుగా నారదుడికి పర్వతుడు కనిపించి, “మామా! నా శాపం మరలించవా?” అని అర్థించాడు.

“ముందు శపించిన వాడివి నువ్వు. అందుకని మొదట నువ్వే నీ శాపం మరలించు” అన్నాడు నారదుడు.

సరేనని తన శాపాన్ని ఉపసంహరించాడు పర్వతుడు. నారదుడూ శాపం పోగొట్టాడు. ఇద్దరూ కలిసి ఇంటికొచ్చారు.

కోతిముఖం లేని నారదుణ్ణి చూసి తన భర్త కాదనుకుంది సుకుమారి. అప్పుడు పర్వతుడు ఆమెతో “అమ్మా! ఇతడు నీ భర్తే. నా శాపం తీరి కోతిముఖం పోయింది” అని జరిగిన సంగతంతా చెప్పాడు నవ్వుతూ.

సుకుమారి ఆశ్చర్యపోయింది.

నారదుడు నిజమేనన్నట్లు చిరునవ్వు నవ్వాడు. ●

# గురువు లేని విద్య

ధర్మరాజు, ఆయన తమ్ములు వనవాసం చేస్తున్నప్పుడు లోమశుడు అనే మహర్షి వాళ్ళని చూడటానికి వచ్చాడు. కుశలప్రశ్నలు అయిన తరువాత లోమశుడు, "ధర్మరాజా! మీరు తీర్థయాత్రలు చెయ్యండి. మనసు కొంత కుదుటపడుతుంది. తీర్థయాత్రలు చేసుకుంటూ అక్కడి స్థల విశేషాలు తెలుసుకుంటూ కాలక్షేపం చెయ్యండి. కాలం ఇట్టే గడిచిపోతుంది" అని సలహా ఇచ్చాడు.

తరువాత పాండవులు పుణ్యక్షేత్రాలు దర్శించడానికి వెళ్ళారు.

అలా వెళ్ళినప్పుడు వాళ్ళకి గంగానది ఒడ్డున రైభ్యుడనే ఋషి ఆశ్రమం కనిపించింది. ఆ పక్కనే వున్నది భరద్వాజుని ఆశ్రమం.

భరద్వాజుడు, రైభ్యుడు మంచి స్నేహితులు. ఇద్దరూ బాగా చదువుకున్నారు. నదీతీరాన  పక్కపక్కనే ఆశ్రమాలు ఏర్పరచుకుని నివసిస్తుండేవారు. రైభ్యుడికి ఇద్దరు కొడుకులు–పరావసు, అర్వావసు.

వాళ్ళిద్దరూ కూడా చక్కగా వేదం చదువుకుని గొప్ప పండితులుగా పేరుపొందారు.

భరద్వాజుడికి ఒక్కడే కొడుకు. అతని పేరు యవక్రీతుడు. యవక్రీతుడికి రైభ్యుడన్నా, ఆయన కొడుకులన్నా గిట్టేది కాదు.

పరావసు, అర్వావసులను చూసి యవక్రీతుడు అసూయపడేవాడు. వాళ్ళకన్నా తను గొప్పవాడు కావాలని ఇంద్రుడ్ని గూర్చి తపస్సు చేశాడు. నిప్పుతో ఒళ్ళంతా మండించుకున్నాడు. ఇంద్రుడికి జాలి కలిగింది. భూలోకానికి వచ్చి, 'ఎందుకు నాయనా ఇంత ఘోరమైన తపస్సు చేస్తున్నావు?' అని అడిగాడు. 'ఎవరూ చదవని వేదవిద్యలన్నీ నాకు రావాలి. నేను గొప్ప పండితుణ్ణి కావాలి. దానికోసం నేనీ కఠోర తపం చేస్తున్నాను. గురువుగారి దగ్గరకు పోవటం, కొన్నాళ్ళు ఆయనకు సేవ చేయటం అవేవీ నాకు కుదరవు. అవేవీ లేకుండా విద్యలన్నీ క్షణాలమీద పొందటానికి ఈ తపస్సు చేస్తున్నాను. నన్ను ఆశీర్వదించండి" అని యవక్రీతుడు వేడుకున్నాడు.



అది విని ఇంద్రుడు నవ్వాడు. "పిచ్చివాడా! నీ తెలివి అపమార్గాన పట్టింది. తక్షణమే వెళ్ళి **గురువును ఆశ్రయించు. ఆయనవద్ద శుశ్రూష చేసి వేదవిద్యలన్నీ నేర్చుకో. గురువువద్ద విద్య నేర్చుకుంటేనే ఎవరికైనా చదువు అబ్బుతుంది. అది లేకుండా ఏం చేసినా ప్రయోజనం లేదు**" అని చెప్పాడు.

కాని యవక్రీతుడికి ఆయన మాటలు నచ్చలేదు. ఇంకా ఘోరమైన తపస్సు

చేశాడు. ఇంద్రుడు మళ్ళీ వచ్చి, "నాయనా! మూర్ఖంగా ఏ పనీ చెయ్యకూడదు. నీ తండ్రిగారికి వేదాలు తెలుసు. ఆయన నీకు నేర్పుతారు. వెళ్ళి వేదవిద్యలన్నీ నేర్చుకో. ఇలా ఒళ్ళు కాల్చుకోవటం మానుకో" అని చెప్పాడు.

యవక్రీతుడికి కోపం వచ్చి, "నేను కోరిన వరం కనుక మీరు ఇవ్వకపోతే నా శరీరంలోని అవయవాలన్నిటినీ విరిచి ఈ అగ్నిగుండంలో పడేస్తాను" అన్నాడు.

అలా వుండగా ఒకనాడు యవక్రీతుడు గంగానదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళాడు. అక్కడ ఓ ముసలి బ్రాహ్మణుడు నది ఒడ్డున కూర్చుని పిడికెడు పిడికెడు ఇసుక తీసి నదిలోకి విసురుతున్నాడు. అది చూసి యవక్రీతుడు "ఏం చేస్తున్నావు తాతా?" అని అడిగాడు.

"గంగానది దాటడానికి వంతెన కడుతున్నా" అన్నాడు ఆ వృద్ధ బ్రాహ్మణుడు.

అది విని యవక్రీతుడు పెద్దగా నవ్వాడు. "వేగంగా పోయే ప్రవాహానికి ఇలా ఇసుకతో అడ్డంగా కట్ట వేయడం కుదరని పని. వేరే మార్గం చూడు" అని సలహా ఇచ్చాడు.

"గురువు లేకుండానే , అసలు చదవకుండానే, కష్టపడకుండానే విద్య రావాలని కొందరు ఎలా తపస్సు చేస్తున్నారో అలాగే నేనూ గంగానదికి ఇసుకతో వంతెన కడుతున్నా" అని ముసలి బ్రాహ్మణుడు బదులు చెప్పాడు.

అప్పుడు అర్థమైంది ఆ ముసలి బ్రాహ్మణుడు ఎవరో యవక్రీతుడికి!

వెంటనే కాళ్ళమీద పడ్డాడు.

ఇంద్రుడు నవ్వుతూ యవక్రీతుణ్ణి దగ్గరకు తీసుకుని, "నీ తండ్రి దగ్గర వేదవిద్యలు నేర్చుకో. అనతికాలంలోనే నువ్వు గొప్ప విద్వాంసుడివి అవుతావు" అని ఆశీర్వదించాడు. ●

# ఇంద్ర విజయం

పూర్వం 'త్వష్ట' అనే పేరు గలవాడొకడుండేవాడు. అతనికి ఇంద్రుడంటే ఒళ్ళుమంట. ఎలాగైనా ఇంద్రుడికి అపకారం చెయ్యాలని తలపెట్టి ఒక మూడు తలలవాణ్ణి సృష్టించాడు. వాడికి విశ్వరూపుడని పేరు పెట్టాడు. ఇంద్ర పదవి కోసం ఘోరంగా తపస్సు చెయ్యడం మొదలుపెట్టాడు విశ్వరూపుడు. అతని తపస్సు భగ్నం చేయడం అప్సరసల వల్ల కాకపోయింది. చివరకు ఇంద్రుడే వాణ్ణి చంపాడు. ఫలితంగా ఇంద్రుడికి తాపసిని చంపిన పాపం అంటుకుంది. అందుకని ఎవరికీ తెలియకుండా ఓ యేడాది రహస్యంగా వుండేసరికి భూతగణాలు ఆక్రోశించడం మొదలుపెట్టాయి.

తన అధర్మకార్యం లోకానికి తెలిసిపోయినందుకు ఇంద్రుడు విచారించి, ఆ దోషాన్ని నాలుగు భాగాలుగా విభజించి సముద్రానికీ, భూమికీ, చెట్లకూ, స్త్రీలకూ అంటగట్టాడు. తరువాత తను హాయిగా వున్నాడు.

అది చూసి మరీ కోపం వచ్చింది త్వష్టకు. ఈసారి అతి నిష్ఠతో హోమం

చేసి, వృత్రాసురుణ్ణి సృష్టించి ఇంద్రుడితో యుద్ధం చెయ్యమని పంపాడు.

తీరా యుద్ధం మొదలయ్యేసరికి వృత్రాసురుడికి ఆకలేసి ఇంద్రుడ్ని కాస్తా మింగి ఊరుకున్నాడు. అది చూసి దేవతలు భయపడిపోయారు. ఎలాగో కష్టపడి వృత్రాసురుణ్ణి ఆవలించేలా చేశారు. వాడు నోరు తెరచి ఆవలించేసరికి ఇంద్రుడు అంగుష్ఠమాత్రుడై వాడి నోట్లోంచి బయటికి వచ్చాడు. వృత్రాసురుడి ముందు ఆగలేక మందర పర్వతానికి పరుగెత్తాడు. ఇక ఈ వృత్రుణ్ణి మహావిష్ణువు తప్ప మరొకరు సంహరించలేరనుకుని దేవతలంతా వైకుంఠానికి వెళ్ళారు.

"ఎలాగైనా వాడితో సంధిచేసుకోండి. సమయం చూసి నేను ఇంద్రుడి వజ్రాయుధంలో ప్రవేశిస్తాను. వృత్రాసురుణ్ణి వధిస్తాను" అని అభయమిచ్చాడు కమలనాభుడు.

సరేనని దేవతలు, మునులు వాడి దగ్గరకు రాయబారానికి వెళ్ళారు.

"పగటివేళగాని రాత్రివేళగాని, తడిసిన దానితోగాని, పొడిదానితో గాని, చెట్లతోగాని, రాళ్ళతోగాని, శస్త్రాలతోగాని నాకు చావు లేకుండా చెయ్యండి. అప్పుడే దేవేంద్రుడికీ, నాకూ సంధి కుదురుతుంది" అన్నాడు వృత్రుడు.

దేవ మునివరులు అంగీకరించక తప్పలేదు. ఫలితంగా వాడితో సంధి చేసుకుని కొన్నాళ్ళు సుఖంగా వున్నాడు ఇంద్రుడు.

ఒకనాడు వృత్రుడు సముద్రతీరంలో విహరిస్తూండగా అతన్ని చంపాలని బుద్ధిపుట్టింది ఇంద్రుడికి. అది సంధ్యాసమయం! రాత్రీ కాదు, పగలూ కాదు. చంపడానికి సాధనం కోసం వెతుక్కుంటున్న ఇంద్రుడికి సముద్రంలో వున్న నురుగు కనిపించింది. అది తడిదీ కాదు, పొడిదీ కాదు. అందుకని తన వజ్రాయుధానికి ఆ నురుగును పట్టించి వృత్రాసురుడి మీదకు విసిరాడు. ఆ ఆయుధంలో హరి ప్రవేశించి వాణ్ణి హతమార్చాడు.

తీరా ఇంద్రుడు అమరావతికి చేరేసరికి "ఇలా బ్రహ్మహత్య చేసి ఇంకా రాజ్యం చేద్దామనుకుంటున్నావా?" అని సకల భూతగణాలూ అతన్ని నిలదీసి ప్రశ్నించాయి. పాపభారంతో ఇంద్రుడు రాజ్యం వదులుకుని నిషధాచలానికి వెళ్ళిపోయాడు. దేవతలంతా కలసి దేవేంద్ర పదవిని నహుషుడికి కట్టబెట్టారు.

ఒకనాడు శచీదేవి నహుషుడి కంటపడింది. ఆ లావణ్యరాశిని చూసి ఉన్మత్తుడై "నేను ఇంద్ర పదవిలో వున్నాను. కనుక ఇంద్రాణివైన నువ్వు నా దగ్గరకు రావాలి"

అని కబురు పంపాడు. శచి భయపడి వెళ్ళి బృహస్పతిని శరణు వేడింది. "మహనీయమైన పదవిలో వున్నావు. పరస్త్రీలను కోరడం ఉచితం కాదు" అని మునులూ, దేవతలూ నహుషుణ్ణి మందలించారు.

"అలాగా! ఆనాడు గౌతముడి భార్య అహల్యకోసం దొంగవేషంలో పరుగెత్తిన ఇంద్రుడికి ఈ బుద్ధులు మీరు చెప్పలేకపోయారేం?" అని నహుషుడు హుంకరించాడు. దేవమునివరులు భయపడిపోయి శచీదేవిని తీసుకురావడానికి బృహస్పతి దగ్గరకు వెళ్ళారు. వాళ్ళు వచ్చిన పని తెలుసుకున్న దేవపురోహితుడు–

"బాగుంది. ఇలాంటి పనికి నహుషుడు పంపడం... మీరు తగుదుమంటూ రావడం... మహాసాధ్వి శచీదేవిని ఇలా అడగడానికి మీకు మనస్సెలా అంగీకరిస్తోంది" అంటూ అసహ్యించుకున్నాడు.

"మరైతే ఇప్పుడేం చేద్దాం?"

ఆలోచనలో పడ్డాడు దేవపురోహితుడు బృహస్పతి. చివరకు ఒక ఉపాయం చేశాడు.

"అమ్మా! నువ్వెళ్ళి అతణ్ణి కొన్నాళ్ళు గడువుకోరి రా! ఈలోగా నిషధాచలం నుంచి నీ భర్తను తీసుకురావడానికి ఏం చెయ్యాలో ఆలోచించుకుందాం" అన్నాడు శచీదేవితో.

ఈ ఉపాయం బాగుందనుకుని సంతోషించారందరూ. శచి నహుషుడి దగ్గరకు వెళ్ళి, "ఇంద్రుడు అసలు వున్నాడో, లేడో తెలియకుండా ఉంది. అతడి సంగతి పూర్తిగా తేల్చుకోకుండా నేను నీ దగ్గరకు వస్తే మనకిద్దరికీ కూడా ప్రమాదం. అందుకని కొంతకాలం వేచిచూడడం మేలు" అని అభ్యర్థించింది.

"అంతేకదా! అలాగే చేస్తాను. నీ కోసం నిరీక్షిస్తూ ఉంటాను. త్వరగా వచ్చేయ్!" అని నవ్వుతూ సాగనంపాడామెను నహుషుడు. ఇంక ఇంద్రుడు వచ్చేమాట లేదనీ, ఆమె తననే వరిస్తుందనీ అతని ధీమా!

ఇంద్రాణి ఈ సంగతంతా చెప్పగానే బృహస్పతి విష్ణువును ప్రార్థించాడు. "వెళ్ళి ఇంద్రుడిచేత అశ్వమేధయాగం చేయించండి. అంతటితో బ్రహ్మహత్యాపాతకం నశిస్తుంది" అని ఆదినారాయణుడు శలవిచ్చాడు.

కాని, ఇంద్రుడెక్కడున్నాడని వెతకటం?

ఆలోచించగా ఆలోచించగా శచీదేవికో దారి కనిపించింది. భక్తితో 'ఉపశ్రుతి'ని ఆరాధించింది. కొంతసేపటికి ఆమె ఎదుట ఒక తేజోరూపం కనిపించి "నీ పాతివ్రత్య, సత్య, శౌచాలను మెచ్చుకుని వచ్చాను. నీ భర్తను చూపిస్తాను పద!" అని శచీదేవిని తనవెంట తీసుకువెళ్ళింది. హిమాలయ పర్వతానికి ఉత్తరదిక్కున 'మంజుమంతం' అనే మహా పర్వతం ఉంది. దానిమీద నూరు యోజనాల విస్తీర్ణం గల ఓ కొలను వుంది! అందులో పంచరంగుల పద్మాలున్నాయి. వాటిలోని ఒక తామరతూడు చీల్చి ఉపశ్రుతి శచితో కూడా అందులో ప్రవేశించి ఆ తూడులో దారాల మధ్య సూక్ష్మరూపంలో వున్న ఇంద్రుణ్ణి చూపించింది. ఇంద్రుణ్ణి చూసి శచీదేవి కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

"శచీ! విచారించకు. నహుషుడి తేజం సహించరానిదిగా వుంది నాకు. కాలం కలిసిరావడం కోసం ఎదురుచూస్తున్నాను. నిన్ను ఆశిస్తున్నాడు కనుక ఇప్పుడు దారి దొరికింది. మహామునులచేత వాహనం మోయించుకుంటూ నీ ఇంటికి రమ్మని అతడికి కబురు పంపు. ఆ తరువాత సంగతి నేను చూసుకుంటాను" అన్నాడు ఇంద్రుడు. శచీదేవి భర్త చెప్పినట్టే చేసింది.

ఆమె సందేశం విన్న నహుషుడు గర్వంతో కన్నుకానక సప్తర్షులను పిలిచి తన వాహనం మొయ్యవలసిందని ఆజ్ఞాపించాడు. ఈలోగా శచీదేవి గబగబ బృహస్పతి దగ్గరకు పరుగెత్తి, "అయ్యా నహుషుడు వచ్చేస్తున్నాడు. నన్నూ, దేవేంద్రుణ్ణీ రక్షించండి" అని ప్రార్థించింది.

"అమ్మా! భయపడకు. నీకు ఏ ఆపదా రాకుండా చూసే భారం నాది. అగ్నిదేవుణ్ణి అర్చించి నీ భర్తను తీసుకురమ్మని ఇంతకుముందే పంపాను. ఈపాటికి వస్తూనే వుంటారు" అని బృహస్పతి అంటుండగానే అగ్ని అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

"స్వామీ! జలం వల్ల అగ్నీ, బ్రాహ్మణుల వల్ల క్షత్రియులూ, ఇనుమువల్ల లోహాలూ పుట్టాయి. వాటి శక్తి జన్మస్థానాల్లో పనిచెయ్యదు. అందుకని నీటిలోకి వెళ్ళలేకపోయాను" అన్నాడు అగ్ని.

"నాయనా! నీవు విశ్వవ్యాపుడవు. నేను బ్రహ్మమంత్రాలతో నీకు అనంతశక్తిని ప్రసాదిస్తాను. వెళ్ళి దేవేంద్రుడిని తోడ్కొనిరా" అన్నాడు బృహస్పతి. బృహస్పతి వల్ల శక్తిమంతుడైన ఘృతవాహుడు దేవతలనూ, మునులనూ ఇంద్రుడి వద్దకు తీసుకు వెళ్ళాడు. "దేవేంద్రా! నహుషుడు సప్తరుషులచేత వాహనం మోయించుకుని తన

తేజమంతా పోగొట్టుకున్నాడు. పైగా అతనికీమధ్య చాలా దుర్గుణాలు సంక్రమించాయి. అందుకని అతని తేజం చూసి భయపడవలసిన అవసరం లేదు. నహుషుణ్ణి అవలీలగా జయించగలవు నువ్వు. పద!" అన్నాడు బృహస్పతి.

ఇంద్రుడు బృహస్పతికి నమస్కరించి దిక్పాలకుల్ని గౌరవించి నహుషుణ్ణి గెలిచే ఉపాయం ఆలోచిస్తుంటే అగస్త్య మహాముని దయచేశాడు. ఇంద్రుడు చేసిన పూజలందుకుని "దేవేంద్రా! నహుషుడు భ్రష్టుడయ్యాడు. ఇంక వెళ్ళి నీ సింహాసనం నువ్వు అధిష్ఠించు" అన్నాడు.

"మహర్షీ! నహుషుడు ఎలా పతనమయ్యాడు?" అని సంభ్రమాశ్చర్యాలతో అడిగారంతా.

"నహుషుణ్ణి మోస్తున్న మునులంతా 'గోసంప్రోక్షణంలో చెప్పబడిన బ్రాహ్మణ మంత్రాలను ప్రమాణంగా నువ్వు అంగీకరిస్తావా?' అని అతణ్ణి అడిగారు. అతను అంగీకరించనన్నాడు. నాకు కోపం వచ్చి 'పెద్దలు కొనియాడిన మంత్రాలను కాదనడం అజ్ఞానం' అన్నాను.

"అందుకు నహుషుడు కుపితుడై నా తలమీద తన్నాడు. 'పరస్త్రీలను ఆశించడం, అహంకారంతో కన్ను మిన్ను కానకపోవడం, పూజ్యులైన మునులచేత పల్లకీ మోయించుకోవడం, పవిత్రమైన మంత్రాల్ని కాదనడం, పైగా నన్ను అవమానించడం... ఇన్ని పాపాలు చేశావు. వెళ్ళి భూలోకంలో కొండచిలువవై పడి ఉండు' అని శపించాను" అన్నాడు అగస్త్యుడు.

దేవతలూ, మునులూ బ్రహ్మానందపడిపోయారు. దేవేంద్రుడు ఆ మునిని భక్తితో పూజించి, దిక్పాలకులతో సహా అమరావతీనగరానికి వెళ్ళి సింహాసనం అధిష్ఠించాడు. ●

# రాజధర్మం

అదొక అడవి. ఆ అడవిలో ఒక గుహలో వుంటోంది ఒక నక్క. చాలా మంచిది. పళ్ళూ, ఆకులూ తినడం, సాటి జంతువులకు సాయం చెయ్యడం మినహా ఎవరి జోలికీ పోయేది కాదు. ఎవర్నీ మోసగించేది కాదు. అడవిలో వున్న మిగిలిన నక్కలన్నింటికీ దాని ధోరణి వింతగా వుండేది.

"ఇదిగో ఇలా చూడు! నువ్వు పుట్టిన పుటకేమిటి? నువ్వు చేస్తున్నదేమిటి? ఎవరైనా వింటే నవ్విపోతారు. నీకంతగా వేటాడటం ఇష్టంలేకపోతే మేము మాంసం తెచ్చి పెడతాం తిను" అని బ్రతిమిలాడేవి. అయినా గుహలోని నక్క మాంసాహారాన్ని ససేమిరా స్వీకరించనని పలికేది.

నక్క కులంలో తప్పబుట్టావు అంటే "తప్ప పుట్టటం కాదు. తప్పనిసరై పుట్టాను. సరే సరే, మీరు వెళ్ళండి. నేను జపం చేసుకోవాలి" అని వాటికి వీడ్కోలు చెప్పేది. ఆ నక్కకి తన పూర్వజన్మ గాథ అంతా గుర్తు వుంది.

పూర్వజన్మలో 'పురిక' అనే పట్టణానికి తను రాజుగా ఉండేది. అనేక దుర్మార్గాలు చెయ్యటంవల్ల ఇప్పుడీ నక్క జన్మ ప్రాప్తించింది. అప్పుడు తన పేరు పౌరికుడు. 'ఇప్పుడంతా జ్ఞాపకం వుండి కూడా మళ్ళీ అలాంటి దౌర్జన్యాలు, హింసలు చేస్తే నాకు విముక్తి ఎప్పుడు?' అని విచారించేది. ఒకరోజు గుహలోకి ఎవరో వస్తున్న చప్పుడు వినబడింది.

'పిచ్చినక్కలు మళ్ళీ వస్తున్నాయి కాబోలు' అనుకుంటూ తలెత్తి చూసి ఆశ్చర్యపోయింది. తన కళ్ళను తనే నమ్మలేకపోయింది.

ఆ వచ్చేది నక్కలు కావు, పులిరాజు. ఎంతో వినయంగా తనవేపు వస్తున్నాడు.

"అయ్యా! నువు చాలా ఉత్తముడవని తెలిసింది. నాతోపాటు వచ్చేయి. నీ స్నేహాన్ని కోరుకుంటున్నాను నేను. నీకు తెలిసిన మంచి విషయాలు నాకు చెబుతూ నన్ను సన్మార్గంలో నడిపించు. లోకంలో నాకు వచ్చిన క్రూరకర్ముడనే పేరు పోగొట్టు" అని వేడుకున్నాడు పులిరాజు.

"రాజచంద్రమా! నువు చాలా గుణవంతుడిలా కనిపిస్తున్నావు. అయినా నేను నిన్నాశ్రయించలేను. పైగా నాకు సుఖాలమీద, భోగభోగ్యాలమీద మమకారం లేదు. అందువల్ల నీతోపాటు రాలేను" అంది నక్క.

"పోనీలే! నాతోపాటు రాకపోయినా, నాతో సఖ్యంగా వుంటూ నాకు కార్యాకార్యాలు, మంచిచెడ్డలు చెబుతూ వుండు" అన్నాడు పులిరాజు.

"నువ్వు చెప్పింది బాగానే ఉంది. కానీ నేను, నువ్వూ అంత స్నేహంగా వుంటే నీతోటి వాళ్ళు అసూయ పడతారు. మనిద్దరికీ భేదం కల్పించడానికి ప్రయత్నిస్తారు. దానివల్ల కీడు సంభవిస్తుంది. ఎందుకొచ్చిన తంటా! నన్నొదిలేయి".

"లేదు, మహాత్మా! నీమీద ఎవరేం చెప్పినా నేను వినను. అలా అని ప్రతిజ్ఞ చేస్తాను సరేనా?" అంది వ్యాఘ్రం.

నక్క సరేనని బయలుదేరింది.

అప్పటినుంచీ పులితో స్నేహంగా వుంది.

ఒకనాడు పులిరాజు భృత్యులంతా ఒకచోట చేరారు. ఇన్నాళ్లకు ముసలినక్క ఒకతె వచ్చి పులిరాజుకు పెద్ద మంత్రయి కూర్చున్నందుకు వాటికి కడుపుమంటగా ఉంది. "ఈ నక్క వినయాల ముందు, మనమూ మన బుద్ధులూ ఎందుకూ

పనికిరావడం లేదన్న మాట! ఇంక మనమందరం ఎందుకూ దిష్టిపిడతల్లాగా! రాజగౌరవం లేకపోయిన తరువాత చావడం మేలు" అనుకున్నారు పులిరాజు భృత్యులందరూ.

"సరే అదంతా అలా వుంచి ఇప్పుడు చెయ్యవలసిందేమిటో చెప్పండి" అన్నారొకరు. అక్కడినుంచీ తర్జనభర్జనలు మొదలయ్యాయి.

"ఈ నక్క ఏదో మహా తపస్వి అని మన రాజు అనుకుంటున్నాడు. ఓ పని చేద్దాం! పులిరాజు తినే మాంసం ఎలాగో అలా దొంగిలించి ఆ ముసలినక్క ఉండే గుహలో దాచిపెడదాం. దెబ్బతో ఈ నక్క చేసే పూజలు, వ్రతాలు అంతా కల్లబొల్లి నాటకమని తేలిపోతుంది. పైగా దానిమీద దొంగతనం కూడా అంటగట్టొచ్చు" అని ఒకడు ఆలోచించి ఉపాయం చెప్పాడు. అందరికీ నచ్చింది.

పులిరాజు తినే మాంసం ఓరోజు గుహలో కనిపించలేదు. వెదుకుతోంది నక్క.

"మిత్రమా! ఏమిటంతలా వెదుకుతున్నావు?" అన్నాడు పులిరాజు.

"నీ ఆహారం గుహలో లేదు. ఎవరో దొంగిలించారు" అంది నక్క.

పులిరాజు తన భృత్యులందర్నీ పిలిచి నాలుగుమూలలకూ పంపించాడు.

"నేను కూడా వెతుకుతాను" అని పులిరాజు కూడా సేవకులతో బయల్దేరాడు.

వెతుకుతూ వెతుకుతూ నక్క గుహ దగ్గరకు వెళ్ళేసరికి వాసన వచ్చింది. లోపలికి వెళ్ళి చూశాడు పులిరాజు.

"ఎంత మోసం!" పళ్ళు పటపట కొరికాడు.

"మహారాజా! ఇదంతా మీరే స్వయంగా తెలుసుకోవడం మా అదృష్టం. లేకపోతే నక్కేమిటి - తపమేమిటి? ఇవేళ యిది మాయమైంది, రేపు ఇంకోటవుతుంది. మీ ఆజ్ఞకు భయపడి ఇన్నాళ్ళూ వూరుకున్నాం గానీ దీనిసంగతి ఇదివరకే తెలుసు మాకు" అని లేనిపోనివి నూరిపోశారు భృత్యులు.

"వెళ్ళండి. వెళ్ళి ఆ ముసలి నక్కను బంధించి వధించండి" అని పులిరాజు ఆగ్రహంతో ఆజ్ఞాపించాడు.

ఇంతలో పులిరాజు తల్లి వచ్చింది. "ఆగు. వివేకం లేకుండా ఎంతపని చేస్తున్నావు! **భృత్యులు చెప్పినదంతా తలకెక్కించుకుని ఎదుటివాణ్ణి నిందించేవాడూ, శిక్షించేవాడూ రాజుగా వుండతగడు. బుద్ధిమంతుణ్ణి చూసి దుర్బుద్ధులూ, అధికుణ్ణి**

**చూసి హీనులూ ఈర్ష్య పడతారు. ఇలాంటివాళ్ళ మూలంగానే ఒకప్పుడు ధర్మం అధర్మంలా గోచరిస్తుంది. అధర్మం ధర్మంలా కనిపిస్తుంది. ధార్మికుడైనవాడు అలాంటి సమయంలో మనసు కలతబరుచుకోకుండా వివేకంతో ఆలోచించాలి.** రాజు దగ్గర సమర్థుడూ, హితుడూ అయిన మంత్రి వుంటే తమ ఆటలు సాగటం లేదని భృత్యులు రకరకాల నాటకాలు ఆడతారు. వాళ్ళనో కంట కనిపెట్టి వుండాలి" అంది.

పులిరాజు శాంతంగా ఆలోచించాడు. సేవకుల మాటల మాటున దాగిన వంచన స్ఫురించింది.

వెంటనే నక్కను పిలిపించి, "మహాత్మా! పొరపాటు జరిగిపోయింది. మన్నించండి. దుర్మార్గులైన నా భృత్యులను దండిస్తాను" అని దీనంగా వేడుకున్నాడు పులిరాజు.

"పులిరాజా! తెలిసైనా తెలియకైనా ఒకరిని అనుమానించడం మొదలుపెట్టాక కలిసివుండటం, తిరిగి కలుపుకోవాలనుకోవడం ఇద్దరికీ వివేకం కాదు. ఒకవేళ మీరు నాతో సఖ్యంగా వుండాలనుకున్నా ఇక నాకిక్కడ వుండటం ఇష్టంలేదు. నీ భృత్యుల వల్ల ఇలా జరుగుతుందని ముందే చెప్పాను నీకు. నా గౌరవం మంట గలిశాక నేను క్షణం వుండను" అని నక్క పులిదగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయింది. నిరాహారదీక్షతో శరీరం విడిచి సద్గతి పొందింది.

రాజశ్రేష్ఠుడు ఎన్నడూ చెప్పుడు మాటలకు లొంగిపోకుండా కీడూ, మేలూ విచారించి, మంచివాళ్ళనూ, చెడ్డవాళ్ళనూ గుర్తెరిగి మసలుకోవాలని చెబుతూ ధర్మరాజుకు నారదమహర్షి యీ కథ చెప్పాడు. ●

# ఋష్యశృంగుడు

**పూ**ర్వం ఒకప్పుడు అంగదేశంలో తీవ్రమైన కరువు కాటకాలొచ్చాయి. "ఈ కష్టకాలంలో కరువుల బాధనుండి ప్రజలను ఎలా కాపాడడం?" అని ఆ దేశపు రాజు రోమపాదుడు పురోహితులతో చర్చించాడు.

"ఇంతవరకు స్త్రీని చూడకుండా సంపూర్ణ బ్రహ్మచర్యం అవలంబిస్తూ వున్న ఋష్యశృంగుణ్ణి రాజధానికి పిలిపించండి. మహా తపశ్శాలి అయిన ఆ మహాను భావుడు మన నగరంలో కాలు మోపగానే వానలు కురుస్తాయి" అన్నారు పురోహితులు.

విభాండక మహాముని కుమారుడు ఋష్యశృంగుడు. ఋష్యశృంగుడు చిన్నతనం నుంచి ఒక్క తన తండ్రిని తప్ప మరొక మనిషిని చూడలేదు. స్త్రీలు, పురుషులు పేరిట సృష్టిలో ఒక విభజన వున్నదని కూడా తెలీదు. ఆ విధంగా శుద్ధ బ్రహ్మచారిగా పెరిగాడు.

విభాండక మహాముని ఆశ్రమం నుంచి ఋష్యశృంగుడ్ని ఏ విధంగా రప్పించాలనేది రోమపాదుడికి సమస్య అయింది. మంత్రులతో ఆలోచన చేసిన పిమ్మట రాచనగరులో వున్న సుందరాంగుల్ని కొందరిని పిలిపించి, “మీరు విభాండక ముని ఆశ్రమానికి పోయి ఆ వనంలో తపస్సు చేసుకుంటున్న ఋషికుమారుణ్ణి ఏదో ఒకవిధంగా మన రాజధానికి తీసుకురావాలి” అని ఆజ్ఞాపించాడు. సరే అని ఆ వారకాంతలు మున్యాశ్రమానికి బయల్దేరి వెళ్ళారు. వారు వెళ్ళిన సమయానికి విభాండకముని ఆశ్రమంలో లేడు. ఇదే మంచి అవకాశమని వారందరిలోకీ అద్భుత సౌందర్యంతో వెలిగిపోతున్న ఒక విలాసవతి ఆశ్రమంలో వున్న ఋషికుమారుడి దగ్గరకు వెళ్ళింది. “మునివరా! క్షేమమా? మీకు కావలసిన కందమూలాలు లభ్యమవుతున్నాయా? మీ తపస్సు నిరాఘాటంగా కొనసాగుతోందా? వేదాధ్యయనం సక్రమంగా కొనసాగుతోందా? తండ్రిగారు ఎలా ఉన్నారు?” అని కుశల ప్రశ్నలు వేసింది.



అటువంటి సుందరాకారంలో వున్న మనిషిని కానీ, అటువంటి మధురస్వరం కానీ పాపం ఋష్యశృంగుడు అంతకుమునుపు కనలేదు, వినలేదు. మెరుపులా మెరిసిన ఆ సుందరిని చూడగానే ఋషికుమారుడి మనస్సులో కలవరం మొదలైంది. అతనికి స్త్రీ పురుష భేదం తెలీదు కనుక ఆ వచ్చింది మునికుమారుడే అనుకున్నాడు.

అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి, "మీ ఆశ్రమం ఎక్కడ? మీ వ్రత నియమాలేమిటి?" అని అడిగాడు.

"మా ఆశ్రమం ఇక్కడికి మూడామడల దూరంలో వుంది" అంటూ ఆమె తాను తెచ్చిన భక్ష్యాలూ, పండ్లూ స్వయంగా తినిపించింది. సువాసనలు వెదజల్లే పూలహారాలు మెళ్ళో వేసింది. అలా కొంతసేపు గడిపి, విభాండక మహాముని వచ్చేవేళకు "అగ్నిహోత్రానికి వేళ అయింది" అని సాకు చెప్పి తప్పించుకుంది.

విభాండకుడు వచ్చేసరికి ఆశ్రమం అంతా చెల్లాచెదురుగా వుంది. పూలూ, పండ్లతొనలూ చిందర వందరగా పడి వున్నాయి. ఇదంతా పరికించి "అబ్బాయీ! నేను లేని సమయంలో నీ దగ్గరకెవరైనా వచ్చారా? ఎందుకలా అన్యమనస్కంగా కన్పిస్తున్నావు?" అని అడిగాడు.

"నాన్నగారూ! మీరు లేని సమయంలో అద్భుతరూపంలో వున్న ఒక మహనీయుడు ఇక్కడకు వచ్చాడు. ఆమాట, ఆ ఆకారం నా మనస్సున నాటుకుపోయాయి. ఆ మూర్తిని చూడకుండా ఉండలేను. అతడితో స్నేహం చేయాలని ఉంది" అని చెప్పాడు.

విభాండకుడికి విషయం తెలిసిపోయింది.

తమ తపస్సును భంగం చెయ్యడానికి ఎవరో రాక్షసులు వచ్చారనుకుని "నేను లేనప్పుడు ఎవరినీ ఆశ్రమానికి రానివ్వకు!" అని గట్టిగా చెప్పాడు.

ఒకనాడు మళ్ళీ విభాండకుడు లేని సమయం చూసి ఆ సుందరి మెల్లగా ఋష్యశృంగుడ్ని సమీపించింది. ఆమెను చూడగానే భరింపరాని మోహంతో ఋషికుమారుడు ఆమె దగ్గరకు పరుగెత్తాడు. ఆ జవ్వని మాటలతో ఋష్యశృంగుణ్ణి మైమరపిస్తూ మెల్లగా అడవి దాటించి తన సఖులను కలిసింది. వారంతా కలిసి ఋష్యశృంగుడ్ని అంగదేశానికి తీసుకుపోయారు.

ఋష్యశృంగుడు అంగదేశంలో అడుగు పెట్టగానే వానలు కురిశాయి. ప్రాణికోటి సేదతీరింది. నేల పచ్చబారింది. రోమపాదుడు సంతోషించి తన కుమార్తె శాంతను ఋష్యశృంగుడికిచ్చి పెళ్ళి చేశాడు.

అన్నీ అనుకున్న ప్రకారం నెరవేరినప్పటికీ, విభాండక మహాముని ఆగ్రహిస్తాడని భయపడ్డాడు రాజుగారు. అందుకని మునిని శాంతపరచటం కోసం రాజధానికి వచ్చే మార్గాలలో చక్కని కగ్రి ఆవులనూ, ఎద్దులనూ నిలిపి పరిజనాన్ని

కాపు ఉంచాడు. "ఈ ఆవులూ, ఎడ్లూ, మేకలూ, భూములూ మీ కుమారుడివి. మేము మీ సేవకులం" అని వినయంగా మాట్లాడమని భటులను హెచ్చరించాడు.

అనుకున్నట్టు కొడుకును వెతుక్కుంటూ మహాముని రానేవచ్చాడు. రాజాజ్ఞ ప్రకారం పరిచారకులు మునీంద్రుడికి స్వాగతం ఇచ్చి చేయవలసిన సపర్యలన్నీ చేశారు. కోపం చాలావరకూ చల్లార్చి ఆయనను పట్టణంలో ప్రవేశపెట్టారు. రాజాంతః పురంలో సకల ఐశ్వర్యాలు అనుభవిస్తున్న కొడుకునీ, పక్కనే వినయంగా తలవంచుకుని నిలబడ్డ కోడల్నీ చూసిన విభాండకమునికి ఆనందం కలిగింది. "నాయనా! ఋష్యశృంగా! ఈ రాజుకు ప్రియమైనదంతా చెయ్యి. ఒక కుమారుడు కలిగిన తరువాత మీరు అరణ్యాలకు రావచ్చు" అని ఆశీర్వదించి వెళ్ళిపోయాడు. తండ్రి ఆనతి ప్రకారం ఋష్యశృంగుడు సంతానవంతుడై, ఆ వెనుక వానప్రస్థాన్ని స్వీకరించాడు. ●

# మిత్రద్రోహం

అది మహారణ్యం.

అక్కడో బ్రహ్మాండమైన మర్రిచెట్టు వుంది.

ఒకతను రొప్పుతూ రోస్తూ వచ్చి ఆ చెట్టుకు జేరబడ్డాడు. ఇంతలో రివ్వున కిందకి దిగింది ఓ కొంగ. అతని ఎదురుగుండా నిలబడి "అయ్యా! ఏమిటిలా ఆయాసపడుతూ పరుగెత్తుకు వచ్చావు! ఈ మర్రిచెట్టు నాదేలే. హాయిగా విశ్రాంతి తీసుకో. తీరికగా తరువాత నీ వివరాలు చెబుదువుగాని" అంది మానవుల భాషలో.

ఆ మాటలు ఆశ్చర్యంగా విన్నాడతను.

మొదట కొంచెం భయపడ్డాడు. తరువాత ధైర్యం తెచ్చుకుని "బకరాజమా! నువ్వు చాలా మంచివాడివిలా వున్నావు! నా పేరు గౌతముడు. మా తల్లిదండ్రులు ఉత్తములు. నేనే అపమార్గాన పడి చదువుసంధ్యలు మానేశాను. వయసొచ్చాక ఓ బోయపిల్లను ప్రేమించి పెళ్ళాడాను. అంతే! ఇంక అప్పటినుంచి బోయవాళ్ళతో

కలిసిపోయి విప్రకర్మలన్నీ వదిలేశాను. వేటకు వెళ్ళడం, మాంసం తినడం నేర్చుకున్నాను. కొన్నాళ్ళకు నాకెందుకో వ్యాపారం చేసి డబ్బు సంపాదించాలని బుద్ధి పుట్టింది. కొందరు వర్తకులు దేశాంతరం వెడుతుంటే నేనూ బయలుదేరాను. భయంకరంగా వున్న ఓ అరణ్యంలో అడవి ఏనుగు ఒకటి మమ్మల్ని తరుముకు వచ్చింది. తలో దిక్కుగా పరుగెత్తాం. అదృష్టవశాత్తూ నేను నీ దగ్గరకు చేరాను. నువ్వే నన్ను రక్షించాలి" అన్నాడు.

"నీకేం భయం లేదు" అని అభయమిచ్చింది కొంగ.

"మిత్రమా! నీ పేరేమిటి? ఇక్కడ ఎందుకుంటున్నావు?" అని అడిగాడు గౌతముడు.

"నా పేరు రాజధర్ముడు. ఈ మర్రిచెట్టు నా నివాసస్థానం. నువ్వు బాగా అలసిపోయి వున్నావు! ఉండు, ముందు నీకు కొంచెం ఆహారం పెడతాను" అని కొన్ని చేపలు పట్టుకొచ్చింది.

"ఉడకబెట్టిన చేపలివి. తిని హాయిగా నిద్రపో. నీ దారిద్ర్యం తీరే మార్గమేదో రేపు చెబుతాను" అంది కొక్కెర.

గౌతముడు రాజధర్ముడు పెట్టిన చేపలు తిని, సుఖంగా చెట్టు నీడన నిద్రపోయాడు.

తెల్లవారింది.

"అయ్యా! అదిగో ఆ కనబడే దారివెంట మూడు యోజనాల దూరం వెళ్ళావంటే మధువజ్రమనే పట్టణం వస్తుంది. దాన్ని విరూపాక్షుడనే రాక్షసరాజు పరిపాలిస్తున్నాడు. అతడు నాకు స్నేహితుడు. నువ్వు అతని దగ్గరకు వెళ్ళి నేను పంపించానని చెప్పు. నీకు కావలసినంత బంగారం, రత్నాలు ఇస్తాడు" అన్నాడు రాజధర్ముడు.

గౌతముడు విరూపాక్షుణ్ణి దర్శించి తనను రాజధర్ముడు పంపినట్టు చెప్పాడు. రాక్షసరాజు సంతోషించి గౌతముడికి అతను మొయ్యగలిగినన్ని మణులూ, బంగారం ఇచ్చాడు. గౌతముడు బ్రహ్మానందపడ్డాడు. విరూపాక్షుడి దగ్గర శెలవు తీసుకుని మళ్ళీ మర్రిచెట్టు దగ్గరకు వచ్చాడు.

రాజధర్ముడు గౌతముడి కోరిక తీరినందుకు చాలా సంతోషించాడు. మిత్రుడికి ఆతిథ్యమిచ్చి శయ్య అమర్చాడు.

గౌతముడు సాగబోయే ప్రయాణాన్ని గురించి ఆలోచించుకుంటున్నాడు. 'మళ్ళీ రేపటినుంచి ఎన్నాళ్ళు ప్రయాణం చేస్తేనో తమ ఊరు! అరణ్యంలో ఆహారం దొరకదు. ఏం చెయ్యాలి?' అనుకుంటూ పైకి చూశాడు. మర్రిచెట్టు మీద కొమ్మలమధ్య ఆదమరచి నిద్రపోతున్న రాజధర్ముడు కనిపించాడు. 'ఈ కొంగ బాగా పుష్టిగా వుంది. దీని శరీరంలో చాలా మాంసం ఉంటుంది. ఇప్పుడు దీన్ని చంపి మూటకట్టుకుంటే ఇంటికెళ్ళేవరకూ దిగులుండదు' అనుకున్నాడు.

వెంటనే కర్ర తీసుకుని చెట్టెక్కాడు.

రాజధర్ముడి తలమీద, మెడమీద దబదబా మోదేశాడు. ఆ కళేబరాన్ని తీసుకుని కిందకు దిగి ఈకల్ని పీకి, ఎముకలూ, పేగులూ తీసేసి మాంసమంతా మూటకట్టుకున్నాడు. తెల్లవారగానే ధనరాశులతోపాటు ఆ మూట కూడా భుజాన వేసుకుని ఉడాయించాడు. విరూపాక్షుడికి ఈ సంగతి తెలీక రాజధర్ముణ్ణి చూడాలనుకుని మరునాడు భటులను పంపాడు. కాసేపటికి వాళ్ళు తిరిగొచ్చి తాము తెచ్చిన రాజధర్ముడి ఎముకలగూడును మహారాజుకు అందించారు.

"నా మిత్రుణ్ణి చంపిన పాపాత్ముడెవరు?" గర్జించాడు విరూపాక్షుడు.

"నిన్న మనదగ్గర రత్నాలూ, బంగారమూ పట్టుకు వెళ్ళినవాడే మహాప్రభూ!" అంటూండగానే మరికొందరు రాక్షసులు హుటాహుటిన నలుదిక్కులకూ పరుగెత్తి కెళ్ళి గౌతముణ్ణి బంధించి తీసుకువచ్చారు. దుఃఖంతో, ఆగ్రహంతో రాక్షస రాజు, "ఈ దుర్మార్గుడ్ని నరికి చంపండి" అని ఆదేశించాడు.

రాజాజ్ఞ ప్రకారం గౌతముణ్ణి ఊరు వెలుపలకు తీసుకుపోయి తల నరికి పారేశారు. విరూపాక్షుడు దుఃఖిస్తూ రాజధర్ముడికి దహన సంస్కారం చేసి వచ్చాడు. ఇంతలో ఇంద్రుడు అతని దగ్గరకు వచ్చాడు.

"రాక్షసరాజా! ఎందుకేడుస్తావు? రాజధర్ముడి అస్తిపంజరానికి నువ్వు సంస్కారం చేసి వచ్చాక అక్కడికి కామధేనువు వచ్చింది. ఆ చితి సమీపంలో నిలబడి అది దూడకు పాలిస్తుంటే ఆ పాలనురుగు గాలికెగిరి చితిమీద పడింది. అందువల్ల నీ మిత్రుడు సజీవుడయ్యాడు" అని చెబుతుండగానే రాజధర్ముడు నవ్వుతూ రానే వచ్చాడు. వచ్చి, "మహేంద్రా! నా యందు దయవుంచి గౌతముణ్ణి కూడా బ్రతికించు! సజ్జన సాంగత్యం లేక పాడయ్యాడు. మనుష్యుల **దారిద్ర్యం పోవడానికి మంచి మిత్రుడూ, వెండి, బంగారం, బుద్ధి అనే నాలుగూ మూల కారణాలని బృహస్పతి చెప్పాడు. ఈ**

**నాలుగింటిలోనూ మంచి స్నేహితుడే చాలా ఎక్కువ** అన్న సంగతి ఈ అమాయకుడికి తెలిసినట్టు లేదు" అన్నాడు జాలిగా.

ఇంద్రుడు రాజధర్ముడి దయార్ద్రహృదయాన్ని మెచ్చుకుని గౌతముణ్ణి బతికించాడు. భటులు మళ్ళీ అతని ధనమంతా అతనికిచ్చేశారు. కృతజ్ఞతతో చేతులు జోడిస్తూ ఆ ధనరాశులతో వెళ్ళిపోయాడు గౌతముడు.

ఈ కథనే కాశ్యపగౌతమాఖ్యానమంటారు. మిత్రద్రోహం కృతఘ్నత కంటే కూడా దారుణమైన పాతకం అని చెబుతూ భీష్ముడు ధర్మరాజుకీ కథ చెప్పాడు. ●

# ఆర్తరక్షణ

**కుం**డపోతగా కురుస్తోంది వాన. దిక్కుతోచక అడవిలో చెట్టుకింద రాతిమీద దుఃఖిస్తూ కూలబడ్డాడో బోయ. పక్షుల్ని వేటాడి చంపి తినడం, అమ్ముకోవడం అతగాడి వృత్తి. అందుకే ఆవేళప్పుడు అక్కడ చిక్కుకున్నాడతను.

అప్పుడే అటుగా తన భార్యను వెతుక్కుంటూ వెడుతూన్న ఓ పావురం బోయవాణ్ణి చూసింది. అతని పక్కనే పక్షులను పట్టే సాధనాలు వున్నాయి. పక్షికి వాటిని చూడగానే భయమేసింది.

'పొద్దునననంగా వెళ్ళింది నా భార్య. ఎక్కడుందో, ఏమైపోయిందో! అది లేకుండా నేను బతకగలనా? పొద్దుటినుంచీ ఇల్లంతా పాడుబడినట్టుంది. ఈ వానలో ఎక్కడైనా చిక్కుకుని చచ్చిపోయిందేమో! లేకపోతే ఏ బోయకైనా చిక్కిందో! అయ్యో! ఏం చెయ్యను' అంటూ దుఃఖంతో ఆక్రోశించింది.

దాని ఏడుపు ప్రియురాలికి వినిపించింది.

"ఇక్కడున్నాను" అంది.

"ఎక్కడ"– పెంటి గొంతు గుర్తుపడుతూనే ఆత్రంగా చుట్టూ చూసింది మగపక్షి.

"ఇదిగో! ఈ చెట్టుకింద బోయవాడి వలలో చిక్కుకున్నాను" అంది.

"అయ్యో! వలలో చిక్కుకున్నావా?" అని పెద్దగా ఏడ్చింది పావురం.

"శరీరాలు శాశ్వతం కాదు. మంచితనం ఒక్కటే మిగిలేది. **శరణు జొచ్చినవాణ్ణి రక్షించటం కంటే మించిన ధర్మం ఏదీ లేదని పెద్దలు చెబుతారు.** పాపం! ఈ బోయవాడు ఆకలికి, చలికి తట్టుకోలేక ఆర్తుడై ఈ చెట్టు కిందకి వచ్చాడు. మేత కోసం బయలుదేరిన నేను ప్రమాదవశాత్తూ ఇతని వలలో చిక్కుకున్నాను. నువ్వు నాకోసం విచారించకు. మన గూటికి వచ్చిన అతిథిగా భావించి ఈ బోయ సంగతి విచారించు" అని ఆడపక్షి ఓదార్చింది.

వెంటనే పావురం కిరాతుడి ఎదుట నిలబడి "అయ్యా! నువ్వు చాలా అలిసిపోయినట్టున్నావు. అనుకోకుండా వర్షంలో చిక్కుకుని ప్రయాసకు గురి అయ్యావు. నీకేం కావాలో చెప్పు" అంది.

"పక్షిరాజమా! ఎంత దయగల దానివి నువ్వు! చలితో అవయవాలన్నీ వంకరలు పోయాయి. ఎలాగైనా ఈ చలిబాధ నుంచి రక్షించు" అన్నాడు.

పావురం త్వరత్వరగా వెళ్ళి తన గూటిలో దాచుకున్న ఎండుపుల్లలు కొన్ని ముక్కున కరచుకుని వచ్చింది. చెట్టుకింద ఒక రాతిమీద వాటిని పోగుపెట్టి నిప్పంటించి మంటచేసింది.

"అయ్యా! ఈ మంటతో చలి కాచుకో! లే!" అంది.

"గువ్వా! నువ్వెంత మంచిదానివి!!" అని మెచ్చుకుని కిరాతుడు హాయిగా ఒళ్ళంతా కాచుకున్నాడు.

చలి బాధ తీరేసరికి బోయకు ఆకలి వేసింది.

"కపోతమా! బాగా ఆకలేస్తోంది" అన్నాడు.

పాపం పావురం ఆ మాట విని వెలవెలబోయింది. కాసేపు ఆలోచించాక "అయ్యా! దాచిపెట్టుకునే ఆహారం పక్షులకేముంటుంది? ఆకలేసినప్పుడు ఏది దొరికితే అదే తింటాం మేము. నువ్వంతగా క్షుద్బాధకు తాళలేకపోతే నా శరీరమే ఆహారంగా ఇస్తాను. తీసుకో! ఇంతకంటే నేనేం ఇవ్వగలను?" అంటూ అగ్నికి ప్రదక్షిణం చేసి

తటాలున అందులో దూకింది. అది చూసి ఆశ్చర్యంతో బోయవాడు కొయ్యబారిపోయాడు.

'ఆహా! ఈ పక్షి నా కోసం తన శరీరాన్నే తృణప్రాయంగా ఇచ్చేసిందే! ఎంత దయ! ఎంత త్యాగం! నేను పుట్టినప్పటి నుంచి ప్రాణులను బాధపెట్టడమేగాని రక్షిం చింది లేదు. ఈ చిన్ని పక్షి ఇవేళ గురువై నాకు బోధ చేసింది. ఇంక హింస చెయ్యను నేను! భార్యాబిడ్డల్ని సైతం విడనాడి, ప్రలోభాన్ని విడిచి అభ్యాగతః సంరక్షణ కోసం తన శరీరాన్నే అగ్నికి ఆహుతి చేసిందీ పక్షి! చూపుకు చిన్నది అయినా గుణానికి మిన్న అయినదీ పిట్ట! దీన్ని చూసి బుద్ధి తెచ్చుకుంటాను. మోహం తెగ తెంచుకుంటాను' అనుకుని మనశ్శాంతి పొంది వలలో వున్న పక్షులన్నిటినీ విడిచిపెట్టాడు. వెంటనే ఆడపావురం అగ్ని దగ్గరకు వెళ్ళి వలవల ఏడ్చింది.

"అయ్యో! నేను లేకుండా క్షణమైనా వుండేవాడవు కావే! నువ్వు లేని నన్ను ఎవరు రక్షిస్తారు! ఎవరు ఆదరిస్తారు! నా కింక ఎవరు దిక్కు? నిన్ను విడిచి నేను బతకలేను. నీతోనే వస్తాను. బ్రతుకులోను, మరణంలోను నీకు సహచరినై శాశ్వత సౌఖ్యాన్ని పొందుతాను" అంటూ ఆ కపోతి ప్రదక్షిణ చేసి అగ్నిలో దూకింది. బోయవాడు రెప్ప వెయ్యకుండా చూస్తూ నిలబడిపోయాడు.

ఇంతలో ఆ పక్షి దంపతులు ఒక దివ్య విమానంలో రత్నమయ భూషణాలు ధరించి అప్సరసల అభినందనలు అందుకుంటూ వెళ్ళిపోతూ వుండడం పూర్వజన్మ పుణ్యం వల్ల ఆ బోయకు కనిపించింది.

జన్మ ధన్యమైందనుకున్నాడు.

అరణ్యమార్గాన నడక సాగించాడు.

ఈసారి వాన, చీకటి, మబ్బులు, భయం, ఆకలి, దాహం ఏవీ అనిపించలేదతనికి.

నడుస్తున్నాడు.

నడిచి నడిచి కాళ్ళ చర్మం పగిలింది.

ఆయాసంతో శరీరం తూలుతోంది.

అయినా నడుస్తూనే వున్నాడు.

నవ్వుతూనే వున్నాడు.

కొంతదూరం వెళ్ళాక ఒకచోట అరణ్యాన్నంతా అలుముకుని దహిస్తున్న దావానలం కనిపించింది.

పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తూ నిర్మలమయిన మనస్సుతో ఆ అగ్నిలోకి ప్రవేశించాడు.

బోయ శరీరం కాలి బూడిదయింది.

అతని ఆత్మ దివ్యత్వం పొందింది ●

# చెప్పులూ-గొడుగూ

"ఇదిగో బాణం విడిచిపెడుతున్నా!" శరాన్ని సంధించి జమదగ్ని మహాముని భార్య రేణుకాదేవి వైపు చూశాడు.

"ఊఁ"

"చాలా దూరం వెడుతుంది సుమా!"

"ఎంతదూరం వెళ్ళినా తేగలను."

"అలాగేం? సరే! చూడు మరి."

జమదగ్ని బాణం విడిచాడు. రేణుకాదేవి పరుగెత్తింది.

ఆ వేళ వాళ్ళిద్దరికీ సరదాగా ఆటపాటలతో గడపాలని బుద్ధి పుట్టింది. అందుకే పొద్దున్నే బాణాలూ, విల్లూ తీసుకుని బయలుదేరారు. చాలా దూరం నడిచి ఒక ఆరుబయలు ప్రదేశం చేరుకున్నారు.

జమదగ్ని బాణాలు వేయటం, ఆమె పరుగెత్తి ఆ బాణం ఎక్కడ పడిందో కనుక్కొని తెచ్చి యివ్వడం-యిదీ ఆట.

ఆ ఆట యిద్దరికీ నచ్చింది. కానీ తీరా బాణం వేశాక జమదగ్నికి దిగులు కలిగేది.

'పాపం పిచ్చిది! పరుగెత్తుకుంటూ వెళ్ళింది. కనుక్కోగలదో లేదో?' అని మెడ సారించి ముందుకు చూసేవాడు. ఇంతలో రేణుక బాణం తీసుకువస్తూ కనిపించేది.

ముని చూస్తుండగానే రేణుకాదేవి వచ్చింది.

"ఇదిగో బాణం తెచ్చాను!" నవ్వుతూ అందించింది.

"సరే! ఈసారి తీసుకురా చూద్దాం!" ఇంకో బాణం వేశాడు.

ఆవిడ పరుగెత్తింది.

అలా జమదగ్ని వేస్తూనే ఉన్నాడు, ఆమె తెస్తూనే ఉంది. ఆ వినోదంలో కాలం ఎంత గడిచిపోయిందో కూడా తెలీలేదు వాళ్ళకి. ఈసారి బాణం తెస్తానని వెళ్ళిన ఆమె ఎంతసేపటికీ తిరిగి రాలేదు. జమదగ్ని చాలాసేపు ఎదురుచూశాడు. చివరికి కొంతసేపటికి మెల్లిగా నడుస్తూ వచ్చింది రేణుకాదేవి.

"రేణుకా! ఏం ఈసారి యింత ఆలస్యం చేశావు?" ప్రశ్నించాడు జమదగ్ని.

"అలా చూడండి! నడిమింట సూర్యుడు నిప్పులు చెరుగుతున్నాడు. కాళ్ళు బొబ్బలెక్కాయి. తల నొప్పిగా ఉంది. ఆయాసం వచ్చేసరికి కాసేపు ఒక చెట్టు నీడన కూర్చుని వచ్చాను. అందుకని కొంచెం ఆలస్యం అయింది"

ఆమె ఆయాసపడుతూ ముఖం మీది చెమట చీరచెరగుతో తుడుచుకుంటూ చెప్పింది. చంద్రబింబం వంటి రేణుకాదేవి ముఖం ఎర్రబడి బాల భానుబింబ మయింది.

జమదగ్ని హృదయం భార్య పట్ల ప్రేమతో కరిగి నీరయింది. "ఏమిటీ? ఈ సూర్యుడు నిన్ను బాధపెట్టాడా? ఇతగాడి పని చెబుతాను వుండు" అంటూ కోపంతో సూర్యుడివైపు అస్త్రం సంధించాడు.

ఇంతలో ఒక బ్రాహ్మణుడు గబగబ వచ్చి ఆయన చెయ్యి పట్టుకున్నాడు.

''జమదగ్ని మహామునీ! శాంతించు. సూర్యుడు లేకపోతే లోకాలు

జీవిస్తాయా? నువ్వే ఆలోచించు."

"అదంతా నాకు తెలీదు. సూర్యుడు నా భార్యని బాధపెట్టాడు. అందుకు అతను ఫలితం అనుభవించి తీరాలి. అడ్డులే" గర్జించాడు.

మరుక్షణమే "అయ్యా! నా తప్పు క్షమించు. నేనే సూర్యుడ్ని! నన్ను కరుణించు" అంటూ ఆ విప్రుడు జమదగ్నిని ప్రార్థించాడు.



వెంటనే చెప్పులూ, గొడుగూ సృష్టించి, "ఇవిగో! ఈ పాదరక్షలు ధరించి ఈ ఛత్రంతో శిరస్సుకు నీడపడితే నా వేడిమి సోకదు. వీటిని మా తల్లి రేణుకాదేవికి ఇవ్వండి" అని మహర్షికి సమర్పించుకున్నాడు.

జమదగ్ని సంతోషించాడు.

సూర్యుడు అంతర్ధానమయ్యాడు.

ఆ గొడుగునూ, చెప్పులనూ చూసి ప్రజలంతా వేడుకపడ్డారు. తాపసుల తామసం సైతం లోకకళ్యాణాన్ని సాధిస్తుందని సంతోషించి నాటినుంచి రకరకాలుగా తయారు చేసిన చెప్పులూ, గొడుగుల్ని వినియోగించడం ప్రారంభించారు.

సూర్యుడిచేత సృష్టించబడినవి గనుక అవి పవిత్రమైనవి. వాటిని సజ్జనులకు, బీదసాదలకు, సాధువులకు దానం చేస్తే చాలా పుణ్యం. అవి పరమ పవిత్రాలు కనుకే వాటిని పితృకార్యాదులలో వినియోగిస్తారు. ●

# విశ్వామిత్రుడు

**చ్య**వన మహర్షి కుశిక మహారాజు దగ్గరకు వెళ్ళాడు. ఆ రాజు చ్యవనుడ్ని ఘనంగా పూజించాడు. ''మునీంద్రా! మమ్మల్ని ఆజ్ఞాపించి మీ పనులు చేయించుకోండి'' అన్నాడు చాలా వినయంగా. "రాజా! నువ్వూ, నీ భార్యా నాకు ఉపచారాలు చేస్తే చాలు" అన్నాడు చ్యవనుడు. "చిత్తం అలాగే దయచెయ్యి స్వామీ!' అంటూ కుశికుడు ఆయన్ని అంతఃపురంలోకి తీసుకువెళ్ళి హంసతూలికా తల్పం, మణిపీఠం ఏర్పాటు చేశాడు.

"మహారాజా! ఇక నేను విశ్రమిస్తాను. నువ్వూ, నీ భార్యా మేలుకుని నా కాళ్ళు ఒత్తుతూ వుండండి. నా అంతట నేను లేచేవరకూ నన్ను నిద్రలేపకండి!" అన్నాడు మహర్షి. కుశికుడూ, అతని భార్యా నిద్రాహారాలు మాని సేవిస్తున్నారు. అలా నలభైరెండు రోజులు గడిచాయి. ఆ మరునాడు మహర్షి నిద్ర లేచి "రథం తయారుచెయ్యి. దాన్ని నువ్వూ, నీ భార్యా లాగాలి. నేను రథమెక్కి, బంగారం, రత్నాలూ, గోవులూ, గుర్రాలూ యాచకులకు దానమిస్తూ పోతాను" అన్నాడు. సరేనన్నాడు రాజు.

మహర్షికి కావల్సిన ధన వస్తు వాహనాలన్నిటినీ తెచ్చి ఇమ్మని మంత్రులను ఆజ్ఞాపించి తనూ, భార్యా రథం లాగటం ప్రారంభించారు. చ్యవనుడు రథమెక్కి ములుకోలతో వాళ్ళిద్దరినీ నెత్తురు వచ్చేలా బాదుతూ, ఆశ్రితులకు దానాలు చేస్తూ వెళ్ళాడు.



రథం ఊరి చివరకు వెళ్ళగానే అక్కడ దిగాడు మహర్షి. శరీరాలు చిట్లి రక్తం కారుతున్నా రాజదంపతులు చిరునవ్వు నవ్వుతూ వుండేసరికి ఆశ్చర్యపోయాడు. "మహారాజా! పాపం బాగా అలిసిపోయావు. ఇంక నీ పట్టణానికి వెళ్ళిపో, నేను ఇక్కడ తపస్సు చేసుకుంటాను. రేపు నువ్వూ, నీ భార్యా మళ్ళీ నా దగ్గరకు రండి" అని వాళ్ళిద్దరి శరీరాలూ ప్రేమగా నిమిరాడాయన. గాయాలన్నీ పోయి హాయిగా అనిపించింది.

"మునినాథా! మీ హస్త స్పర్శతో మా శరీరాలకు నూతన శక్తి వచ్చింది. శ్రమ, గాయాలూ మాయమైపోయాయి. మీ మహిమను ఏమని పొగడగలం?" అంటూ నమస్కరించి వెనుదిరిగి వెళ్ళిపోయాడు కుశికరాజు. ఆ మరునాడు ఆ ముని వున్నచోటుకి మళ్ళీ వచ్చారు. అక్కడ ఆయన లేకపోగా ఒక విశాలమైన, అందమైన మణిమయ భవనం కనిపించింది. రాజదంపతులిద్దరూ వింతగా దానిచుట్టూ తిరిగారు.

"దేవీ! చూశావా ఇది స్వర్గలోకంలా వుంది. మహర్షి దయవల్ల ఈ శరీరాలతో ఈ ప్రదేశాలు చూడడం మనకు సాధ్యమైంది" అంటూ భార్యతో కూడా ఆ భవంతిలోకి

వెళ్ళాడు కుశికుడు. అందులో ఒక మణిమయ పర్యంకం మీద పడుకుని ఉన్నాడు మహర్షి. తీరా దగ్గరకు వెళ్ళబోయేసరికి ఆయన, ఆ మేడా కూడా మాయమయ్యారు. రాజదంపతులిద్దరూ తెల్లబోయి అటూ, ఇటూ చూసేసరికి ఒకచోట తపస్సు చేసుకుంటూ చ్యవనుడు కనిపించాడు.

"రాణీ! ఈ మహాముని యోగబలం చూశావా? రాజ్యం సులభంగా సంపాదించుకోవచ్చు. కాని ఈ బ్రాహ్మణత్వం, తపస్సు దుర్లభాలు సుమా!" అన్నాడు కుశికుడు. "ఇలా రండి!" కళ్ళు తెరచి పిలిచాడు మహర్షి. ఇద్దరూ సాష్టాంగ నమస్కారం చేశారు.

"మహారాజా! ఇంద్రియాలను జయించావు నువ్వు. ఏం కావాలో కోరుకో!" అన్నాడు చ్యవనుడు. "అయ్యా మిమ్మల్ని సేవించడం కంటే మాకింకేం కావాలి? ఒక్క సంగతి చెప్పండి. మా ఇంటికి వచ్చింది మొదలు మీరు ప్రవర్తించిన విధానం చూస్తే ఆశ్చర్యంగా వుంది. దానికి అర్థమేమిటో తెలియలేదు నాకు" అన్నాడు కుశికుడు.

నవ్వాడు మహర్షి.

"ఒకనాడు బ్రహ్మ ప్రసంగవశాన చెప్పాడు–భృగు కుశిక వంశాలకు సంకరం కలుగుతుందని. అది విని మా వంశానికి సంకరం కలగడం ఇష్టంలేక కుశిక వంశాన్ని నిర్మూలించాలని నీ దగ్గరకు వచ్చాను. నీ దగ్గర ఎప్పుడైనా ఏలోటైనా కనిపిస్తుందేమో శపిద్దామని ఎన్నో నాటకాలు ఆడాను. కానీ నువ్వు ఉత్తముడివి. నీ గొప్పతనం చూసి మెచ్చుకుని, నువ్వూ, నీ భార్యా ఈ శరీరాలతోనే స్వర్గలోకం చూసేటట్టు చేశాను. అది చూసి నువ్వు రాచరికం మీద ఉదాసీనతా, బ్రాహ్మణ్యం మీద ఆసక్తి కనబరిచావు. మంచిది. నీ మనుమడు బ్రహ్మతేజస్వంతుడౌతాడు. బ్రహ్మర్షిగా త్రిలోకపూజ్యుడౌతాడు. నీకు భార్గవ వంశంతో సంబంధం కలుగుతుంది. సుఖంగా వుండు" అని చ్యవనుడు దీవించాడు.

కుశికుడి కొడుకు గాధిరాజు. అతని కూతురు సత్యవతిని భార్గవ వంశస్థుడు ఋచీకుడు పెళ్ళి చేసుకున్నాడు. గాధికి విశ్వామిత్రుడు పుట్టి చ్యవనుడి ఆశీర్వాదం వల్ల బ్రహ్మర్షి అయ్యాడు. ఉత్తమ క్షత్రియ కులమైన కుశిక వంశంలో పరమ బ్రాహ్మణుడైన విశ్వామిత్రుడు ఆ విధంగా జన్మించాడు. ●

# త్రిశంకు స్వర్గం

విశ్వామిత్ర మహారాజు ఒకసారి సపరివారంగా అరణ్యానికి వేటకు వెళ్ళాడు. చాలాసేపు ఏకాగ్రంగా వేటాడి అలసిపోయి చివరకు వశిష్ఠుని ఆశ్రమం చేరుకున్నాడు. మహర్షి ఆయనకు ఘనంగా స్వాగతం చెప్పి అతిథి సత్కారాలు చేశాడు.

విశ్వామిత్రుడు కొంచెం సేద తీరాక "మహారాజా! మీరు, మీ పరివారమూ బాగా డస్సినట్టున్నారు. త్వరగా స్నానాదికాలు కానివ్వండి. భోజనం చేద్దురుగాని" అన్నాడు వశిష్టుడు.

మహారాజు, ఆయన సేవకులు స్నానాలు పూర్తిచేసి వచ్చేసరికి రకరకాల పిండివంటలతో విందు సిద్ధంగా వుంది. స్వల్ప వ్యవధిలో యిన్ని వంటకాలు యీ మహర్షి ఎలా తయారు చేయించాడా అని విశ్వామిత్రుడు విస్తుపోయాడు. రుచికరమైన ఆ విందుభోజనం పూర్తయ్యే సమయానికి రాజుగారి విస్మయం మరింతగా పెరిగిపోయింది. తరువాత వశిష్టుడి దగ్గరకు వెళ్ళి "స్వామీ! షడ్రసోపేతమైన ఇంత కమ్మటివిందు క్షణాల్లో ఎలా తయారు చేయించారు?" అని అడిగాడు.

తాపసి చిరునవ్వు నవ్వి తన ఆశ్రమంలోని "నందిని" అనే కామధేనువు తను కోరినవన్నీ ఇస్తుందని చెప్పాడు.

విశ్వామిత్రుడికి పేరాశ కలిగింది.

ఆ కామధేనువును తాను స్వంతం చేసుకోవాలనుకున్నాడు. "విరాగీ! నీ కామధేనువును నాకివ్వు. బదులుగా నీకు శ్రేష్ఠమైన కోటి పాడిఆవుల్ని ఇస్తాను" అన్నాడు విశ్వామిత్రుడు. వశిష్ఠుడు రాజుగారి కోరికను మృదువుగా తోసిపుచ్చాడు. విశ్వామిత్రుడికి కోపం వచ్చి "రాజ్యంలోని సమస్త వస్తువులూ సకల సంపదలూ మహారాజుకే చెందుతాయి. రాజే అన్నిటికీ అధిపతి" అన్నాడు. వశిష్ఠుడు ఆ మాటను కూడా లెక్క చేయలేదు. దానితో విశ్వామిత్రుడు మండిపడి కళ్ళెర్రచేసి బలవంతంగా నందినిని తీసుకు వెళ్ళబోయాడు. వశిష్ఠుణ్ణి వదలి వెళ్ళటం ఇష్టంలేని నందిని తోక ఝుళిపిస్తూ, కొమ్ములు విసురుతూ, ముంగాళ్ళపై భయంకరంగా నిలబడింది. దాని శరీరం నుంచి అనేక వందల మంది యోధులు బయటకు ఉరికి ఘోరయుద్ధం చేశారు. ఆ యుద్ధంలో విశ్వామిత్రుడి సైన్యం మట్టికరిచింది. చిత్తుచిత్తుగా ఓడిపోయారు. ఇక లాభం లేదనుకుని విశ్వామిత్రుడే స్వయంగా వశిష్ఠుడితో యుద్ధానికి తలపడ్డాడు. విశ్వామిత్రుడు గుప్పించిన బాణాలన్నీ వశిష్ఠుణ్ణి చేరగానే పరిమళ పుష్పాలుగా మారిపోయాయి. మహర్షి తపశ్శక్తి ముందు మహారాజు శౌర్యం, అధికారం, అంగబలం, ఆయుధబలం అన్నీ నిష్ప్రయోజనమయ్యాయి. విశ్వామిత్రుడు పూర్తిగా పరాజితుడై, ఖిన్నుడై రాచనగరుకు తిరిగి వెళ్ళిపోయాడు. అయితే అప్పటినుంచి ఆయనలో వశిష్ఠుడి మీద ద్వేషం పెరుగుతూనే వుంది కాని లేశమైనా తగ్గలేదు. ప్రతీకారం కోసం చేయని ఆలోచన, అన్వేషించని మార్గాలు లేవు.

రాజుకన్నా, రాజ్యాధికారంకన్నా తపశ్శక్తి గొప్పదని, తాపసులు దైవసమానులనీ, మహర్షులు తలచుకుంటే యీ పృథ్వీమీద సాధ్యంకానిదేదీ లేదని విశ్వామిత్రుడు తెలుసుకున్నాడు. రాజ్యాన్ని బంధువులకు అప్పగించి అరణ్యాలకు వెళ్ళి ఆశ్రమాన్ని నిర్మించుకుని దీక్షతో తపస్సు చేయడం ప్రారంభించాడు. నిశ్చలధ్యానంతో మహాజ్ఞానాన్నీ, అద్భుతశక్తుల్నీ సంపాదించాడు. తపశ్శక్తి పెరుగుతున్నకొద్దీ వశిష్ఠుడి మీద పగ, ప్రతీకారం కూడా పెరుగుతూనే వచ్చాయి. ఇద్దరిమధ్య అగాధం ఎక్కువైంది.

సూర్యవంశానికి చెందిన త్రిశంకు మహారాజు శరీరంతోనే స్వర్గం

చేరాలనుకుని వశిష్ఠుణ్ణి ఆశ్రయించాడు. అది సాధ్యం కాదని మహర్షి చెప్పాడు. ఈ విషయం విశ్వామిత్రుడికి తెలిసి శరీరంతోనే స్వర్గం చేరుస్తానని రాజుకు హామీ ఇచ్చాడు. దానికోసం ఆయన ఒక బ్రహ్మాండమైన యాగాన్ని కూడా నిర్వహించాడు. అయితే వశిష్ఠుడు ఆజ్ఞాపించినందువల్ల మునులెవరూ ఆ యాగంలో పాల్గొనలేదు. విశ్వామిత్రుడొక్కడే యాగాన్ని పూర్తిచేసి తన శక్తిని నిరూపించుకున్నాడు. అదే తపశ్శక్తితో త్రిశంకుణ్ణి మెల్లగా శరీరంతోనే పైకి తీసుకువెళ్ళాడు.

తీరా త్రిశంకుడు స్వర్గం చేరబోతుండగా మానుషమాత్రుడెవరో సశరీరుడై స్వర్గద్వారం దాటి వస్తున్నాడని దేవతలు గ్రహించి పరుగు పరుగున ఇంద్రుడి దగ్గరకు వెళ్ళారు. ఇంద్రుడు జరిగిందంతా తెలుసుకుని, కోపగించి, త్రిశంకుణ్ణి కిందకు ఒక్కతోపు తోయగానే అతను తలక్రిందులుగా నేలమీదకు వచ్చిపడుతూ "విశ్వామిత్రా రక్షించు" అని బిగ్గరగా ఆర్తనాదాలు చేశాడు. విశ్వామిత్రుడు ఆ కేకలు విని ఆకాశం నుంచి కిందకు తలక్రిందులుగా వస్తున్న త్రిశంకుణ్ణి మంత్రశక్తితో అలాగే నిలిపి వుంచి, అతడి కోసం మరో స్వర్గం సృష్టించాడు. కొత్తగా నెలకొల్పిన స్వర్గం కోసం విశ్వామిత్రుడు మరో ఇంద్రుణ్ణీ, దేవతలనూ సృష్టించబోయాడు. దేవతలు భయపడిపోయి సమాంతర దేవతలను సృష్టించవద్దని విశ్వామిత్రుణ్ణి అర్థించవలసిందిగా ఇంద్రుణ్ణి కోరారు. ఇంద్రుడు విశ్వామిత్రుడి దగ్గరకు వెళ్ళి త్రిశంకుడికి తన స్వర్గంలోనే స్థానం కల్పిస్తానని మాట ఇచ్చిన మీదట విశ్వామిత్రుడు ఆ ప్రయత్నం విరమించుకున్నాడు. ఇంద్రుడు తక్షణమే బంగారు విమానాన్ని తీసుకువచ్చి త్రిశంకుణ్ణి స్వర్గానికి తీసుకువెళ్ళాడు. ●

# అభ్యాగతః స్వయం విష్ణుః

**కు**రుక్షేత్రంలో ఒక పేద బ్రాహ్మణుడు ఉంఛవృత్తి చేసుకుంటూ జీవిస్తుండేవాడు. పొలంలో నేలమీద రాలిపోయిన ధాన్యం ఏరుకుంటూ అతడూ, అతడి భార్యా, కొడుకూ కోడలూ కాలం గడుపుతూండేవారు. ఇలావుండగా ఒకప్పుడు వర్షాలు లేక దేశంలో పెద్ద కరువు వచ్చింది. బిచ్చమెత్తుకున్నా ఏమీ దొరికేది కాదు. ఎక్కడ చూసినా జనం తిండిలేక అల్లాడిపోతున్నారు. పాపం ఆ బీద బ్రాహ్మణ కుటుంబం ఎన్నో రోజులు పచ్చి మంచినీళ్ళు పుచ్చుకుని వుండిపోవలసి వచ్చేది.

ఒకనాడు ఎలాగైతేనేం తిరిగి తిరిగి ఆ బ్రాహ్మణుడు ఒక శేరు జొన్నలు సంపాదించుకుని ఇల్లు చేరాడు. ఆ శేరు జొన్నలూ పిండి చేసుకుని నలుగురూ సమానంగా పంచుకు తిందామనుకున్నారు. సరిగా ఆ సమయానికి ఒక వృద్ధుడు మండుటెండలో అలసిపోయి ఆకలితో అక్కడికి వచ్చాడు. అతిథి ఎవరో వచ్చారని ఆ గృహస్థు ఎదురువెళ్లి ఆయనను లోపలకు తీసుకువచ్చాడు.

ఉపచారాలు చేశాక, "స్వామీ! నేను పేదవాణ్ణి. మీరేమీ అనుకోకుండా నేను పెట్టింది ఆరగించి నన్ను ధన్యుణ్ణి చెయ్యండి" అని గృహ యజమాని తన భాగం జొన్నపిండి ఆయనకు వడ్డించాడు. అది ఆ వృద్ధుడు భుజించాడు. కానీ దానితో అతడికి ఆకలి తీరలేదు. బ్రాహ్మణుడి వంక ఆశగా చూశాడు. ఆ బ్రాహ్మణుడికి ఏం చెయ్యటానికీ పాలుపోక తన భార్యవంక చూశాడు. వెంటనే ఆమె "నా భాగం పిండి కూడా అతిథికి పెట్టండి. ఆయన తృప్తిపడితే అదేచాలు" అంది.

"సాధ్వీ! చీమలూ, ఈగలూ కూడా అంతో ఇంతో సంపాదించి తెచ్చి తమ భార్యాబిడ్డల్ని పోషిస్తాయి. అటువంటిది నేను నిన్ను పోషించలేని స్థితిలో వున్నానంటే ఏమనాలి? అది చాలక నీ విస్తట్లోది కూడా లాక్కుని అతిథిపూజ చెయ్యటం వల్ల నాకు ఒనగూడే ప్రయోజన మేముంది కనుక!? అందుచేత నువ్వు నీ భాగం జొన్నపిండి ఇవ్వనక్కరలేదు" అన్నాడు బ్రాహ్మణుడు.

భార్య ఒప్పుకోలేదు.

"బ్రాహ్మణోత్తమా! ధర్మార్థ కామమోక్షాలు మన మిద్దరం పాటించవలసిన నియమాలు కదా? కనుక మీతోపాటే నేనూ! నా వంతు ఆహారం కూడా అతనికి పెట్టండి, కాదనకండి!" అంది.

అతిథి అది కూడా భుజించాడు.

అయినా ఆయన ఆకలి తీరినట్టులేదు.

ఆ పేద బ్రాహ్మణుడు అదిచూసి మనసులో కలవరపడ్డాడు. ఇదంతా చూస్తున్న బ్రాహ్మణుడి పుత్రుడు "నాన్నగారూ! నా భాగం కూడా అతిథిదేవుని కిచ్చి తృప్తిపరచండి" అన్నాడు.

"నాయనా! పెద్దవాళ్ళూ, వయసు ముదిరిన వాళ్ళూ ఆకలికి తట్టుకోగలరు. పిల్లలు ఆకలిని భరించలేరు. నీ వంతు ఆహారం తీసుకునేందుకు నా మనసు ఒప్పడంలేదురా!" అన్నాడు బ్రాహ్మణుడు.

"తండ్రీ! మీరు వేరూ, నేను వేరూ కాదు. మీ ధర్మం నెరవేర్చడం కంటే నాకు కావల్సినదేముంది! కాదనకుండా నా భాగం కూడా తీసుకోండి' అన్నాడు కుమారుడు.

తప్పింది కాదు.

అతిథి అది కూడా తిని యింకా తృప్తిచెందనట్టే కనిపించాడు. బ్రాహ్మణుడికి ఎంతో అవమానంగా వుంది. ఏం చెయ్యడానికీ తోచడంలేదు. అప్పుడతడ్ని చూసి కోడలు "మామగారూ! నా వంతు ఆహారం కూడా సంతోషంగా యిస్తాను. తీసుకుని మన అతిథికి పెట్టండి. మీ ఆశీర్వాదం వల్ల నాకు అక్షయమయిన సంపదలు కలుగుతాయి" అంది వినయంగా.

"అమ్మాయీ! నీవు చిన్నదానివి. వయసులో వున్నదానివి. నువ్వు ఆకలితో నకనకలాడుతూంటే నేను చూస్తూ ఎలా వూరుకోగలను? వద్దుతల్లీ!" అన్నాడు మామగారు.

"స్వామీ! మీరు నా ప్రభువుకు ప్రభువులు. దైవానికి దైవం, గురువుకు గురువులు. నా భాగం పిండి కూడా తీసుకుని అతిథికి వడ్డించండి. ఈ శరీరం వున్నది గురునాథుల సేవ కోసమే కదా!" అంది.

"కుమారీ! నీవు పతివ్రతవు. నీకు సకల భాగ్యాలూ కలుగుతాయి" అని ఆశీర్వదించి ఆమె వంతు ఆహారం కూడా బ్రాహ్మణుడు అతిథికి పెట్టాడు.

అది కూడా భుజించిన తర్వాత అతిథికి ఆకలి తీరింది. తృప్తి కలిగింది. "మీరు చేసిన దానం అత్యద్భుతమయిన దానం. దేవతలు కూడా పుష్పవర్షం కురిపిస్తున్నారు. **సామాన్యంగా ఆకలి బుద్ధిని చెరుస్తుంది. నేరాలు చేయిస్తుంది. ఆకలి వల్ల మనిషి దేనికైనా పాల్పడతాడు. జ్ఞానవంతులూ, ఆలోచనాపరులు కూడా ఆకలి వల్ల వివేకం కోల్పోతారు.** అటువంటిది మీరు ఆకలితో వున్నా ఎంతో ఔదార్యం చూపించారు. ఒకరిమీద ఒకరికి ఉన్న ప్రేమను కూడా మీరు లెక్కచెయ్యకుండా ధర్మదీక్షనే ప్రియమైనదిగా భావించుకున్నారు. వేనకు వేల రాజసూయాలూ, అశ్వమేధ యాగాలూ కూడా దీనికి సరిరావు. అదిగో! మీకోసం దివ్య విమానాలు సిద్ధంగా వున్నాయి. స్వర్గానికి పయనం కండి" అని చెప్పి అతిథిగా వచ్చిన వృద్ధ బ్రాహ్మణుడు అంతర్ధానమయ్యాడు. ఆకాశంలో దేవర్షులూ, దేవతలూ, గంధర్వులూ హర్షధ్వానాలు చేస్తుండగా పేద బ్రాహ్మణుడి కుటుంబం స్వర్గలోకం చేరుకుంది. ●

# కేకయుడు

పూర్వం కేకయుడనే రాజువుండేవాడు. ఆయన ఒకనాడు అధ్యయన విధి నిర్వహించడానికి అరణ్య పరిసరాలకు వెళ్ళాడు. అక్కడ అతనిని ఒక రాక్షసుడు వెంబడించాడు. చివరికి రాజు పట్టుబడ్డాడు. ఎంత పెనుగులాడినా కేకయుడు వాడ్ని వదిలించుకోలేకపోయాడు.

"ఓ రాక్షసోత్తమా! నా రాజ్యంలో ఎక్కడా దౌర్జన్యం, దొంగతనం, బీదరికం లేవు. నాలుగు వర్ణాల ప్రజలూ తమ తమ ధర్మాలు తప్పకుండా ప్రవర్తిస్తున్నారు. నాలో ఏం లోటు కనిపించిందని నన్ను వెంటాడుతున్నావు?" అని మహారాజు అడిగాడు.

"మహారాజా! నీలో ఏ లోపమూ లేదు. నీకుమల్లే ప్రజల్ని రక్షించే రాజుకు ఏ కీడూ రాదని చెప్పటానికే వచ్చాను. వెళ్ళి ఈ విధంగానే ప్రజాపాలన చెయ్యి" అని కేకయుడితో స్నేహం చేసుకున్నాడు.

"రాక్షసోత్తమా! నువ్వు ధర్మసూక్ష్మం తెలిసిన వాడిలా ఉన్నావు. ప్రజా సంక్షేమం సక్రమంగా జరగాలంటే కావల్సినంత డబ్బుండాలికదా! ధనార్జన దేనివల్ల చక్కగా సాగుతుందో సెలవియ్యి" అని మహారాజు అడిగాడు.

"ప్రతి రాజుకూ ధనార్జన చేసేవాడు ఒకడు ఉండాలి. అయితే, అందరూ అతడికి చేటు చెయ్యాలనే చూస్తారు. కనుక రాజు అతణ్ణి జాగ్రత్తగా రక్షించాలి. ఈ విషయంలో ఓ చిన్నకథ చెబుతాను విను" అన్నాడు రాక్షసుడు.

"కోసల రాజ్యాన్ని క్షేమదర్శి పాలిస్తుండేవాడు. ఓరోజు ఆయన కొలువు తీర్చివున్నాడు. ఇంతలో కాలకవృక్షీయ మహాముని వేంచేశారు. ప్రభువు గబగబా ఎదురు వెళ్ళి మహర్షిని సగౌరవంగా ఆహ్వానించాడు. మహాముని సంతసించి ఆయనను ఆశీర్వదించాడు. ఆయన చేతిలో వున్న పంజరం కేసి సభికులంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.



'మహారాజా! ఇది భూత భవిష్యత్ వర్తమానాలు తెలిసిన పక్షి' అంటూ ఆ పంజరాన్నీ అందులో వున్న కాకినీ అందరికీ చూపించాడు ఆయన. తరువాత రాజు దగ్గరకు వెళ్ళి 'నువ్వు ధనార్జన విషయంలో అశ్రద్ధ చూపిస్తున్నావు. కోశాగారాన్ని సరిగా రక్షించుకోలేక పోతున్నావు. దానివల్ల కలిగిన అనర్థమంతా ఈ వాయసం నీకు చెబుతుంది. నీకు అపకారం తలపెట్టిన దుర్మార్గుల్ని కూడా పట్టి ఇస్తుంది'

అని చెప్పి పంజరం అతని చేతికిచ్చాడు.

మహామునిని గౌరవించి పంపాడు రాజు. ఆయన వెళ్ళిపోయాడు. మరునాడు మళ్ళీ వచ్చాడు. మహారాజు అభ్యంతరగృహంలో విచారంగా కూర్చుని ఉన్నాడు.

'మహామునీ! తమరు ఇచ్చిన కాకిని రాత్రి ఎవరో రహస్యంగా చంపేశారు' అని క్షేమదర్శి చెప్పాడు.

'మహారాజా! కాకి తమ సంగతి ఎక్కడ బయట పెడుతుందోనని నీ అధికారులు భయపడ్డారన్నమాట! వాళ్ళ కపటోపాయంవల్లే కాకి చనిపోయింది. నేనూ, నీ తండ్రీ ప్రాణస్నేహితులం. అతను చనిపోయాక నాకీ రాజ్యంలో ఉండటం ఇష్టంలేక అరణ్యాలకు పోయి తపస్సు చేసుకుంటున్నాను. నీ మీద వున్న వాత్సల్యం వల్ల నీ యోగక్షేమాలు తెలుసుకుందామని వచ్చాను. నీ రాజ్యమంతా కలయతిరిగాను. నీవు మంచివాడవు కాబట్టి ఆ మంచితనాన్ని కొందరు అధికారులు ఆసరాగా తీసుకొని అన్యాయాలకు పాల్పడుతున్నారు. ఆ సంగతి నీకు చెప్పడానికే కాకి మిష పెట్టుకుని వచ్చాను. అసలా కాకికి ఏమీ తెలియదు. కాకి చావడం వలన నీకు కీడు తలపెట్టే వాళ్ళెవరో ఉన్నారని తెలుస్తోంది గదా! జాగ్రత్తగా పరిశీలిస్తే యింకా కొన్ని విషయాలు బయటపడతాయి.నిన్ను మోసగిస్తున్న నీ అధికారులను కనిపెట్టి ఒకరిలో ఒకరికి అరమరికలు కల్పించి వాళ్ళ స్నేహం చెడగొట్టి ఒక్కొక్కణ్నే కఠినంగా దండించు. ఫలితం ఉంటుంది' అని చెప్పాడు మహాముని.

"క్షేమదర్శి ఆయన చెప్పినట్టే చేసి తరువాత తన రాజ్యానికి ఆ మహామునినే మంత్రిగా చేసుకున్నాడు.

"మంత్రి జ్ఞానపరుడూ, పౌరజానపదులకు ఆప్తుడూ, కార్యజ్ఞానం తెలిసినవాడూ అయివుండాలి. అలా అని రాజు ఎప్పుడూ ఏమరి ఉండకూడదు. ప్రమత్తుడు కారాదు. అన్ని పనులూ అతని ఆధ్వర్యంలోనే జరగాలి. **అసలు ఎవరినీ నమ్మకపోవడం మృత్యువుతో సమానం, ఎక్కువగా నమ్మడం అకాల మృత్యువుతో సమానం. నమ్మీ నమ్మకుండా అందరిచేత పనులు చేయించుకోవాలి.** వ్యవహార శుద్ధి ఉండాలి. మనస్సు త్రాసు మాదిరి ఉండాలి. హితంగా మాట్లాడే నేర్పు ఉండాలి. కరకుతనమూ ఉండాలి" అంటూ రాక్షసుడు కథను ముగించాడు. కేకయుడు అభివాదం చేశాడు. ●

# వివేచన

"అయ్యో! నా తండ్రీ! అప్పుడే నీకు నూరేళ్ళూ నిండాయా నాయనా!" అంటూ గుండెలు బాదుకుంటూ ఏడుస్తున్నారు బంధువులంతా శవం చుట్టూ చేరి. స్మశానంలో చెట్టుకింద ఒక పసివాడి శవాన్ని పెట్టి చుట్టూ కూర్చుని గొల్లున ఏడుస్తున్న వాళ్ళని చూసి, చెట్టుమీద ఉన్న ఓ ముసలిగద్ద జాలిపడింది.

"అమ్మా! ఎందుకలా ఏడుస్తున్నారు? ఊరుకోండి! **మన, తన అని ఉండదు మృత్యువుకి. గర్భంలో జీవి ప్రవేశించినప్పటినుంచీ ఎప్పుడు తీసుకుపోదామా అని ఎదురుచూస్తూ ఉంటుంది! క్షణక్షణానికి ఇగిరిపోతున్న నీళ్ళల్లో వుండే చేపల్లాంటివాళ్ళం మనం. భీరుడు, శూరుడు, జడుడు, బలవంతుడు, బలహీనుడు అనే భేదాలేవీ లక్ష్యపెట్టదు మృత్యువు. ఎటువంటి వాళ్ళనైనా కబళిస్తుంది.** లేవండి, పొద్దు గుంకుతోంది. రాక్షసులూ, భూతాలూ శవాలను తినడానికి వస్తాయిక! చచ్చిన పిల్లవాడితో కలిసి అందరూ చావాలనుకుంటున్నారేమిటి? బాగుంది వరుస! శవాన్ని

వదిలిపెట్టి పొండి. ఏడిస్తే పోయినవాళ్ళు వస్తారా? వెళ్ళండి! ఇంకొంచెంసేపు ఆలస్యం చేస్తే రాక్షసులు మిమ్మల్ని కూడా పీక్కుతింటారు" అని వేదాంతధోరణిలో చెప్పింది.

వాళ్ళు భయపడ్డారు. గుండెలు రాయి చేసుకుని శవాన్ని అక్కడే వదిలేసి ఇళ్ళకు బయల్దేరారు.

"అయ్యయ్యో! గద్ద మాటలు విని భయపడుతున్నారా? చందమామలాంటి ఈ పసివాడ్ని ఇలా పారేసి పోవడానికి మీకు మనసెలా వస్తోంది! కాళ్ళెలా ఆడుతున్నాయి? వెళ్ళకండి. విధి దయతలిస్తే ఈ పసివాడికి మళ్ళీ ప్రాణం వస్తుందేమో. ఇంకా సూర్యాస్తమయం కాలేదు. భయపడకండి" అంది ఒక నక్క ఎక్కడినుంచో హఠాత్తుగా దూసుకువచ్చి.

"ఈ బుద్ధిలేని నక్కమాటలు నమ్ముతున్నారా? పసివాడి శవం చూడండి ఎలా వికృతంగా తయారైందో! ఇంకేం ప్రాణం వస్తుంది. అడియాసలు మానండి. వెళ్ళండి. దానాలూ, పుణ్యకార్యాలూ చేసి ఈ పసివాడికి ఉత్తమ గతులు కల్పించండి" అంది గద్ద.

"ఏడిశావ్! నోరు మూసుకో! ఏదో మహా తెలిసినట్టు వాగుతున్నావు" అని నక్క గద్దను ఆక్షేపించి, చనిపోయిన పిల్లవాడి బంధువులవైపు తిరిగి "గద్ద చాలా క్రూరమైంది. దాని మాటలు వినకండి. ఈ చిట్టి తండ్రిని చూస్తుంటే నాబోటిదానికే కన్నీళ్ళు ఆగటంలేదు. మరి మీరెలా వెళ్ళిపోవాలనుకుంటున్నారో నాకు తెలీడంలేదు. ప్రయత్నం చేస్తే దైవబలం కలిసిరావచ్చు. ఈ పసివాడు ప్రాణాలతో లేచిరావచ్చు. అంతగా బతక్కపోతే అప్పుడే పోదురుగాని" అంది నక్క.

"నేను పుట్టి కొన్ని వందల సంవత్సరాలైంది. చనిపోయిన వాళ్ళెవరూ తిరిగి బతికి రావడం చూడలేదు నేను. ఒకటి మాత్రం నిజం. చచ్చినవాళ్ళు మరో గర్భంలో పుట్టి మళ్ళీ వస్తారు. అంతేకాని ఈ శరీరంతో రారు. ఈ నక్కకు బుద్ధిలేదు. శవమట–బ్రతుకుతుందట! ఎవరైనా వింటే నవ్విపోతారు!" అపహాస్యం చేసింది గద్ద.

ఆ మాటలు నిజమే అనుకుని వెక్కివెక్కి ఏడుస్తూ వాళ్ళు వెనక్కి తిరిగారు.

"ఆగండాగండి! వెళ్ళకండి. మనిషిజన్మ ఎత్తి కూడా మీ కెందుకు బుద్ధిలేకుండా పోయిందో నాకు అర్థం కావడంలేదు! సృంజయుడి కొడుకు మరణిస్తే నారదుడు అతన్ని బతికించాడా లేదా? హనుమంతుడు సంజీవని తెచ్చి లక్ష్మణుణ్ణి బ్రతికించాడా

లేదా? అలాగే మీ ఏడుపు విని ఏ సిద్ధుడో, దేవతో కరుణించి ఈ పసివాడికి ప్రాణాలు ఇవ్వకూడదా? ఎందుకిలా వెళ్ళిపోతున్నారు?" అని నక్క అడ్డం వచ్చింది. వాళ్ళు మళ్ళీ వచ్చి శవం చుట్టూరా కూర్చుని గట్టిగా ఏడ్వడం మొదలుపెట్టేరు.

ఇంతలో సూర్యుడు అస్తమించాడు.

సూర్యాస్తమయం కాకుండానే వాళ్ళని పంపించివేస్తే హాయిగా ఆ శవాన్ని పీక్కు తినవచ్చని ఆశపడింది గద్ద. బాగా చీకటిపడేదాకా వాళ్ళను ఆపితే గద్దకు దక్కకుండా ఆ శవాన్ని తానే ఆరగించవచ్చునని ఆశపడింది నక్క. చచ్చినవాడు తిరిగి రాడని ఆ రెంటికీ తెలుసు. చీకటిపడగానే ఇంక చేసేదేంలేక ఆశ వదులుకుని గద్ద వెళ్ళిపోయింది. సరిగ్గా ఆ సమయంలోనే ప్రేతవనంలో విహరించడానికి వచ్చాడు శివుడు. గొల్లున ఏడుస్తున్న వాళ్ళని చూసి జాలిపడ్డాడు. ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. వాళ్ళు ఆశ్చర్యంతో ఆ కరుణామూర్తికి సాష్టాంగపడి "దేవా! మా బిడ్డను బతికించు" అని వేడుకున్నారు. శివుడు ఆ శిశువుకు ప్రాణాలిచ్చి నూరేళ్ళ ఆయువు ప్రసాదించాడు. గద్దకూ, నక్కకూ ఆకలి లేకుండా వరాలిచ్చి అంతర్ధానమయ్యాడు.

కనుక వాళ్ళ వాళ్ళ లాభాలు కోరి మాట్లాడే గద్దా, నక్కాలాంటి వాళ్ళు అనేకులుంటారు. వాళ్ళ వైఖరులు తెలుసుకుని మనం ప్రవర్తించాలి. ●

# భంగాశ్వుడు

**పూ**ర్వం భంగాశ్వుడు అనే చక్రవర్తి ఉండేవాడు. అతని పాలనాచాతురి వల్ల ఆ రాజ్యం శాంతిసౌఖ్యాలకు నిలయమై భాసిస్తూండేది. అయితే సంతానం లేని చింత రాజుగార్ని బాధిస్తూండేది. చివరకు ఒక యాగప్రభావం వల్ల నూరుగురు కొడుకులు పుట్టి భంగాశ్వుడికి మహదానందం కలిగించారు.

ఒకనాడు చక్రవర్తి వేటకు వెళ్ళాడు. తదేక దీక్షతో వేటాడుతూ, అనుకోకుండా అరణ్యంలో చాలాదూరం వెళ్ళాడు. అలసట వల్ల బాగా దాహం వేసిన రాజుగారికి అల్లంతదూరాన ఓ సరస్సు కనిపించింది. గుర్రాన్ని వెన్ను మునిగేటట్టు ఆ నీళ్ళలో ముంచి తను కూడా సరస్సులోకి దిగాడు. తనివితీరా దోసిళ్ళతో నీళ్ళు తాగాడు.

వెంటనే ఆడమనిషిగా మారిపోయాడు.

'అయ్యో! ఏమిటీ గ్రహచారం! ఇప్పుడేం చెయ్యటం?' అని భంగాశ్వుడు మిక్కిలి దుఃఖపడ్డాడు.

ఇంతలో మంత్రులంతా చక్రవర్తిని వెతుక్కుంటూ వచ్చి చూసి

ఆశ్చర్యపోయారు. భంగాశ్వుడు వాళ్లకు జరిగిన సంగతంతా చెప్పాడు. కొడుకులకు రాజ్యం అప్పగించి, తను తపస్సుచేసి ఆడరూపును పోగొట్టుకోవాలన్న ఉద్దేశ్యంతో ఆ అరణ్యంలోనే ఉండిపోయాడు.

ఒకనాడు ధ్యానం ముగించి కళ్ళు తెరిచేసరికి ఒక సుందరాంగుడు నవ్వుతూ కనిపించాడు. స్త్రీ రూపంలో వున్న రాజు కంగారుపడ్డాడు.

"సుందరీ! ఇంత సుకుమారివి, ఈ ఘోరమైన తపస్సెందుకు చేస్తున్నావు?" అన్నాడా సుందర పురుషుడు. "తగిన వరుడు దొరకలేదనా?" అని ప్రశ్నించాడతను.

నిజంగానే పెళ్ళి చేసుకోవాలనే బుద్ధి పుట్టిందప్పుడు ఆడరూపంలో వున్న రాజుగారికి. సందేహిస్తూనే మెల్లిగా జరిగినదంతా చెప్పాడు. చిరునవ్వు నవ్వాడా యువకుడు.

"భగవంతుడి లీలలు చిత్రంగా ఉంటాయి. ఏమైనా నువ్విప్పుడు ఆడపిల్లవి. వనితలకు వయసుకు తగిన తోడుండాలి. నన్ను పెళ్ళి చేసుకుంటావా?" అని అడిగాడు.

సిగ్గుపడుతూ సరేనంది ఆమె.

వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుని ఆనందంగా విహరించారు. కొన్నాళ్ళు గడిచాయి. వాళ్ళకి నూరుగురు కొడుకులు పుట్టారు. వాళ్ళు మహా బలవంతులు. రాజ్యాలు ఏలగల సమర్థులు. వాళ్ళందర్నీ తీసుకుని భంగాశ్వుడు తన పూర్వపు పుత్రుల దగ్గరకు వెళ్ళాడు. జరిగిన విషయం వివరించాడు. తన యీ నూరుగురు కొడుకుల్నీ చూపించి, "మీరంతా అన్నదమ్ములు. రాజ్యం పంచుకుని హాయిగా అనుభవించండి" అని చెప్పాడు.

సరేనన్నారు వాళ్ళు. సోదరప్రేమతో కలిసిమెలిసి జీవించసాగారు. అదిచూసి స్త్రీ రూపంలో వున్న భంగాశ్వుడు ఎంతో సంతోషించాడు.

కొన్నాళ్ళు పోయాక ఒక బ్రాహ్మణుడు వచ్చి, "మీ తండ్రి ఏనాడో పోయాడు! ఇంకెక్కడి తండ్రి! ఆడదిగా మారి, ఎవరికో పుట్టిన బిడ్డల్ని తెచ్చి మీకిస్తే మీరు వాళ్ళని సోదరులుగా భావించడమే ఆశ్చర్యం! రాజ్యం ఇవ్వడం మరీ విడ్డూరం?" అని రాజుగారి పూర్వపు కుమారులకు నూరిపోశాడు. తరువాత కొత్తగా వచ్చిన పిల్లల దగ్గరకు వెళ్ళి "వాళ్ళు మిమ్మల్ని సరిగా చూడటం లేదు. ఏదో దయతలచినట్లు ఏమిటిది? అసలీ రాజ్యమంతా మీ తల్లిదేగా! వాళ్ళకెంత హక్కో, మీకూ అంతే

హక్కు" అని రెచ్చగొట్టాడు. ఆ మాటలు పట్టించుకుని, వాళ్ళల్లో వాళ్ళు పగలు పెంచుకుని యుద్ధంచేసి మొత్తం రెండు వందల మందీ నిహతులయ్యారు. ఒక్కడు కూడా మిగల్లేదు. అప్పుడు ఆడరూపంలో వున్న భంగాశ్వుడి శోకం పట్టశక్యం కానిదయింది.

"ఏడవకు! ఇదంతా నేనే చేశాను" అన్నాడు బ్రాహ్మణుడు ఎదుటికి వచ్చి.

ఆశ్చర్యంగా చూసిందావిడ.

"ఔను! నేను దేవేంద్రుణ్ణి. మొదట నువ్వు నాకిష్టంలేని యాగం చేసి నూరుగురు కొడుకుల్ని కన్నావు. ఆ కోపంతో నేనే నిన్ను స్త్రీగా మార్చాను. కానీ నీకు కీడు కలగలేదు. హాయిగా మళ్ళీ పెళ్ళి చేసుకుని నూరుగురు కొడుకుల్ని కన్నావు. వాళ్ళంతా కలిసిమెలిసి సుఖంగా వుంటే సహించలేక నేనే వాళ్ళమధ్య విభేదాలు సృష్టించాను" అని దేవేంద్రుడు నిజస్వరూపం ధరించి ఎదుట నిలబడ్డాడు.

భయపడిందామె. "దేవా! కొడుకుల కోసం తపించి నీకిష్టంలేని యాగం చేశాను. నా తప్పు క్షమించు. నన్ను దయ చూడు" అంటూ దీనంగా ప్రార్థించింది.

"రాజా! రమణీరూపంలో నువ్విలా విలపిస్తూంటే నాకు జాలేస్తోంది. నీ కొడుకులు కొంతమందిని బతికిస్తాను. తండ్రిగా నువ్వు పొందినవాళ్ళు కావాలా? తల్లిగా నువ్వు కన్నవాళ్లు కావాలా?" అని అడిగాడు దేవేంద్రుడు.

"దేవా! తల్లిగా నేను జన్మనిచ్చిన వాళ్ళనే నాకు ఇవ్వు."

"ఏం! వీళ్ళు ఎక్కువా, వాళ్ళు తక్కువా ఏమిటి?"

"దేవా! స్త్రీలకు బిడ్డలమీద ప్రేమ ఎక్కువ కదా! మీకు తెలియందేముంది?" అంది.

"నీ బిడ్డలందర్నీ బతికిస్తాను. నీకు పూర్వరూపం కూడా ఇస్తాను" అన్నాడు దేవేంద్రుడు.

"నా బిడ్డలందర్నీ ఇస్తానన్నావు. అదే పదివేలు. నాకు పురుషరూపం వద్దు. నన్ను స్త్రీగానే ఉండనివ్వండి, తల్లిగా నా సంతానాన్ని చూసుకోనివ్వండి. ఆ ఆనందం చాలు నాకు" అంది.

దేవేంద్రుడు సరేనని రాజకుమారులందర్నీ బతికించి భంగాశ్వుణ్ణి నారీరూపంలోనే ఉంచి అంతర్ధానమయ్యాడు. ●

# యయాతి

యయాతి మహారాజు పాండవుల పూర్వీకుల్లో ఒకడు. పరాజయం ఎరుగని పరాక్రమశాలి. శుక్రాచార్యుని కుమార్తె దేవయానిని పెళ్ళి చేసుకున్నాడు. తరువాత వృషపర్వుడి కుమార్తె శర్మిష్ఠ పట్ల కూడా మోహం కలిగి దేవయానికి చెప్పకుండా రహస్యంగా పెళ్ళి చేసుకున్నాడు. దేవయానికి ఇది తెలిసింది. తన తండ్రితో మొరపెట్టుకుంది. శుక్రాచార్యుడికి పట్టరాని కోపం వచ్చింది. "నీకు తక్షణమే ముసలితనం వాటిల్లుగాక" అని యయాతికి శాపం ఇచ్చాడు. నడివయస్సులో అకస్మాత్తుగా ముసలితనం రావడంతో యయాతి మహారాజు గత్యంతరం లేక మామగారి పాదాలపై పడ్డాడు. శుక్రాచార్యుడు జాలిపడ్డాడు. "రాజా! నా శాపాన్ని మళ్ళించలేను. అయితే ఎవరైనా సమ్మతించేవారుంటే వారికి నీ ముసలితనం ఇచ్చి వారి పడుచుతనం నీవు తీసుకో" అని ఉపాయం చెప్పాడు శుక్రాచార్యుడు. యయాతికి ఐదుగురు కొడుకులు వున్నారు. అందరూ అందమైనవాళ్ళు. క్షత్రియోచితమైన విద్యలో ఆరితేరినవాళ్ళు. యయాతి వాళ్ళను పిలిచి "నాయనలారా! చూశారా నా అవస్థ!

మీ తాతగారిచ్చిన శాపం వల్ల నాకు అకాల వార్ధక్యం దాపురించింది. మీలో ఎవరైనాసరే నా ముసలితనం తీసుకుని మీ యౌవనం నాకు బదులిస్తే మరికొంత కాలం నేను పడుచుదనం అనుభవించవచ్చు. జీవిత భోగాలు తృప్తితీరా అనుభవిస్తాను. ఎవరయితే నా ముసలితనం స్వీకరిస్తారో వారికి నా రాజ్యం ఇస్తాను" అన్నాడు. పెద్ద కుమారుడు నా వల్ల కాదన్నాడు.



రెండవకుమారుణ్ణి అడిగితే, "నాన్నగారూ! బలాన్నీ, రూపాన్నే కాకుండా తెలివిని కూడా నాశనంచేసే వృద్ధాప్యాన్ని పుచ్చుకోమంటున్నారు. అంతటి నిబ్బరం నాకు లేదు. క్షమించండి" అని మర్యాదగా తప్పుకున్నాడు.

మూడవవాడు నిష్కర్షగా ముందే చేతులు అడ్డుగా తిప్పాడు.

రాజుగారికి చాలా కోపం వచ్చింది. నాలుగవ వాణ్ణి పిలిపించాడు. "నాన్నగారూ! నన్ను మన్నించండి. ముసలితనమంటే అసహ్యం నాకు. వార్ధక్యంలో శరీరం ముడతలు పడి, చూపు ఆనక, మాట వినపడక స్వతంత్రం కోల్పోయి దుఃఖపడాలి. మీ కోసం నేనంత కష్టాన్ని భరించలేను" అని స్పష్టంగా చెప్పాడు.

ఇలా నలుగురు కొడుకులు తన కోరిక కాదనేటప్పటికి యయాతి పుట్టెడు దుఃఖంలో మునిగిపోయాడు. ఎంతోసేపు విచారించాడు. చివరకు తన మాటకు ఎన్నడూ ఎదురుచెప్పని కడగొట్టు కుమారుణ్ణి పిలిపించాడు.

"నాయనా! ఇక నీవే నన్ను కాపాడాలి. ఈ ముసలితనం, ఈ ముడతలు, ఈ తడబాటు, ఈ నెరసిన వెంట్రుకలు– ఇవన్నీ శుక్రాచార్యులవారి శాపం వల్ల నాకు అకాలంగా వచ్చిపడ్డాయి. ఈ దుస్థితిని నేను భరించలేకుండా వున్నాను. కొంతకాలం నా ముదిమిని నీవు పుచ్చుకుని నీ యౌవనం నాకిచ్చావంటే సర్వసుఖాలూ అనుభవిస్తాను" అని దీనంగా అర్థించాడు.

యయాతి కడగొట్టు పిల్లవాడి పేరే పూరుడు. అతనికి తండ్రి యెడల జాలి కలిగింది. "నాన్నగారూ! మీ కోరిక ప్రకారం మీ వార్ధక్యాన్నీ, రాజ్యభారాన్నీ కూడా ఆనందంగా స్వీకరిస్తాను. మీరేమీ దిగులు పెట్టుకోకండి" అన్నాడు.

యయాతికి పట్టరాని ఆనందం కలిగింది. కుమారుణ్ణి కౌగిలించుకుని అభినందించాడు.

అలా పూరుడి యౌవనాన్ని యయాతి తీసుకున్నాడు. తండ్రి ముసలితనం పూరుడు స్వీకరించి, రాజ్యభారం వహించి చాలాకాలం జనరంజకంగా పాలనచేశాడు. గొప్ప కీర్తి పొందాడు. యయాతి కుమారుడిచ్చిన యౌవనంతో సర్వసుఖాలు అనుభవించాడు కానీ తృప్తి కలగలేదు. అప్పుడు పూరుడి దగ్గరకు వెళ్ళి "నాయనా! కుమారా! **కోరికలు ఎన్నటికీ తీరవు. విషయానుభవం వల్ల కాంక్షలు ఇంకా వృద్ధిపొందుతాయేగాని అణగవు. కామినీ కాంచనాలూ, పాడిపంటలూ మనిషి కోరికలను ఎన్నటికీ తృప్తిపరచలేవు.** ఈ సంగతి క్రమేపీ తెలిసొచ్చింది నాకు. ఇష్టాయిష్టాలకు అతీతమైన ప్రశాంతస్థితిని పొందాలని వుంది. ఇక నీ యౌవనం నీవు తీసుకుని చల్లగా రాజ్యం పాలిస్తూ వర్ధిల్లు నాయనా" అని ఆశీర్వదించాడు.

యయాతి తన ముసలితనం తాను తీసుకుని అరణ్యాలకు వెళ్ళాడు. అక్కడ చాలా సంవత్సరాలు తపస్సుచేసి, చివరకు స్వర్గం చేరుకున్నాడు. ●

# మృత్యుదేవత

అకంపనుడనే రాజుకి ఒకప్పుడు శత్రువులతో యుద్ధం వచ్చింది. అతను శత్రువుల చేతిలో పట్టుబడేసరికి, అతని కొడుకు వీరవిహారం చేసి తండ్రిని విడిపించాడు.

ఆ వీర కిశోరాన్ని అధర్మమార్గాన అభిమన్యుణ్ణి చంపినట్టే అనేకమంది పట్టి చిత్రవధ చేశారు. అకంపనుడు పుత్రశోకాన్ని భరించలేకపోయాడు. కొడుకుని తలుచుకుని ఏడుస్తుంటే ఓ రోజు నారద మహర్షి వచ్చాడు.

"అకంపనా! ఏమిటిది? మరణించనివాళ్ళెవరైనా ఉంటారా? అంతమంది యోధుల్ని చంపిన నీ కుమారుడు సామాన్యుడా? వాడు మహావీరుడు. అయితే శత్రువులు బాణాలు వెయ్యకుండా పువ్వులు చల్లుతారేమిటి? చావుని తప్పించుకోవటం ఎవరి తరం? అన్నీ తెలిసిన నువ్విలా దుఃఖించటం తగదు. ధైర్యం తెచ్చుకో" అని ఓదార్చాడు మహర్షి.

"మహాత్మా! మృత్యువు లేకుండా బ్రతుకుండదా? అసలీ చావు పుట్టుకలేమిటి?" అకంపనుడు ప్రశ్నించాడు.

అప్పుడు నారదులవారు చెప్పారు:

పూర్వం బ్రహ్మదేవుడు ప్రజలను సృష్టించి వూరుకున్నాడు. సంహారం సంగతి ఆలోచించనే లేదు. జనాభా అంతకంతకూ పెరిగిపోయి భూమికి భారమైపోయారు. అప్పుడు ఏం చెయ్యాలో తెలీక బ్రహ్మ బాధపడుతూండేసరికి అతని అవయవాలనుంచి ప్రళయాగ్ని పుట్టి ప్రజాసంహారం మొదలుపెట్టింది. భువనాలన్నీ అలా తగలబడిపోతుంటే చూడలేక పరమేశ్వరుడు బ్రహ్మ దగ్గరికి పరుగెత్తి, "అయ్యా! నీ వల్ల పుట్టిందీ సృష్టి. దీన్ని నువ్వే ఇలా కోపగించి నాశనం చెయ్యడం తగదు. దయతో యీ భూతజాలాన్ని కరుణించు" అని ప్రార్థించాడు. ఆ మాటలు విని ప్రసన్నుడయ్యాడు విధాత. అతడు కోపాన్ని దిగమింగే సమయంలో అతని ఇంద్రియాల నుంచి ఒక స్త్రీ జన్మించింది.

నల్లని శరీరం! నిప్పుకణికల్లాంటి కళ్ళు! ఎర్రటి వస్త్రాలు– అతి భయంకరంగా వుంది. చకచక నడిచి వెళ్తోంది. 'అమ్మాయీ! ఎక్కడికి పోతున్నావు? ఇలారా!' అని పిలిచాడు బ్రహ్మ. ఆమె వచ్చి వినయంగా నిలబడింది.

'నాలో పుట్టిన క్రోధం వల్ల జన్మించావు నువ్వు. అందుకని నా ఆజ్ఞ ప్రకారం నువ్వింక అన్ని ప్రాణుల్నీ సంహరిస్తూ వుండు' అని ఆజ్ఞాపించాడు. ఆ మాటలు విని జలజల కన్నీళ్ళు కార్చిందామ్మాయి.

'కరుణామూర్తీ! నువ్వు సృష్టించావు నన్ను! ఈ దుర్మార్గపు పని ఎలా చెయ్యమంటావు? ప్రజల ఏడుపు నేను చూడలేను. ఈ అధర్మానికి నన్ను పంపకు. నేను ధేనుకాశ్రమానికి వెళ్ళి తపస్సు చేసుకుంటాను! అనుజ్ఞ ఇచ్చి పంపు' అని వేడుకుంది.

'నిన్ను ప్రజా సంహారం కోసం మాత్రమే సృష్టించాను. మనస్సులో ఏ వికారాలూ పెట్టుకోకు. సమయాన్ననుసరించి సంహారం చెయ్యి' అని బ్రహ్మ మళ్ళీ ఆజ్ఞాపించాడు.

"కాదంటే ఏమంటాడోననే భయంతో అక్కడినుంచి ఆ అమ్మాయి వెళ్ళిపోయింది. నంద, కౌశికి నదుల మధ్యప్రదేశంలో అనేక వ్రతాలు చేసింది. చివరకు హిమశైల శిఖరం చేరి నియమవతియై కూర్చుంది.

బ్రహ్మ మళ్ళీ ప్రత్యక్షమై, 'పిచ్చిదానా! ప్రజాసంహారం వల్ల నీకు అధర్మం ఎలా కలుగుతుంది? నా ఆజ్ఞ పాలించడం ధర్మం కాదా నీకు? నీకు అత్యుత్తమ కీర్తి లభించేటట్టు నేనూ, పరమేశ్వరుడూ అనుగ్రహిస్తాం. సరేనా?' అన్నాడు.

'ప్రభూ! నీ ఆజ్ఞ శిరసావహిస్తాను. నాలుగు రకాల భూతాలనూ సంహరిస్తాను. కాని లోభం, క్రోధం, అసూయ అనేవి ప్రాణుల శరీరాల్ని వికృతం చేసేటట్టు చూడు' అంది దుఃఖిస్తూ.

'అలాగే! ఇప్పుడు నువు కార్చిన కన్నీటిబిందువులే రోగాలై ప్రజల్ని పీడిస్తూ మరణాలు సంభవింప చేస్తాయి. అందుచేత నీకు ఏ అధర్మం అంటదు. ప్రాణుల్ని చంపడమే నీకు పరమధర్మం. నువ్వు తరతమ భేదాలు లేకుండా అందర్నీ ఆకర్షించు–వెళ్ళు!' అన్నాడు బ్రహ్మదేవుడు.

"ధర్మహాని లేదనే నమ్మకం కుదిరాక ఆమె ఆ పనికి అంగీకరించింది. అప్పటినుంచీ మనోవ్యథ ప్రాణుల శరీరాల్ని కృశింప చేస్తుంటే, మృత్యువు ప్రాణం తీస్తూ వస్తోంది.

"అది రాజా మృత్యువుకి మూలం! శరీరాన్ని రక్షించడానికీ, నాశనం చెయ్యడానికీ కూడా కారకుడు జీవుడు. నరులు దేవతలౌతారు. దేవతలు మనుషులౌతారు. నీ కొడుకు చిరవీరస్వర్గసుఖం అనుభవిస్తున్నాడు. అతని కోసం విచారమెందుకు?" అన్నాడు నారదుడు.

"మునీంద్రా! నువు చెప్పిన కథ విన్నాక నా మనసు కుదుటపడింది. విచారం పోయింది" అని నమస్కరించాడు అకంపనుడు.

నారదుడు అతన్ని దీవించి అశోకవనానికి వెళ్ళిపోయాడు. ●

# జరాసంధుడు

ఒకప్పుడు బృహద్రథుడనే రాజు మగధ దేశాన్ని పరిపాలిస్తూ వుండేవాడు. అతను గొప్ప పరాక్రమశాలి. మూడు అక్షౌహిణుల బలంతో శత్రువులందర్నీ జయించాడు. కాశీరాజు కుమార్తెలైన కవలలిద్దర్నీ పెళ్ళి చేసుకున్నాడు. ఎంతకాలం గడిచినా అతనికి సంతానం కలగలేదు. దేవతలను పూజించాడు. బ్రాహ్మణులను ఆదరించాడు. మునిముఖ్యులను అర్చించాడు. ఎవరే పుణ్యకార్యం చెపితే అదల్లా చేశాడు. అయినా ఫలితం లేకపోయింది.

పిల్లలు లేక సిరి, రాజ్యవైభవాలన్నీ వ్యర్థమనుకుని బృహద్రథుడు భార్యలిద్దర్నీ వెంటపెట్టుకొని తపోవనానికి బయలుదేరాడు. అలా వెడుతూ ఉండగా, ఒక గున్నమామిడి చెట్టునీడలో నిష్ఠతో తపస్సు చేస్తూ దివ్యతేజస్సుతో వెలిగిపోతున్న చండకౌశిక మహాముని వారికి కనిపించాడు.

ఆ మునిని నిరంతర నియమసపర్యలతో మహారాజు సేవించాడు. చండకౌశికుడు ప్రసన్నుడై కావలసినదేదో అడగమన్నాడు.

"మహాత్మా! నాకు సర్వసంపదలూ ఉన్నాయి కానీ సంతానం లేదు. పుత్రులు లేనివాళ్ళకు ఉత్తమగతులు లభించవని మీ బోటి పెద్దలు చెబుతారు. తపస్సు చేద్దామని వస్తుంటే మహానుభావులయిన తమరి దర్శనభాగ్యం కలిగింది. భగవంతుడే తమ రూపంలో నన్ను కరుణించాడనుకుంటున్నాను. నాకు పుత్రులు కలిగేలా వరం ప్రసాదించండి" అని వేడుకున్నాడు బృహద్రథుడు.

ఆ ముని అతణ్ణి కరుణించి ధ్యానంలో నిమగ్నమయ్యాడు. కొంతసేపటికి ఒక చక్కని మామిడిపండు చెట్టునుంచి రాలి కింద పడింది. ముని కళ్ళుతెరిచి ఆ పండును మంత్రించి మహారాజు కిచ్చాడు. ఆ ఫలం వల్ల పండంటి కొడుకు పుడతాడని చెప్పాడు. బృహద్రథుడు మహదానందంతో ఆ ఫలాన్ని తీసుకుని కళ్ళకు అద్దుకున్నాడు.

రాజధానికి తిరిగివచ్చి, ఆ పండును రెండుగా చీల్చి ఇద్దరు భార్యలకూ ఇచ్చాడు. వాటిని తిని రాణులిద్దరూ గర్భవతులయ్యారు. వాళ్ళకు ఒక అర్ధరాత్రివేళ ఒక కన్ను, ఒక చెయ్యి, ఒక చెవి, ఒక కాలు ఉన్న శరీర ఖండాలు పుట్టాయి. అవి చూసి రాణులిద్దరూ భయపడిపోయారు. ఈ మనుష్య ఖండాలను మహారాజుకు ఎలా చూపించడమా అని సిగ్గుపడి, దాదులను పిలిచి ఆ రెంటినీ అవతల పారెయ్యమని చెప్పారు. దాదులు వాటిని తీసుకువెళ్ళి దూరంగా పారేశారు.

ఆ ప్రదేశంలో 'జర' అనే రాక్షసి రాత్రివేళలో సంచరిస్తూ ఉండేది. అది ఆ శరీర ఖండాలను చూసి తనకెవరో ఆహారం వేశారు కాబోలనుకుని ఆ రెండింటినీ దగ్గరకు చేర్చి పట్టుకుంది. వెంటనే ఆ రెండు శరీరఖండాలూ అతుక్కుని ఒక చక్కని బాలుడయ్యాడు. వాడు వజ్రకఠిన శరీరంతో ఆ రాక్షసి కూడా ఎత్తలేనంత బరువై గట్టిగా ఏడవటం మొదలుపెట్టాడు. ఆ ఏడుపు విని అంతఃపురంలోని పరిచారికలంతా పరిగెత్తుకొచ్చారు. ఆ పసివాణ్ణి జర చేతుల్లోంచి లాక్కుని, ఆ రాక్షసిని బంధించి రాజభవనానికి తీసుకువెళ్ళారు.

అప్పుడు 'జర' స్త్రీరూపం ధరించి, "మహారాజా! నేను రాక్షసకాంతను. నా పేరు 'జర'. మీ పట్టణంలో రాజభవనానికి కొంచెం దూరంగా నాలుగుదారులూ కలిసేచోట నివసిస్తున్నాను. ఈ వేళ ఎవరో ఈ మనుష్య శకలాలను నేను తిరిగే

ప్రాంతంలో పారేశారు. విధివశం వల్ల ఆ రెండు ఖండాలూ నా చేతుల్లో కలుసుకుని ప్రాణం పోసుకున్నాయి. ఈ బాలుడు తయారయ్యాడు. వీణ్ని తీసుకో. చాలా రోజులనుంచి మీకేమి మేలుచేద్దామా అని ఆలోచిస్తున్నాను. ఇన్నాళ్ళకిది సమకూడింది" అని పరిచారిక చేతుల్లో ఉన్న బాలుణ్ని తీసుకుని రాజుగారికి అందించింది.

"అమ్మా! నేను చేసిన సపర్యలకు సంతోషించి ఒక మునీశ్వరుడు నాకీ బాలుణ్ణి ప్రసాదించాడు. ఇప్పుడు నువ్వు మళ్ళీ తిరిగి ప్రసాదించావు. మా వంశం ఉద్ధరించడానికి వచ్చిన దేవతవు కాని నీవు రాక్షసస్త్రీవి కావు. నీచేత సంధించబడ్డాడు కనుక వీడికి జరాసంధుడని పేరు పెడతాను" అంటూ బృహద్రథుడు ఆ రాక్షసిని సత్కరించాడు.



జరాసంధుడు అల్లారుముద్దుగా పెరుగుతున్నాడు. ఒకనాడు ఆ పిల్లవాణ్ణి చూడటానికి చండకౌశికుడు వచ్చాడు. మహారాజు ఆయనను భక్తితో పూజించి కొడుకును చూపించాడు. ఆ మహర్షి పసివాణ్ణి ఎత్తుకుని, "వీడు కుమారస్వామి వలె శక్తిసంపన్నుడవుతాడు. సాక్షాత్తూ పరమేశ్వరుడికే సన్నిహితుడు అవుతాడు. ఎంతటి బలవంతులైనా వీణ్ని ఎదిరించి జయించలేరు.

"గ్రహాలలో సూర్యుడిలా రాజేంద్రులలో వీడు తేజస్వియై ప్రకాశిస్తాడు. దివ్యాస్త్రాలేవీ వీడి శరీరాన్ని ఛేదించలేవు. సకలమహీపతుల సంపదలూ వీడి

హస్తగతమవుతాయి" అని ఆశీర్వదించాడు.

తరువాత కుమారుడు పెద్దయ్యాక అతణ్ణి రాజ్యాభిషిక్తుణ్ణి చేసి బృహద్రథుడు తపోవనానికి వెళ్ళిపోయాడు.

"ధర్మరాజా! విన్నావా? జరాసంధుడు అలా ఆ మునీంద్రుడి ప్రభావం వల్ల అనంత శక్తిసంపన్నుడై బలగర్వితుడయ్యాడు. అతన్ని ఆయుధవిద్యలో ఎవరూ జయించలేరు. అందుకని భీమసేనుడే మల్లయుద్ధంలో వాణ్ని మెళకువగా చంపాలి" అని కృష్ణుడు జరాసంధుని జన్మవృత్తాంతాన్ని ధర్మరాజుకు చెప్పాడు. ●

# సహనసంపద

త్రిపురాసుర సంహారం చేసినప్పుడు మూడు పురాల్నీ దహించి వచ్చిన బాణాన్ని తన తొడమీద పెట్టుకున్నాడు పరమశివుడు. అది బాలుడుగా మారింది. ఈశ్వరతపం, ఉగ్రతాపం రెండూ కలవాడు కనుక ఆ బాలుడికి దుర్వాసుడని పేరు పెట్టాడు. ఈశ్వరాంశ సంభవుడు కనుక దుర్వాసుడు నిశ్చల తేజంతో వెలుగుతూ సకల శాస్త్రాలూ అధ్యయనం చేశాడు. ముక్కంటిని పూజించి మునిశ్రేష్ఠుడయ్యాడు.

ఒకసారి దుర్వాస మహాముని పాండవుల మందిరానికి వచ్చాడు. మందహాసం చేశాడు. అంతలోనే ఉన్నట్టుండి కోపగించుకున్నాడు. కళ్ళెర్ర చేశాడు. అన్నం కావాలన్నాడు. మళ్ళీ ఎందుకో వద్దన్నాడు. తర్వాత వడ్డించమని ఎంతమందికో చేసిన పదార్థాలన్నీ తానొక్కడే తినేశాడు. కాసేపు నేలమీదా, కాసేపు పట్టుపాన్పుల మీదా పవళించాడు. పగలనకా రాత్రనకా ఎక్కడికో పోతూ వస్తూ ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించాడు.

ఒకనాడు కృష్ణుడి దగ్గరకు వెళ్ళి "కృష్ణా! పరమాన్నం తినాలని వుంది. పెట్టించవా?" అని అడిగాడు. కృష్ణుడు వెంటనే తయారుచేయించి పెట్టాడు. దుర్వాసుడు కొంత తిన్నాడు. మిగిలింది తన ఒంటికి రాయమని కృష్ణుణ్ణి అడిగాడు. ముని చెప్పినట్టే చేశాడు ముకుందుడు. అతని పక్కనున్న రుక్మిణిని చూసి కొంచెం పరమాన్నం తీసి దుర్వాసుడు ఆవిడ శరీరానికి పూశాడు. ఆవిణ్ణి రథానికి కట్టి, ఆ రథం ఎక్కి వీధుల్లో తిరుగుతూ ఆవిణ్ణి ములుకోలతో కొట్టాడు. ఇదంతా కృష్ణుడు చూస్తూనే వున్నాడు. అయినా ఆయనకు కోపం రాలేదు. రథంతో పాటు తానూ నడిచాడు.

యాదవులందరికీ పట్టరాని కోపం వచ్చింది. దుర్వాసుడి వింతచేష్టలు చూసి ఆశ్చర్యపోతున్నారు. కొందరు భయపడుతున్నారు. మరికొందరు కోపంతో ఏమేమో అనుకుంటున్నారు. అయినా చేసేదేంలేక అందరూ రథం వెంట నడిచారు.

కాసేపటికి రుక్మిణి అలసిపోయి నేలమీద బోర్లాపడింది. దుర్వాసుడు వెంటనే రథం మీద నుంచి కిందకు దూకి, రుక్మిణిని చూసి జాలి పడకపోగా ఆవిడ మీద దుమ్ము చల్లి దక్షిణదిశగా పరుగుతీశాడు. కృష్ణుడు కూడా ఆయన వెంటే పరుగెత్తాడు. చాలాదూరం వెళ్ళాక హఠాత్తుగా ఆగిపోయాడు దుర్వాసుడు. చిరునవ్వుతో వెనక్కి తిరిగాడు.

"కృష్ణా! కోపం జయించావు నువ్వు! మిమ్మల్ని బాగా కష్టపెట్టాను కదూ! మహాసాధ్వి రుక్మిణి కనుక నా పరీక్షకు తట్టుకుని నిలబడింది. నీకు వరమిస్తాను. ప్రతివాళ్ళూ తమని తాము ఎంత ప్రేమిస్తారో, నిన్ను కూడా అంతగా ప్రేమిస్తూ అనుసరిస్తారుగాక! లోకవంద్యుడవై ఎదురులేని మహిమతో ప్రకాశించు. పరమాన్నం నా శరీరమంతా పూశావు. అరికాళ్ళలో మాత్రం రాయలేదు. అందుచేత అరికాలి ద్వారా నీకు అపాయం కలుగుతుంది. అది అశుభం కాదు. పరమపద ప్రాప్తికి కారణం" అన్నాడు దూర్వాసుడు.

తరువాత రుక్మిణిని చేరబిలిచి, "తల్లీ! సాటిలేని సౌందర్య సౌభాగ్యాలు పొందుతావు నువ్వు. కృష్ణుడి అంతపుఃర కాంతలందరికంటే ఎక్కువదానవై ప్రకాశించు. పుణ్యవతివై, మహాపతివ్రతవై దేవ మునివర్యుల ప్రశంసలు పొందు" అని దీవించి అంతర్ధానమయ్యాడు. అప్పుడు రుక్మిణీ, కృష్ణుడూ యిద్దరూ కొత్త కాంతితో ప్రకాశించారు. రుక్మిణి తాను పడిన అలసటంతా మరచిపోయింది. అగరు

లతికధూపం వేసినట్టు ఆవిడ శరీరం నుంచి సుగంధ పరిమళాలు వీచాయి. తమ మందిరాలు అందరి యిళ్ళకంటే ఎక్కువ వైభవోపేతంగానూ, అందమైన వస్తువులతోనూ, చీని చీనాంబరాలతోనూ నిండివుండడం చూసి రుక్మిణీకృష్ణులు ఆశ్చర్యపడ్డారు."

భీష్ముడు పాండవాగ్రజుడికి యీ కథ చెప్పాడు.

"అహింస, దానం, ధర్మం, సహనం అనేవి ఉత్తమ ధర్మాలు. **సహనం కలవాడిని విజయలక్ష్మి వరిస్తుంది. సహనం కలిగి ధర్మంమీద ఆదరం గలవాడికి లోకం తలవంచి నమస్కరిస్తుంది.** ఈ కనిపించే వెలుగంతా కృష్ణుడే. కృష్ణుడే సమస్తమూనూ. నాయనా! ఉత్తరాయణ పుణ్యకాలం త్వరలో రాబోతోంది. నేను దేహం విడిచే సమయం దగ్గరయినట్లు తోస్తోంది. నాకు ఇంద్రియాలూ, మనస్సూ, వాక్కూ స్వాధీనం తప్పుతున్నాయి. నీకు కావలసినదంతా కృష్ణభగవానుడు చెప్తాడు. పురాణ పురుషుడాయన. ఆయన చెప్పిన మార్గాన నడిచి సర్వసముడవై రాజ్యం పాలించు. బహుయజ్ఞాలు చెయ్యి, ప్రజలను రంజింపచేసి రాజ్యధర్మాన్ని నెరవేర్చు. పండిన వృక్షాన్ని పక్షులు ఆశ్రయించినట్లు చుట్టాలూ, మిత్రులూ నిన్ను ఆశ్రయించి సుఖపడతారు" అని గాంగేయుడు ధర్మజుడికి హితవు చెప్పాడు.

ధర్మరాజు భక్తి వినయాలతో తాతకు ప్రదక్షిణం చేసి కృష్ణుడితో హస్తినాపురానికి వెళ్ళాడు. ●

# దుర్వాసుడు

**దు**ర్వాసుడికి ముక్కుమీద వుండేది కోపం. సహనం వుండేది కాదు బొత్తిగా. పరమశివుని అంశతో పుట్టాడని ప్రతీతి. దుర్వాసుడి పుట్టుక గురించి పురాణాలలో అనేక కథలున్నాయి.

ఒకసారి బ్రహ్మకు, శివుడికి మధ్య మాటామాటా పెరిగి వాదోపవాదాలు చెలరేగి అది పెద్ద యుద్ధంగా మారింది. పరమేశ్వరుడు ప్రళయ రుద్రుడయ్యాడు. ఆయన కోపాగ్ని జ్వాలలకు దేవతలు తాళలేకపోయారు. బ్రహ్మ పలాయనం చిత్తగించాడు. భవాని సైతం భయభ్రాంతురాలైంది. భర్త దగ్గరకు వెళ్ళి "దుర్వాసం భవతి మి" అని ప్రాధేయపడింది. 'మీతో ప్రశాంతంగా కాపురం చేయటం నానాటికీ కష్టమవుతోంది' అని ఆ మాటకు అర్థం. తన కోపం క్షణికమే అయినా దానివల్ల పార్వతి సుఖంగా వుండలేకపోతోందని గ్రహించి తనలోని కోపాన్నీ ఉద్రేకాన్నీ మరొకరిలో ప్రవేశపెట్టాలని నిశ్చయించుకున్నాడు శివుడు.

ఈ సంఘటన జరిగిన రోజుల్లో శిలావతి అనే సాధ్వీమణి వుండేది. ఆమె భర్త ఉగ్రస్రావుడు దుశ్శీలుడు, కుష్ఠురోగి. వ్యాధితో బాధపడుతూ కూడా వారకాంతల ఇళ్ళకు తీసుకువెళ్ళమని భార్యను వేధిస్తుండేవాడు. ఒకరోజు శిలావతి భర్త కోరికపైన నడవలేని అతన్ని నెత్తిమీద బుట్టలో కూర్చోపెట్టుకుని ఓ వారకాంత ఇంటికి తీసుకువెళ్తుండగా అనుమాండవ్య మహాముని ఎదురై అతన్ని చీదరించుకుని, "రేపు సూర్యోదయ వేళ నువ్వు తలపగిలి మరణిస్తావు" అని శపించాడు. అందుకు ప్రతిగా "రేపు అసలు సూర్యోదయమే వుండదు" అని శిలావతి పలికింది.

పతివ్రతాశిరోమణి మాటకు తిరుగులేదు కనుక మరునాడు సూర్యుడు ఉదయించలేదు.

వెలుగుకోసం ప్రాణికోటి గగ్గోలుపెట్టింది. అప్పుడు త్రిమూర్తులు అత్రిమహర్షి భార్య అనసూయ దగ్గరకు వెళ్ళి శిలావతి తన శాపాన్ని ఉపసంహరించుకునేట్లు చేయమని అర్థించారు. అనసూయ కోరిక మేరకు శిలావతి తన శాపాన్ని వెనుకకు తీసుకుంది. మరుక్షణం సూర్యుడు వేన వేల కిరణాలతో వెలిగాడు. త్రిమూర్తులు సంతోషించి అనసూయను ఏదైనా వరం కోరుకోమని అడిగారు. "మీ ముగ్గురి అంశతో నాకు బిడ్డలు కలగాలి" అని కోరుకుంది ఆవిడ. సరేనన్నారు త్రిమూర్తులు. ఆ ప్రకారం బ్రహ్మ అంశతో చంద్రుడు, మహావిష్ణువు అంశతో దత్తాత్రేయుడు కలిగారు. పార్వతి భరించలేకుండా వున్న తన ఆగ్రహాన్ని శివుడు అనసూయలో ప్రవేశపెట్టాడు. ఆ అంశతో అనసూయకు కలిగినవాడే దుర్వాసుడు. కోపం నుంచి పుట్టాడు కనుక ఎప్పుడూ చిర్రుబుర్రు లాడుతుండేవాడు.

ఈ కథ బ్రహ్మాండపురాణంలో వుంది.

పూర్వం శ్వేతకి అనే రాజుగారుండేవారు. వందేళ్లపాటు సాగే ఒక మహా యజ్ఞాన్ని ప్రారంభించాడు ఆయన. అనేకమంది విప్రులు ఆ యజ్ఞానికి పౌరోహిత్యం వహించారు. కొన్నాళ్ళయ్యాక వాళ్ళు హోమగుండం నుంచి వచ్చే పొగకి తట్టుకోలేక కంటిచూపు కోల్పోయి వెనక్కి వెళ్ళిపోయారు. దానితో యజ్ఞం ఆగిపోయింది. శ్వేతకి చాలా బాధపడి శివుణ్ణి గురించి తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై దుర్వాసుణ్ణి పురోహితునిగా నియమించుకోమని చెప్పాడు. ఆ తరువాత దుర్వాసుడి పర్యవేక్షణలో శ్వేతకి యజ్ఞం పూర్తి చేశాడు.

ఓసారి దుర్వాసమహర్షి పితృలోకానికి వెళ్ళాడు. పితృనాథుడు మహర్షికి

ఎదురువెళ్ళి ఘనంగా స్వాగతం చెప్పాడు. వారిద్దరూ ఒకరి యోగక్షేమాలు మరొకరు తెలుసుకుంటూ వుండగా ఎక్కడినుంచో పెద్దపెట్టున దీనారావాలు వినిపించాయి. రకరకాల గొంతులు తమను హింసించవద్దంటూ చేస్తున్న ఆక్రందనలకు కరిగిన తాపసి "ప్రభూ! నువ్వు దీనులపాలిటి పెన్నిధివని, కారుణ్యమూర్తివని విన్నాను. మరి ఇక్కడ ఈ ఆర్తనాదాలేమిటి?" అని పితృనాథుణ్ణి అడిగాడు.

"మహర్షీ! నిజానికి ఇది పవిత్ర స్థలమే. పుణ్యకార్యాలు మినహా మరేమీ జరగవు. కాని ఇక్కడకు దగ్గరలో యమపురి వుంది. దాన్ని సంయమని అని పిలుస్తారు. న్యాయ రక్షకుడు యముడు అక్కడ అనేక క్రూరమైన పద్ధతుల్లో పాపుల్ని శిక్షిస్తుంటాడు. అక్కడ ఎనభై ఆరు నరక కూపాలుంటాయి. అన్నిట్లోకీ కుంభిపాకం అతి దారుణమైంది. భగవంతుణ్ణీ తల్లిదండ్రుల్నీ దూషించే వాళ్ళనూ, మానభంగాలకు పాల్పడేవాళ్ళనూ, గురువును తూలనాడే వాళ్ళనూ, గురుపత్నిని ఆశించే వాళ్ళనూ ఈ కుంభిపాక నరకంలోకి తోసి శిక్షిస్తారు. ఇప్పుడు మీరు విన్న ఆ అరుపులు అక్కడినుంచి వచ్చినవే" అన్నాడు పితృనాథుడు.

దుర్వాసుడికి ఇదంతా విన్న తరువాత యమపురిని సందర్శించాలన్న కోరిక కలిగింది. పితృనాథుడి సేవకులు వెంటరాగా అతడు యమపురికి వెళ్ళాడు. చిత్రం– మహర్షి అడుగు పెట్టగానే భీతి, బీభత్సం స్థానే శాంతి, సంతోషం చోటు చేసుకున్నాయి. నరకం నాకంగా మారింది. అప్పటివరకూ నానాహింసలూ పడ్డవాళ్ళు ఆనందనాట్యం చేయటం మొదలు పెట్టారు.

యమభటులకు ఇదంతా ఆశ్చర్యం కలిగించింది. హుటాహుటిన వెళ్ళి జరిగినదంతా తమ ప్రభువుకు విన్నవించారు. ఆశ్చర్యపోయిన యముడు వెంటనే మహిషవాహనంపై వచ్చి చూశాడు. తన లోకం అచ్చం ఇంద్రలోకంలా కనిపించింది. కారణం తెలియలేదు. ఈ వింతవార్త తెలిసి ఇంద్రుడు, బ్రహ్మ, విష్ణువు, అష్టదిక్పాలకులు కుంభిపాకనరకానికి వచ్చిచూశారు. వాళ్ళకీ ఏమీ బోధపడలేదు. చివరికి శ్రీమహావిష్ణువు కొందరు దేవతలను వెంటపెట్టుకుని కైలాసానికి వెళ్ళి, దుర్వాసుని రాకతో నరకం స్వర్గంగా మార్పు చెందటం గురించి శివుడికి సవివరంగా విన్నవించాడు.

ఫాలాక్షుడు నవ్వుతూ "ఇదంతా దుర్వాసుడి ప్రభావం. కుంభిపాక నరకంలోకి అడుగు పెట్టగానే ఆ తాపసి ఒంటిమీద విభూతి రాలి కిందపడి వుంటుంది. ఆయన మెడలోని పవిత్ర రుద్రాక్షల గాలి నరకమంతా వ్యాపించి వుంటుంది. అందుకే

కుంభిపాకం స్వర్గంలా భాసిస్తోంది. ఇకమీదట ఆ ప్రాంతం 'పితృతీర్థం' అని పిలవబడుతుంది. అక్కడవున్న తటాకంలో స్నానమాచరించిన వారికి పుణ్యగతులు కలుగుతాయి. అక్కడ నా విగ్రహాన్నీ, శివలింగాన్ని, పక్కనే ఉమాదేవి విగ్రహాన్నీ ప్రతిష్ఠించండి" అని సెలవిచ్చాడు పరమేశ్వరుడు. మహావిష్ణువు సంతోషించి ఆయన చెప్పినట్టే చేశాడు. ●

# యక్షప్రశ్నలు

పాండవులలో పెద్దవాడైన యుధిష్ఠిరుడు ధర్మానికి ప్రతిరూపం. అతని ధర్మబుద్ధిని ప్రతిబింబించే సంఘటనలు మహాభారతంలో కోకొల్లలుగా వున్నాయి.

అరణ్యవాసం చేస్తున్నప్పుడు పాండవులు ఒకనాడు అడవిలో తిరుగుతూ వుండగా వారికి విపరీతమైన దాహం వేసింది. అందరిలోకీ చిన్నవాడైన సహదేవుడు ఒక చెట్టు ఎక్కి వెతకగా దూరంగా ఒక మడుగు కనిపించింది. అన్నలను అక్కడే వుండమని చెప్పి నీటికోసం సహదేవుడు మడుగువైపు వెళ్ళాడు.

ముందు తాను దప్పిక తీర్చుకుని తరువాత తన సోదరులకు నీరు తీసుకుపోదామనుకున్నాడు. కానీ తీరా మడుగులోకి దిగబోయేసరికి చిత్రంగా ఎవరో మాట్లాడుతున్నట్టు అనిపించింది.

"సహదేవా ఆగు. నేను ఒక యక్షుణ్ణి. ఈ మడుగును కావలి కాస్తున్నాను. నువ్వు నా ప్రశ్నలకు సమాధానం చెబితేకాని ఈ మడుగులోకి దిగటానికి వీల్లేదు"

అన్నాడు యక్షుడు.

సహదేవుడు ఆ మాటలు లక్ష్యపెట్టక గబగబ దోసిళ్ళతో నీళ్ళు తీసుకుని తాగాడు. వెంటనే స్పృహతప్పి కిందపడి ప్రాణాలు కోల్పోయాడు.

కొంతసేపటికి తమ్ముణ్ణి వెదుకుతూ నకులుడు వెళ్ళాడు, నకులుడూ మొండిగా ప్రవర్తించి మడుగు వద్ద ప్రాణాలు వదిలాడు.

ఎంతకూ రాని తమ్ముళ్ళ గురించి కంగారుపడుతూ అర్జునుడు, భీముడు వెళ్ళారు. వారూ యక్షుడికి తిన్నగా సమాధానాలు చెప్పక ప్రాణాల మీదకు తెచ్చుకున్నారు.



చివరికి పాండవాగ్రజుడు మడుగు వద్దకు చేరాడు. చనిపోయిన తన సోదరులను చూచి దిగ్భ్రమ చెందాడు. నెమ్మదిగా మడుగులోకి దిగబోయాడు. యక్షుని కంఠస్వరం నుండి మళ్ళీ అవే మాటలు వినిపించాయి.

ధర్మతనయుడు యక్షుడి ప్రశ్నలకు సమాధానాలు చెప్పడానికి సన్నద్ధుడై నిలబడ్డాడు.

"మానవుని ఆపదలో కాపాడేది ఏది?"

"ధైర్యం"

"ఏ శాస్త్రాన్ని చదివి మానవుడు వివేకవంతుడవుతాడు?"

"శాస్త్రాధ్యయనం వలన వివేకం రాదు. సజ్జనసాంగత్యం వలన వస్తుంది."

"ఉర్వి కన్నా ఉదారమైనది, నిలకడ కలది ఏది?"

"పృధ్వికంటే ఉదాత్తమైనది కన్నతల్లి"

"గాలికంటే వేగంగా ప్రయాణించగలిగేది ఏది?"

"మనస్సు"

"దేశాటన చేసేవానికి తోడు ఏది?"

"తాను నేర్చిన విద్య"

"హృదయానికి ఏది ఎక్కువ ఆనందం ఇస్తుంది?"

"సత్ప్రవర్తన వల్ల వచ్చే ఫలితం"

"మనిషిని గౌరవించేది ఎప్పుడు?"

"అహం వినాశకారి అని తెలుసుకున్నప్పుడు"

"ప్రపంచంలో అన్నిటికన్నా వింత అయినది ఏది?"

"ప్రతినిత్యమూ ఎందరో తనువులు చాలిస్తున్నారు. జాతస్య మరణం ధృవమని ప్రతి మనిషికీ తెలుసు. కాని తాము ఎప్పటికీ జీవించి వుండాలనీ, అలా జీవిస్తామనే ప్రతివారూ అనుకుంటారు. అందుచేత రేపు చావబోయేవాడు ఈరోజు మరణించినవాడి కోసం రోదిస్తున్నాడు. ఇంతకన్నా వింత ఏముంది?"

యుధిష్ఠిరుడి సమాధానాలు విని యక్షుడు సంతోషించాడు.

"చనిపోయిన నీ సోదరులలో ఒకరిని బతికిస్తాను. ఎవరు కావాలో కోరుకో" అన్నాడు.

ధర్మరాజు నకులుని బతికించమని కోరాడు. యక్షుడు ఆశ్చర్యపడి కారణ మడిగాడు.

"అయ్యా! మా తండ్రిగారికి ఇద్దరు భార్యలు. పెద్ద భార్య మా మాతృదేవి కుంతికి నేనున్నాను. రెండవ భార్య కుమారులలో ఒకరైనా జీవించి వుండడం

న్యాయమని నేను భావిస్తున్నాను" అన్నాడు ధర్మరాజు.

అతని ధర్మనిరతికి, సూక్ష్మదృష్టికి సంతోషించి యక్షుని రూపంలో వున్న ధర్మదేవత తన నిజస్వరూపంతో ధర్మరాజు ఎదుట ప్రత్యక్షమైనాడు. మరణించిన పాండుకుమారులు నలుగురినీ బతికించి అంతర్హితుడయ్యాడు. ●

# బతుకుతెరువు

ఒక మహారణ్యంలో మర్రిచెట్టు కింద వున్న కలుగులో పలితుడనే ఎలుకరాజు వుండేవాడు. అదే చెట్టుమీద రోమకుడనే పిల్లి కూడా వుండేది. ఎలుకరాజు బయటికి వచ్చేటప్పుడు జాగ్రత్తగా, పిల్లి లేని సమయం చూసుకుని మరీ వచ్చేవాడు.

ఒక బోయ ప్రతిరోజూ అడవిలోకి వచ్చి మృగాలకోసం వల వేసి పోతుండేవాడు. ఒకరోజు పిల్లి అతడి వలలో చిక్కింది. అది చూసిన ఎలుకరాజు ఇంక ఫరవాలేదు, నిర్భయంగా బయటకు వచ్చి ఆహారం కోసం వెతకవచ్చులే అనుకున్నాడు. తీరా పలితుడు బయటకు వచ్చే సమయానికి గుడ్లగూబ, ముంగిస ఎదురయ్యాయి. గూబపేరు చంద్రకుడు, ముంగిస పేరు హారికుడు. ఇద్దరూ దుర్మార్గులే! 'భగవంతుడా! ఇప్పుడేం చెయ్యను? ఎటు కదిలినా ప్రాణం పోతుందే! చుట్టూ శత్రువులేనే! ఇప్పుడేమిటి కర్తవ్యం' అని పలితుడు డీలాపడ్డాడు. చివరికి ఓ ఆలోచన తట్టింది. మెల్లిగా పిల్లి దగ్గరకు వెళ్ళి, "పిల్లిరాజా! ఎన్నడూ లేనిది ఏమిటిలా

వలలో చిక్కుకున్నావు? ఇద్దరం ఒకే చెట్టును ఆశ్రయించి బ్రతుకుతున్నాం. నేను వల కొరికి నిన్ను విడిపిస్తాలే! నాతో స్నేహంగా ఉండు. అదే పదివేలు" అంది. 'ముందు గుడ్లగూబనూ, ముంగిసనూ తప్పించుకుంటే ఆ తర్వాత పిల్లిని ఎలాగైనా మాయబుచ్చవచ్చు. పిల్లిని చూస్తే గూబకూ, ముంగిసకూ కూడా భయమేగా' అనుకుని పలితుడు పిల్లి దగ్గరకు వెళ్ళి నిలబడ్డాడు.

"మిత్రమా! తప్పకుండా నువ్వు నా స్నేహితుడవే! ముందు ఈ వల దారాలు కొరికి నన్నీ చెరనుంచి రక్షించు" అని పిల్లి ఆత్రంగా అడిగింది.

"అయ్యా– ఆ ముంగిసనీ, గూబనూ చూస్తుంటే నా శరీరం వణుకుతోంది. ముందు నన్ను కాసేపు నీ ఒళ్ళో కూర్చోబెట్టుకున్నావంటే నాకు భయం తగ్గుతుంది. తరువాత వలనుంచి నిన్ను బయటకు రప్పిస్తాను" అన్నాడు ఎలుకరాజు.

"అయ్యో! అంతకంటేనా! భయం విడిచి నా దగ్గరకు రా! నేనంటే గూబా, ముంగిసా భయపడతాయి. నువ్వు నా దగ్గరుంటే అవి నిన్నేం చేయలేవు. రా నేస్తం! రా!!" అంది పిల్లి.

"ఆ సంగతి తెలిసే నీతో సంధి చేసుకుంటున్నాను. అందువల్ల నాకు ప్రాణరక్షణ, నీకీ వలనుంచి విడుదల దక్కుతాయి" అంటూ పలితుడు వెళ్ళి ధైర్యంగా మార్జాలం ఒళ్ళో కూర్చున్నాడు. అది చూసి ఇంక లాభం లేదనుకుని ముంగిస, గూబ నోళ్ళు నొక్కుకుని వెళ్ళిపోయాయి.

ఎలుక సంతోషించి రోమకుడి ఒడిలోంచి బయటకు వచ్చి మెల్లమెల్లగా తాళ్ళు కొరుకుతున్నట్టు నటించింది. అది చూసి, "మిత్రమా! ఏమిటి ఆలస్యం చేస్తున్నావు. తాళ్ళు తొందరగా కొరికి వెంటనే నాకు విముక్తి కలగజెయ్యి" అంది పిల్లి.

"పిచ్చివాడా! ఆశ్రయించిన నన్ను రక్షించావు నువ్వు. అలాంటి నేను నీకు ద్రోహం చేస్తానా? అలా చెయ్యడం కంటే పాపం ఇంకేమైనా వుందా? నీకు భయపడి, నిన్ను నమ్మలేక వెంటనే వల కొరకడం లేదు. వేటగాడు కంటపడగానే వల దారాలు కొరికి నిన్ను రక్షిస్తాను. ఈలోగా నిన్ను తప్పిస్తే నాకేం చేటు తలపెడతావో! **శత్రువుతో అవసరం కొద్దీ సంధి చేసుకున్నా అతన్ని నమ్మకూడదనీ, జాగ్రత్తగా వుండాలనీ పెద్దలు చెబుతారు.** వేటగాడు వచ్చే వేళకు వల కొరికితే నువ్వు గబగబ చెట్టు ఎక్కుతావు, నేను కన్నంలోకి పోతాను. నన్ను పట్టే అవకాశం వుండదు నీకు! అందుచేత

వేటగాడి రాక చూస్తూనే నిన్ను బంధవిముక్తుడ్ని చేస్తాను, సందేహించకు" అన్నాడు ఎలుకరాజు.

"నా గురించి నువ్వు అలా అనుకోవడం ఏమీ బాగాలేదు. నీ ప్రాణం నేను రక్షించాను. అలాగే సాధ్యమైనంత త్వరగా నా ప్రాణం కూడా రక్షించడం నీ ధర్మం" అంది పిల్లి.

"తొందరపడకు. తెల్లవారుతోంది. వేటగాడు రాగానే నీకీ చెర తప్పిస్తాను" అన్నాడు పలితుడు.

"అయ్యో! అడుగో వేటగాడు. కుక్కల్ని వెంట బెట్టుకుని వస్తున్నాడు. చేతిలో కత్తి కూడా ఉంది. త్వరగా నన్ను కాపాడు" అంది బిడాలం గడగడ వణుకుతూ.

"భయపడకు, భయపడకు" అంటూ ఎలుక గబగబ ఆ వల తెగ కొరికింది. పిల్లి ప్రాణభయంతో చరచరా చెట్టెక్కింది. ఎలుక వెంటనే కన్నంలోకి దూరింది. వేటగాడు వల పాడైపోయినందుకు విచారిస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

తరువాత పిల్లి మెల్లగా కన్నం దగ్గరకు వచ్చి, "మిత్రమా! నువ్వూ, నేనూ ఒకరికొకరం ఉపకారం చేసుకుని మంచి స్నేహితులమయ్యాం. ఇప్పుడు నీకింక అపనమ్మకం ఎందుకు? రా! మనిద్దరం హాయిగా కలిసి జీవిద్దాం. నీకు అండగా ఉంటాను నేను" అంది.

"పిల్లి రాజా! నీ మాటలు బాగానే వున్నాయి. కాని శత్రువుల్నీ, మిత్రుల్నీ తెలుసుకోవాలంటే చాలా సూక్ష్మదృష్టి ఉండాలి. ఒక్కొక్కప్పుడు శత్రువులే మిత్రులౌతారు. మిత్రులే శత్రువులౌతారు. కనుక నీ దగ్గరకు రావడం మంచిదికాదు. నువ్వు నా యందు అభిమానం చూపించినా నేను ఏమరడం నాకు శ్రేయస్కరం కాదు. ఇలాగే నీ పొరుగున ఉండి అవసరమైనప్పుడు నీకు మేలు చేస్తుంటాను. అంతేగాని నీ దగ్గరకు రాను. అదీగాక నేను నీకు ఆహారాన్ని. నన్ను చూడగానే నీకు మనస్సులో వికారం పుడుతుంది. నన్ను తినాలనే కోరిక పుడుతుంది. రాత్రంతా వలలో చిక్కి అసలే ఆకలితో ఉన్నావు. నీకు ఉపాహారం కావల్సివచ్చి నన్ను పిలుస్తున్నావు, చాలు చాల్లే" అన్నాడు ఎలుకరాజు. "అయ్యయ్యో! నా ప్రాణ రక్షకుడికి అపకారం చేస్తానా. నేను అంత కృతజ్ఞత లేనిదాన్నా?' అంది పిల్లి.

"అదంతా ఎందుకు? నా వల్ల నువ్వూ, నీ వల్ల నేను బ్రతికాం. ఆ స్నేహం చాలు మనకు. అంతకుమించి చెలిమి మంచిది కాదు. ప్రయోజనం ఉన్నప్పుడు

బలవంతుడైన శత్రువుతో కలిసి ఉండి, ఆ ప్రయోజనం తీరగానే విడిపోవాలి. నమ్మి అక్కడే ఉంటే కీడు తప్పదు. **నమ్మతగని వాళ్ళను నమ్మనేకూడదు. ఇతరులు తనను నమ్మేటట్టు ప్రవర్తిస్తూ, తాను మాత్రం ఎవరినీ నమ్మకుండా ఉండటమే నీతి. అదే బతుకుతెరువు.** నీలాంటి వాళ్ళను నమ్మకుండా నేనూ, బోయ లాంటి వాళ్ళను నమ్మకుండా నువ్వూ బతికిపోదాం. ఇంకేం మాట్లాడకు వెళ్ళు" అన్నాడు పలితుడు. పిల్లి సిగ్గుపడి వెళ్ళిపోయింది.

ఆ తరువాత ఆ కలుగులో వుండటం క్షేమం కాదని ఎలుక మరోచోటికి వెళ్ళింది. ●

# శిశుపాలుడు

భీష్మాది రాజర్షుల సహాయంతో, కృష్ణుని పర్యవేక్షణలో ధర్మరాజు ప్రారంభించిన రాజసూయయాగం చక్కగా సాగింది. భీష్ముడు ఆ యాగం చూసి మహదానందంతో, ‘‘నాయనా! ధర్మనందనా! నీ క్రతువు మూడు వంతులు పూర్తయింది. స్నాతకుడూ, ఋత్విజుడూ, సద్గురుడూ, ఇష్టుడూ, భూమీశుడూ, సంయముడూ పూజనీయులని పెద్దలు చెబుతారు. ఈ ఉన్న వాళ్ళందరిలో సద్గుణవంతుడయిన మహాత్ముణ్ణి పిలిచి అర్ఘ్యమిచ్చి పూజించు” అన్నాడు.

“తాతా! అటువంటి వారెవరో అది కూడా నువ్వే చెప్పు. నీ ఆజ్ఞానుసారం చేస్తాను” అన్నాడు ధర్మరాజు. “నాయనా! జగన్నాయకుడైన కృష్ణుడు వుండగా ఇంక వెతుక్కోవలసిన అవసరమేముంది? అతడు యజ్ఞపురుషుడు. లోకపూజ్యుడయిన అతనిని పూజించడమే నీ యజ్ఞానికి ఫలం” అన్నారు తాతగారు. వెంటనే అర్ఘ్యాన్ని విధియుక్తంగా వాసుదేవుడికి సమర్పించాడు ధర్మరాజు. అదిచూసి శిశుపాలుడు మండిపడ్డాడు.

"ధర్మరాజా! నీ వెర్రితనం చూస్తే జాలేస్తోంది. అనేకులైన రాజులుండగా, ఆర్యులై, ఆరాధ్యులైన భూసురులుండగా, ఆ గాంగేయుని మాటలు విని వివేకం లేకుండా ఈ జిత్తులమారిని పూజించావు. వృద్ధాప్యంవల్ల మతిమందగించి భీష్ముడు చెప్పాడే అనుకో–నీ తెలివితేటలు ఏమయ్యాయి? వాసుదేవుడు మీకు ఇష్టుడైతే అతడు కోరినంత ధనం ఇవ్వండి. అంతేగాని ఇంతమంది పూజనీయులున్న ఈ సభలో ఈ అనర్హుణ్ణి పూజార్హుణ్ణి చేయడం మాత్రం తగదు. వయోవృద్ధుడు కాదు, ఋత్విజుడూ కాదు, ఆచార్యుడంతకంటే కాదు. ఏ యోగ్యత ఉందని అతనిని పూజించ దలుచుకున్నావు? చెవిటికి శంఖధ్వని వినిపించడం వల్ల ఎంత ప్రయోజనమో ఈ కృష్ణుణ్ణి పూజించడం వల్ల కూడా అంతే ప్రయోజనం" అంటూ శిశుపాలుడు సభ విడిచి బయలుదేరాడు.

"నాయనా శిశుపాలా! నిదానించు. **ఆవేశం చాలా చెడ్డది. పరుషంగా మాట్లాడకూడదు. గుణవంతులూ, ధీరులూ అయినవాళ్ళు చల్లగా మాట్లాడటం నేర్చుకోవాలి.** కృష్ణభగవానుడు సృష్టికర్తయైన బ్రహ్మకే కారణభూతుడైనవాడు. వేదాది సమస్త వాఙ్మయమూ అతన్నే స్తుతిస్తుంది. అతడు త్రిలోక పూజ్యుడు కనుకనే తాతగారు అలా చెప్పారు. తొందరపాటుతో ఆ మహానుభావుణ్ణి తూలనాడావు..." అని ధర్మరాజు శిశుపాలుడికి నచ్చచెప్పబోయాడు.

"ధర్మరాజా! ఈ శిశుపాలుడు బాలుడు. పైగా మూఢుడు. తనకున్న కొద్దిపాటి రాజ్యాన్ని చూసుకుని మిడిసిపడుతున్నాడు. కారణం లేకుండా కలహం పెంచుకునేవాడితో మాట్లాడకూడదు" అన్నాడు భీష్ముడు.

తరువాత శిశుపాలుణ్ని చూసి కోపంతో, "శిశుపాలా! ఏళ్ళు మీరినవాడు కాదు వృద్ధుడు–జ్ఞానవంతుడు బాలుడైనా పూజనీయుడే. పరాక్రమసంపదతో రాజులందరినీ అతిశయించినవాడు క్షత్రియుడు కాకపోయినా సన్మానార్హుడౌతాడు. గుణవృద్ధుడని తెలిసే కృష్ణుణ్ణి పూజించాం. పెద్దల చరిత్రలు అల్పులకేం తెలుస్తాయి?" అంటూ మందలించాడు భీష్ముడు.

"తాతా! మీరాగండి. సభాసదులారా వినండి! కావాలనే మేము కృష్ణుడికి అర్ఘ్యమిచ్చాం. కాదనేవాళ్ళందరినీ నా వామపాదంతో నెత్తిమీద తన్నడానికి సిద్ధంగా ఉన్నాను. ఎవరైనా ఉంటే రండి ముందుకు" అన్నాడు సహదేవుడు.

వెంటనే తన పక్షం చేరే క్షత్రియులందర్నీ కూడగట్టుకుని శిశుపాలుడు యుద్ధానికి సంసిద్ధుడయ్యాడు.

భీముడు కూడా పళ్ళు పటపట కొరుకుతూ, గద భుజాన వేసుకుని, కోపంగా శిశుపాలుడి వైపు నడిచాడు. అది చూసి భీష్ముడదిరిపడి, చటాలున వెళ్ళి భీమసేనుణ్ణి గట్టిగా పట్టుకుని వెనక్కు మళ్ళించాడు.

"నాయనా! వాణ్ణి చంపవలసింది నువ్వు కాదు. కృష్ణుడి చేతిలో తప్ప మరెవ్వరి చేతిలో వాడు చావడు" అంటూ శిశుపాలుడి గాథను వివరించాడు.

"పూర్వం చేది వంశంలో దమఘోషుడనే రాజుండేవాడు. అతని భార్య సాత్వతి. వాళ్ళకి పుట్టిన పిల్లవాడు వీడు. వీడు పుట్టడమే నాలుగు చేతులతో, నుదుట కన్నుతో– చాలా వికారంగా పుట్టాడు. గాడిద కంఠస్వరంతో ఏడుపు మొదలుపెట్టాడు. ఆ లక్షణాలకు తల్లిదండ్రులిద్దరూ భయపడుతుంటే– 'మహారాజా! ఎవరు నీ కుమారుణ్ణి ఎత్తుకుంటే వీడి వికారాలన్నీ పోతాయో, ఆ మహానుభావుడి చేతిలోనే వీడు మరణిస్తాడు. అతను తప్ప యింకెవరూ వీణ్ణి చంపలేరు' అని అశరీరవాణి పలికింది.

"అప్పటినుంచి దమఘోషుడు, సాత్వతి యిద్దరూ తమ యింటికి వచ్చిన వాళ్ళందరికీ తమ బిడ్డను ఎత్తుకొమ్మని అందిస్తూండేవారు.

ఒకసారి బలరామకృష్ణులు మేనత్త సాత్వతిని చూడటానికి వాళ్ళ యింటికి వెళ్ళారు. సాత్వతీదేవి వాళ్ళను కుశల ప్రశ్నలడిగి కొడుకును మొదట బలరాముడి చేతికి యిచ్చింది. వాడు మామూలుగానే వికారంగా ఉన్నాడు. తర్వాత కృష్ణుడి చేతికి అందించింది. కృష్ణుడు ఎత్తుకోగానే శిశుపాలుడికి ఎక్కువగా ఉన్న రెండు చేతులు, నుదుట ఉన్న కన్ను మటుమాయమయ్యాయి. అది చూసి అందరూ ఆశ్చర్యపడ్డారు. కాని సాత్వతి మాత్రం భయపడింది. 'కృష్ణా! ఈ శిశుపాలుడు నీకు మేనత్త కొడుకు. వీడొక వేళ దుర్మార్గుడై నీ కిష్టంలేని పని చేసినా, నీకు అన్యాయం తలపెట్టినా క్షమించి విడిచిపెడతానని మాట యివ్వు నాయనా! నా పై దయచూపి పుత్రభిక్ష అనుగ్రహించు' అంటూ కృష్ణుణ్ణి బతిమాలుకుంది. అప్పుడు కృష్ణుడు మేనత్తమీద ఉన్న అభిమానం కొద్దీ ఆమె మాట మన్నించి, 'అత్తా! నూరు తప్పులవరకూ వీణ్ణి క్షమిస్తానని నీకు మాట యిస్తున్నాను. ఆ తరువాత–విధి లిఖితం. నా చేతులలోనే వీడు చావవలసి ఉంటే నేను చేయగలిగిందేమీ లేదు' అన్నాడు. అందుకని శిశుపాలుడు ఎంతగా తూలనాడినా కృష్ణుడు సహించి వూరుకుంటున్నాడు.

"అదిగో అలా చూడు! వాడికి కాలం చేరువైంది!! మంటను చేరే మిడతలాగా కృష్ణుడి పైకి వెడుతున్నాడు" అంటూ శిశుపాలుణ్ణి భీష్ముడు భీమసేనునికి చూపించాడు.



"సభాసదులారా! ఈ శిశుపాలుడి వాచాలత్వం మీ అందరికీ తెలిసింది కదా! ఒకప్పుడు నేను ప్రాగ్జోతిష పురానికి భగదత్తుడి మీదకు దండయాత్రకు వెడితే, ఆ సమయం చూసి వీడు అన్యాయంగా ద్వారకానగరానికి నిప్పంటించాడు. వీరులయిన భోజరాజన్యులు రైవతకాద్రి మీద భార్యలతో విహరిస్తుంటే వారిని వధించాడు. నా తండ్రి వసుదేవుడు అశ్వమేధయాగం చేస్తుంటే అశ్వాన్ని అపహరించి యజ్ఞానికి విఘ్నం కలగజేశాడు. అన్నిటికీ మించి ఈ పాపాత్ముడు బభ్రుని భార్యను చెరపట్టి తనకు భార్యగా చేసుకున్నాడు. మా మేనత్త బ్రతిమాలినందువల్ల వీడి అపరాధశతాన్ని సహించాను. ఇంకొక్క తప్పు చేసినా వీణ్ణి క్షమించను" అన్నాడు కృష్ణుడు.

"నీ దయ ఎవడికి కావాలి? నీ వంటి తుచ్ఛుడి అనుగ్రహంతో బతికేటంత దయనీయ స్థితిలో నేను లేను. మా అమ్మకు మాట ఇచ్చాట్ట మాట! బీరాలు పలుకుతున్నాడు..." అంటూ ఉండగానే కృష్ణుడి చేతినుంచి సుదర్శనం మెరుపులు చిమ్ముతూ వెళ్ళి శిశుపాలుడి శిరస్సును ఛేదించింది. వజ్రాయుధం వల్ల కూలిన పర్వతంలా శిశుపాలుడి దేహం కింద పడటంతోనే అతని శరీరాన్నుండి ఒక దివ్యతేజస్సు వెలువడి నారాయణునిలో లీనమైంది. వెంటనే రాజసమూహంతో పాటు దేవతలంతా జయజయధ్వానాలు చేశారు. ●

# ధర్మవర్తనం

**పూ**ర్వం కపిలుడనే ఒక ముని వుండేవాడు. అతనొకసారి నహుష మహారాజు గోవును చూసి "నువ్వు వేదస్వరూపవు కదా!" అన్నాడు. అక్కడికి దగ్గరలోనే వున్న సోమరశ్మి అనే మరో ముని ఆ మాటలు విని కపిలుడికి వేదాలమీద ఆదరం లేక పరిహసిస్తున్నాడు కాబోలనుకుని వెంటనే ఆ గోవులో ప్రవేశించి, "ఏం వేదాలమీద నీకు నమ్మకం లేదా?" అని అడిగాడు.

"నాకు వేదాలమీద ఆదరం, అనాదరం రెండూ లేవు. అయినా ఎందుకలా ప్రశ్నించావు? నాలుగు రకాల ఆశ్రమాలూ అవలంబింపవలసినవే!" అన్నాడు కపిలుడు.

"వేదమార్గం విడిస్తే పాపం వస్తుందా?" అని గోవు శరీరంలోకి ప్రవేశించిన సోమరశ్మి అడిగాడు.

"పాణి, ఉపస్థ, ఉదరం, వాణి అనేవి మూయలేని వాకిళ్ళు. బుద్ధిమంతుడు మాత్రమే వాటిని మూయగలడు. అటువంటివాడు ఎదురుగా బంగారపు ముద్ద వున్నా తీసుకోడు. కోపం వచ్చినా కొట్టడానికి చెయ్యి ఎత్తడు. అప్పుడు వాడు 'చెయ్యి' అనే వాకిలి మూసినట్టేగా! ఎంత చక్కనిచుక్క ఎదురైనా చలించడు. కాంతావ్యామోహం వుండదు. అలాంటివాడు 'ఉపస్థ' అనే వాకిలిని మూసినట్టే! ప్రాణం నిలుపుకునేందుకు ఏ పదార్థమైనా కొంచెంగా తింటాడు గానీ రుచులిచ్చగించడు. తద్వారా 'ఉదరం' అనే వాకిలిని మూసివేస్తాడు. అబద్ధం పలకడు. పరుషంగా మాట్లాడడు. వాదానికి దిగడు. ఎవరినీ నొప్పించడు. అలాంటివాడు 'వాణి' అనే వాకిలి మూసివేసినట్లే. ఈ నాలుగు ద్వారాలూ ఎవరు మూయగలరో వారు ఉత్తములు. అలాంటి స్థితప్రజ్ఞులకు తపాలూ, దానాలూ, యాగాలూ ఎందుకు? ఫలకాంక్ష లేనివాడికి వేదాలలో చెప్పిన కర్మలతో, నిష్ఠలతో, ధర్మాలతో పనిలేదు" అని వివరించాడు కపిలుడు.

"అయ్యా! నేను ధర్మం తెలుసుకోవాలనే ఉద్దేశంతో ఈ గోవులో ప్రవేశించాను. వేదాలు సప్రమాణికం అవునో కాదో నీ నుండి విందామనుకున్నాను. నా కోరిక తీరింది. సంతోషం" అంటూ సోమరశ్మి బయటకు వచ్చి కపిలుడికి నమస్కరించాడు.

"నాయనా! వేదాలు, ధర్మార్థ కామాలు మూడిటి గురించీ చెబుతాయి. ఎన్ని చెప్పినా ధనం, కామం ధర్మంతో సమానమౌతాయా!

"ఒకసారి ఓ బ్రాహ్మణుడు యజ్ఞం చెయ్యాలనుకున్నాడు. కావలసిన సొమ్ము కోసం తీవ్రంగా తపస్సు చెయ్యడం మొదలుపెట్టాడు. కుండధారుడనే దేవ పరిచారకుడు అక్కడికి వచ్చి బ్రాహ్మణుడి కోరిక తెలుసుకుని, తన ప్రాణ స్నేహితుడైన మణిభద్రుణ్ణి తలుచుకున్నాడు. అతడు కుబేరుడి భృత్యువు. వెంటనే అక్కడికి వచ్చాడు. కుండధారుడి ద్వారా ఆ బ్రాహ్మణుడి కోర్కె తెలుసుకుని యాగానికి కావలసిన మొత్తం ధనం తను ఇస్తానన్నాడు. కాని మానవశరీరం అశాశ్వతమనీ, ఆ బ్రాహ్మణుడి మనస్సు ధర్మమార్గంలో నడిస్తే సర్వసంపదలూ వాటంతటవే అతనికి లభిస్తాయని తోచింది కుండధారుడికి. ఆ మాటే బ్రాహ్మణుడితో చెప్పాడు. బ్రాహ్మణుడు దేవ పరిచారకుడి మాటమీద విశ్వాసం వుంచి, 'అయ్యా! నీ అనుగ్రహం వల్ల నాకు తెలివి వచ్చింది. నాకు ధనధాన్యాలు అక్కరలేదు. తపస్సు చేసుకుంటాను, అనుజ్ఞ ఇవ్వు' అని ప్రార్థించాడు.

సరేనని కుండధారుడూ, మణిభద్రుడూ వెళ్ళిపోయారు.

ఆ ఘడియలో మౌని అయిన ఆ బ్రాహ్మణుడు తరువాత చాలాకాలంపాటు నిరాఘాటంగా తపస్సు చేశాడు. క్రమక్రమంగా అతని మనస్సూ శరీరమూ మానుషభావాన్ని విడిచిపెట్టి దివ్యత్వాన్ని సంతరించుకున్నాయి.

'నన్ను ఆశ్రయించిన వాళ్ళకు పాపాలు పోగొడతాను. భోగభాగ్యాలు కలగచేస్తాను. రాజ్యం ఇస్తాను. సకల సౌఖ్యాలు అనుగ్రహిస్తాను' అనే ఊహలు అతని మనస్సులోకి వచ్చాయి. అంతటి సిద్ధి లభించిందతనికి.

అప్పుడు కుండధారుణ్ణి తలచుకున్నాడు. అతను వెంటనే ప్రత్యక్షమయ్యాడు. బ్రాహ్మణుడు అతనిని భక్తితో పూజించి సాష్టాంగ నమస్కారం చేశాడు. దేవ పరిచారకుడు అతనిని ప్రీతిపూర్వకంగా లేవనెత్తి, 'నాయనా! **ధనం, కామం రెండూ మనిషిని వెర్రివాడ్ని చేస్తాయి. మంచి చెడుల విచక్షణ తెలుసుకోలేని వివేకహీనుడిగా మారుస్తాయి. మనస్సు కామక్రోధాలకు, లోభమోహాలకు లోనైతే ధర్మానికి లోపం జరుగుతుంది.** అప్పుడు పాపపు బుద్ధులు పుడతాయి.

'ధనం సకల దోషాలకూ మూలం. గోవుతోపాటు కొమ్ములు పెరిగినట్టే డబ్బుతో పాటే తృష్ణ పెరుగుతుంది. తృష్ణవల్ల నా బంధువులు, నా ధనం, నా ఇల్లు అనే మమత కలుగుతుంది. ఆ మమకారం పోయి దేనిమీదా ఆశ లేని నిష్కామదృష్టి కలిగితేనే తృష్ణ నశిస్తుంది. తృష్ణను త్యజించినప్పుడు వచ్చే సుఖం డబ్బు కన్నా, రాజ్యం కన్నా, రమణి కన్నా గొప్పది. కనుక ఆశామోహాలను విడిచిపెట్టు. కాంక్షను జయించే మార్గం ఇతరులకు బోధించు' అని దీవించి వెళ్ళిపోయాడు.

"బ్రాహ్మణుడు కుండధారుడు చెప్పినట్టే మనస్సు నిగ్రహించుకుని, నిగర్వి అయి, సాటి మానవులకు నిష్కామతత్వాన్ని ఉపదేశిస్తూ తపస్సు చేసి బ్రహ్మపథం పొందాడు" అని కపిలుడు సోమరశ్మికి వివరించాడు. ●

# ఖాండవదహనం

**చా**లా ఏళ్ళక్రితం శ్వేతకి అనే రాజుగారు దుర్వాసమహర్షి పర్యవేక్షణలో ఒక బృహత్తర యజ్ఞాన్ని నిర్వహించాడు. వందేళ్ళపాటు సాగి దిగ్విజయంగా ముగిసిన ఆ యజ్ఞం వల్ల దేవతలందరూ సంతోషించారు. కాని నిత్యం హోమగుండంలో ఆజ్యం పోయడం వల్ల అగ్నిదేవుడికి అజీర్తి చేసింది. మొహం పాలిపోయింది. సన్నబడ్డాడు. ఆహారం పట్ల విముఖత ఏర్పడింది. ఇక లాభం లేదనుకుని అగ్ని బ్రహ్మను అర్చించి తన వ్యాధి గురించి వివరించి తరణోపాయం చెప్పమని వేడుకున్నాడు. "ఖాండవవనంలో అనేక దివ్య ఓషధులున్నాయి. దేవతలకు శత్రువులైన రకరకాల జంతువులున్నాయి. నీ ప్రతాపంతో ఆ వనాన్ని దహించి ఆ ఓషధుల్ని స్వాహాచేసి జంతువుల్ని భక్షించు. నీ ఆరోగ్యమూ కుదుటపడుతుంది. శత్రు సంహారమూ జరుగుతుంది" అని అగ్నికి సలహా ఇచ్చాడు.

సరేనని అగ్ని ఖాండవవనానికి వెళ్ళాడు. ఆ వనంలో ఇంద్రుడి స్నేహితుడు తక్షకుడు భార్యాబిడ్డలతో వుంటున్నాడు. ఖాండవ వనాన్ని దహించటానికి అగ్ని వచ్చాడని తెలుసుకుని తన స్నేహితుడ్ని ఎలాగయినా సరే రక్షించాలనుకున్నాడు ఇంద్రుడు.

అగ్ని వనదహనం ప్రారంభించగానే ఇంద్రుడు కుండపోతగా వర్షం కురిపించాడు. అంతటితో అగ్ని ప్రయత్నం విఫలమైంది. కోపంతో కణకణలాడిన అగ్నిదేవుడు ఆ వనాన్ని ఎలాగైనా స్వాహా చెయ్యాలన్న నిశ్చయంతో వరుసగా ఏడురోజులూ కాపు కాశాడు. ఏడురోజులూ ఇంద్రుడు అడ్డుకున్నాడు. లాభం లేక అగ్ని వెళ్ళి మళ్ళీ బ్రహ్మ దగ్గర మొరపెట్టుకున్నాడు.



"నరనారాయణులు భూమిపై కృష్ణార్జునులుగా జన్మిస్తారు. అప్పుడు ఖాండవ వనాన్ని దహించే అవకాశం నీకు లభిస్తుంది. అప్పటివరకూ వేచివుండు" అని బ్రహ్మ ఉపాయం చెప్పాడు.

పాండవులు ఇంద్రప్రస్థంలో ఉంటున్నప్పుడు ఒకసారి అర్జునుడు కృష్ణుణ్ణి తోడు తీసుకొని ఖాండవ వనానికి వెళ్ళాడు.

యమునా తీరాన బావమరుదులిద్దరూ చల్లగాలికి సేద తీరుతుండగా అగ్ని ఒక ముసలి బ్రాహ్మణుడి వేషంలో వెళ్ళి తన వ్యాధి గురించి చెప్పుకుని సహాయం కోసం అర్థించాడు. వారు సరేనన్నాక అసలు రూపంలో ప్రత్యక్షమై ఖాండవ వనాన్ని దహించాలనే కోరికను వెళ్ళబుచ్చాడు. కృష్ణార్జునులు సహాయం చేస్తామని వాగ్దానం చేశారు. అయితే ఆ సమయంలో వాళ్ళ దగ్గర ఆయుధాలు సిద్ధంగా లేవు. అది గమనించి అగ్ని వరుణదేవుణ్ణి ప్రార్థించాడు. వరుణుడు ప్రత్యక్షమై అగ్నిదేవుడి అభ్యర్థన మేరకు అర్జునుడికి 'చంద్రధనుస్సు' (గాండీవం) ఇచ్చాడు. చిత్రమేమిటంటే దానికి అక్షయ తూణీరం ఉన్నది. ఎన్ని బాణాలు తీసివేస్తున్నా అది ఖాళీ కాదు. ఎప్పుడూ శరసమృద్ధమై ఉంటుంది. దానికితోడు కపిరాజుచిత్తరువుతో వున్న ధ్వజాన్ని అమర్చిన ఒక దివ్యరథాన్ని అర్జునుడికి ఇచ్చాడాయన. ఆ రథానికి బలిష్టమైన నాలుగు తెల్లగుర్రాలు పూన్చి ఉన్నాయి. నాలుగిటికీ కళ్ళేలుగా నాలుగు బంగారపు గొలుసులు ఉన్నాయి. బ్రహ్మానందం పొందిన అర్జునుడు వరుణదేవుడికి వినమ్రుడై నమస్కరించి వాటిని స్వీకరించాడు.

కృష్ణార్జునులు ఖాండవ వన సరిహద్దుల్లో నిలబడి లోపలి ప్రాణులు బయటకు రాకుండా కాపలాకాస్తూ, వనాన్ని దహించమని అగ్నికి అనుమతి ఇచ్చారు. అడవిలో జంతువులు అటూ ఇటూ పరుగెత్తి ఎటూ పోలేక అగ్నిజ్వాలలకు తట్టుకోలేక ప్రాణాలు పోగొట్టుకుంటున్నాయి. అక్కడ తపస్సు చేసుకుంటున్న మహర్షులు ఎటూ పోలేక తమను రక్షించమని దేవేంద్రుణ్ణి వేడుకున్నారు. క్షణంలో ఆకాశం మేఘావృతమైంది. ఉరుములూ, మెరుపులతో ధారాపాతంగా వర్షం మొదలైంది. ఆ వెంటనే అర్జునుడు ఆకాశంలోకి అంబులు విడిచి అగ్ని దహిస్తునంత మేరా ఒక్క వానచినుకు రాలకుండా శరఛత్రం ఏర్పరిచాడు. సంతోషించిన అగ్ని మళ్ళీ విజృంభించాడు.

ఆ సమయానికి తక్షకుడు లేడక్కడ. కురుక్షేత్రం వెళ్ళాడు. తక్షకుడి కొడుకు అశ్వసేనుడు మంటల్లో చిక్కుకుని గిలగిల్లాడసాగాడు. కొడుకును మంటల నుంచి రక్షించేందుకు తల్లి అతన్ని ఆసాంతం గుటుక్కున మింగి ఖాండవ వనానికి దూరంగా ఉమ్మి వేయాలనుకుంది. అర్జునుడు అది పసిగట్టాడు. కోపంతో అశ్వసేనుడి తల నరకబోయాడు. వెంటనే ఇంద్రుడు గాలీ దుమ్మూ రేపాడు. కళ్ళల్లోకి ధూళి పోవడం వల్ల అర్జునుడి గురితప్పింది. అశ్వసేనుడి ప్రాణాలు నిలిచాయి.

ఇది గ్రహించి కృష్ణార్జునులు మండిపడ్డారు. అశ్వసేనుడు తలదాచుకునేందుకు

మరెక్కడా చోటు లభించరాదని అగ్ని, కృష్ణార్జునులు శపించారు. పాండవమధ్యముడు ఖాండవవనంలో కనిపించిన ప్రతి ప్రాణినీ నిర్దాక్షిణ్యంగా సంహరించసాగాడు.

బాణాలగొడుగు చాటున అగ్ని ఖాండవవనాన్ని దహిస్తున్నాడు. అతిప్రయాసతో తప్పించుకుని బయటకు రాగలిగిన పాముల్ని, డేగల్ని అర్జునుడు ముక్కలు చేస్తున్నాడు. మరో పక్క కృష్ణుడు అసురుల్ని మట్టికరిపించాడు. చివరకు ఇంద్రుడే ఐరావతాన్ని ఎక్కివచ్చి స్వయంగా కృష్ణార్జునులతో తలపడ్డాడు. దేవతలందరూ యుద్ధంలో ఇంద్రుడికి సహాయపడినా ఫలితం లేకపోయింది. దేవేంద్రుడు ఓడిపోయాడు. కృష్ణార్జునులు విజయం సాధించారు. ఖాండవవనాన్ని సమూలంగా స్వాహా చేసిన అగ్ని తిరిగి ఉజ్జ్వలంగా ప్రకాశించాడు. ●

# నిష్కామ కర్మ

ఒకసారి వేదవ్యాసుడు ధర్మరాజుకు జాజలి కథ చెప్పాడు.

“‘పూర్వం జాజలి అనే ముని వుండేవాడు. అతడు నిష్ఠగా తపస్సు చేసుకుంటున్నాడు. అతని నెత్తిమీద పిచికలు గూడు కట్టుకుని, గుడ్లు పెట్టుకుని పిల్లలతో హాయిగా  కాపురమున్నాయి. జాజలి దయార్ద్ర హృదయుడు కావటం వలన వాటిని తరిమెయ్యకుండా తన నెత్తిమీద అలాగే ఉంచుకున్నాడు.

‘ఆహా! నాకున్న ధర్మనిష్ఠ ఇంకెవరికైనా వుందా!’ అనుకుంటూ తననితానే మెచ్చుకునేవాడు. ఒకసారి అశరీరవాణి అతని అహంభావాన్ని ఖండిస్తూ ‘నీకంటే ఎక్కువ ధర్మపరుడు తులాధారుడనే వర్తకుడు. అయితే అతను నీ మాదిరి ఎప్పుడూ గర్వపడలేదు’ అంది.

“జాజలికి అసూయ కలిగింది. ఆ తులాధారుడెవరో చూడాలనుకుని విసవిస బయలుదేరాడు. వర్తకం చేసుకుంటున్న అతన్ని చూశాడు.

'అయ్యా వచ్చావా! రా! పిచికలు నెత్తిమీద గూడు కట్టుకుని పిల్లలతో సుఖంగా తిరుగుతున్నా చిత్తవికారం లేకుండా తపస్సు చేస్తున్న దయాసాగరా! ఎంత గొప్పవాడివి నువ్వు!!' అని అమితంగా గౌరవించి ఆదరించాడు తులాధారుడు.

జాజలి ఆశ్చర్యపోయాడు.

'ఈ సంగతి నీకెలా తెలిసింది?' అని అడిగాడు.

'మహర్షీ! నాకు దేనిమీదా, ఎవరిమీదా మమకారం లేదు. ధర్మమార్గంలో సంచరించటమొక్కటే నాకు తెలుసు. ప్రపంచాన్ని రంగస్థలంగా చూసేందుకు నేను ఎప్పుడూ ప్రయత్నిస్తాను. అందుచేత నా మనస్సు దేనికీ ఆకర్షింపబడక తామరాకు మీది నీటిబొట్టులా వుంటుంది. అందువల్లే నీ గొప్పతనం తెలుసుకోగలిగాను' అన్నాడు తులాధారుడు.

'అయితే నేను ధర్మమార్గాన నడవడం లేదంటావా? నా తపస్సూ, యజ్ఞాలూ ధర్మాలు కావంటావా?' అన్నాడు జాజలి కొంచెం కోపంగా.

'అహంకారంతో చేసే తపస్సునీ, ఫలం కోరి చేసే యజ్ఞాన్నీ దేవతలు మెచ్చరు. నిత్యతృప్తి అనేది మంచి యజ్ఞం. దానివల్ల దేవతలూ, మనమూ కూడా తృప్తి పొందుతాము' అన్నాడు తులాధారుడు.

'మరైతే నువ్వీ వ్యాపారం ఎందుకు విడిచిపెట్టవు? ధనాశ కాదా ఇది?' అని అడిగాడు జాజలి.

'అయ్యా! కర్తవ్యాలు విడిచిపెట్టడం తగదు. అయినా మనిద్దరికీ వాదం ఎందుకు! నేను చెప్పినదంతా సత్యమో కాదో అడుగుదాం–ఇన్నాళ్ళూ నువ్వు తండ్రిలా పెంచిన నీ పిచికలను పిలు' అన్నాడు తులాధారుడు.

పిలిచాడు జాజలి.

"అవి ముని కేశపాశంలో నుంచి రివ్వున ఎగిరి ఆకాశమార్గాన నిలబడి 'మేము ధర్మదేవత భటులం. ఆయన ఆజ్ఞవల్ల నిన్ను పరీక్షించడానికి వచ్చాం. మత్సరం మంచిది కాదు. అది సర్వధర్మాలనూ నాశనం చేస్తుంది. అందుచేత స్పర్ధ మాని శ్రద్ధ అవలంబించాలి. శ్రద్ధలేని తపస్సూ, యజ్ఞాలూ వ్యర్థం. శ్రద్ధతో యాగం చేసినవాడు శుచి కాకపోయినా ఫరవాలేదు. శ్రద్ధ లేకుండా యాగం చేసినవాడు శుచి అయినా ప్రయోజనం శూన్యం. శ్రద్ధవల్ల దానగుణం అబ్బుతుంది. అందువల్ల మేలు కలుగుతుంది. సర్వ సుఖాలూ చేకూరుతాయి' అని వివరించి

మాయమయ్యాయి.

'అయ్యా! మునుల నుంచి తత్త్వజ్ఞానం తెలుసుకోకపోవడం వల్ల నాకీ అసూయ కలిగింది. ఎవరికి వారు తమ తమ విధానాలైన కర్మలు చెయ్యటం మంచిదని నీ నుంచి గ్రహించాను. కాని వాటివల్ల ప్రయోజనం ఆశించకూడదు. అదీ నీ నుంచే తెలుసుకున్నాను. వెళ్ళొస్తాను' అని చెప్పి తులాధారుడి దగ్గర సెలవు తీసుకున్నాడు.

"ధర్మరాజా! ఆచార ధర్మాలు అలాంటివి. సూర్యుడి రూపం నీళ్ళలో ప్రతిబింబించినట్లు ఆత్మస్వరూపం నిర్మల బుద్ధిలో ప్రతిబింబిస్తుంది. **ఈ శరీరం యావత్తు మహాపట్టణం. దానికి బుద్ధి రాణి. సర్వ విషయాలూ చర్చించే మనస్సు మంత్రి. విషయాలు అయిదూ పురోహితులు. చెవి, ముక్కు మొదలైన ఇంద్రియాలు పౌరులు. ఈ శరీర సామ్రాజ్యంలో రజోగుణం, తమోగుణం అనే మోసగాళ్ళున్నారు. మనస్సు చెప్పిన మాట బుద్ధి వినకపోయిందంటే ఆ మోసగాళ్ళ బారినపడి చెడిపోతుంది. మనస్సు, బుద్ధి కలిసి ఏకముఖంగా ప్రయాణిస్తే రాజ్యపాలన చక్కగా సాగుతుంది.** శాశ్వత సౌఖ్యం లభిస్తుంది" అని చెప్పాడు వేదవ్యాసుడు.

"మహర్షీ! కార్యసమీక్ష త్వరగా చెయ్యడం మంచిదా? నిదానంగా చెయ్యడం మంచిదా?" అని అడిగాడు ధర్మరాజు.

"కార్యవిచారం చెయ్యడంలో తొందర ఎప్పుడూ పనికిరాదు" అని చెబుతూ ఒక కథ చెప్పాడు వ్యాసుడు.

"మేధాతిథి అనే మునికి చిరకారి అనే కొడుకుండేవాడు. అతడు ప్రతి పనీ బాగా ఆలోచించి చేసేవాడు. యుక్తాయుక్త విచక్షణ తెలిసినవాడు. అందుకే అతనికి ఆ పేరు వచ్చింది. ఒకనాడు మేధాతిథికి భార్యమీద కోపం వచ్చింది. ఆమెను చంపెయ్యమని చిరకారిని ఆదేశించి వెళ్ళిపోయాడాయన.

'నవమాసాలు మోసే కన్నతల్లి కంటే ఈ భూమి మీద ఎక్కువ ఏదీ లేదు. తల్లి దైవమంటారు. ఆమెను చంపటం కంటే పాపం వుందా! కాని తండ్రి ఆజ్ఞ మీరకూడదంటారు. ఏంచెయ్యను? ఇద్దరిమీదా గౌరవం వున్నవాడనే నేను!' అనుకుంటూ చిరకారి చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆలోచనలో చాలా సమయం గడిచిపోయింది. ఏదో కోపంలో అన్న మాటలు పట్టుకుని కొడుకు తల్లిని ఎక్కడ చంపేశాడోనని విచారపడుతూ, తన కొడుకు అలా చెయ్యడని ధైర్యం తెచ్చుకుంటూ ఆశ్రమానికి వచ్చాడు మేధాతిథి. తండ్రిని చూస్తూనే చిరికారి చేతిలో

వున్న కత్తి కిందపడేసి అతని కాళ్ళమీద పడ్డాడు. భార్య వచ్చి నమస్కరించింది. కన్నీటితో ముని భార్యాతనయుల్ని గుండెకు హత్తుకున్నాడు. కొడుకును మెచ్చుకుని దీవించాడు.

"ధర్మరాజా! కార్యవిచారం చాలా ధైర్యంగా, జాగ్రత్తగా చెయ్యాలి. తొందరపడి ఏ పని చేసినా చివరకు పశ్చాత్తాపపడవలసి వస్తుంది" అని ముగించాడు వ్యాసమహర్షి. ●

# స్ఫూర్తి-సమయస్ఫూర్తి

నడి ఎండాకాలం.

సూర్యుడు అగ్నిగోళంలా ఉన్నాడు.

నిప్పులు చెరిగి పోస్తున్నాడు.

"చెరువులూ, మడుగులూ కాగి కాగి ఇంకిపోతున్నాయి. చూశారా! మడుగు ఎండిపోతోంది! ఈ కాసిని నీళ్ళు కూడా ఇంకిపోతే ఇంకోచోటికి వెళ్ళటానికి కూడా సాధ్యం కాదు. కనుక ఎప్పుడూ ఇంకని నీళ్ళు గల మడుగుకు ఇప్పుడే తరలిపోదాం" అన్నాడు దీర్ఘదర్శి.

"నీకన్నీ భయాలే వూరుకుందూ! అంతగా నీళ్ళింకిపోతే అప్పుడు చూసుకుందాంలే. అప్పటికి ఏదో ఒక ఉపాయం తట్టకపోదు" అన్నాడు ప్రాప్తకాలజ్ఞుడు.

“బాగా చెప్పావు. దీర్ఘదర్శి ఎప్పుడూ ఇంతే. ఊరికే కంగారుపడిపోతాడు” అన్నాడు దీర్ఘసూత్రుడు.

దీర్ఘదర్శి, ప్రాప్తకాలజ్ఞుడు, దీర్ఘసూత్రుడు ముగ్గురూ స్నేహితులు! అరణ్యంలో వున్న ఆ మడుగులో ఎంతోకాలంగా కలిసి మెలిసి వుంటున్న చేపలు. స్నేహితులు కదా అని హితవు చెప్పాడు దీర్ఘదర్శి. వినకపోతే తానేం చేస్తాడు? ఎండలు రాను రాను ముదురుతున్నాయి. ఇవాళ కాకపోతే రేపైనా ఈ మడుగు ఎండుతుంది. నీళ్ళింకితే జాలర్లు చేపల్ని బ్రతకనిస్తారా? అప్పటికప్పుడు ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని తొక్కిసలాడేకంటే ముందే జాగ్రత్తపడటం మంచిది కదా అని దీర్ఘదర్శి దూరాలోచన చేశాడు. మిత్రులు ఒప్పుకోవడం లేదాయె!

“సరే! అయితే మీరు మీ ఇష్టం వచ్చినట్టు వుండండి. నేను పోతున్నా” అని ఆ చేప మెల్లమెల్లగా వెళ్ళి ఒక పెద్ద మడుగులో ప్రవేశించింది. మిగిలిన వాళ్ళిద్దరూ ఇదివరకు వున్న మడుగులోనే వున్నారు. దీర్ఘదర్శి చెప్పినట్టు కొన్నాళ్లకు ఆ మడుగులో నీళ్ళింకిపోయాయి. చేపలు పట్టేవాళ్ళు వలలు చేతపట్టుకుని రానే వచ్చారు. “అమ్మయ్యో! ఎంత ప్రమాదం వచ్చింది! ఈ జాలర్లు ఊతలతోనూ, వలతోనే కాకుండా చేతులతో కూడా పట్టేస్తున్నారు. తాళ్ళకి గుచ్చుతున్నారు. ఏం చేద్దాంరా మిత్రమా?” అంటూ ప్రాప్తకాలజ్ఞుడు ఏడుపుముఖం పెట్టాడు.



“ఏమోరా! దీర్ఘదర్శి మాటలు విన్నాం కాదు మనం. నాకేం దిక్కుతోచడం లేదు” అంటూ అటూ ఇటూ ఖంగారుగా ఎగిరెగిరి పడటం మొదలుపెట్టాడు

దీర్ఘసూత్రుడు. ఈ చేప అలా ఎగరటం ఒక బెస్త చూడనే చూశాడు. దానిని రెండు చేతులతోనూ పట్టుకుని చంపి తాడుకు గుచ్చేశాడు. అది చూసి గుండె ఆగినంతపనైంది ప్రాప్తకాలజ్ఞుడికి. ఆలోచించి చివరకు ఒక ఉపాయం పన్నాడు.

చేపలు గుచ్చిన తాడు దగ్గరకు మెల్లగా వెళ్ళి ఆ తాడును రెండు దవడలతోను కరిచి పట్టుకుని చచ్చినట్టే, ఆ తాడుకు గుచ్చినట్టే పడివున్నాడు. వేట పూర్తయ్యాక చేపలకున్న బురదనంతా కడగటానికని వాటిని జాలర్లు ఒక మంచినీళ్ళ మడుగులో ముంచారు. అప్పుడు ప్రాప్తకాలజ్ఞుడు ఆ తాడు విడిచి నీళ్ళల్లోకి జారుకున్నాడు. బ్రతుకుజీవుడా అనుకుని ఊపిరి పీల్చుకున్నాడు.

కాబట్టి అటు దూరదృష్టీ యిటు సమయస్ఫూర్తీ రెండూ లేనివాడు దీర్ఘసూత్రుడిలాగే ప్రాణం పోగొట్టుకుంటాడు.

అప్పటికప్పుడు పథకం వేసుకుని నడిచేవాడు ప్రాప్తకాలజ్ఞుడి లాగే పరమ సంశయభరితమైన జీవితం గడుపుతాడు.

రాబోయే వాటిని ముందే ఊహించి తగినట్టు జాగ్రత్తపడేవాడు దీర్ఘదర్శిలాగా సుఖపడతాడు.

ఉత్తమ పురుషులు ఎప్పుడూ దూరదృష్టి గలవారై, రాబోయే అపాయాలను ఉపాయంగా తప్పించుకునే విధానాలు ఊహిస్తూవుండాలని చెబుతూ నారదమహర్షి ధర్మరాజుకీ కథ చెప్పాడు. ●

# త్యాగం

దధీచి మహర్షి సరస్వతీ నదీ తీరాన తపస్సు చేసుకుంటూండగా ఓ రోజు కాశ్యపుని కుమార్తె 'ఆలంబున' అక్కడికి విహారానికి వచ్చి ప్రకృతి సౌందర్యానికి మైమరచి నెమలిపిల్లలా నాట్యం చేసింది. నిజానికి ఇంద్రుడు పంపగా వచ్చింది తను. దధీచిని తన ఆటపాటలతో కావాలనే కవ్వించింది. ఆయన తపస్సు కాస్తా భగ్నమయింది. అంతవరకూ అస్ఖలిత బ్రహ్మచారిగా నియమబద్ధంగా జీవితం గడిపిన దధీచి ఆలంబున అందానికి దాసుడై ఇంద్రియనిగ్రహం కోల్పోయాడు. ఆ రేతస్సు వెళ్ళి సమీపంలో వున్న సరస్వతీనదిలో పడింది.

కొన్నాళ్ళకు నదీమతల్లి గర్భం దాల్చింది. పండులాంటి బిడ్డను ప్రసవించింది. అతని పేరు సరస్వత. కొడుకును వెంటబెట్టుకుని తల్లి దధీచి దగ్గరకు వెళ్ళింది. దధీచి బిడ్డను దగ్గరకు తీసుకుని, "దేశంలో ముందుముందు పన్నెండు సంవత్సరాలు వరుసగా కరువు కాటకాలు ఏర్పడతాయి. నదుల్లోనూ, కాలవల్లోనూ నీటిమట్టం తగ్గుతుంది. వ్యవసాయ పనులు మందగిస్తాయి. పంటపొలాలు దెబ్బతింటాయి. తీవ్ర అనావృష్టి పరిస్థితులు నెలకొంటాయి. ప్రజలు పొట్ట చేతబట్టుకుని ఉపాధికోసం

దేశాంతరం వెళ్ళవలసి వస్తుంది. ఆ పన్నెండేళ్ళూ బ్రాహ్మణులు వైదిక కర్మలు చేసే వీలుండదు. వేదాలనూ, మంత్రాలనూ పూర్తిగా మరచిపోతారు. చదువుసంధ్యలు అడుగంటుతాయి. అప్పుడు ఈ చిన్నవాడు వాళ్ళు మరిచిపోయిన వేదాలనూ, మంత్రాలనూ, వైదిక కర్మలనూ వాళ్ళకు మళ్ళీ చదివి వినిపిస్తాడు. వాళ్ళ విధులను వాళ్ళకు గుర్తు చేస్తాడు. ఇదే నా ఆశీర్వాదం" అన్నాడు దధీచి.

సంతోషంగా తల్లీ కొడుకులు వెనక్కి తిరిగి వెళ్ళారు.

ఆ సమయంలోనే ఇంద్రుడు తన వజ్రాయుధాన్ని పోగొట్టుకున్నాడు. అదే అదననుకుని రాక్షసులు దేవతలమీద తిరగబడ్డారు. వాళ్ళ ఆగడాలు పెచ్చుమీరాయి. దేవతలందరూ వెళ్ళి ఇంద్రుణ్ణి ప్రార్థించారు. ఇంద్రుడు ఆలోచించి చివరికి "దధీచి వెన్నుపూస తెస్తే రాక్షస సంహారం చెయ్యగలన"ని దేవతలకు హామీ ఇచ్చాడు. దధీచి వెన్నెముకతో చేసిన ఆయుధంతో దానవులు మరణిస్తారని ఇంద్రుడికి తెలుసు.

దేవతలు సరేనని వెళ్ళారు.

భూలోకానికి వెళ్ళి దధీచిని అర్థించారు.

ఉత్తమకార్యం కోసం తనువు చాలించడం కన్నా కావల్సిందేమీ లేదనుకుని దధీచి ప్రాణత్యాగం చేసి ఉత్తమగతులు పొందాడు. దేవతలు దధీచి వెన్నెముకను ఇంద్రుడికి తీసుకువెళ్ళి ఇచ్చారు. ఇంద్రుడు దానితో ఆయుధాలు తయారుచేసి రాక్షసులను వధించాడు.

ఈ సంఘటన జరిగిన కొన్నాళ్ళకి దేశంలో తీవ్రంగా కరువు ఏర్పడింది. పంటపొలాలు నిస్సారంగా తయారయ్యాయి. కార్మికులు, కర్షకులు పొట్టకూటి కోసం వలస వెళ్ళారు. బ్రాహ్మణులు దేశాంతరం వెళ్ళారు.

పన్నెండేళ్ళపాటు ప్రకృతి పగబట్టింది.

సరస్వత ఒక్కడే తన తల్లితో అక్కడ మిగిలాడు.

తీరా కరువు కాటకాలు పోయి, ప్రజలు ఒక్కొక్కరే స్వదేశం తిరిగి చేరుకునేవేళకు ఎవరి విద్యుక్తధర్మాలు వాళ్ళు మరిచిపోయారు. బ్రాహ్మణులకు వేదాలూ, ఉపనిషత్తులూ, మంత్రాలూ స్ఫురణకు రాకుండా పోయాయి.

అప్పుడు వాళ్ళంతా సరస్వతను అర్థించారు. అతను శృతిపక్వంగా, కర్ణపేయంగా వేదాలూ, మంత్రాలూ పఠించాడు. బ్రాహ్మణులు సంతోషించారు. దేశం మళ్ళీ సుభిక్షమైంది. ●

# అలర్కుడు

పూర్వం అలర్కుడనే రాజుండేవాడు. మనస్సు ప్రేరణవల్ల ఇంద్రియాలన్నీ ఇష్టం వచ్చినట్టు చెలరేగడం చూసి కోపించి, వాటిమీద ఒక దివ్యాస్త్రం ప్రయోగించడానికి సిద్ధమయ్యాడు. అప్పుడు అవన్నీ పకపక నవ్వాయి.

"మహారాజా! ఈ అస్త్రాల వల్ల మేం నశించం. రోషంతో ప్రయోగించావంటే నువ్వే క్షయమౌతావు. నీకు చేతనైతే తపోమయమైన అస్త్రాలతో సాధించు మమ్మల్ని. పరశురాముడు రాజులందర్నీ వధించినప్పుడు పితృదేవతలు అతని దగ్గరకు వెళ్ళి తపోయజ్ఞం అన్ని యజ్ఞాలకు మించినదనీ, అది చెయ్యవలసిందనీ చెప్పారు. కనుక నువ్వు కూడా క్రోధం విడిచి యోగం వల్ల శాంతిని పొందు" అని ఉపదేశించాయి.

అలర్కుడు ఇంద్రియాలు చెప్పినట్టే చేసి సౌఖ్యం పొందాడు. తపస్సు చేసి అంతశ్శత్రువుల్ని జయించాడు.

ఒకసారి జనక చక్రవర్తి సమక్షంలో ఒక బ్రాహ్మణుడు ఏదో పనికిమాలిన పనిచేశాడు. చక్రవర్తి కోపగించుకుని "నువ్వు నా దేశంలో వుండకు! వెళ్ళిపో" అన్నాడు.

"నీ దేశమంటే! అదెంతవరకు? ఆ సంగతి తెలుసుకుని మరో దేశానికి పోతాను చెప్పండి" అన్నాడా విప్రుడు.

అది విని మూర్ఛపోయాడు జనక చక్రవర్తి. కాసేపటికి తేరుకుని, "అయ్యా! తండ్రీ తాతల తరాల నుంచి వున్న భూమి అంతా నాకు వారసత్వంగా సంక్రమించింది. కాని నాకు దీనిమీద ఏ మమకారం లేదు. ఈ మిథిలానగరంలోనే ఎప్పుడూ వుంటాను. ఇదీ నాదనిపించదు. నా దేశమనేది ఏదీ లేదు. అందుకే నువ్వలా అడగ్గానే, నేను పలికిన పొరపాటు మాట తెలిసి మూర్ఛ వచ్చింది" అన్నాడు జనకుడు.

"జనకరాజా! ఇన్నాళ్ళనుంచి ఏలుతున్నావు! అయినా ఈ భూమి మీదా, పట్టణం మీదా, ప్రజలమీదా నీకు మమకారం కలగకపోవడానికి కారణమేమిటి?"

"ఇవన్నీ ఎలాగో నశించేవే! వీటిల్లో నాదని చెప్పుకోతగినది ఏదీలేదు. నాది అనే మమకారం లేకపోవడం వల్ల భూమి మొదలైన భూతాలన్నీ నాచేత జయింపబడి, నా ఆధీనంలో వుంటాయి. అదీ సంగతి" అన్నాడు జనక చక్రవర్తి.

"జనక మహారాజా! నేను ధర్మదేవుడను. నిన్ను పరీక్షించాలని వచ్చాను. అంబరీషుడు కూడా నీలానే లోభాన్ని జయించి సుఖం పొందాడు. ఈ వివేకం నీ మనస్సులో స్థిరంగా నిలిచి నీకు శాంతి కలిగించుగాక" అని నవ్వుతూ ఆ విప్రుడు ప్రభువుని దీవించి వెళ్ళిపోయాడు.

కనుక యోగయజ్ఞం ముక్తికి మూలం. ఆ యజ్ఞానికి స్వపరిత్యాగం దక్షిణ. దానివల్ల నారాయణుడు తృప్తి పొందుతాడు.

ఒకప్పుడు దేవతలు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి "అయ్యా! ఏంచేస్తే మాకు మేలు కలుగుతుంది" అని అడిగారు. అక్షరోపాసన చెయ్యవలసిందని ఆయన చెప్పాడు. **క్రోధమనే చీకటితో, లోభమనే పాముతో, కామం అనే దొంగతో కూడిన భయంకరమైన సంసార సాగరాన్ని దాటడానికి తపస్సును మించిన మార్గం లేదు.** ●

# జ్వరం

ఒకనాడు వెండి కొండమీద కొలువు తీర్చి కూర్చున్నాడు శివుడు. దేవతలూ, మహర్షులూ సంతోషంగా ఎక్కడికో వెళ్ళటం చూసి "స్వామీ! వీళ్ళంతా ఎక్కడికి వెడుతున్నారు?" అని భర్తను ప్రశ్నించింది భవాని.

"దక్షప్రజాపతి యజ్ఞం చేస్తున్నాడు. తమ తమ హవిర్భాగాలు తీసుకునేందుకు వెడుతున్నారు" అని శివుడు చెప్పాడు.

"మరి మీరెందుకు వెళ్ళరు?"

"అతడు నాకు హవిస్సులో భాగం కల్పించలేదు. నన్ను పిలువలేదు. అందుకని వెళ్ళను" అన్నాడు శివుడు.

పార్వతికి కోపం వచ్చింది.

కనుబొమలు ముడివేసి మౌనం వహించింది. ఈశ్వరుడు ఆమె మనస్సు గ్రహించి దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయడానికి ప్రమథగణాలతో బయలుదేరాడు.

ప్రమథగణాల ధాటికి ఆగలేక యజ్ఞం మృగరూపం ధరించి పారిపోయింది. ఉగ్రతాండవం చేసిన రుద్రుని నుదుట చెమట పట్టింది. ఒక స్వేదబిందువు కింద పడింది. మరుక్షణం పెద్ద మంటలు లేచాయి! ఆ మంటల్లోంచి భయంకరాకారం గల పురుషుడొకడు పుట్టాడు. అతన్ని చూసి భయ విహ్వలులై దేవతలూ, మునులూ నాలుగు దిక్కులకూ పారిపోయారు. అప్పుడు బ్రహ్మదేవుడు వచ్చి "పినాకపాణీ! దేవతలు నీకు హవిర్భాగం కల్పిస్తారు. కోపం ఉపసంహరించు" అని ప్రార్థించాడు. అంతటితో గంగాధరుడు శాంతించాడు. యాగం యథావిధిగా ముగిసింది.

"దేవా! నీ నుదుటి చెమట వల్ల పుట్టిన పురుషుడు 'జ్వరం' అనే పేరుతో సర్వత్రా సంచరిస్తాడు. కాని అతడు ఒకే రూపంలో వుంటే నేలతల్లికి భారమౌతాడు. బహు విధాలుగా చెయ్యవా?" అని బ్రహ్మదేవుడు వేడుకున్నాడు.

చంద్రమౌళి విరించి ప్రార్థనను మన్నించి గురులకు శిరస్థానంగానూ, పాములకు కుబుసంగానూ, గోవులకు అరికాలి గిట్టలలో బాధగానూ, మృగాలకు తమ స్వరూపాలను చూడలేకపోవడంగానూ, గుర్రాలకు పార్శ్వశోషణంగానూ, నెమళ్ళకు ఈకలు రాలిపోవడంగానూ, కోకిలలకు నేత్రవ్యాధిగానూ, చిలకలకు హిక్క అనే వ్యాధిగానూ, మేకలకు మతిభ్రమణంగానూ, పులులకు శ్రమగానూ, మనుష్యులకు చావుపుట్టుకల్లో కలిగే బాధగానూ ఆ జ్వరాన్ని విభజించాడు. వృత్రాసురుడికి, ఇంద్రుడికి యుద్ధం జరిగినప్పుడు పరమేశ్వర తేజం జ్వరరూపం ధరించి వచ్చి వృత్రాసురుణ్ణి చుట్టుకుంది. లేకపోతే ఇంద్రుడు ఓడిపోయేవాడే!

దేవసైన్యంతో ఇంద్రుడూ, రాక్షస సైన్యంతో వృత్రాసురుడూ యుద్ధం ప్రారంభించారు. వృత్రుని మాయా బల ప్రభావం వల్ల ఇంద్రుడు మూర్ఛపోయాడు. అప్పుడు వశిష్ఠుడు తన తపశ్శక్తితో దేవేంద్రునికి స్పృహ కలిగించాడు. పోరు తిలకిస్తున్న త్రిమూర్తులూ, మునులూ, మిగిలిన దేవతలూ కలిసి దేవేంద్రుణ్ణి ఉత్సాహపరిచి మళ్ళీ యుద్ధానికి పురిగొల్పారు. బృహస్పతి మునీశ్వరులతో కలిసి ఇంద్రుడికి జయం ఇవ్వవలసిందని పరమేశ్వరుణ్ణి ప్రార్థించాడు.

అప్పుడు పరమేశ్వరుడు జ్వరరూపం ధరించి వృత్రాసురుణ్ణి చుట్టుముట్టాడు. తరువాత జ్వరం వజ్రాయుధంలో ప్రవేశించేసరికి ఇంద్రుడు దానిని ప్రయోగించి వృత్రాసురుణ్ణి కూల్చాడు. వజ్రంలో ఉన్న విష్ణుస్పర్శ వల్ల వృత్రాసురుడి పాపాలన్నీ పోయి అతనికి అనంతశాంతి లభించింది.

వృత్రాసురుడి ప్రాణం పోగానే ఇంద్రుణ్ణి బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. ఇంద్రుడు వెళ్ళి వెళ్ళి తామర తూడులో దాక్కున్నా వదలలేదది. అప్పుడు ఇంద్రుడు బ్రహ్మ దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకున్నాడు. ఆయన ఇంద్రుణ్ణి పట్టిన బ్రహ్మహత్యాపాతకాన్ని నాలుగుభాగాలు చేసి అగ్నికీ, ఔషధవృక్షాలకూ, స్త్రీలకూ, నీటికీ సమంగా ఇచ్చాడు. వాళ్ళు భయపడిపోతూ, "స్వామీ! ఈ పాపం నుంచి మాకు నిష్కృతి లేదా?" అని అడిగారు.

"నువ్వు ప్రజ్వలించకుండానే నీలో హవిస్సు వ్రేల్చిన వాళ్ళకు నీలో వున్న దోషం సంక్రమిస్తుంది" అని అగ్నికీ, "పర్వకాలంలో మిమ్మల్ని ఛేదించిన వాళ్ళకు మీ పాపం చెందుతుంది" అని ఔషధ వృక్షాలకూ, "రజస్వలలై వున్న మిమ్మల్ని చేపట్టిన వాళ్ళకు మీ పాపం సంక్రమిస్తుంది" అని స్త్రీలకూ, "మీలో మల మూత్ర శ్లేష్మాలు ఎవరు విడిస్తే వాళ్ళకు మీ పాతకం చుట్టుకుంటుంది" అని నీటికీ చెప్పాడు బ్రహ్మ. వాళ్ళంతా సరేనని బ్రహ్మహత్యాపాతకాన్ని స్వీకరించారు.

ఆ రకంగా కల్మషరహితుడైన ఇంద్రుడు అశ్వమేధయాగం చేసి మళ్ళీ సర్వలోక పూజ్యుడై ప్రకాశించాడు. వృత్రాసురుడి రక్తంలో పుట్టిన బుడగలు పుట్టకొక్కులై మనుష్యులకు ఆహారమయ్యాయి. ●

# శీలసంపద

ధర్మరాజు ఇంద్రప్రస్థంలో రాజసూయయాగం చేశాడు. అతని సభావైభవం చూసి అసూయపడి తండ్రి దగ్గరకు వెళ్ళి తన దుగ్ధ వెళ్ళబోసుకున్నాడు దుర్యోధనుడు.

"నాయనా! నీకు మాత్రం తక్కువ ఐశ్వర్యముందా? అయితే ధర్మరాజు నీకంటే ఎక్కువగా ప్రకాశించడానికి కారణం అతడు శీలవంతుడు కావడమే. శీలవంతులను లక్ష్మి వరిస్తుంది. కనుక నువ్వు కూడా శీలవంతుడవై సకల సంపదలూ పొందు" అంటూ ధృతరాష్ట్రుడు కొడుక్కి ఓ ఇతిహాసం చెప్పాడు.

"ప్రహ్లాదుడు రాక్షస కులశ్రేష్ఠుడు. సకల విద్యాపారంగతుడు. జనరంజకంగా పరిపాలన చేయగల సమర్థుడు. ఇంద్ర రాజ్యాన్ని స్వాధీనం చేసుకుని ముల్లోకాలనూ ధర్మయుక్తంగా పరిపాలించసాగాడు. పదవీభ్రష్టుడైన ఇంద్రుడు తనకు ముల్లోకాధిపత్యం మళ్ళీ వచ్చే విధానం చెప్పవలసిందని బృహస్పతిని ప్రార్థించాడు.

బృహస్పతి భార్గవుణ్ణి అడగమన్నాడు.

ఇంద్రుడు వెళ్ళి భార్గవుణ్ణి ఆశ్రయించాడు.

'అతనికి అంత శక్తి ఎలా వచ్చిందో అతన్నే అడిగి తెలుసుకుని ఉపాయంగా ఆ శక్తిని అడిగి పుచ్చుకో' అని సలహా ఇచ్చాడు భార్గవుడు.

"ఇంద్రుడు విప్రుడి వేషం ధరించి ప్రహ్లాదుడికి శిష్యుడై భక్తితో సేవలు చెయ్యడం ప్రారంభించాడు. చాలాకాలం గడించింది. ప్రహ్లాదుడు ప్రసన్నుడయ్యాడు.

'నాయనా! ఏమి కోరి నన్ను సేవిస్తున్నావు?' అని అడిగాడు.

'అయ్యా! మీకు త్రిలోకాధిపత్యం ఎలా వచ్చిందో తెలుసుకోవాలని వుంది' అన్నాడు శచీపతి వినయంగా.



'ఏముంది! నేనెప్పుడూ రాజుననే గర్వంతో ప్రవర్తించను. ఎవరినీ నొప్పించను. ఈర్ష్య, అసూయ, ద్వేషం, పగ మొదలైన దుర్గుణాలేవీ మనస్సులోకి రానివ్వను. ఎవరన్నా ఏదైనా అడిగితే లేదనకుండా సంతోషపెడతాను. పురాకృత పుణ్యం వల్ల బ్రహ్మర్షులు మెచ్చుకునే శీలం వున్నది. కనుక ఇంత మహోన్నత పదవి లభించింది నాకు' అన్నాడు ప్రహ్లాదుడు.

'అయ్యా! నిజంగా నువ్వు మహాత్ముడవు. దానశీలివి. నాయందు దయదలచి నీ శీలం నాకివ్వు' అని ఇంద్రుడు దీనంగా యాచించాడు.

'అయ్యో పాపం! ఎంత దీనంగా అర్థిస్తున్నాడు' అనుకుని 'సరే' అన్నాడు ప్రహ్లాదుడు.

ఇంద్రుడు పన్నిన పన్నాగంలో ప్రహ్లాదుడు చిక్కుకున్నాడు.

ఆ తరువాత ప్రహ్లాదుడి శరీరంలోంచి మహా తేజస్సుతో ఒక పురుషుడు బయటకు వచ్చాడు.

'నువ్వెవరు?' ప్రశ్నించాడు ప్రహ్లాదుడు.

'నేను నీ శీలాన్ని. నువ్వు నన్ను ఆ విప్రుడికి దానం చేశావుగా! అతని దగ్గరకు వెళ్ళిపోతున్నాను' అని వెనుదిరగకుండా వెళ్ళిపోయాడా దివ్యరూపుడు. ఆ వెనుకే ఒక్కొక్క వెలుగూ ప్రహ్లాదుడి శరీరం నుంచి మెల్లిగా బయటకు జారుకుంది.

'నువ్వెవరు మహానుభావా?"

'నేను సత్యాన్ని. శీలాన్ని ఆశ్రయించి ఉంటాను. నేను వెడుతున్నాను'

'నువ్వెవరు?'

'నేను ఋజువర్తనను. సత్యాన్ని ఆశ్రయించి బతుకుతాను. పోతున్నాను.'

'మహాశయా! నువ్వెవరు?'

'నేను బలాన్ని. సత్ప్రవర్తనకు తోడుగా ఉంటాను. శలవు.'

ప్రహ్లాదుడి విషాదానికి అవధులు లేవు.

అతను విచారిస్తుంటే అతిలోక సౌందర్యవతియైన ఒక స్త్రీ అతని శరీరంలోంచి బయటకు వచ్చింది.

'అమ్మా! నువ్వెవరు?'

'నేను లక్ష్మిని. బలం ఎక్కడుంటే అక్కడ వుంటాను. వెడుతున్నాను.'

'అయ్యో! తల్లీ! నువ్వూ నన్ను విడిచిపోతున్నావా? ఇంతకూ అంత వినయంగా ఇన్నాళ్ళూ నన్ను సేవించిన ఆ విప్రుడెవరు?' అని సిరిని అడిగాడు ప్రహ్లాదుడు.

'అతను ఇంద్రుడు. నీ వైభవాన్ని ఎగరేసుకుపోవడం కోసం వచ్చాడు. నువ్వు అతని మాయలో పడి నీ శీలాన్ని అతనికి ధారపోశావు. శీలం వల్ల ధర్మం, ధర్మం వల్ల సత్యం, సత్యాన్ని అంటి మంచి నడవడి, దానివల్ల బలం, బలాన్ని ఆశ్రయించి నేను వుంటాం. కనుకనే అన్నిటికీ 'శీలం' మూలమని చెప్తారు. నువ్వు అది పోగొట్టుకున్నావు. కనుక నేను ఇంక నీ దగ్గర వుండటం అసంభవం' అని చెప్పి వెళ్ళిపోయింది శ్రీదేవి.

"కనుక–దుర్యోధనా! శీలవంతుడవై వర్ధిల్లు నాయనా" అని కొడుక్కి హితవు చెప్పాడు ధృతరాష్ట్రుడు.

సకల జీవుల పట్ల దయతో వుండటం, ఎవరికీ ద్రోహం తలపెట్టకుండా పరులకు ఓపినంతవరకూ మేలు చేయడం, ఎదుటివాడు తప్పుచేస్తే వాడు సిగ్గుపడేలా కాక తన దోషాన్ని చక్కదిద్దుకునేలా బోధించటం, అందరూ మెచ్చుకునేటట్టు మంచిగా ప్రవర్తించటం, పేరాశను విడిచిపెట్టడం శీలవంతుల లక్షణాలు. ●

# బలరాముడి యాత్ర

కౌరవులు పాండవుల మధ్య యుద్ధం చూడటం ఇష్టంలేక తీర్థయాత్రలకు బయలుదేరాడు బలరాముడు. మొదట సరస్వతీ సంగమస్థానానికి వెళ్ళాడు. దానికి ప్రభాసతీర్థమని పేరు. అందులో స్నానం చేసి చంద్రుడు తన క్షయ వ్యాధిని పోగొట్టుకున్నాడని ప్రతీతి.

దక్ష ప్రజాపతి తన ఇరవై ఏడుగురు కుమార్తెలనూ చంద్రుడి కిచ్చి పెళ్ళి చేశాడు. వాళ్ళలో రోహిణి చాలా చక్కనిది. అందువల్ల ఆమెమీద ఎక్కువ ప్రేమ చూపుతూ, చంద్రుడు ఆమెతోనే కాలం గడుపుతూండే సరికి మిగతావాళ్ళంతా ఏడుస్తూ తండ్రి దగ్గరకు వెళ్ళి సంగతి వివరించారు.

దక్షుడికి కోపం వచ్చింది.

వెంటనే చంద్రుణ్ణి పిలిపించి, "నువ్వు చాలా అన్యాయం చేస్తున్నావు. కట్టుకున్న భార్యలందరినీ సమానంగా చూడకపోతే నిన్ను శపిస్తాను!" అని మందలించాడు.

ఆ మాటను తృణప్రాయంగా తోసిపారేశాడు చంద్రుడు. యథాప్రకారంగా రోహిణి తోడిదే లోకంగా బతకసాగాడు.

కూతుళ్ళ ద్వారా ఆ సంగతి తెలుసుకుని కోపంతో మండిపడుతూ దక్షుడు, "నీకు క్షయవ్యాధి సంభవించుగాక" అని అల్లుణ్ణి తీవ్రంగా శపించాడు. అప్పటినుంచీ చంద్రుడికి క్షయవ్యాధి పట్టుకుంది. కళకళలాడే చంద్రుడు ఆ జబ్బుతో రోజురోజుకీ క్షీణించిపోయేసరికి చంద్రకాంతి బాగా సన్నగిల్లింది. ఫలితంగా ఓషధులు పెరగడం ఆగిపోయింది. ప్రజలు బాధపడసాగారు. ఇదంతా చూసి దేవతలు కంగారుపడ్డారు. చంద్రుణ్ణి అడిగి సంగతంతా తెలుసుకుని అతన్ని వెంటబెట్టుకుని దక్షప్రజాపతి దగ్గరకు వెళ్ళారు. రేరాజును అనుగ్రహించి, ప్రజలను రక్షించవలసిందిగా దక్షుణ్ణి ప్రార్థించారు.

"నాకు బిడ్డలందరూ ఒకటే. వాళ్ళందర్నీ సుధాకరుడు సమానంగా సంతోషపెట్టాలి. అందరితోనూ కలిసి వుండాలి. అందరినీ ఒకే రకంగా ఏలుకోవాలి. అలా వుంటూ సరస్వతీ సంగమంలో స్నానంచేస్తే వృద్ధి పొందుతాడు. అయితే నా శాపానికి తిరుగులేదు. నెలలో పదిహేనురోజులు మాత్రం చంద్రుడు క్షీణించక తప్పదు. ఆ పదిహేనురోజులూ గడిచాక సరస్వతీ సంగమ స్థానంలో తీర్థంలో మునిగితే మిగిలిన పదిహేనురోజులూ మళ్ళీ వృద్ధి పొందుతాడు" అని అల్లుణ్ణి అనుగ్రహించాడు దక్షుడు. దేవతలు సంతోషించారు. తరువాత చంద్రుడు సరస్వతీ సంగమంలో మునిగి భాసమానుడయ్యాడు. అందుకే ఆ తీర్థానికి ప్రభాసతీర్థమని పేరు.

తర్వాత బలరాముడు నైమిశారణ్యానికి వెళ్ళాడు. ఆ పైన సోమతీర్థాన్ని సందర్శించాడు. కుమారస్వామిని దేవసేనానిగా అభిషేకం చేసిన చోటది. శివుడి అంశతో హిమవత్ పర్వతం మీదున్న రెల్లుగడ్డిలో ఒక కుమారుడు అవతరించాడు. ఆ సమీపంలో వున్న కృత్తికలు ఆ పిల్లవాణ్ణి చూసి వీడు నా కుమారుడంటే నా కుమారుడు అని వాదులాడుకున్నారు. అందరూ ఒకేసారి చేతులు చాచి ఎత్తుకున్నారు. అప్పుడా పిల్లవాడు ఆరు ముఖాలు ధరించి ఆరుగురు కృత్తికల దగ్గరా పాలు తాగాడు. అందుకే ఆతనిని షాణ్మాతురుడు, షణ్ముఖుడు అంటారు. అతని ప్రభావం వల్ల ఆ ప్రదేశమంతా బంగారమయమై వుంటుంది. పుట్టుకతోనే సమస్త విద్యలూ వచ్చాయతనికి. ఒకసారి బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, దేవతలూ తమతమ పరివారాలతో కుమారుడి దగ్గరకు వచ్చారు. బాలుడు ముందు ఎవరిదగ్గరకు వెళ్తాడా

అని చూస్తున్నారందరూ. పార్వతి, గంగ, అగ్ని, శివుడు ఎవరికి వారు తమకే పెద్దరికమిచ్చి బాలుడు తమ దగ్గరకు రావాలి అనుకున్నారు. అదంతా తన యోగ ప్రభావం వల్ల కనిపెట్టిన పసివాడు నాలుగు రూపాలు ధరించి ఆ నలుగురి దగ్గరకూ ఒకేసారి వెళ్ళాడు. వాళ్ళకు సంతోషం కలిగించాక మళ్ళీ ఏకరూపం ధరించాడు. అప్పుడు దేవతలందరూ కలిసి అతనిని దేవసేనానిగా అభిషిక్తుణ్ణి చేశారు. మహాశివుడు సూర్యకాంతితో ప్రకాశించే ధ్వజాన్ని ఇచ్చాడు. ఇంద్రుడు శక్తి అనే ఆయుధం, విష్ణువు వనమాలిక, పార్వతి ఎన్నడూ మాయని పట్టువస్త్రాలు, గంగాదేవి స్ఫటిక కమండలం, బృహస్పతి తేజోమయ దండమూ, గరుత్మంతుడు నెమలి వాహనమూ, వరుణదేవుడు చక్కని కోడిపుంజూ, కుబేరుడు మంచి మేకా, బ్రహ్మ చక్కని కృష్ణమృగచర్మం బహుమానాలుగా కుమారుడికిచ్చారు.

కుమారస్వామి దేవతలకు శత్రువైన తిరకాక్షుణ్ణి చంపాడు. బలిచక్రవర్తి కుమారుడు బాణుడనేవాడు క్రౌంచ పర్వతం మీద దాగివుండి లోకాన్ని బాధిస్తుంటే ఆ క్రౌంచ పర్వతాన్ని బద్దలుచేసి అందులో వున్న రాక్షసులందర్నీ హతమార్చాడు. ఇదీ కుమారస్వామి గాథ.

సోమతీర్థాన్ని సందర్శించాక బలరాముడు వృద్ధకన్యాశ్రమం చేరేసరికి కురుక్షేత్ర రణరంగంలో శల్యుడు చనిపోయిన వార్త తెలిసింది. బలరాముడు దగ్గరగా వున్న శమంతపంచకాన్ని సందర్శించి అక్కడి మునులను కురుక్షేత్ర మహిమ చెప్పవలసిందని అడిగాడు.

"కురుడనే రాజు ఆ క్షేత్రంలో పుట్టిన వాళ్ళందరూ చనిపోయాక స్వర్గానికి వెళ్ళాలని తలచి ఆ ప్రదేశాన్ని దున్నడం ప్రారంభించాడు. ఇది విని ఇంద్రుడు అపహాస్యం చేశాడు. అయినాసరే కురుడు పట్టు వదలలేదు. అతని నిష్ఠకు మెచ్చుకుని 'ఈ పుణ్యక్షేత్రంలో నిరాహారులై శరీరాన్ని విడిచినవాళ్ళకూ, యుద్ధంచేసి ధర్మంగా చనిపోయినవారికీ స్వర్గలోకప్రాప్తి కలుగుతుంది' అని వరమిచ్చాడు శచీపతి. అంతేకాదు, కురుక్షేత్రంలో వున్న ధూళి గాలికి ఎగిరి ఎవరి మీద పడితే వారి పాపాలన్నీ నశిస్తాయని కూడా ప్రకటించాడు. అది విని కురుడు ప్రీతిపొందాడు. అందుకని అతనిపేర ఆ ప్రదేశం కురుక్షేత్రమైంది" అని చెప్పారు మునులు. ●

# మయూరధ్వజుడు

ధర్మరాజు అశ్వమేధయాగం చేసి హయాన్ని వదిలాడు.

యాగాశ్వాన్ని ఎవరైనా పట్టుకుంటే వారు యజ్ఞంచేసే చక్రవర్తి అధికారాన్ని ఎదిరించినట్లే!

పాండవులు వదిలిన యాగాశ్వాన్ని మయూరధ్వజుడనే రాజు బంధించాడు అది తెలిసి కృష్ణార్జునులు అతని నగరం చేరుకున్నారు.

మయూరధ్వజుడు కృష్ణభక్తుడనీ, అతనితో యుద్ధం చేసేటప్పుడు అప్రమత్తంగా వుండాలనీ కృష్ణుడు అర్జునుడితో చెప్పాడు. సరేనన్నాడు పాండవమధ్యముడు.

మయూరధ్వజుడు అద్భుత పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ యుద్ధం చేశాడు. సవ్యసాచి అతన్ని సంబాళించలేక పోయాడు. విధి లేక శౌరి సాయం అర్థించాడు.

పార్థసారథి కూడా యుద్ధంలోకి దిగాడు. మయూరధ్వజునికి తన ఆరాధ్యదైవంతో పోరాడటం ఇష్టంలేదు. కాని రణరంగంలో వెనుదీయడం క్షత్రియధర్మం కాదని తలచి "కృష్ణా! కృష్ణా!" అని నామస్మరణం చేస్తూ బాణాలు గుప్పించడం మొదలుపెట్టాడు. ఆ శరాల ధాటికి ఆ మహాయోగి కూడా చలించాడు.

"బావా! ఎందుకు సంకోచిస్తావు. నీ చక్రంతో మయూరధ్వజుని చంపలేవా?" అన్నాడు అర్జునుడు. పద్మనాభుడు మందహాసంతో "పార్థా! నీ గాండీవం గాని, నా సుదర్శనం గాని ఆ మహాభక్తునిమీద పనిచేయవు" అన్నాడు.

'మయూరధ్వజుడు అంతటి భక్తుడా!' అని గాండీవి విస్తుపోయాడు. మాధవభక్తులలో తనను మించినవారు లేరని కృష్ణసఖునికి కించిత్తు గర్వముంది. అది మునుపే ఎరిగిన కృష్ణుడు మయూరధ్వజుని భక్తి ఎంత గొప్పదో అర్జునుడికి చూపించాలనుకున్నాడు. ఇద్దరూ ఆనాటికి యుద్ధం చాలించారు.

మరునాడు కృష్ణార్జునులు బ్రాహ్మణ వేషాలు ధరించి మయూరధ్వజుని మందిరానికి అతిథులుగా వెళ్ళారు. విప్రుల రాక గమనించి ఆ రాజు వారికి ఎదురేగి గౌరవ పురస్కారంగా మర్యాద చేశాడు.

"అయ్యా! మీరు నా ఆతిథ్యం స్వీకరించి నన్ను ఆశీర్వదించండి" అని ప్రార్థించాడు. "రాజా! నీ ఇంట భుజించడానికి మాకు వ్యవధి లేదు. మాకొక పెద్ద ఆపద వచ్చిపడింది. అది తీరితేగాని మేము మరొక విషయం ఆలోచించలేము" అన్నాడు మాయారూపంలో ఉన్న కృష్ణుడు.

"స్వామీ! మీకు కలిగిన విపత్తేమిటో చెప్పండి. నా శాయశక్తులా తీర్చడానికి ప్రయత్నిస్తాను. అవసరమైతే నా ప్రాణమైనా ఇస్తాను" అన్నాడు మయూరధ్వజుడు.

"రాజా! మేము అడవిలో ప్రయాణిస్తున్నప్పుడు నా కుమారుణ్ణి ఒక పులి పట్టుకుంది. అది ఆ పసివాడి శరీరాన్ని సగం తిన్న తరువాత "మయూరధ్వజ మహారాజు శరీరంలో సగభాగాన్ని తెచ్చి ఈ పులికి అప్పగిస్తే నీ బిడ్డ బతుకుతాడు" అని అశరీరవాణి పలికింది. అందుకని నాకు పుత్రభిక్ష పెట్టవలసిందిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను" అన్నాడు విప్రుని వేషంలో వున్న కృష్ణుడు.

"ఆహా! నా జన్మ తరించింది. ఒక పసిబిడ్డ ప్రాణాలు కాపాడేందుకు నా శరీరం ఉపయోగపడుతోంది. ఇంతకంటే ఏం కావాలి. అయ్యా! సందేహించకండి. వెంటనే నా శరీరంలో సగభాగాన్ని తీసుకుని వెళ్ళి పులికి ఆహారంగా ఇవ్వండి"

అని వారిని అర్థించాడు మయూరధ్వజుడు. వెంటనే భార్యాబిడ్డల్ని పిలిచి తన శరీరాన్ని రెండు భాగాలుగా కోయమన్నాడు.

మయూరధ్వజుడు ఏదో మహత్తర కార్యక్రమానికి తన శరీరాన్ని వినియోగించబోతున్నాడని వారికి అర్థమైంది. మారుమాట్లాడక రాజుగారి శరీరాన్ని ఛేదించడం ప్రారంభించారు.

కృష్ణార్జునులు అనిమిషులై ఈ దృశ్యాన్ని చూస్తున్నారు. అలా చూస్తుండగా వారికొక వింత కనిపించింది.

మయూరధ్వజుని ఎడమ కంటి నుండి నీటిచుక్కలు రాలసాగాయి. అప్పుడు కృష్ణుడు తెచ్చిపెట్టుకున్న కాఠిన్యంతో, "రాజా! బాధపడుతూ నువ్వేమీ నీ శరీరాన్ని నాకివ్వనవసరంలేదు. మనస్ఫూర్తిగా, సంతోషంగా చేస్తేనే ఏదైనా త్యాగమవుతుంది. ఎదుటివాడి కష్టాన్ని చూసి కన్నీరు కార్చడంలో దివ్యత్వముంటుంది. మనల్ని చూసి మనం దుఃఖించడం నైచ్యమౌతుంది. మనమీద వున్న మమకారాన్ని మనం చంపుకోలేక పోవడం దీనికి కారణం. నీ కిష్టంలేని పనిని నీవు చెయ్యవద్దులే" అని వెనుదిరిగాడు.

మయూరధ్వజుడు కృష్ణుని చేతులు పట్టుకుని, "అయ్యా! నా శరీరం అర్పిస్తున్నానని నాకు బాధ లేదు. మనస్ఫూర్తిగా ఇస్తున్నాను. నాకే నిజంగా బాధ వుంటే రెండు కళ్ళూ కూడా నీరు కార్చాలి కదా! ఒక కంటి నుండి మాత్రమే నీరు వస్తోంది. ఎందుకో ఆలోచించారా? నా శరీరంలో కుడిభాగం ఆర్తరక్షణకు అర్పితమవుతున్నదనీ, వామభాగానికి ఆ భాగ్యం కలగలేదనీ ఎడమకన్ను దుఃఖిస్తోంది. ఒంటరిగా మిగిలిపోయిన తాను ఏ పరమార్థాన్నీ సాధించకుండానే, ఎవరికీ ఎట్టి ప్రయోజనాన్నీ కలిగించకుండానే ఖిలమైపోవాలి కదా అని చింతిస్తోంది" అన్నాడు.

ఈ మాటలు విని కృష్ణుడు అర్జునుడి వైపు చూశాడు. అర్జునుడికి అంతా అర్థమైంది. ఇదంతా తనకు గర్వభంగం చేయడానికి అచ్యుతుడు ఆడిన నాటకమని గ్రహించి సిగ్గిల్లాడు.

పునీతుడైన ప్రియబాంధవునితో సహా కృష్ణుడు తమ నిజరూపాలు తెలియజెప్పి మయూరధ్వజుని దీవించాడు. ఆ రాజు శరీరానికి పూర్వపు స్థితిని కలుగచేశాడు.

మయూరధ్వజుడు యాగాశ్వాన్ని అర్జునునికి అప్పగించి మాధవుడికి పాదాభివందనం చేశాడు. ●

# భీమాంజనేయులు

దివ్యాస్త్రాలు సంపాదించే నిమిత్తం అర్జునుడు హిమాలయపర్వతాలకు వెళ్ళాడు.

గాండీవి ఎడబాటు భరించలేకపోయారు పాంచాలి, పాండవులు. సవ్యసాచితో కలిసి గడిపిన ఆ ప్రదేశాన్ని వదిలిపెట్టి మరెక్కడికైనా తరలివెళ్ళాలని నిర్ణయించుకున్నారు. అక్కడనుంచి వెంటనే బయలుదేరి నారాయణాశ్రమవనం చేరుకుని కొన్నాళ్ళు కాలం గడిపారు. ఒకనాడు ఉత్తర దిశనుంచి చల్లని పిల్లగాలి వీచింది. ఆ గాలితోపాటు దివ్యపరిమళం విరజిమ్ముతున్న వెయ్యి దళాలు కల పద్మం ఒకటి ద్రౌపది ఒళ్ళో పడింది. ఆమె ఆ పువ్వును చూసి మురిసిపోయింది.

“భీమసేనా! ఈ పూవు చూడు. ఎంత సువాసన! ఎంత అందం!! ఈ చెట్టు విత్తనం దొరికితే మన కామ్యకవనంలో వేసి పెంచుకుందాం. ఈ పువ్వులు ఎక్కడున్నాయో చూసి తీసుకురా” అంది.

ద్రౌపది కోరిక తీర్చడం కోసం భీమసేనుడు ఆ పూల చెట్టు ఉన్న స్థలాన్ని వెతుకుతూ వెళ్ళాడు. అలా వెళ్ళి వెళ్ళి ఒక వనం చేరుకున్నాడు. ఆ వనంలో దారికి అడ్డంగా ఒక కోతి పడుకుని ఉంది. దాన్ని భయపెట్టి పారిపోయేటట్టు చేద్దామని భీముడు గట్టిగా అరిచాడు.

అప్పుడు ఆ వానరం కళ్ళు తెరచి, “నా ఒళ్ళు బాగాలేదు. పడుకున్నాను. కదలలేను. పిచ్చిపిచ్చిగా శబ్దాలు చెయ్యకు. **వివేకం గల మనుష్యులు ప్రాణుల పట్ల కనికరం కలిగి ఉండాలి. బుద్ధిమంతులు మృగాలను హింసించకూడదు.** అయినా ఎక్కడికి పోదామని వచ్చావు? ఇది దేవలోకానికి పోయే మార్గం. మానవులు దీన్ని దాటిపోవడం సాధ్యం కాదు. తిరిగి వచ్చిన దోవనే వెళ్ళిపో” అంది.



వానరం అలా అనేసరికి భీముడికి ఒళ్ళు మండిపోయింది. “అసలు నువ్వెవరు? నన్నడ్డగించడానికి నీకు గల అధికారమేమిటి? నేను కుంతీదేవి కుమారుణ్ణి. వాయునందనుడ్ని అని తెలుసుకో. దారి ఇవ్వు” అని బిగ్గరగా గర్జించాడు.

“నేను ఒక సాధారణమైన కోతినే. కాని నువ్వీ దారిన వెళితే దెబ్బతింటావు. జాగ్రత్త” అంది వానరం.

“నీ సలహా నాకు అక్కర్లేదు. మర్యాదగా తప్పుకో” అన్నాడు భీముడు.

"నాకు లేవడానికి శక్తి లేదు. నేను ముసలిదాన్ని. కాదూ, కూడదూ అంటే నువ్వే నన్ను దాటి వెళ్ళు" అంది వానరం.

"జంతువులను దాటి పోగూడదని మా శాస్త్రం. లేకపోతే హనుమంతుడు సముద్రాన్ని లంఘించినట్టు, నిన్నూ, ఈ పర్వతాన్నీ ఒక్క ఉదుటున దాటిపోగలను ఏమనుకున్నావో!" అన్నాడు భీముడు గొప్పగా.

"నాయనా! కోపం తగ్గించుకో. గొప్పలకు పోకు. ముసలివాణ్ణని ముందే చెప్పాను. నిలిచే శక్తి నాకు లేదు. నా మీదినుంచి దాటిపోవడానికి ఆక్షేపణ వుంటే, దయచేసి నా తోక కొంచెం జరిపి తోవ చేసుకుని వెళ్ళు" అంది వానరం.

తన భుజబలం చూసి గర్వపడుతున్న భీముడు 'అదెంత పని!' అనుకుని ఆ కోతి తోక పట్టుకుని జరపబోయాడు. కాని ఆ వాలం కదల్లేదు. భీముడు తన బలమంతా ఉపయోగించి మళ్ళీ ప్రయత్నించాడు. లాభం లేకపోయింది. తోక పైకి ఎత్తడమైనా సాధ్యంకాలేదు. ఆ క్షణంలో భీముడికి ఎదుటవున్నది సామాన్య వానరం కాదని అర్థమైంది.

"అయ్యా! నన్ను మన్నించండి. మీరెవరు? సిద్ధులా? దేవతలా? గంధర్వులా? నన్ను క్షమించి మీ శిష్యుడిగా స్వీకరించండి" అని వేడుకున్నాడు.

"పాండవవీరా! సర్వలోకాలకూ ప్రాణాధారమైన వాయుదేవుని పుత్రుడ్ని, హనుమంతుడ్ని నేనే. యక్షులూ, రాక్షసులూ సంచరించే ఈ తోవలో నువ్వు వెళ్తే అపాయం వస్తుందని అడ్డగించాను. నీకు కావలసిన సౌగంధ వృక్షం–అదిగో కనిపిస్తోంది చూడు" అని భీమసేనుణ్ణి దగ్గరకు తీసుకున్నాడు హనుమంతుడు.

మారుతి చేసిన ఆలింగనంతో భీముడు పడిన శ్రమ అంతా పోయి అధిక శక్త సామర్థ్యాలు వచ్చాయి. "వీరుడా! నీ నివాసానికి తిరిగిపో. అవసరం కలిగినప్పుడు నన్ను తలుచుకో, నీకు మేలు జరుగుతుంది. నువ్వు యుద్ధరంగంలో ఎప్పుడు సింహనాదం చేస్తావో అప్పుడు నీ కంఠస్వరంతో నా కంఠం కూడా కలిపి శత్రువుల గుండెలను చీలుస్తాను. నీ తమ్ముడు అర్జునుడి రథంమీద జెండాపైన నేనుంటాను. మీకు జయం కలుగుతుంది" అని దీవించాడు హనుమంతుడు.

భక్తితో ఆయనకు ప్రణమిల్లి సౌగంధ పుష్పాలన్నీ కోసుకుని తిరుగు ప్రయాణమయ్యాడు భీముడు. 

# విష్ణుస్వరూపం

ఒకప్పుడు హిమవత్పర్వతం మీద మునులూ, సిద్ధులూ కలిసి గోష్ఠి చేస్తున్నారు. అప్పుడు అక్కడికి గరుత్మంతుడు వచ్చాడు. వాళ్ళందరూ అతన్ని గౌరవించి కూర్చోబెట్టారు.

"మహాత్మా! గరుత్మంతా! నువ్వు విష్ణుభక్తుడవు. ఆ స్వామి భక్తప్రియుడు. నువ్వెప్పుడూ ఆయన దగ్గర వుంటావు. విష్ణుమూర్తి గురించి వినయంగా మాకు చెప్పవా?" అని ప్రార్థించారు.

"లోకాలను రక్షించడానికి స్థూలరూపం ధరించి మనకు కనబడతాడాయన. ఆ మహానుభావుడు నామీది దయతో నాకు అనేక అద్భుతాలు చూపించాడు.

"ఒకసారి నేను దేవేంద్రుణ్ణి జయించి అమృతం తీసుకువెడుతూంటే ఆకాశం నుంచి 'పక్షిరాజా! మెచ్చాను నీ శౌర్యానికి! నీకు వరమిస్తాను. ఏం కావాలో కోరుకో!' అన్న మాటలు మృదుగంభీరంగా వినిపించాయి. ఆశ్చర్యం కలిగింది నాకు. అమితానందపడ్డాను.

'నువ్వెవరో ఎక్కడనుంచి మాట్లాడుతున్నావో తెలీదు నాకు. తెలియచెప్పి వరమియ్యి' అని వేడుకున్నాను.

'కాలంతోపాటే నన్ను తెలుసుకుంటావులే! నాకు వాహనంగా వుండు' అంటూ ఉజ్జ్వలతేజోమయుడైన పురుషుడొకడు ప్రత్యక్షమయ్యాడు.

నాకు దేవదానవులందర్నీ గెలవగల శక్తి ఇచ్చాడు. జరామరణాలు లేకుండా చేశాడు. నేను ఆయనకు సాష్టాంగపడి, 'దేవా! నీకు వాహనాన్నవుతాను! నువ్వు రథమెక్కితే జెండానై ఉంటాను. నాకు ఈ వరం కూడా ఇవ్వు' అన్నాను. సరేనని అంతర్ధానమయ్యాడాయన. నేను సంతోషపడుతూ వెళ్ళి ఆ సంగతంతా మా తండ్రి గారితో చెప్పాను.

'నాయనా! ఆ మహాత్ముడు నారాయణుడు. నీమీద ఉన్న అనుగ్రహంతో నీకు కనబడి మాట్లాడాడు. ధన్యుడవు నువ్వు. ఆయనను చూడగోరి యోగసమాధి వహించాను నేను. నల్లని, తెల్లని, పచ్చని, ఎర్రని వర్ణాలతో అనేక పాణి, పాద, శిరో నేత్రాలతో దర్శనమిచ్చాడు నాకు. అలాంటి మహానుభావుడికి శాశ్వతంగా పరిచర్య చేసే భాగ్యం లభించింది నీకు. తరించావు నీవు. బదరికాశ్రమానికి వెళ్ళి అక్కడ ఉన్న నారాయణమూర్తిని సేవించు' అన్నాడు.

గబగబ అక్కడికి వెళ్ళాను.

అక్కడ నాకు ఆ దేవుడు పీతాంబరధారియై, ఎనిమిది చేతులుగల మూర్తిగా దర్శనమిచ్చాడు. నన్ను చూసి చిరునవ్వు నవ్వి, 'వచ్చావా! మంచిపని చేశావు! రా!' అంటూ ఈశాన్య దిక్కుగా పోసాగాడు. నేను ఆయనవెంట పరుగెత్తి వెళ్ళాను. అలా బహు సహస్రయోజనాలు వెళ్ళాక, అక్కడ బ్రహ్మాండమైన అగ్ని వెలుగుతూ కనబడింది. కట్టెలు లేకుండానే వెలుగుతోందది. ఆయన ఆ అగ్నిలో ప్రవేశించాడు. అందులో శివుడు పార్వతితో సహా తపస్సు చేస్తున్నాడు. కాసేపు ఆ శివపార్వతులతో ముచ్చటించి ఆ అగ్నిని దాటి వెళ్ళిపోతున్నాడాయన. నేను అప్పటికే బాగా అలసిపోయాను. అయినా ఆయనవెంటే నడిచాను. ఆ దేవుడు అలా చాలాదూరం నడిచి సూర్యకిరణాలు చొరబడడానికి వీల్లేని మహా తపస్సులోకి ప్రవేశించాడు. అక్కడికి వెళ్ళేసరికి నాకు కళ్ళు కనిపించలేదు. భయమేసింది. 'దేవా! దిక్కు తెలియడం లేదు. నన్ను కరుణించు' అని ప్రార్థించాను.

వెంటనే 'ఇదుగో! ఇటువైపు రా' అనే శబ్దం వినబడింది.

'దేవా! మనస్సుకు ఖేదం, శరీరానికి అలసటా ఎక్కువైపోయాయి. ఈ చీకట్లో కళ్ళు కనిపించడం లేదు. శరణు! దయచూడవా!' అన్నాను దీనంగా.

వెంటనే ఆ చీకటంతా పోయింది. ప్రభాకరునిలా వెలిగిపోతూ కనిపించాడాయన. ఆ ప్రదేశం సూర్యచంద్రనక్షత్రాలకూ కూడా చేరరానిది. తామర కొలనులున్నాయక్కడ. మృదుమధుర గీతాలు వినిపిస్తున్నాయి. అప్సరసలను మించిన దివ్యాంగనలు కనిపించారు. వాళ్ళందరి పూజలూ అందుకుంటూ వెళ్ళాడా మహాత్ముడు. ఒక ప్రదేశానికి వెళ్ళేసరికి అదంతా అగ్నిమయమై భయంకరంగా వెలగసాగింది. ఆయన కనిపించలేదు. భయమేసింది. 'దేవా! రక్షించు!' అని ప్రార్థించాను.

'వినతాసుతా! భయపడకు! మమతాహంకారాలు విడిచిన శాంతమూర్తులు మాత్రమే నన్ను చూడగలుగుతున్నారు. నువ్వు నిష్ఠతో నన్ను తలుచుకుంటున్నావు గనుక నీకు స్థూలరూపంలోనే కనిపిస్తాను' అనే చల్లని మాటలు వినిపించాయి.

ఆ అగ్ని ఆరిపోయింది.

నేను ఆయనతో మరికొంత దూరం వెళ్ళాను.

కాసేపటికి ఆ స్వామి అంతర్హితుడయ్యాడు.

కనిపించని స్వామి 'ఇటు! ఇలా' అంటూ చేసిన సూచనలను ఆధారం చేసుకుని ముందుకు వెళ్ళాను నేను. అందమైన సరస్సు కనిపించింది. అందులో ఆనందంగా స్నానం చేస్తూ కనిపించాడాయన. నన్ను దగ్గరకు రమ్మని సైగ చేశాడు. తీరా వెళ్ళేసరికి మాయమయ్యాడు. నేను విచారంగా నాలుగు దిక్కులూ చూసేసరికి అనేక వేల అగ్నిహోత్రాలు వెలుగుతూ కనిపించాయి. వేదశబ్దాలు వినిపించాయి. కాని ఎవరూ కనిపించలేదు. అనేకమంది సుపర్ణులు నా మీద విరుచుకుపడ్డారు. నారాయణమూర్తిని స్తుతిస్తూ చేతులు జోడించాను.

'భయపడకు' అని అభయం వచ్చింది. కళ్ళు తెరిచేసరికి ఎప్పటికిమల్లే బదరికాశ్రమంలో ఉన్నాను. నా ఎదురుగుండా ఆయన ఎనిమిది చేతులతో కూడిన స్వరూపంతో నిలబడ్డాడు. సంతోషం, సంభ్రమం కలిగాయి నాకు. ఆయన పాదాలను తాకాను. కళ్ళకు అద్దుకున్నాను.

దయతో నావైపు చూసి 'వినతాతనయా! నా స్వరూపం ఎవరికీ తెలియదు!

సకలభూతాల్లోనూ ఉంటాను. అవన్నీ నాలో ఉంటాయి. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధులనే పేర్లతో నాలుగు రకాలుగా విభజింపబడి ఉంటాను నేను. ఆత్మ, బుద్ధి, అహంకారం, మనస్సు అనే రూపాలతో వ్యాపించి వుంటాను. అయితే ఏకాంతధ్యానపరులు మాత్రమే నా సూక్ష్మరూపం తెలుసుకోగలరు. నువ్వు నా భక్తుడవై నన్ను తెలుసుకో' అన్నాడా మహానుభావుడు.

"మహాత్ములారా! నాకు తెలిసిన హరి దివ్యచేష్టలన్నీ మీకు చెప్పాను" అని గరుత్మంతుడు మునులకూ, సిద్ధులకూ విష్ణురూపాన్ని వివరించాడు. ●



# గరుత్మంతుడి గర్వభంగం

**ఇం**ద్రుడి సారథి అయిన మాతలికి ఒక కుమార్తె ఉంది. పేరు గుణకేశి. చూడచక్కని చిన్నది. యుక్తవయస్సు వచ్చాక ఆ పిల్లకు తండ్రి పెళ్ళి చేద్దామనుకున్నాడు. కాని ఆమెకు తగిన వరుడు ఎక్కడా దొరకలేదు. చివరికి మాతలి నాగలోకానికి వెళ్ళి సుముఖుడికి తన కూతుర్ని చేసుకోవాలని ఆర్యకుని అర్థించాడు. ఆర్యకుని మనుమడు సుముఖుడు. సుముఖుడి తండ్రి చిరకారి.

"నాయనా! చిరకుణ్ణి కొద్దిరోజుల క్రితమే గరుత్మంతుడు చంపి భక్షించాడు. మరో నెలరోజుల్లో సుముఖుణ్ణి కూడా హతమారుస్తానని చెప్పి వెళ్ళాడు. చెప్పింది చేసి తీరుతాడు వాడు. చావు మూడినవాడికి నీ కుమార్తెనిచ్చి పెళ్ళి చేయడమెందుకు?" అన్నాడు ఆర్యకుడు. అది విని మాతలి బాధపడ్డాడు.

"అయ్యా! సుముఖుణ్ణి నాతో పంపండి. నేను అతణ్ణి ఇంద్రుడి దగ్గరకు తీసుకుపోతాను. ఆనక గరుత్మంతుని వలన ప్రమాదం రాకుండా ఉపాయం ఆలోచిస్తాను" అన్నాడు.

ఆర్యకుడు అంగీకరించాడు.

సుముఖుణ్ణి వెంటపెట్టుకుని మాతలి మొదట ఇంద్రుణ్ణీ, ఆ తరువాత విష్ణుమూర్తినీ సందర్శించి సంగతంతా విన్నవించాడు. విష్ణుమూర్తి ఆజ్ఞమేరకు ఇంద్రుడు సుముఖుడికి పూర్ణాయుర్దాయం ప్రసాదించాడు.

గరుత్మంతుడికీ విషయం తెలిసింది.

అగ్గిమీద గుగ్గిలమయ్యాడు.

ఇంద్రుడి దగ్గరకు వచ్చి "సురేశ్వరా! త్రిలోకాధిపత్యం నీకే వుందని విర్రవీగుతున్నట్టున్నావు. నీ తల్లీ, నా తల్లీ ఒకే తండ్రి బిడ్డలన్న సంగతి మర్చిపోకు. ఇద్దరూ దక్షప్రజాపతి కుమార్తెలే. నీ తండ్రీ నా తండ్రీ కశ్యపుడే. నీకెంత బలం వుందో నాకూ అంతకుమించి ఉంది. నిత్యం విష్ణుమూర్తిని వీపుమీద ఎక్కించుకుని మోస్తున్నాను. అలాంటిది నువ్వో లెక్కా!" అన్నాడు గర్వంగా.

ఈ విషయం విష్ణుమూర్తికి తెలిసింది. ఆయన గరుత్మంతుణ్ణి పిలిచి చిన్నగా నవ్వి "గరుత్మంతా! తెలివితేటల్లో ఒకరి తలదన్నేవారు మరొకరుంటారు. నేనే బలాఢ్యుడనని ఎవరూ గర్వించకూడదు. నీవు నన్ను మోస్తున్నానని గొప్పలు చెప్పుకుంటున్నావు. నిజానికి నన్ను ఎవరూ మోయలేరు. నన్ను నేను మాత్రమే మోయగలను. నీ బలమేమిటో తెలుస్తుంది–నా కుడిచేతిని ఒకసారి మోయి" అంటూ విష్ణుమూర్తి తన దక్షిణహస్తాన్ని గరుత్మంతుడి మూపుపై మోపాడు. గరుడుడు ఆ బరువు మోయలేక కుప్పకూలాడు. కొనవూపిరితో కొట్టుకుంటూ తనను రక్షించమని విష్ణుమూర్తిని ప్రార్థించాడు. విష్ణుమూర్తి దయతలచి లేవనెత్తి, "ఇకమీదటెప్పుడూ అనవసరపు డాంబికాలకు పోకు" అని బుద్ధి చెప్పి పంపాడు. ఆ తరువాత మాతలి తన కుమార్తె గుణకేశిని సుముఖుడికిచ్చి పెళ్ళి చేశాడు.

"గరుత్మంతునిలా నీవూ గర్వాంధుడవై పాండవులతో విరోధం తెచ్చుకుని నవ్వులపాలు కావద్ద"ని కణ్వమహర్షి దుర్యోధనుడికీ కథ చెప్పాడు. కానీ సుయోధనుడు మహర్షి మాట వినలేదు. అవివేకికి జ్ఞానుల మాటలు అంత తేలికగా తలకెక్కవు.

**ప్రతిఫలాపేక్ష లేకుండా హితవు చెప్పేవాడు దొరకడం కష్టం. చెప్పిన హితవచనాలు శ్రద్ధగా విని ఆచరించేవాడు లభ్యం కావడం అంతకంటే దుర్లభం. హితవు త్రోసిపుచ్చక స్వీకరించేవాడూ, ఆచరించేవాడూ ఎన్నడూ కష్టాలకు లోనుకాడు**

●

# చార్వాకుడు

**కు**రు పాండవ యుద్ధం ముగిసిన తరువాత ధర్మరాజు హస్తినాపురానికి వస్తున్నాడని తెలిసి పట్టణమంతా అందంగా అలంకరించారు. రాజవీధిలో ప్రవేశించిన ధర్మరాజు మీదా, పరివారం మీద ప్రజలు ముత్యాలూ అక్షింతలూ పూలూ చల్లారు.

అవన్నీ స్వీకరిస్తూ ధర్మతనయుడు రాజమందిర ద్వారంలోంచి లోపలికి వెళ్ళి ఏనుగు మొగసాలలో రథం దిగాడు. బ్రాహ్మణులకు బంగారం, గోవులు దానం చేశాడు.

"ఇతనే మన మహీపతి! కురుక్షేత్ర సంగ్రామంలో కౌరవులకు బుద్ధి చెప్పిన వీరుడితడే– అజాత శత్రువు– ఆడినమాట తప్పని ధర్మప్రభువు, చల్లని తండ్రి– ఆప్తులను, ఆర్తులను ఆదరించే పుణ్యాత్ముడు" అని జనం వేనోళ్ళ కొనియాడసాగారు.

ఇంతలో ఒక బ్రాహ్మణుడు గబగబ పరుగెత్తుకు వచ్చాడక్కడికి. "ఈ ధర్మరాజేం ప్రభువు!? మహా పాపం చేశాడు! తండ్రి, తమ్ముడు, పుత్రుడు, గురువు అనే తారతమ్యం, జంకూ గొంకూ లేకుండా బంధుజనులందర్నీ చంపాడు. ఎందుకీ జన్మ! దాయాదులందర్నీ చంపి ఏం భోగాలనుభవిస్తావు?! పాపం మూటగట్టుకున్నావు!" అన్నాడు. ఆ మాటలు విని అక్కడున్న బ్రాహ్మణులంతా తెల్లబోయి బాధపడుతూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు. "ఇదేమిటి?" అని ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

ధర్మరాజు కాసేపు సిగ్గుతో తల వంచుకుని తరువాత ఆ బ్రాహ్మణుల వైపు తిరిగి, "మీకు నమస్కరించి వేడుకుంటున్నాను. మహర్షులందరూ అనుమతించి పంపితేనే రాజ్యం చెయ్యడానికి వచ్చాను. మీరు నన్ను ఆదరించవలసిందని కోరుతున్నాను" అన్నాడు చేతులు జోడించి.

విప్రులంతా భయపడిపోయారు. "మహారాజా! మేమెవరమూ ఇలా అనలేదు. అసలు ఇతనెవరో కూడా మాకు తెలీదు. ఉత్తమ క్షత్రియ ధర్మంతో నువ్వు గెలుచుకున్న సిరి శాశ్వతమై ఉండుగాక" అని ధర్మరాజును ఓదార్చి, దివ్యదృష్టి సారించారు. ఆ కపట విప్రుని స్వరూపం బోధపడింది.

"మహారాజా! వీడు చార్వాకుడనే రాక్షసుడు. దుర్యోధనుడి స్నేహితుడు. అతనికి మేలు చెయ్యాలని వీడు ఈ రూపంలో వచ్చాడు. ఈ కుక్క మొరిగితే పాలసముద్రం వంటి నువ్వు బాధపడటమెందుకు? ధర్మాత్ములైన తమ్ముల సాయంతో సకల మహీవలయాన్నీ పరిపాలించు" అని ఆ రాక్షసుడివైపు చూసి హూంకారం చేశారు వాళ్ళు. వాళ్ళ క్రోధాగ్నికి ఆగలేక చార్వాకుడు చచ్చి నేలబడ్డాడు. అజాతశత్రుడు సంతోషించి వాళ్ళను విశేషంగా పూజించాడు.

కృష్ణుడు ఇదంతా చూస్తూ–

"ధర్మరాజా! వీడు కృతయుగంలో తపస్సు చేసి బ్రహ్మ ప్రత్యక్షమైతే సకల భూతాల వల్ల చావు లేకుండా వరం కావాలని కోరాడు. 'బ్రాహ్మణులకు అపకారం చేసే పనులు మాత్రం చెయ్యకు. అలా ఎప్పుడు చేస్తే అప్పుడే నీకు చావు సంభవిస్తుంది. అంతవరకూ ఎవరివల్లా నీకు చావు లేద'ని బ్రహ్మ వరమిచ్చాడు. అప్పటినుంచీ వీడు లోకాలన్నిటినీ బాధిస్తూనే వున్నాడు. తరువాత దుర్యోధనుడితో స్నేహం చేసి మరింత పెచ్చుమీరాడు. ఆ దురహంకారంతోనే ఇప్పుడు చావును కొని తెచ్చుకున్నాడు.

గురువును ఎదిరించడం, గ్రామం పాడు చెయ్యడం, వేదాలూ, ఔషధాలూ అమ్ముకోవడం, చెడుస్నేహం చెయ్యడం, రాజధర్మాలూ, ఆపద్ధర్మాలూ, వర్ణాశ్రమధర్మాలూ పాటించే ఉత్తమ పాలకుణ్ణి తూలనాడడం, ధిక్కరించడం, కూడనిపనులూ చెయ్యరాని పనులూ చేస్తే ఎవరికైనా ఇంతే" అని, "ఎవరక్కడ! ఈ కళేబరాన్ని తీసి అవతల పారెయ్యండి" అన్నాడు.

భటులు వచ్చి శవాన్ని ఈడ్చుకుపోయారు.

విప్రులు కృష్ణుడికి నమస్కరించారు.

తరువాత సభా భవనంలో ఎత్తయిన బంగారు పీఠం వేయించి ధర్మరాజును కూచోబెట్టి సుముహూర్తం సమీపించగానే చక్రధారి వచ్చి "సమస్త పృథ్వికీ అధిపతివై పరిపాలించు" అంటూ శంఖుతీర్థంతో ధర్మరాజుకు అభిషేకం చేశాడు. పంచ మహా వాద్యాలూ మ్రోగాయి. ●

# శిఖండి

సంతానం లేని ద్రుపదుడు పరమేశ్వరుని గురించి తపస్సు చేసి భీష్ముణ్ణి చంపే కొడుకు కావాలని అడిగాడు.

"ముందు కూతురై పుట్టి తరువాత కొడుకుగా మారి భీష్ముణ్ణి చంపే సంతానం నీకు కలుగుతుంది" అని శివుడు శెలవిచ్చాడు.

ఆ ప్రకారమే ద్రుపదుడికి కూతురు పుట్టింది. తల్లిదండ్రులిద్దరికీ అసలుసంగతి ముందే తెలుసు కనుక తమకు కొడుకే పుట్టాడని అందరితోనూ చెప్పి ఆ పిల్లను పురుషవేషంలో పెంచారు. ఆమెకు శిఖండి అని పేరు పెట్టారు. శివుడి వరం సంగతి ఆమెకు చెప్పి, ద్రోణాచార్యుడి దగ్గర విలువిద్యాభ్యాసం చేయించడం మొదలుపెట్టారు.

కూతురికి యుక్తవయస్సు వచ్చాక పెళ్ళి చెయ్యాలనుకుని, ఈశ్వరుని వరం తలచుకుని ధైర్యం తెచ్చుకుని, దశార్ణదేశ ప్రభువు హేమవర్మ కూతుర్ని తెచ్చి పెళ్ళి చేశారు. ఆ పెళ్ళికూతురు చాలా తెలివైనది. శిఖండి అజాగ్రత్తగా ఉన్న సమయంలో అసలు సంగతి పసికట్టి తన దాసికి చెప్పింది. పరిచారిక వెళ్ళి హేమవర్మ చెవిలో

వేసిందా సంగతి. ఆయన అగ్గిమీద గుగ్గిలమయ్యాడు.

"కొడుకని చెప్పి కూతురికి మరో కన్యనిచ్చి పెళ్ళి చేశావు. ఇందువల్ల నగుబాటు తప్ప మరేం జరిగింది నీకు? నన్ను అవమానించావు. కొడుకని చెప్పిన నీ కూతురికెలాగూ పురుషత్వంలేదు. నీకైనా మగతనం వుంటే యుద్ధంలో చూపించు" అన్నాడు.

"ఏం మాటలయ్యా ఇవి! కూతుర్ని కొడుకని చెప్పుకోవలసిన గతేమిటి నాకు? ఎవరో గిట్టనివాళ్ళు ఏదో చెప్పివుంటారు మీకు. నావంటివాడి మర్యాదైనా ఆలోచించకుండా మాట్లాడటం ధర్మమేనా?" అన్నాడు ద్రుపదుడు.

"అయితే మనిద్దరం ఇప్పుడే నిజానిజాలు తేల్చుకుంటే సరిపోతుందిగా?" అన్నాడు హేమవర్మ.

''అబ్బే! అలా చేస్తే అబ్బాయిని అవమానించినట్టవుతుంది. ఎందుకూ–కొద్దిరోజుల్లో అబ్బాయి అత్తవారింటికోసారి రావాలిగా?" అని మెల్లగా నచ్చచెప్పి పంపించేశాడు ద్రుపదుడు.



ఇదంతా తెలిసి శిఖండి ఆ అవమానం భరించలేక మరణమే శరణ్యమనుకుని ఎవరికీ చెప్పకుండా అడవికి పారిపోయింది. అక్కడున్న యక్షుడొకడు ఆ అమ్మాయి ఆత్మహత్యా ప్రయత్నాలను గమనించి "అమ్మాయీ! ఏమిటీ చావు ప్రయత్నం? నీ బాధేమిటో చెప్పు, నేను తీరుస్తాను" అన్నాడు.

"నా బాధ భగవంతుడు తీర్చాల్సిందే" అంది శిఖండి విలపిస్తూ.

"పోనీ నేను వినడం వలన నష్టం లేదుగా?" అన్నాడు యక్షుడు.

"ఇప్పుడు నాకు పురుషత్వం వస్తే తప్ప ఈ బాధ తీరదు" అని తన కథంతా పూసగుచ్చినట్టు చెప్పింది శిఖండి.

యక్షుడికి జాలేసింది.

"ఓస్! ఇంతేకదా! నా పురుషత్వం నీకిస్తాను. వెళ్ళి మీ అత్తింట సందేహం పోగొట్టి మళ్ళీ పదిరోజుల్లో తిరిగిరా. అంతవరకు నీ కన్యాత్వం నేను భరిస్తూ ఉంటాను. నువ్వొచ్చాక నా పురుషత్వం నాకిచ్చేద్దువుగాని" అని శిఖండిని ఓదార్చి ఆమెకు తన పురుషత్వాన్ని ఇచ్చాడు యక్షుడు.

శిఖండి ఇంటికి వెళ్ళి జరిగిన సంగతి తల్లిదండ్రులకి చెప్పేసరికి వాళ్ళు బ్రహ్మానందపడిపోయారు. తక్షణం ద్రుపదుడు హేమవర్మను పిలిపించి శిఖండి పురుషుడనే సంగతి రుజువు చేశాడు. హేమవర్మ తన తొందరపాటుకి సిగ్గుపడ్డాడు.

పది రోజులయ్యాక యక్షుడికిచ్చిన మాటప్రకారం శిఖండి అరణ్యానికి తిరిగి వచ్చాడు.

"మహాత్మా! నా పరువు దక్కించావు. నీ పురుషత్వం నువ్వు తీసుకో" అన్నాడు.

"నాయనా! నువ్వు అదృష్టవంతుడివి. ఇక నువ్వు నీ జీవితాంతం ఇలా పురుషుడుగానే ఉంటావు. ఇది దైవనిర్ణయం" అన్నాడు యక్షుడు.

సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయాడు శిఖండి.

"నాయనా! నువ్వు వెళ్ళాక ఒకనాడు కుబేరుడు వచ్చాడు. ఆయన వస్తే ఎదురు వెళ్ళి గౌరవించాలని తెలుసు. కాని ఈ ఆడ రూపుతో వెళ్ళడానికి సిగ్గుపడ్డాను. నేను గౌరవించనందుకు ఆయనకు కోపం కలిగింది. ఆయన పరివారంలో ఉన్న యక్షులు కొందరు నా దగ్గరకు వచ్చి సంగతంతా తెలుసుకుని వెళ్ళి ఆయనతో చెప్పారు. అయినాసరే రమ్మనేసరికి నేను వెళ్ళి ఆయన పాదాలు తాకాను. 'స్థూల

కర్ణా! ఇంక నువ్విలా స్త్రీ రూపంలో వుండు' అన్నాడు. ఆ మాట విని నేను ఏడ్చాను. యక్షులంతా నా బాధ చూచి కుబేరుణ్ణి ప్రార్థించారు. 'సరే అయితే! శిఖండి బ్రతికి ఉన్నన్నాళ్ళూ నువ్వు యిలా స్త్రీగా ఉండి, అతడు చనిపోయాక నీ పురుషత్వాన్ని మళ్ళీ నువ్వు పొందుతావు' అని కుబేరుడు అనుగ్రహించాడు. ఇందులో నీ తప్పేమీ లేదులే. వెళ్ళి సుఖంగా ఉండు" అని యక్షుడు అనగానే అపరిమిత ఆనందం పొందాడు శిఖండి.

స్థూలకర్ణుడి దగ్గర శెలవు తీసుకుని గబగబ ఇంటికి వచ్చి తల్లిదండ్రులకీ వార్త తెలియజేశాడు.

ద్రుపదుడు తన అదృష్టానికి మురిసిపోయి దేవతలనూ, విప్రులనూ పూజించి నిస్సంకోచంగా ద్రోణాచార్యుడి దగ్గరకు శిష్యుడిగా పంపాడు శిఖండిని. ఆ తరువాత అస్త్రవిద్యలో అతను ఆరితేరాడు.

అంగనలనూ, అంగనాపూర్వులనూ, అంగనాకారం గలవాళ్ళనూ, అంగనా నామధేయం కలవాళ్ళనూ చంపనని భీష్ముడు వ్రతం పట్టాడు. అందుకే శిఖండిని కురుక్షేత్ర సంగ్రామంలో భీష్ముడు చంపలేదు. ●

# సుదేవుడు

స్వర్గలోకం సుందరంగా వుంది. అప్సరసల అందెల రవళులతో మారుమోగుతోంది. సమస్త భోగాలకూ నిలయమై ప్రకాశిస్తోంది. ఇంద్రుడు సుందరీమణుల నృత్యాన్ని తన్మయంగా తిలకిస్తున్నాడు. ఇంతలో అంబరీష మహారాజు వచ్చాడక్కడికి.

అతణ్ణి చూసి ఇంద్రుడు ఎదురువెళ్ళి, “మహారాజా! స్వాగతం! ఎన్నో యాగాలూ, పుణ్యకార్యాలూ చేసి దేవలోకానికి వచ్చిన ఉత్తముడివి నువ్వు. నీ రాక మా అందరికీ మహదానందకరంగా వుంది” అన్నాడు. అంబరీషుడు చిరునవ్వుతో చుట్టూ కలయచూశాడు. ఒకచోట పుష్పక విమానంలో, దివ్యాంగనలతో పరాచికాలాడుతున్న ఓ విలాసపురుషుడు కనిపించాడు. ఇంద్రుడికి అతణ్ణి చూపిస్తూ “వాడు సుదేవుడు కదూ?” అని అడిగాడు అంబరీషుడు.

“ఔను”

“వాడు నా సేవకుడు. ఏ పుణ్యకార్యాలూ చెయ్యలేదు. అయినా వాడికీ సుకృతం ఎలా కలిగింది?” అని అంబరీషుడు ప్రశ్నించాడు.

“ఒకసారి శతశృంగుడనే రాక్షసుడి కుమారులు సదముడూ, విదముడూ, దముడూ నీమీద దండెత్తారు కదూ?”

“అవును. ప్రజలెందరినో పీడించి దోచుకుని నా రాజ్యం ఆక్రమించడానికి వస్తే నేను సుదేవుణ్ణి పిలిచి, ‘సైన్యంతో తక్షణం వెళ్ళి ఆ రాక్షస కుమారుల్ని హతమార్చు. జయం పొందకుండా వస్తే మాత్రం నీ తల కోట గుమ్మానికి కడతాను’ అని కావల్సినంత సైన్యమిచ్చి పంపాను. సరేనని వెళ్ళాడు. కాని ఆ తరువాత వాడి జాడ తెలీలేదు.”

“నేను చెబుతాను విను. అతడు వెళ్ళి సైన్యంతో ఒకచోట విడిది చేశాడు. గూఢచారుల్ని పంపి శత్రు సైన్యం బలం అంచనా వెయ్యమన్నాడు. వాళ్ళు తిరిగివచ్చి శతశృంగుడి కుమారులతో తలపడడం మంచిది కాదని చెప్పారు.

‘ఎదుటివాడి బలం ఎంతో తెలుసుకున్నాక కూడా యుద్ధం చేస్తే సైన్యానికి చేటు తప్ప ఏం ప్రయోజనం లేదు. తిరిగి వెడితే ఎలాగూ ప్రాణాలు దక్కవు. కనుక నా తల అంబరీషుడికి ఇచ్చే బదులు పరమేశ్వరుణ్ణి ఆరాధించి ఆయనకు ఇవ్వడం మేలు’ అనుకుని యుద్ధం మానేసి సైన్యాన్ని వెనక్కి వెళ్ళమని చెప్పాడు సుదేవుడు. తను వెళ్ళి మరుభూమిలో కూర్చుని, శివుణ్ణి మనస్సులో నిలుపుకుని మెడమీద కత్తి పెట్టుకున్నాడు.

వెంటనే, ‘ఆగు! ఏమిటీ సాహసం? ఎందుకీ పనికి పూనుకున్నావు?’ అని కత్తి తొలగించాడు పరమేశ్వరుడు.

సుదేవుడు పరమానంద భరితుడై ఆదిదేవుడికి సాగిలబడ్డాడు.

‘దేవా! శతశృంగుడి కుమారులను జయించకుండా వస్తే చంపుతానన్నాడు. అంబరీష మహారాజు. కాని ఆ రాక్షస కుమారులు జయించరానివారుగా వున్నారు. ఎలాగైనా చావు తప్పనప్పుడు దేవదేవుడవైన నీకే నా తల అర్పించుకుంటే మంచిదనుకున్నాను’ అన్నాడు జాలిగా.

“శివుని మనస్సు ఆర్ద్రమైంది. ఒక దివ్యరథాన్ని, విల్లమ్ములీ్న సుదేవుడికి ఇచ్చి, ‘ఇంక నిన్ను యుద్ధంలో దేవదానవులెవరూ గెలువలేరు. కాని ఒక విషయం

గుర్తుంచుకో– యుద్ధం చేసేటప్పుడు ఈ రథం మీదనుంచి కిందకు మాత్రం దిగకు' అని హెచ్చరించాడు.

"సుదేవుడు బ్రహ్మానందపడిపోయాడు. ఆ రథమెక్కి వెళ్ళి సదముడినీ, దముడినీ చంపేశాడు. అదిచూసి విదముడు మండిపడ్డాడు. ఖడ్గం చేతపట్టి సుదేవుడి మీదకు వచ్చాడు. వైరిని చూసి రెచ్చిపోయి, పరమేశ్వరుడు చెప్పినమాట మరచి రథం మీదనుంచి కిందకు దూకాడు సుదేవుడు. ఖడ్గయుద్ధం చేస్తూండగా ఒకరి కత్తికి ఒకరు బలై ఇద్దరూ మరణించారు. అతడలా శత్రుసంహారం చెయ్యబట్టే నీ రాజ్యం గొప్పగా వుంది. అందువల్లే సుదేవుడికి యీ నాగలోకాన యింతటి ఉన్నత స్థానం లభించింది. "యుద్ధంలో చనిపోయి వచ్చినవాడు యిక్కడ పొందే సత్కారానికి సమానమైనది ఇంకొకటి ఏదీలేదు. వీరమరణం పొందిన వారికే కాక, సంగ్రామంలో వైరికి వెరవక, వెన్నివ్వక పోరాడి నిలిచిన వారికి కూడా వీరస్వర్గమే లభిస్తుంది" అన్నాడు ఇంద్రుడు.

అప్పుడు అంబరీషుడు కూడా సుదేవుణ్ణి అభినందించాడు. ●

# గౌతముడి ఏనుగు

**పూ**ర్వం గౌతముడనే బ్రాహ్మణుడు అడవిలో తపస్సు చేసుకుంటూ వుండేవాడు. అతనికి ఒకచోట తల్లి లేని ఒక ఏనుగుపిల్ల కనిపించింది. జాలివేసి దాన్ని తీసుకొచ్చి పెంచాడు. ఆ గున్న ఏనుగు క్రమక్రమంగా పెరిగి పెద్దదయింది.

ఒకరోజు ధృతరాష్ట్రుడనే రాజు ఆయన దగ్గరకు వచ్చి ఆ ఏనుగును తన కిమ్మని అడిగాడు.

"ఇది నేను లేనప్పుడు నా పర్ణశాలకు కాపలా కాస్తుంది. దర్భలూ మొదలైనవి తెచ్చి ఇస్తుంది. దీన్ని కొడుకులా పెంచుకున్నాను, నీకివ్వలేను" అన్నాడు గౌతముడు.

"మునులకు ఏనుగెందుకు? నీకు కావల్సినన్ని గోవులు, కోరినంత బంగారం ఇస్తాను తీసుకో" అన్నాడు మహారాజు.

"ఇది తల్లి లేనిది. చిన్నప్పటినుంచి ప్రేమగా పెంచాను. దీనిమీద నాకు మమకారం ఎక్కువ. నువ్వు పదివేల గోవులిచ్చినా నాకు అక్కర్లేదు. బంగారం అంతకంటే వద్దు, మన్నించాలి" అన్నాడు గౌతముడు.

"ఏనుగు రాజులకు వాహనం. నేను మహారాజును. స్వయంగా వచ్చి అడుగుతున్నాను. ఇవ్వనంటావా?" అన్నాడు రాజు.

"పుణ్యాత్ములు హర్షం, పాపాత్ములు దుఃఖం పొందే యమధర్మరాజు సభకు వెళ్ళి న్యాయం అడుగుదాం! రా! అక్కడ నీకు ఏనుగుని ఇస్తాను" అన్నాడు గౌతమముని.



"పాపాత్ములు వెడతారక్కడికి. నేనెందుకు వస్తాను?" అన్నాడు రాజు.

"యముడు పుణ్యాత్ముడే. అతని సన్నిధిలో ఇస్తాను రా."

"అక్కనూ తల్లిదండ్రులనూ దయతో రక్షించే వాళ్ళు అతని దగ్గరకు వెడతారు, నేను రాను!"

"పోనీ గంగాతీరానికి వెడదామా?"

"అతిథులకు పెట్టి తరువాత తాము తినేవాళ్ళు, అపరిగ్రహులూ అక్కడికి వెడతారు. నేనెందుకు వస్తాను!"

"అయితే మేరువనానికి వెడదాం."

"సత్యం, దయ, మృదువర్తనం కలిగి, భూతదయ కలిగివుండేవారు వెడతారక్కడికి. ఇంకేదైనా చోటు చెప్పు."

"నారదమహర్షి విహార స్థలానికి వెడదాం. అప్సరసలూ, కిన్నెరలూ వుంటారక్కడ"

"సంగీతనృత్యాలతో దేవతార్చన చేసిన వాళ్ళు వెడతారక్కడికి, నేను రాను."

"పోనీ ఉత్తర కురుభూములకు వస్తావా? అక్కడ దేవతలుంటారు, దేవేంద్రుడు అందరి కోరికలూ తీరుస్తూ వుంటాడు."

"కామ హింసా రహితులు వెడతారక్కడికి, నేనెందుకు?"

"చంద్రమండలానికి వెళ్దాం పద."

"దాననిరతులైన శాంతులు వెడతారక్కడికి, నేను రావడం సాధ్యం కాదు."

"సూర్యుడి దగ్గర ఇస్తాను, రా!"

"తపస్స్వాధ్యాయపరులు వెడతారక్కడికి."

"వరుణుడి దగ్గరకో?"

"అగ్నిహోత్రం, యాగాలు చేసినవాళ్ళే అక్కడికి వెళ్ళగలరు."

"పోనీ ఇంద్రుడి దగ్గరకు వెడదామా?"

"శూరులు, సోమయాజులూ, నూరు సంవత్సరాలు జీవించినవాళ్ళూ వెడతారు. నేను రాను."

"ప్రజాపత్య లోకానికి వెడదాం."

"అది అశ్వమేధాలు చేసిన వాళ్ళకు స్థానం!"

"గోలోకానికి వస్తావా?"

"తీర్థాలు సేవించినవాళ్ళూ, బ్రహ్మచర్య వ్రతం చేసినవాళ్ళూ అక్కడికి వెడతారు. నేను రాలేను."

"సరే! అయితే బ్రహ్మసభలో ఇస్తాను, రా!"

"అసంగులూ, ఆధ్యాత్మ విద్య తెలిసిన వాళ్ళూ వెడతారక్కడికి. అసలు నాకా ప్రదేశం చూడటానికే సాధ్యం కాదు."

"మహానుభావా! ఇప్పటికి నీ సంగతి తెలిసింది. నువ్వు దేవేంద్రుడవు. ఏయే పుణ్య ప్రదేశాల్లో ఎవరెవరు వుంటారో దేవేంద్రుడికి తప్ప మరెవరికి తెలుసు?" అని రాజును తేరిపార చూసి ఆయన కాళ్ళమీద పడ్డాడు గౌతముడు.

"అయ్యా! ఈ ఏనుగు నీ మీద తొండం చాపుతూ, నీ కాళ్ళ దగ్గర నిలబడి గారాలు పోతూ, నీ మీద తనకుగల ప్రేమను ప్రకటిస్తోంది. దీన్ని నీనుంచి ఎందుకు

విడదీస్తాను? నేను మారురూపం ధరిస్తే దేవతలే కనుక్కోలేరు. మహానుభావుడవు కనుక నువ్వు కనుక్కున్నావు. ఈ ఏనుగూ, నువ్వూ కూడా రండి. స్వర్గంలో హాయిగా సుఖాలు అనుభవించండి'' అని రాజు నిజస్వరూపం ధరించి గౌతముణ్ణి ఆహ్వానించాడు. మహర్షి, కరిరాజు దేవేంద్రుడితోపాటు స్వర్గానికి వెళ్ళారు. ●

# తపతి

**లో**కాలన్నింటికీ వెలుగునిచ్చే సూర్యభగవానుడు విశ్వకర్మ కుమార్తె సంజ్ఞను పెళ్ళిచేసుకున్నాడు. వారికి కాళింది, యముడు అని ఇద్దరు పిల్లలు కలిగారు. రాను రాను సూర్యుడితో కలిసి బతకటం సంజ్ఞకు కష్టమైంది. ఆయన తేజస్సును ఆమె భరించలేకపోయింది. భర్తకు సేవలు చేసే బాధ్యతను తన పరిచారిక ఛాయకు అప్పగించి ఆమె తపస్సు చేసుకునేందుకు అడవులకు వెళ్ళింది.

సంజ్ఞ రూపంలో ఛాయ సూర్యుడికి చాలాకాలం సేవలు చేసింది. ఆమెకు సూర్యుడివల్ల శనీశ్వరుడు, తపతి కలిగారు.

తపతి అందాల బొమ్మ, సుగుణాల ప్రోగు. ఆమెకు యుక్తవయస్సు వచ్చేసరికి మరింత అందంగా తయారైంది. సూర్యుడు కుమార్తెకు పెళ్ళి చేయాలని నిశ్చయించుకున్నాడు. తగిన వరుడికోసం అన్వేషిస్తున్నాడు.

ఒకరోజు సంవరణుడు తపతిని చూసాడు. ఈ సంవరణుడు చంద్రవంశ రాజు ఋక్షుని కుమారుడు. పర్వత ప్రాంతాలలో పగలంతా వేటకై తిరిగి తిరిగి

అలసిపోయి సంవరణుడు కమలాలు, కల్హారాలతో నిండిన ఒక సరస్సును చేరుకున్నాడు. అక్కడ దేవకన్యలు ఆటపాటల్లో మునిగి వున్నారు. వారందరిలో తపతి మొగలిరేకుల మధ్య మెరుపుతీగలా వుంది. సంవరణుడు శిలాప్రతిమలా తపతినే చూస్తూ నిలబడిపోయాడు. చూసినకొద్దీ ఆమెపట్ల అతనికి అనురాగం అధికమయింది. ఆమె దగ్గరకు వెళ్ళి "సుందరీ! నిన్ను చూసిన క్షణంలోనే నేను నీకు దాసుడినయ్యాను. నన్ను కనికరించు" అని బతిమాలాడు. అతను అలా అంటూవుండగానే తపతి మాయమైంది. ఆమె కూడా మన్మథాకారుడైన సంవరుణుని మోహించింది. అతన్ని చూసిన క్షణం నుంచీ ఆమెకూ మనసు స్వాధీనంలో లేకుండాపోయింది.

రాజధాని ప్రతిష్ఠానగరానికి వెళ్ళిన సంవరణునికి నిద్రాహారాలు లేవు. ప్రజల మంచిచెడ్డలు పట్టించుకోవడం పూర్తిగా మానేశాడు. తపతి తప్ప మరో ధ్యాస లేదు. ఈ విషయం ఋక్షుని కులగురువైన వశిష్ఠ మహామునికి తెలిసింది.

సూర్యపుత్రి తపతి కోసం అతను తపిస్తున్నాడని మహాముని గ్రహించాడు. "నీ మనోరథం నెరవేరుస్తాను. దిగులు మానుకో" అని సంవరణుడికి చెప్పి వశిష్ఠుడు యోగబలంతో ఆదిత్య మండలానికి వెళ్ళి వేదమంత్రాలతో సూర్యభగవానుణ్ణి ప్రసన్నం చేసుకున్నాడు.

భాస్కరుడు మహర్షిని సాదరంగా ఆహ్వానించి ఆతిథ్యం యిచ్చి "మునివర్యా! మీ రాకకు కారణం ఏమిటి?" అని అడిగాడు.

"ఋక్షుడి కుమారుడు సంవరణుడు నీ కుమార్తె తపతిని చేపట్టాలను కుంటున్నాడు. అతను నిర్మల యశస్కుడు. ప్రజారంజకంగా పాలన చేస్తున్నవాడు. పెద్దలు, గురువులఎడ విశేషగౌరవం కలిగినవాడు. వేదాలను శ్రద్ధగా నేర్చుకున్నవాడు. అన్నిటికీ మించి నాకు ప్రియాతిప్రియమైన శిష్యుడు. అతనికి నీ కుమార్తెను ఇమ్మని అడగటానికి వచ్చాను" అన్నాడు వశిష్ఠ మహర్షి.

సూర్యుడు సంతోషంతో సమ్మతించి తన కుమార్తె తపతిని వశిష్ఠుడి వెంట సంవరణుడి దగ్గరకు పంపాడు. ప్రతిష్ఠానపురంలో వారిద్దరి వివాహం వశిష్ఠుడి ఆధ్వర్యంలో అతి వైభవంగా జరిగింది.

సంవరణుడు తపతిని పెళ్ళి చేసుకున్నాక రాజ్యపాలనంతా మంత్రులకు అప్పగించి నదీపర్వత ప్రాంతాలలో భార్యతో ఇష్టభోగాలు అనుభవిస్తున్నాడు.

అలా పన్నెండేళ్ళు గడిచాయి. రాజు యజ్ఞయాగాది ప్రజాహిత క్రతువులు చెయ్యకుండా విషయలోలుడై వున్నందున అతని రాజ్యంలో అనావృష్టి ప్రబలింది. తిండి, బట్ట కరువై ప్రజలు దేశాంతరం వెళ్ళవలసిన దుస్థితి కలిగింది.

అప్పుడు వశిష్ఠుడు సంవరణుని సతీసమేతంగా నగరానికి తీసుకువచ్చి పుణ్యస్నానాలు చేయించి శాంతి క్రతువులు నిర్వహింప చేశాడు. ఇంద్రుడు సంతోషించి వర్షం కురిపించాడు. దేశం మళ్ళీ సుభిక్షమైంది. సంవరణుడు అప్పటినుంచి యజ్ఞయాగాది కర్మలు చేస్తూ చాలాకాలం చక్కగా పరిపాలన చేశాడు. ఆ దంపతులకు కురు వంశానికి మూలపురుషుడైన 'కురువు' జన్మించాడు.

భూవ్యాకాశాలకు తన ప్రచండ కిరణాలతో తాపం కలుగచేసే సూర్యభగవానుడి కుమార్తె కావడం వలన కురువు తల్లికి తపతి అని పేరు వచ్చింది. తపతి వంశోద్ధారకులు కాబట్టి కురుసంతానాన్ని 'తాపత్యులు' అని కూడా అంటారు.

వింధ్య పర్వతాలకు పశ్చిమంగా ప్రవహించి ప్రజల పాపాలు పోగొట్టమని భాస్కరుడు తన కుమార్తెను దీవించాడట. తండ్రి ఆశీస్సును అనుసరించి తపతీదేవి నదీమతల్లిగా మారి నర్మదానదిలో లీనమై ప్రవహిస్తోంది.

గంగానదీ తీరాన అర్జునుడితో చెలిమి చేసిన చిత్రరథుడు అనే గంధర్వుడు పార్థుణ్ణి 'తాపత్యా' అని సంబోధిస్తాడు. కిరీటి కోరిక మేరకు తన పిలుపు వెనుక గల తపతి వృత్తాంతాన్ని వివరిస్తాడు.

చిత్రరథుడి అసలుపేరు అంగారపర్ణుడు. అడవులలో రేయింబవళ్ళు ప్రయాణం చేస్తూ ఒక అర్ధరాత్రి వేళ గంగానదిని సమీపించిన పాండవుల అడుగుల చప్పుడు విని సఖులతో క్రీడిస్తున్న అంగారపర్ణుడు కోపోద్రిక్తుడై కయ్యానికి కాలుదువ్వాడు. అర్జునుడు అతన్ని విరథుడ్ని చేసి నేలమీదకు లాగి దండించాడు. అంగారపర్ణుడు కుప్పకూలాడు. అతని భార్య కుంభీనసి వచ్చి పతిభిక్ష పెట్టమని ధర్మరాజుకు ప్రణమిల్లింది. అన్న చెప్పిన మీదట విజయుడు గంధర్వుని విడిచిపెట్టాడు. కృతజ్ఞతాసూచకంగా అంగారపర్ణుడు 'చాక్షుసి' అనే గంధర్వవిద్యను సవ్యసాచికి బోధించాడు. అర్జునుడి ఆగ్నేయాస్త్ర ప్రభావంతో దగ్ధమైన తన రథానికి మారుగా 'చిత్రరథం' అనే మరో రథాన్ని సృష్టించుకున్నాడు గనుక ఆనాటినుంచి అంగారపర్ణుడు చిత్రరథుడయ్యాడు. ●

# రురుచరిత్ర

భృగు మహర్షి కుమారుడు ప్రమతి. ప్రమతి ఘృతాచిని పెళ్ళి చేసుకున్నాడు. వాళ్ళకు రురుడు పుట్టాడు. అతను ప్రమద్వరను చేపట్టాడు. వారికి శునకుడు కలిగాడు. అతను గొప్ప తపస్సు చేసి భృగు వంశానికి యశస్సు చేకూర్చాడు. రురుడి చరిత్ర చిత్రంగా వుంటుంది.

ఒకప్పుడు మేనక విశ్వావసుడు అనే గంధర్వుణ్ణి ప్రేమించింది. ఆ ప్రేమ ఫలితంగా ఓ ఆడపిల్లను కన్నది. స్థూలకేశుడి ఆశ్రమ ప్రాంతాన నదీతీరంలో ఆ పాపను విడిచి వెళ్ళింది. స్థూలకేశుడు ఆ బిడ్డను చూసి జాలిపడి తన ఆశ్రమానికి తీసుకుపోయి అల్లారుముద్దుగా పెంచాడు. ఆశ్రమప్రాంతంలోని పిల్లలలో కెల్లా చురుకైనది కావడం వల్ల ఆమెకు ప్రమద్వర అని పేరు పెట్టారు. యుక్తవయసు వచ్చేసరికి ఆ అమ్మాయి మరింత అందంగా తయారైంది. రురుడు ఆ చక్కనిచుక్కను పెళ్ళి చేసుకోవాలనుకుని తన కోరికను తండ్రికి తెలియబరచాడు.

ప్రమతి స్థూలకేశుడి ఆశ్రమానికి వెళ్ళి తన కుమారుడి కోరికను విన్నవించాడు. స్థూలకేశుడు సంతోషించి వారిరువురి వివాహానికి శుభముహూర్తం నిర్ణయించాడు.

పెళ్ళి ముహూర్తం ఇంకా కొద్దిరోజులు వున్నదనగా ప్రమద్వర ఆశ్రమ సమీపంలో ఆటపాటల్లో వుండి పొరపాటున చెట్టుచాటున నిద్రిస్తున్న పామును తొక్కింది. ఆ పాము ప్రమద్వరను కాటు వేసింది – ఆ పిల్ల కాస్తా ప్రాణాలు విడిచింది. ఈ వార్త రురుడికి తెలిసి అమితంగా దుఃఖపడ్డాడు. ప్రేయసి ఆకస్మికంగా మృతి చెందినందువల్ల మనసు చెదిరి ఇల్లు పట్టకుండా అరణ్యాల వెంట తిరగడం మొదలుపెట్టాడు.

“నేను పుణ్యకార్యాలు చేసినవాడనైతే, సజ్జనుడనైతే, తల్లిదండ్రులనూ, గురువునూ పూజించేవాడనైతే నా ప్రమద్వర పునరుజ్జీవితురాలవుతుంది” అని గట్టిగా అనుకున్నాడు. ఇంతలో ఆకాశం నుంచి అనునయవాక్యాలు వినిపించాయి. “ఓ మునికుమారా! ప్రియురాలి కోసం ఎందుకంతగా దుఃఖిస్తావు? ప్రమద్వర జీవించాలనుకుంటే నీ ఆయుష్షులో సగం తనకివ్వు. ఆమె వెంటనే ప్రాణాలతో లేచి కూర్చుంటుంది.”

తన ఆయుర్దాయంలో సగభాగం ప్రమద్వరకు ధారపోసేందుకు రురుడు సంసిద్ధుడయ్యాడు. వెంటనే వెళ్ళి ఈ సంగతి విశ్వావసుడితో చెప్పాడు. ఆయన యమధర్మరాజు దగ్గరకు వెళ్ళి రురుడి ఆయుష్షులో సగం ప్రమద్వరకు ధారపోస్తాడనీ, కనుక దయతో మళ్ళీ తన కుమార్తెను బ్రతికించమనీ వేడుకున్నాడు.

ధర్మరాజు అంగీకరించాడు.

ప్రమద్వరకు మళ్ళీ ప్రాణం పోశాడు. తరువాత ప్రమద్వర, రురుల వివాహం జరిగింది. కాని అప్పటినుండి రురుడికి పాములంటే తగని కక్ష ఏర్పడింది. పాములు ఎక్కడ కనిపించినా చంపకుండా వదిలిపెట్టేవాడు కాదు.

ఒకసారి రురుడు అరణ్యంలో ‘డుండుభం’ అనే పామును చూసాడు. వెంటనే చంపడానికి సిద్ధమయ్యాడు. అప్పుడు డుండుభం బాధపడుతూ “నీకు నేను ఏమి అపకారం చేశానని నన్ను చంపబోతున్నావ్?” అని అడిగింది.

“నా భార్యను ఒకనాడు ఒక నాగు కాటువేసి చంపింది. అప్పటినుంచి కనిపించిన పామునల్లా చంపుతాను నేను” అన్నాడు రురుడు.

"ఎప్పుడో ఒక పాము నీ భార్యను కాటువేసిందని పాములన్నిటినీ చంపాలనుకోవడం ఏమి న్యాయం? ఇకనైనా ఈ పాములవేట విడిచిపెట్టు" అని డుండుభం అంది. మరుక్షణం అది ఒక మునిరూపం ధరించింది. రురుడు ఆశ్చర్యపోయి మునీశ్వరుడికి నమస్కారం చేశాడు.

డుండుభం క్రితం జన్మలో సహస్రపాదుడు. సహస్రపాదుడికి మిత్రుడు భాగముడు. భాగముడు బ్రాహ్మణ కుమారుడు. తపోధనుడు. ఒకనాడు భాగముడు అగ్నిగృహంలో వున్నప్పుడు సహస్రపాదుడు బాల్యచాపల్యంతో గడ్డిపరకను పాము ఆకారంగా చేసి మిత్రుడిపై పడవేశాడు. అది పామే అనుకుని భాగముడు మూర్ఛపోయాడు. కొంతసేపటికి తేరుకున్నాక "డుండుభమనే పాముగా మారిపోదువుగాక" అని స్నేహితుణ్ణి శపించాడు.

ఆ శాపానికి సహస్రపాదుడు భయపడిపోయి "తెలీక పొరపాటు పని చేశాను. నన్ను మన్నించు. నీ శాపం మరలించు" అని వేడుకున్నాడు.

అప్పుడు భాగముడు జాలితలచి "భృగుమహర్షి కుమారుడు ప్రమతికి రురుడనే వాడు పుడతాడు. అతణ్ణి చూడగానే నీ శాపం తీరిపోతుంది. మళ్ళీ అసలు రూపం వస్తుంది" అన్నాడు. ఆ విధంగానే రురుడి దర్శనంతో డుండుభానికి శాపవిముక్తి కలిగింది. ●

# బభ్రువాహనుడు

ధర్మరాజు అశ్వమేధ యాగం తలపెట్టాడు. సోదరులు మేలుజాతి గుర్రాన్ని ఎంపిక చేసి తెచ్చారు. వేదోక్త విధులన్నీ నిర్వర్తించాక ధర్మరాజు ఆ యాగాశ్వాన్ని విడిచిపెట్టాడు. గాండీవమూ, అక్షయ తూణీరమూ ధరించి సవ్యసాచి దానివెంట వెళ్ళాడు. త్రిగర్తదేశం, ప్రాగ్జ్యోతిషపురం, సింధుదేశం గడిచాక మణిపురంలోకి ప్రవేశించింది అశ్వం. తండ్రి వస్తున్నాడని తెలిసి ఎదురువెళ్ళి అతని పాదాలకు వినయంగా నమస్కరించాడు బభ్రువాహనుడు. అర్జునుడు కొడుకును ఆదరించలేదు సరికదా ఈసడించుకున్నాడు. తండ్రి నిరాదరణకు కారణం తెలియక విచారిస్తూ మౌనంగా పక్కకు తప్పుకున్నాడు బభ్రువాహనుడు.

తలవంచుకుని విచారంగా తన మందిరానికి బయలుదేరాడు. కొంచెం దూరం వెళ్ళేసరికి ఒక స్త్రీ ఎదురువచ్చి, "నాయనా! నీకు నేను తల్లినవుతానురా. నాగేంద్రకుమారిని! నా పేరు ఉలూచి. నీకు హితం చెప్పడానికి వచ్చాను. యుద్ధం రాజధర్మం. వెళ్ళి నీ తండ్రితో యుద్ధం చెయ్యి. ఆయనకు అది ప్రియమవుతుంది" అని సలహా చెప్పింది.

"తల్లీ! తండ్రితో యుద్ధం కూడదని శాంతం వహించాను. అంతేగాని పిరికితనం వల్ల కాదు. నువ్వు చెప్పినట్టే యుద్ధంచేసి నా తండ్రికి సంతోషం కలిగిస్తాను" అని బభ్రువాహనుడు ఆమెకు నమస్కరించి సర్వసాధనాలతో కూడిన రథం ఎక్కి అశ్వానికి అడ్డుపడ్డాడు. అది చూచి మెచ్చుకున్నాడు సవ్యసాచి. ఇద్దరూ పట్టుదలతో చాలాసేపు యుద్ధం చేశారు. చివరకు లిప్తపాటు కాలంలో కొడుకు వేసిన క్రూరశరం ఒకటి రొమ్ములో దిగబడేసరికి నిలువునా కూలిపోయాడు అర్జునుడు. అదే క్షణంలో తండ్రి వేసిన బాణం సోకి బభ్రువాహనుడు మూర్ఛపోయాడు.



బభ్రువాహనుడి పరిచారకులు గబగబా వెళ్ళి సంగతంతా అతని కన్నతల్లి చిత్రాంగదకు తెలియచేశారు. ఆమె ఉలూచిని వెంటబెట్టుకుని యుద్ధభూమికి వచ్చింది. రథానికి అడ్డంగా పడివున్న కొడుకును, నిర్జీవంగా వున్న భర్తను చూసి చిత్రాంగద దుఃఖవివశురాలయింది.

"అక్కా! ఎందుకు ఈ పసివాణ్ణి యుద్ధానికి ప్రోత్సహించావు? కొడుకు శౌర్యానికి బలి అయి చచ్చిపడి వున్న ఈ కురుకులవరేణ్యుణ్ణి నువ్వు బతికించకపోయావంటే నేను కూడా ఇక్కడే ప్రాయోపవేశం చేస్తాను" అంటూ పద్మాసనం వేసుకుని కూర్చుంది.

కాసేపటికి తెప్పరిల్లాడు బభ్రువాహనుడు. విగతజీవుడైన తండ్రినీ, దుఃఖిస్తూన్న తల్లినీ చూసి ఎలుగెత్తి ఏడ్చాడు. తండ్రిని చంపిన పాపానికి తానూ ప్రాయోపవేశం చేసి తనువు చాలించాలనుకుని తండ్రి పాదాల దగ్గర కూర్చున్నాడు.

ఆ తల్లీకొడుకుల్నీ, అచేతనంగా పడివున్న భర్తనూ చూసి కన్నీరు పెట్టుకుంది ఉలూచి. మృత సంజీవనీమణిని తలచుకుంది. వెంటనే ఆ మణి వచ్చి ఆమె చేతులలో పడింది.

"నాయనా! బభ్రువాహనా! విజయుడికి మరణం ఉంటుందా? నీతో యుద్ధం చేసి నీ పరాక్రమం తెలుసుకోవాలనే కోరిక నీ తండ్రికి వుంది. అది తీరడానికే ఇంత పని చెయ్యవలసి వచ్చింది. ఇదిగో ఈ మణిని తీసుకో! దీన్ని ఆయన హృదయం మీద పెట్టు" అంటూ తన చేతిలో ఉన్న మణిని కొడుక్కి ఇచ్చింది. అతడు దానిని తండ్రి హృదయానికి తాకించగానే నిద్రనుంచి మేలుకున్నట్టు లేచి కూర్చున్నాడు అర్జునుడు.

ఉలూచి భర్త పాదాలకు నమస్కరించి, "స్వామీ! శిఖండిని నెపంగా పెట్టుకుని భీష్ముణ్ణి కూల్చారు మీరు. అది పాపం! దానికి ప్రాయశ్చిత్తం చేసుకోకుండా శరీరం విడిస్తే నరకం ప్రాప్తిస్తుంది మీకు. అందుకే కావాలని మీకూ, బభ్రువాహనుడికీ యుద్ధం కల్పించాను. నన్ను మన్నించండి" అంది.

"అసలేం జరిగింది?" అని ఉలూచిని అడిగాడు అర్జునుడు.

"ఒకనాడు స్నానం చేద్దామని ఆకాశగంగకు వెళ్ళాను నేను. వసువులంతా వచ్చారు అక్కడికి. ఒక రేవులో స్నానం చేశారు. ఇంతలో గంగాదేవి ప్రత్యక్షమైంది వాళ్ళకు. 'అమ్మా చూశావా! శిఖండిని అడ్డుపెట్టుకుని భీష్ముణ్ణి కూల్చాడు అర్జునుడు! అన్యాయం కదా?' అన్నారు వసువులు. కోపించిన గంగాదేవి 'కన్నకొడుకు చేతిలోనే అర్జునుడు హతమగుగాక!' అని శపించింది. అది నేను విని పరుగున వెళ్ళి మా తండ్రికి చెప్పాను. ఆయన భయపడుతూ వచ్చి దేవిని అనేక విధాల ప్రార్థించాడు. చివరికి ఎలాగైతేనేం–ఆమె ప్రసన్నురాలయింది. అర్జునుడు తన కొడుకైన బభ్రువాహనుడి అస్త్రాల వల్ల మరణిస్తాడనీ, నాగలోకాన వున్న మృతసంజీవనిమణివల్ల పునరుజ్జీవితుడు అవుతాడనీ ఉపాయం చెప్పింది. ఈ సంగతి మా తండ్రిగారు నాకు చెప్పారు. అందుచేత ఈవేళ బభ్రువాహనుణ్ణి మీతో యుద్ధానికి పురికొల్పాను. యుద్ధసమయంలో ఇతనియందు మహాశౌర్యం ఆవహింపచేశాను. అతని వల్ల కూలిన

మీ దేహాన్ని మృతసంజీవనిమణివల్ల తిరిగి సజీవం చేశాను" అని శాపవృత్తాంతం చెప్పింది ఉలూచి.

"దేవీ! నీ వల్ల మా కులం నిలబడింది. కులవర్ధినివి నువ్వు" అని ఉలూచిని గౌరవించి, కొడుకును ఆశీర్వదించి, చిత్రాంగదను దీవించి వారందరి దగ్గరా వీడ్కోలు తీసుకుని సంతోషంగా బయలుదేరాడు అర్జునుడు. ●

# విరించి సారథ్యం

**తా**రకాసురుడి కొడుకులు విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు అనే వాళ్ళు బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చేశారు. ఆయన ప్రత్యక్షమయ్యాక, తమకు ఎన్నడూ చావు లేకుండా వరమిమ్మని కోరారు. అది అసాధ్యమన్నాడాయన. మరేదైనా వరం కోరుకొమ్మన్నాడు.

"అయితే సకల సౌకర్యాలూ కలిగి కామగమనం గల మూడు పట్టణాలు మా ముగ్గురికీ ఇవ్వు. అవి దేవదానవాదులెవరూ భేదించరానివిగా ఉండాలి. అలా అయితే మేము సుఖంగా వుంటాం" అన్నారు వాళ్ళు.

"సరే! అలాగే ఇస్తాను. కాని ఆ మూడు పట్టణాలూ ఒక్కచోటికి రాకూడదు. తీరా వచ్చాక బలవంతుడెవడైనా అది చూసి బాణం వేస్తే మాత్రం అవి నాశనమవుతాయి. అలా రాకుండా జాగ్రత్తపడండి" అన్నాడు బ్రహ్మదేవుడు.

"అలాగే" అని ఆ వరం పొందారు వాళ్ళు.

తరువాత మయుణ్ణి పిలిచి పురాలు నిర్మించవలసిందన్నారు. అతడు తన తపస్సంతా ధారపోసి, నాలుగుదిక్కులూ నూరేసి యోజనాలుండేట్టుగా ముగ్గురికీ మూడు పట్టణాలు నిర్మించాడు. ఒకటి బంగారుది, రెండవది వెండిది, మూడోది ఇనుముతో చేసినది. తారకాక్షుడికి బంగారు పట్టణం ఇచ్చాడు. అది స్వర్గంలో సంచరిస్తుంది. కమలాక్షుడికి వెండి పట్టణం ఇచ్చాడు. అది అంతరిక్షంలో తిరుగుతుంది. ఇనుపనగరును విద్యున్మాలికిచ్చాడు. అది భూమిమీద తిరుగాడుతుంది. అలా ఆ రాక్షసులు ముగ్గురూ సకల భోగాలూ అనుభవిస్తూ అంతటితో తృప్తిపడక ముల్లోకాలనూ స్వాధీనపర్చుకున్నారు. మయుడు తన మాయాజాలంతో వాళ్ళకు కావలసినవన్నీ సమకూరుస్తుండేవాడు. ఇలా చాలా ఏళ్ళు గడిచిపోయాయి. తారకాక్షుడికి 'హరి' అనే కొడుకు పుట్టాడు. అతడి కూడా బ్రహ్మదేవుణ్ణి గురించి తపస్సు చేసి, 'త్రిపురాల్లో వున్న రక్కసులు ఒకవేళ ఆయుధాల వల్ల చనిపోతే వాళ్ళను నీళ్ళలో పడేసిన వెంటనే ఒక్కడు పదిమందై అమిత బలంతో లేచి రావాలి. అలాంటి బావులు ఆ మూడు పట్టణాల్లోనూ వుండేటట్టు వరమివ్వు. వాటిలో నీళ్ళు నిరంతరం వుండాలి' అని వరమడిగాడు. బ్రహ్మ సరేనని వరమిచ్చాడు.

అంతటితో వాళ్ళ ఆగడాలు పెచ్చుమీరాయి. ముల్లోకాలనూ వేధించడం మొదలుపెట్టారు. దేవేంద్రుడు తట్టుకోలేక బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు. బ్రహ్మ పరమేశ్వర సన్నిధికి చేరాడు. అంతా విని పరమేశ్వరుడు "ఆ రాక్షసులు చాలా బలవంతులు. నా ఒక్కడిచేత చెడరు. అందుచేత నా తేజోబలాల్లో సగం తీసుకుని మీరందరూ కలిసి వాళ్ళను సంహరించండి" అన్నాడు.

"మహాత్మా! అది మా వల్ల కానిపని. నీ తేజస్సును మేము భరించలేం, అందుచేత మా అందరి తేజోబలాల్లో సగం సగం నీకే ఇస్తాం. నువ్వే ఆ శత్రువుల్ని సంహరించు" అని దేవతలు ప్రార్థించారు.

"సరే! అలాగే కానివ్వండి. నేను వాళ్ళను సంహరిస్తాను. కాని ఒక్క విషయం గుర్తుంచుకోండి. లోకాలన్నిటికీ పశుత్వం సహజం – నాకు పశుపతిత్వం కలగాలి. అలా అయితే పశువుల్ని చంపినా పాపం వుండదు. దివ్యరథం తయారుచెయ్యండి. దానికి తగిన సారథినీ, విల్లమ్ములనూ తీసుకురండి" అన్నాడు శివుడు. తమకందరికీ పశుత్వం కలగడాన్ని గురించి దేవతలు విచారిస్తుంటే వాళ్ళ మనస్సు గ్రహించి "భయపడకండి! పాశుపతవ్రతం చేస్తే పశుత్వం పోతుంది" అని అభయమిచ్చాడు శివుడు. అప్పుడు దేవతలంతా తృప్తిపడి పరమేశ్వరుణ్ణి 'పశుపతి' అని స్తుతించారు.

తమ తమ తేజోబలాలు సగం సగం ధారపోసి ఆయనకు అభిషేకం చేశారు. విశ్వకర్మ దివ్యరథం తయారు చేశాడు.

"నా రథానికి సారథి ఎవరు?" అని అడిగాడు భవుడు.

"మీ ఇష్టం" అన్నారు దేవతలు.

"అలా కాదు. నాకంటే గొప్పవాణ్ణి సారథిగా మీరే నిర్ణయించండి" అని ముక్కంటి అనగానే దేవతలూ, మునులూ బ్రహ్మదేవుడి వైపు తిరిగి సాష్టాంగ నమస్కారం చేశారు.

"శక్తి, చాతుర్యం కలిగిన సారథి రథికుణ్ణి తప్పకుండా గెలిపిస్తాడు. ఇంతగొప్ప రథానికి నీవంటి వాడు తప్ప మరొకడు సారథ్యం చెయ్యలేడు. ఇందుకు నువ్వు అంగీకరించాలి" అన్నాడు శివుడు బ్రహ్మదేవుడితో.

చేతిలో వున్న కమండలం పక్కన పెట్టి, జడముడి బిగించి, ఓంకారాన్ని ములుకోలగా చేసుకుని రథమెక్కాడు. బ్రహ్మ, శివుడు రుద్రుడై నారి సారించి, పాశుపతాస్త్రంతో సహా నారాయణాస్త్రాన్ని సంధించి ఆ మూడు పట్టణాల్నీ మనస్సులో నిలిపాడు. మరుక్షణం ఆ మూడూ ఒక్కచోటుకు చేరాయి. ఈశ్వరుడు బాణం విడవడం, ఆ మూడు పట్టణాలూ బూడిదై పశ్చిమ సముద్రంలో కలవడం కన్ను మూసి తెరిచేలోగా జరిగిపోయాయి. అప్పుడు సకల లోకాలూ సంతోషంతో మహాదేవుణ్ణి స్తుతించాయి.

మహాభారత యుద్ధంలో తనంతటివాడు కర్ణుడికి సారథిగా వుండడమేమిటని శల్యుడు భీష్మించిన సందర్భంలో యీ కథ చెబుతూ కౌరవాగ్రజుడు, "మహాత్మా! విన్నావా? లోకహితం కోరి పరమేష్ఠి అంతటివాడు శివుడికి సారథ్యం చేశాడు. అలాగే ఇప్పుడు నాకోసం నువ్వు కర్ణుడికి సారథ్యం వహించు. నా గౌరవం కాపాడు. నన్ను రక్షించు. సారథి రథికుడి కంటె గొప్పవాడు కావాలనే నీతి నీ దయవల్ల నాకు సిద్ధింపచెయ్యి" అని శల్యుణ్ణి ప్రార్థించి ఒప్పించాడు. ●

# రెంటికీ చెడిన రేవడు

**కు**రుపాండవసంగ్రామంలో ఎవరి పక్షానా చేరకుండా ఉండిపోయింది ఇద్దరే ఇద్దరు. ఒకరు బలరాముడు, మరొకరు రుక్మి. బలరాముడికి మహాజన క్షయకరమైన కురుపాండవ యుద్ధం ఇష్టం లేదు. ఈ అభిప్రాయాన్ని ఆయన కృష్ణుడి ఎదుట చాలాసార్లు వ్యక్తం చేశాడు. బంధుమిత్రులూ, క్షత్రియులూ అందరూ క్షేమంగా ఉండాలని ఆయన కోరుకున్నాడు. కాని తమ్ముడు ఏ పనిచేస్తే దానినే బలరాముడు అంగీకరిస్తాడు. తమ్ముడంటే ఆయనకు అంత ప్రేమ, అభిమానం, గౌరవం. అలా అని కౌరవులు రణభూమిలో కూలిపోవడం కూడా ఆయన సహించలేదు. అన్నదమ్ములు ఒకరినొకరు చంపుకోవాలనుకోవడం ఆయనకు బాధ కలిగించింది. అందుకే తీర్థయాత్రల పేరుతో సరస్వతీ నదీతీరానికి వెళ్ళిపోయాడు.

భీష్మక మహారాజు కుమారుడు రుక్మి మహా పరాక్రమవంతుడు. ఇంద్రుడికి ప్రాణస్నేహితుడు. ఇతన్నే హిరణ్యరోముడని కూడా పిలుస్తారు. రుక్మిణీదేవికి

స్వయంగా అన్నగారు. గంధమాదన పర్వతంమీద వున్న ద్రుముడనే కింపురుషుడి అనుగ్రహం వల్ల 'విజయం' అనే దివ్య ధనుస్సు సంపాదించాడు.

లోకంలో శ్రేష్ఠమైన దివ్య ధనుస్సులు మూడే ఉన్నాయి. దేవతల ధనుస్సులేవీ వాటితో సాటిరావు. వాటిలో ఒకటి విష్ణుమూర్తి శార్ఙ్గం అనే ధనువు. శత్రువులకు దానిపేరు చెబితేనే నిద్రాహారాలుండవు. శ్రీకృష్ణుడు దానిని ధరించాడు. మరొకటి గాండీవం. ఖాండవవనదహన సందర్భంలో అగ్నిదేవుడు అర్జునుడికీ ధనుస్సు ఇచ్చాడు. ఇక మూడవది విజయం. ద్రుముణ్ణి ఆరాధించి రుక్మి అతని దగ్గర శస్త్రాస్త్ర విద్యలు అనేకం అభ్యసించాడు. మేఘగర్జనవలె ధ్వనించే విజయ నామక చాపాన్ని అతనినుండి సంపాదించాడు రుక్మి. రుక్మిణీదేవిని వివాహం చేసుకోవడానికి శ్రీకృష్ణుడు ఆమెను రథంమీద తీసుకుపోతుంటే రుక్మి బలగర్వితుడై డాంబికాలు పలుకుతూ కృష్ణుణ్ణి ఎదిరించి నిందారోపణలు చేశాడు. తీరా కృష్ణుడు రథం నిలిపి బలాబలాలు చూసుకుందాం రమ్మని పిలిస్తే ఎదుర్కోలేక అవమానాలపాలయ్యాడు.



కురుపాండవ సంగ్రామం జరగబోతోందని తెలిసి ఒక అక్షౌహిణి సేనతో పాండవుల దగ్గరకు వెళ్ళాడు రుక్మి. పాండవులు అతన్ని సాదరంగా ఆహ్వానించి గౌరవించారు. అతిథి సత్కారాలు అందుకున్నాక రుక్మి అందరూ వింటూవుండగా

పార్థుణ్ణి పిలిచి "అర్జునా! రాబోయే సంగ్రామం గురించి బాధపడుతున్నావేమో! నేను నీకు అండగా ఉంటాను. నా అండదండల వల్ల నీకు విజయం తథ్యం. నన్ను మించిన పరాక్రమవంతుడు లేడు. పైగా నా దగ్గర తేజోమయమయిన ధనుస్సు ఉంది. దానితో ద్రోణ, భీష్మ, కృపాచార్యాది కౌరవులను క్షణాల్లో మట్టి కరిపిస్తాను. ఈ రాజ్యం నీ వశం చేస్తాను. సరేనా" అన్నాడు.

అర్జునుడు నవ్వుకున్నాడు.

కృష్ణుడూ ధర్మరాజూ వుండగా ఏమిటీ బీరాలు పలకటమని అందరూ చెవులు కొరుక్కున్నారు.

"ఓయీ! వీరాధివీరా! మాకు సాయం చేస్తానని ముందుకు వచ్చినందుకు ధన్యవాదాలు. అయితే కృష్ణుడు మాకు ఎల్లవేళలా సాయంగా ఉంటాడన్న సంగతి మాత్రం మర్చిపోకు. ఆయన సాయం వుంటే ఇంకెవరి అండదండలూ అక్కర్లేదు మాకు. పైగా నా చేతిలో గాండీవం ఉంది. సాక్షాత్తూ ఇంద్రుడే వజ్రాయుధం ధరించి వచ్చినప్పటికీ నేను భయపడను" అన్నాడు అర్జునుడు రుక్మితో.

ఆ మాటలు రుక్మికి కోపం తెప్పించాయి. వెంటనే తన సైన్యాన్ని తీసుకుని సుయోధన సార్వభౌముడి దగ్గరకు వెళ్ళాడు.

"రాబోయే కురుపాండవ యుద్ధంలో నేను మీ పక్షం ఉంటాను, మీ విజయానికి నేను తోడ్పడతాను. పాండవుల పొగరు అణుద్దాం. నా చాపంతో వాళ్ళందర్నీ స్వర్గం చేరుస్తాను. నా ప్రతాపం చూపిస్తాను" అన్నాడు.

అయితే సుయోధనుడు కూడా అభిమానం కలవాడు. అతను కూడా రుక్మి సహాయం అక్కర్లేదని మంచిగా చెప్పాడు.

రుక్మి సిగ్గుపడ్డాడు.

దుర్యోధనుడు కూడా తిరస్కరించాక వచ్చినదారినే తన నగరానికి తిరిగి వెళ్ళాడు.

**తన శక్తియుక్తుల్ని అధికంగా ఊహించుకోవడం, ఎదుటివారి తెలివితేటల్నీ, శక్తినీ తక్కువగా అంచనా వేయడం ఎవరికీ మంచిది కాదు.** రుక్మికి ఈ అలవాటు మొదటినుంచీ ఉంది.

అందుకే అనేకసార్లు పరాభవాలు పొందాడు. ●

# చేసిన పుణ్యం చెడని పదార్థం

పూర్వం ఇంద్రద్యుమ్నుడనే రాజు అనేక పుణ్యకార్యాలు చేసి, యజ్ఞయాగాలు నిర్వహించి అందరిచేత మంచివాడనిపించుకుని తనువు చాలించాక స్వర్గలోకానికి వెళ్ళాడు. ఏళ్ళు గడిచేసరికి భూలోకంలో ఆయన కీర్తి మాసిపోయి ఆ పేరుగల రాజు ఒకప్పుడుండేవాడన్న సంగతి కూడా ప్రజలకు జ్ఞప్తి లేకుండా పోయింది. అప్పుడు దేవతలు ఇంద్రద్యుమ్నుణ్ణి స్వర్గంలో వుండనీయక భూమి మీదకు తోసేశారు. ఇంద్రద్యుమ్నుడు బాధపడుతూ మార్కండేయమహర్షి దగ్గరకు వెళ్ళి "మహర్షీ! తమకు నేనెవరో తెలుసు కదా, నా పేరు ఇంద్రద్యుమ్నుడు" అన్నాడు.

మహర్షి అతన్ని తేరిపార చూసి "నాయనా! నీవెవరో నాకు తెలీదు. నీ పేరు నేనెప్పుడూ వినను కూడా వినలేదు. అయినా నేను హిమగిరివాసిని. తాపసిని. రాజులూ, వాళ్ళ చరిత్రలతో నాకు సంబంధంలేదు." అని బదులు చెప్పారు.

"మహర్షీ! మీ కంటె ముందు పుట్టి సజీవులుగా వున్న వారెవరైనా వున్నారా? ఉంటే సెలవియ్యండి. వాళ్ళ దగ్గరికి వెళ్ళి కనీసం వారికైనా నేను తెలుసేమో విచారిస్తాను" అన్నాడు ఇంద్రద్యుమ్నుడు. "మంచుకొండ మీద గూబ ఒకటి వుంది. దానిపేరు ప్రావారకర్ణుడు. అది నా కంటె చాలా ఏళ్ళు ముందు పుట్టింది. వెళ్ళి దానిని అడిగి తెలుసుకో" అన్నాడు మార్కండేయ మహర్షి.

"అప్పుడు ఇంద్రద్యుమ్నుడు అశ్వాకారం ధరించి మహర్షిని మోసుకుంటూ ప్రావారకర్ణుడున్న ప్రాంతానికి తీసుకువెళ్ళాడు.

"ఉలూకమా! నేనెవరో తెలుసుకదా" అన్నాడు రాజు తన నిజరూపం చూపి, తన కథంతా చెప్పాక. ప్రావారకర్ణుడు కాసేపు ఆలోచించి నాకు తెలీదన్నాడు.

రాజు సిగ్గుపడ్డాడు.

"నీకంటే ముందు పుట్టి చిరంజీవులుగా ఉన్నవారెవరైనా వున్నారా?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

ప్రావారకర్ణుడు కాసేపు ఆలోచించి "ఇక్కడికి దగ్గరలోనే ఒక సరస్సు వుంది. అక్కడ నాడీజంఘుడనే కొంగ వుంది. అది నాకంటే వయస్సులో పెద్దది" అని చెప్పాడు. ఇంద్రద్యుమ్నమహారాజు మార్కండేయమహర్షినీ, ప్రావారకర్ణుణ్ణి మోసుకుంటూ సరోవరం దగ్గరకు వెళ్ళి కొంగను కలుసుకుని "నీకు ఇంద్రద్యుమ్నుడు తెలుసా?" అని అడిగాడు. అది కూడా కొంతసేపు ఆలోచించి తెలీదని తల అడ్డంగా వూపింది. తనకంటె ముందు పుట్టి తనతోపాటు ఆ సరస్సులో వుంటున్న తాబేలుకు తెలుసేమో కనుక్కుంటానంది.

సరేనన్నాడు రాజు.

తాబేలుకు కబురు పంపారు. వణుక్కుంటూ ముసలి కమఠం వచ్చింది. "ఇంద్రద్యుమ్నుడు తెలుసా?" అని అడిగితే, కాసేపు ఆలోచించి, కాసేపు నవ్వుకుని, మరి కాసేపు స్మృతితప్పినదానిలా తనలో తాను ఏదో గొణుక్కుని "నేను ఆయన్ని ఎరగకపోవడమేమిటి? ఆ మహారాజు వేయియజ్ఞాలు చేశాడు. అసలీ సరస్సు పేరేమిటనుకున్నారు–ఇంద్రద్యుమ్న సరోవరం! ఆ మహానుభావుడు చేసినన్ని దానాలు మరెవరూ చేసి వుండరు. ఎన్నో గోదానాలూ, ఎన్నో భూదానాలూ, నిత్య సంతర్పణలూ జరిగేవి.

"ఆ మహనీయుడు భూసురులకు దక్షిణలుగా వేనవేల గోవులు దానం చెయ్యడం వలన ఆ గోవుల తొక్కిళ్ల చేతనే ఈ సరోవరం ఏర్పడింది" అని చెప్పి ఆ మహానుభావుణ్ణి స్మరిస్తూ నమస్కరించింది కూర్మం.

"నేనే ఆ ఇంద్రద్యుమ్నుణ్ణి" అని చెప్పి మహారాజు కూడా కమఠానికి నమస్కారం చేశాడు.

ఇంద్రద్యుమ్నుణ్ణి ప్రత్యక్షంగా చూడగలిగినందుకు తన జన్మ ధన్యమైందని సంతోషించింది ముసలి తాబేలు.

ఎన్నో వేల ఏళ్ళ తరువాత కూడా ఇంద్రద్యుమ్న మహారాజు గొప్పతనాన్నీ, ఆయన చేసిన పుణ్యకార్యాలనూ ఒకరైనా గుర్తు పెట్టుకున్నందుకు దేవతలు సంతోషించి దివినుండి భువికి పుష్పక విమానంలో వచ్చి, "మహారాజా! ఇప్పటికీ భూలోకంలో నీ కీర్తి మాసిపోనందుకు మాకు సంతోషంగా వుంది. నీవూ మాతోపాటు స్వర్గంలోనే వుండాలి. ఇది మా అందరి కోరిక" అని పలికారు.

ఇంద్రద్యుమ్నుడు కృతజ్ఞతగా చేతులు జోడించి నమస్కరించాడు.

మార్కండేయ మహర్షినీ గూబనూ కొంగనూ ఎవరి ప్రదేశాలలో వారిని విడిచిపెట్టి దేవతలు ఇంద్రద్యుమ్నుణ్ణి పుష్పక విమానంలో స్వర్గానికి తీసుకువెళ్ళారు.

కాబట్టి –

**చేసిన పుణ్యం చెడని పదార్థం. పుడమిపై కీర్తి ఎంతకాలం వుంటుందో అంతకాలం స్వర్గంలో వుంటారు మానవులు. అపఖ్యాతి వున్నంతకాలం నరకంలో వుంటారు. అందుచేత బ్రతికిన నాలుగురోజులూ పుణ్యకార్యాలు చేసి అందరి దీవెనలూ పొంది యశస్సును ఆర్జించుకోవాలి.**

పాండవులు అరణ్యవాసం చేస్తున్నప్పుడు మార్కండేయ మహర్షి ధర్మరాజుకీ కథ చెప్పి "ధర్మజా! అన్ని దానాలలో అన్నదానం ఉత్తమం. అన్నదానం చేయలేనివాడు పిడికెడు మెతుకులు పెట్టే ఇల్లు చూపించినా పుణ్యం లభిస్తుంది" అని దాన ధర్మ స్వరూపాన్ని వివరించాడు. ●

# పాశుపతాస్త్రం

దేవతల అనుగ్రహాన్ని సాధించి కొత్త శస్త్రాస్త్రాలు సంపాదించడానికి అర్జునుడు వ్యాసులవారి సలహాను అనుసరించి హిమవత్ పర్వతాలకు వెళ్ళి తపస్సు చేయాలనుకున్నాడు. అన్నదమ్ముల వద్ద సెలవు తీసుకుని, పాంచాలితో చెప్పడానికి వెళ్ళాడు. ఆమె అతణ్ణి చూసి "ధనుంజయా! మా సుఖదుఃఖాలూ, మా బ్రతుకులూ, మా అందరి మానావమానాలూ, ఐశ్వర్యసంపదలూ అన్నీ నీమీద ఆధారపడి వున్నాయి. విజయుడవై, దివ్యాస్త్రాలతో త్వరగా తిరిగిరా" అని శుభాకాంక్షలు చెప్పింది.

అస్త్రాల కోసం బయలుదేరిన అర్జునుడు ఎన్నో అడవులూ, కొండలూ దాటి చివరకు ఇంద్రకీల పర్వతం చేరుకున్నాడు. అక్కడ అతనికి ఒక వృద్ధబ్రాహ్మణుడు కనిపించాడు.

"నాయనా! విల్లూ, బాణాలూ కత్తీ కటార్లూ పెట్టుకుని వున్నావు. ఎవరు నీవు? ఇక్కడ అస్త్రాలతో పనేమీ లేదే! కోపతాపాలూ, రాగద్వేషాలూ వదిలిపెట్టి

నిర్మలంగా ముక్కు మూసుకుని తపస్సు చేసుకునే ఈ తావున ఈ క్షత్రియవేషం ఎందుకు?" అంటూ ఆ వృద్ధుడు అర్జునుడితో ఎంతో ఆప్యాయంగా మాట్లాడాడు. కొంతసేపటికి నిజరూపంతో ఎదుట నిలిచి, తాను ఇంద్రుడనని చెప్పాడు. "నా కుమారుడవైన నిన్ను చూసిపోదామని స్వర్గం నుండి వచ్చాను" అన్నాడు. అప్పుడు అర్జునుడు "నాకు దివ్యాస్త్రాలు కావాలి. అవి దయతో ఇప్పించండి" అని దేవేంద్రుణ్ణి అడిగాడు.

"కుమారా! అస్త్రాల వల్ల ఏం ప్రయోజనం? ఉత్తమలోకాలు కోరుకో ఇస్తాను" అన్నాడు ఇంద్రుడు.

"దేవరాజా! నాకు ఉత్తమలోకాలూ, భోగభాగ్యాలూ అక్కర్లేదు. నా భార్య ద్రౌపదినీ, నా అన్నదమ్ముల్నీ నట్టడవిలో విడిచిపెట్టి వచ్చాను. నాకిప్పుడు కావలసిందల్లా అస్త్రాలే" అని ఖచ్చితంగా చెప్పాడు అర్జునుడు.

''ముక్కంటిదేవరను గూర్చి తపస్సు చేస్తే ఆయన వరప్రసాదం వల్ల దివ్యాస్త్రాలు పొందగలవు. అలా చెయ్యి'' అని చెప్పి వేయికన్నుల వేల్పు మాయమైపోయాడు. ఆ తరువాత అర్జునుడు హిమవత్పర్వతానికి వెళ్ళి పరమశివుణ్ణి గురించి చాలాకాలం కఠోరమైన తపస్సు చేశాడు.

ఒకరోజు పరమేశ్వరుడు పార్వతీదేవితో సహా అర్జునుడు తపస్సు చేస్తున్న ప్రాంతానికి వేటగాడి వేషంలో వచ్చాడు. ఆ సమయంలో ఒక అడవిపంది అర్జునుడి మీదకి దూక వచ్చింది. అప్పుడు ఆ పందిమీద పినాకంతో శివుడూ, గాండీవంతో అర్జునుడూ ఒకేసారి బాణాలు వేశారు. "నీవెవరు? ఆడపిల్లతో ఈ అడవిలో ఎందుకు తిరుగుతున్నావు? నేను గురిపెట్టిన పందిని నువ్వెందుకు కొట్టావు?" అని అర్జునుడు శివుణ్ణి కోపంగా అడిగాడు.

''ఈ అడవి మాది. ఈ జంతువులు మావి. మేము తిరగక నువ్వు తిరుగుతావా? అసలు నువ్వెవరు? నువ్వెందుకొచ్చావు ఇక్కడికి? చెప్పు ముందు" అని శంకరుడు ఎదిరించి అడిగాడు.

అందుకు జవాబివ్వకుండా, "ఈ వరాహం నాది" అన్నాడు విజయుడు.

"ఈ పందిని నేను కొట్టాను. అది నీకు కావాలంటే నాతో యుద్ధం చెయ్యి" అన్నాడు ముక్కంటి.

ఆ మాటలకు అర్జునుడికి కోపం వచ్చింది. సర్రున బాణం తీసి వేశాడు. కాని అది అతడిమీద పడినట్లే పడి పస ఉడిగి కిందపడిపోయింది. అర్జునుడికి మరీ కోపం వచ్చింది. వెంట వెంటనే వందల కొద్దీ బాణాలు విడిచాడు. అన్నింటినీ పరమశివుడు ప్రసన్నవదనంతో ఎదుర్కొన్నాడు. అర్జునుడి అంబులపొదిలోని అంబులన్నీ అయిపోయాయి. అప్పుడు విల్లు తిప్పి దాని కొనతో ఆ వేటగాణ్ణి కొట్టబోయాడు. దానికి కూడా బోయ చలించలేదు. అనాయాసంగా విల్లు లాక్కుని పెద్దగా నవ్వాడు. అర్జునుడికి సిగ్గువేసింది. సరసర కత్తి దూసి యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఆ ఖడ్గం కూడా ఆదిశంకరుడి తలకు తగిలి తునా తునకలై పోయింది. తరువాత రాళ్ళూ రప్పలూ తీసుకుని తలపడ్డాడు. అవీ పిండి అయిపోయాయి. చివరకు ముష్టియుద్ధానికి దిగాడు. అందులోనూ ఓడిపోయాడు. ఇక అర్జునుడికి ఏం చెయ్యడానికీ తోచలేదు. శివుణ్ణి ధ్యానించాడు. ఆ ధ్యానంతో అతనికి జ్ఞానోదయమైంది. ఆ వేటగాడెవరో తెలిసిపోయింది. పరమశివుని పాదాలమీద పడ్డాడు. శివుడు నవ్వుతూ తాను లాక్కున్న గాండీవాన్నీ, తక్కిన ఆయుధాలనూ తిరిగి అర్జునుడికి ఇచ్చేశాడు. పాశుపతాస్త్రాన్ని ప్రసాదించి, ఇంకా అనేక వరాలను ఇచ్చి విజయుణ్ణి దీవించాడు.

ముష్టియుద్ధంలో ముక్కంటి స్పర్శ తగిలిన కారణం చేత అర్జునుడి శరీరం నూరు రెట్లు ఎక్కువ తేజస్సుతో ప్రకాశించింది. ●

# ఊర్వశి శాపం

ధర్మరాజు దివ్యాస్త్రాలు సంపాదించుకురమ్మని అర్జునుణ్ణి హిమగిరి ప్రాంతాలకు పంపాడు. అర్జునుడు దక్షిణదిశగా వెళ్ళి ఇంద్రలోక పర్వతం మీద తపస్సు చేశాడు. ఇంద్రుడు సంతోషించి కోరినన్ని వరాలు ఇచ్చాడు. అటు తరువాత యమధర్మరాజు దండాస్త్రాన్నీ, వరుణుడు పాశాన్నీ, కుబేరుడు అంతర్ధానాస్త్రాన్నీ ఇచ్చారు. అర్జునుడు ఇన్ని దివ్యాస్త్రాలు సంపాదించటం ఇంద్రుడికి నిజంగా ప్రీతి కలిగించింది. తన రథసారథి మాతలిని పిలిచి అర్జునుణ్ణి దేవలోకానికి తీసుకురావల్సిందిగా ఆజ్ఞాపించాడు.

మాతలి సరేనని వెళ్ళాడు.

మాతలి సారథ్యంలోని రథం బంగారు ఆభరణాలతో చూడముచ్చటగా వుంది. వాయువేగంతో పరుగులు తీసే గుర్రాలు ఆ రథానికి పూన్చి వున్నాయి. అవి మహాఘోషతో మేఘాలను చీల్చుకుంటూ వెళ్ళాయి.

మాతలి అర్జునుడి దగ్గరకు వెళ్ళి "అర్జునా! అమరనాథుడు నిన్ను స్వర్గానికి తీసుకురమ్మని నన్ను పంపాడు. దేవ, ముని, గంధర్వ, అప్సరసలతో కొలువుతీర్చి దేవేంద్రుడు నీ రాకకై ఎదురు చూస్తున్నాడు. కొన్నాళ్ళు అక్కడే అమర సుఖాలు అనుభవించి తిరిగి భూలోకానికి వెళ్ళవచ్చని ఇంద్రుడు నీతో చెప్పమన్నాడు" అన్నాడు.

అది విని అర్జునుడు మహదానందపడ్డాడు.

దేవరథం అధిరోహించాడు.

తక్షణం అది దివ్యపథం పట్టింది.

అమరావతీనగర మొగసాలలో ఆగింది. రథం దిగి లోపలికి నడిచాడు.

అక్కడ దేవేంద్రుడు కొలువుతీరి వున్నాడు.

సవ్యసాచి సాష్టాంగ ప్రణామం చేశాడు.

ఇంద్రుడు అర్జునుణ్ణి కౌగలించుకుని ఆప్యాయంగా శిరస్సు నిమిరాడు. నారదుడు ఆశీర్వదించాడు.

తుంబురుడు పాట పాడాడు.

అప్సరసలు నృత్యం చేశారు.

పార్థుడు అమరలోకంలో కొన్నాళ్ళుండి భూలోకంలో లేని సంగీత నృత్యగానాలూ, విలువిద్యలో మెళకువలూ తెలుసుకున్నాడు.

అర్జునుడి అందానికీ, ఠీవికీ, శక్తియుక్తులకీ దేవలోకంలోని అప్సరస్త్రీలు సమ్మోహితులయ్యారు.

పాండవ మధ్యముడికి తన ప్రేమను అర్పించాలని సౌందర్యరాశి ఊర్వశి తహతహలాడసాగింది.

అర్జునుడితో తన ప్రేమ సఫలమయ్యేట్టు చూడమని ఇంద్రుణ్ణి ప్రార్థించింది.

పార్థుడికి తన కోరిక తెలియపరచమని పరిచారిక చిత్రసేనను వేడుకుంది.

చిత్రసేన వెళ్ళి "మన్మథాకారా! అప్సరకన్య మా ఊర్వశి నిన్ను మోహించింది. నీవు లేకుండా క్షణమైనా గడపలేనంటోంది. కనుక ఆమెను చేపట్టి సుఖాలు అనుభవించు" అని అర్జునుడితో చెప్పింది.

అది విని ధనుంజయుడు చెవులు మూసుకున్నాడు. "ఆమె నాకు తల్లితో సమానం. పూజ్యురాలు. మా వంశానికి మూల పురుషుడైన పురూరవుణ్ణి ఆమె

వరించింది. కనుక ఇలాంటి చెడు ఆలోచన ఆమె మనస్సులోకి రావడం మంచిది కాదని చెప్పు" అని బదులు చెప్పాడు.

చిత్రసేన వెళ్ళి ఆసంగతి ఊర్వశితో చెప్పింది.

జగదేకసుందరి ఊర్వశి చిరుకోపం తెచ్చుకుని అందెలు ఘల్లుఘల్లున మోగుతుండగా తానే బయలుదేరి పార్థుడి మందిరానికి వెళ్ళింది.

"మేము అప్సరకాంతలం. దేవవేశ్యలం. భూలోకంలో పుణ్యకర్మలు చేసి స్వర్గానికి వచ్చిన మహనీయులను సంతోషపెట్టడం మా విధి. పూరు వంశంలో జన్మించిన ఎందరో రాజులు స్వర్గానికి వచ్చి నాతో సౌఖ్యం అనుభవించారు. కాబట్టి నీవూ సంశయించక నాతో సుఖాలు అనుభవించు" అని చెప్పింది.

"తల్లీ! నీవు చెప్పింది నిజమే కావచ్చు. పెద్దలూ మహనీయులూ ఏమి చేసినా ఒప్పే. కాని నా వంటి వాడికి అది తగని పని. ఈ అనుచితకార్యానికి నా మనస్సు అంగీకరించదు. నన్ను మన్నించు" అన్నాడు పార్థుడు.

అర్జునుడు అలా తిరస్కరించేసరికి ఊర్వశి కోపం పట్టలేకపోయింది. "పార్థా! నేను స్త్రీని. పైగా వారకాంతను. నా అంతట నేను వలచి వచ్చినందుకు నన్ను చులకన చేశావు. పరాభవించావు. కాబట్టి నిన్ను శపిస్తున్నాను. నీవు మానరహితుడవై ఆడపిల్లలకు ఆటపాటలు నేర్పుతూ, స్త్రీ, పురుష జాతికి దేనికీ చెందకుండా వుందువుగాక" అని తీవ్రంగా పలికి వెనుదిరిగి వెళ్ళిపోయింది.

ఇంద్రుడికి విషయం తెలిసింది. "నాయనా! ఊర్వశి శాపానికి భయపడకు. నీవు ఒక ఏడాది అజ్ఞాతవాసం ఎలాగో చెయ్యవలసి వుంది. ఆ సమయంలో ఇతరులు నిన్ను ఎవరూ పోల్చుకోకుండా వుండేందుకు ఈ శాపం బాగా ఉపకరిస్తుంది. అజ్ఞాతవాసం పూర్తయ్యాక నీ అసలు రూపం నీకు వస్తుంది" అని దీవించాడు.

అర్జునుడు సంతుష్టుడైనాడు. ●

# గంగావతరణం

పూర్వం ఇక్ష్వాకువంశంలో పుట్టిన సగరుడనే రాజు అయోధ్యను పరిపాలించాడు. అతనికి వైదర్భి, శైబ్య అని ఇద్దరు భార్యలు. చాలాకాలంపాటు సగరుడికి సంతానం కలగలేదు. ఆ మనోవ్యథతో ఆయన పరమశివుని గురించి ఘోరమైన తపస్సు చేశాడు. చివరికి శంకరుడు ప్రత్యక్షమై, “సగరా! నీకు నీ మొదటి భార్యయందు అరవై వేలమంది పుత్రులు పుడతారు. కానీ వాళ్ళు అచిరకాలంలోనే మరణిస్తారు. రెండవ భార్య ద్వారా మాత్రం ఒకే ఒక్క పుత్రుడు జన్మించి నీ వంశోద్ధరణకు తోడ్పడతాడు. అతని వారసులు నీ వంశాన్ని యశోమయం చేస్తారు” అని దీవించి అంతర్ధానమయ్యాడు.

కొంతకాలానికి పరమేశ్వరుడు పలికినట్లే సగరుడి రాణులిద్దరూ గర్భవతులయ్యారు. వైదర్భి కడుపున ఒక సొరకాయ పుట్టింది. మహాదేవుని మాట మనసులో వుంచుకుని సగరుడు ఆ ఫలాన్ని పగులగొట్టి అందులోని అరవైవేల

విత్తనాలను అరవైవేల నేతిపాత్రలలో భద్రం చేశాడు. ఒక్కొక్క పాత్రనుండి ఒకొక్క పుత్రుడు జన్మించాడు. ఆ తరువాత శైబ్యకు ఒక కుమారుడు కలిగాడు. ఆ పిల్లవాడు అసమంజసుడనే పేరుతో పెరగసాగాడు. వైదర్భిపుత్రులు కన్నూ మిన్నూ కానక దేవగంధర్వమహర్షులను నానాబాధలకు గురిచేయడం మొదలుపెట్టారు. ఆ బాధలు భరించలేక వారంతా వెళ్ళి బ్రహ్మ దగ్గర మొరపెట్టుకున్నారు. నగరపుత్రులు త్వరలోనే హతులవుతారని విధాత వాళ్ళకు చెప్పాడు. మరోవైపు యుక్తవయస్కుడైన అసమంజసుడు దుర్మార్గుడై పాపభీతి లేకుండా ప్రవర్తించసాగాడు. అందుకు కినిసిన మహారాజు అసమంజసునికి రాజ్య బహిష్కారం విధించాడు. అతని కుమారుడు అంశుమంతుడు తాతగారి వద్దే వుండిపోయాడు.

ఇది జరిగిన కొన్నాళ్ళకి సగరచక్రవర్తి అశ్వమేధయాగం చేశాడు. యాగంలో వదిలిన అశ్వం దేశదేశాలూ తిరిగి చివరికి ఎక్కడో నీళ్ళు లేని సముద్రంలో దాక్కుంది. దాన్ని అనుసరిస్తూ వెళ్ళిన సగరపుత్రులు మధ్యలో తోవ తప్పి గుర్రం కనిపించక బిక్కమొహాలు వేసుకుని ఇంటికి వెళ్ళారు.

"తురంగాన్ని తేకుండా ఇంటికి వస్తే వూరుకునేది లేదు" అని సగరుడు కొడుకుల్ని ఆజ్ఞాపించాడు.

వాళ్ళు మళ్ళీ బయలుదేరి వెళ్ళి అన్నిచోట్లా గాలించి ఎక్కడా గుర్రం కనబడకపోయేసరికి చివరికి నీళ్ళు లేని సముద్రాన్ని తవ్వడం ప్రారంభించారు. తవ్వగా తవ్వగా వాళ్ళకి పాతాళం కనిపించింది. అక్కడ కపిల మహాముని ఆశ్రమ ప్రాంతంలో వున్న యజ్ఞాశ్వాన్ని చూసి తమ గుర్రాన్ని ఆ మహర్షే దొంగిలించాడనుకుని ఆయనకు తపోభంగం కావించి, అనరాని మాటలు అన్నారు. అందుకు కపిలముని కోపించి ఆ అరవైవేల మంది సగర పుత్రుల్నీ ఒకే ఒక్క కంటి చూపుతో దహించివేశాడు.

సగరుడికీ విషయం తెలిసి అమితంగా దుఃఖపడ్డాడు. మనుమడు అంశుమంతుణ్ణి పిలిచి యాగాశ్వాన్ని తీసుకురమ్మని చెప్పాడు. అంశుమంతుడు చురుకైనవాడు. బుద్ధిమంతుడు. అతను తాతగారు చెప్పినట్లే గుర్రాన్ని వెతుక్కుంటూ వెళ్ళి కపిలమునికి వచ్చిన పని చెప్పాడు. ముని సంతోషించి, పక్కనే ఉన్న భస్మపురాశిని చూపుతూ, "అంశుమంతా! పవిత్ర గంగాజలాలు ఈ బూడిదని తాకిన క్షణాన నీ పెదతండ్రులకు ముక్తి లభిస్తుంది. నీ మనుమడు సురగంగను భూమి మీదకు తీసుకువస్తాడు. నువు గుర్రాన్ని తీసుకుని వెళ్ళు" అని అనుగ్రహించాడు.

అంశుమంతుడు సంతోషించాడు. గుర్రాన్ని తీసుకుని స్వరాజ్యానికి వెళ్ళి తాతగారికి జరిగిన కథంతా చెప్పాడు.

సగరుడు అమితానందంగా యాగాన్ని పూర్తిచేశాడు.

నీరులేని సముద్రాన్ని సగర పుత్రులు తవ్వడం వల్లనే దానికి 'సాగరం' అని పేరు వచ్చింది.



సగర చక్రవర్తి తరువాత అంశుమంతుడు రాజ్యపాలన చేశాడు. అనంతరం ఆయన కుమారుడు దిలీపుడు సింహాసనం అధిష్ఠించాడు. ఆయన తన పూర్వీకులకు ముక్తి కలిగించే ఉద్దేశ్యంతో గంగను భూమి మీదకు తెచ్చే ప్రయత్నం చేసి విఫలుడయ్యాడు. దిలీపుడి తరువాత ఆయన కుమారుడు భగీరథుడు పరిపాలనకు వచ్చాడు. కపిలముని నేత్రాగ్నిలో భస్మమైపోయిన తన పూర్వీకులకు ఉత్తమ గతులు కల్పించాలని దీక్ష వహించిన భగీరథుడు హిమాలయాలకు వెళ్ళి గంగను ప్రార్థిస్తూ అనేక వేల సంవత్సరాలు కఠోర తపస్సు చేశాడు. భగీరథుడి ధ్యాననిష్ఠకు గంగ

మెచ్చి ఏం కావాలో కోరుకోమంది. "కపిలుడి ఆశ్రమంలో వేలాది వత్సరాలుగా పడివున్న నా పూర్వీకులను నీ పవిత్ర జలాలతో పునీతులను చేయి తల్లీ" అంటూ అర్థించాడు భగీరథుడు.

"నాయనా! నేను స్వర్గం నుండి భూమికి దిగేటప్పుడు నా వేగాన్ని పరమశివుడు తప్ప మరొకరు భరించలేరు. కాబట్టి శివుడి అనుమతి పొందు" అని ఉపాయం చెప్పింది గంగ.

వెంటనే భగీరథుడు కైలాసాన్ని చేరి మహేశ్వరుణ్ణి అనేక విధాలుగా ప్రార్థించాడు. రుద్రుడు ప్రసన్నుడై "నేను సురగంగను నా శిరస్సున ధరిస్తాను. వెళ్ళి ఈ విషయం గంగతో చెప్పు" అన్నాడు.

భగీరథుడు గంగను ప్రార్థించాడు. ఆమె ప్రసన్నమైంది.

అప్పుడు–సకల ప్రాణికోటి దిగ్భ్రమతో నిలిచి చూడగా–కోటి మెరుపుతీగల వెలుగుతో, వేగంతో పరవళ్ళు తొక్కుతూ, సుళ్ళు తిరుగుతూ, నురగలు కక్కుతూ, జలరూపం దాల్చిన ప్రభంజనంలా గంగాభవాని దివి నుంచి దిగివచ్చింది.

ఒక్క ఉదుటున కిందకు దూకిన గంగను శివుడు తన జటాజూటంలో పట్టి నిలిపాడు. ఆ పైన భగీరథుడి ప్రార్థన మేరకు ఒక పాయను మాత్రం భూమి మీదకు వదిలాడు.

నేలను తాకిన గంగ భగీరథుణ్ణి చూసి, "మహారాజా! నీ కోరిక మన్నించి వచ్చాను. నేను ఎటు వెళ్ళాలో దారి చూపించు. ఎక్కడ నీ పెద్దలు భస్మీపటలమయ్యారో చెప్పు. ఆ భస్మపు రాశులపై ప్రవహిస్తాను" అంది. కృతజ్ఞతలతో ప్రణమిల్లి ముందుకు సాగాడు భగీరథుడు.

గంగ ఆయన రథాన్ని అనుసరిస్తూ కొన్ని లక్షల యోజనాల మేర నేలతల్లికి వంటసిరిని ప్రసాదిస్తూ పాతాళం చేరింది. అక్కడ మహర్షి ఆశ్రమ ప్రాంగణంలో పేరుకుని ఉన్న సగరపుత్రుల భస్మరాశుల మీదుగా ప్రవహించి వారికి ఉత్తమ గతులు ప్రసాదించింది.

ఆ విధంగా భగీరథుడు భూమికి తెచ్చిన గంగ 'భాగీరథి' అనే పేరుతో ప్రసిద్ధి చెందింది. ●

## పుత్రప్రేమ

కృష్ణద్వైపాయనుడు తన మందిరానికి వస్తున్నాడని తెలిసి విదురుని సాయంతో ఆ మహామునికి ఎదురువెళ్ళి సముచిత మర్యాదలతో స్వాగతం చెప్పాడు ధృతరాష్ట్రుడు. సత్కారాలు అందుకున్న తరువాత, "నాయనా! నువ్వూ, నేనూ, విదురుడూ, భీష్ముడూ బతికుండగానే ఇంత అధర్మం జరుగుతుంటే ఉపేక్షించటం న్యాయం కాదు" అన్నాడు వ్యాసభగవానుడు ధృతరాష్ట్రుడితో.

"స్వామీ! మళ్ళీ ఏం జరిగింది?" అని ధృతరాష్ట్రుడు భయపడుతూ అడిగాడు.

"పాండవులు వనవాసక్లేశాన్ని అనుభవిస్తున్న యీ సమయంలోనే దండెత్తి వెళ్ళి వాళ్ళను హతమార్చాలని కర్ణుడు నీ కొడుక్కి సలహా ఇస్తున్నాడు. పాపాత్ముడైన నీ కొడుకు అందుకు సంతోషించి సమరసన్నాహాలు చేస్తున్నాడు. వద్దని వారించాను

కానీ, వింటాడన్న నమ్మకం లేదు నాకు. నీకు చెబితే నువ్వయినా కొడుక్కి బుద్ధి చెబుతావేమోనని ఇలా వచ్చాను. రాజ్యం పోయి, అడవులలో కందమూలాలు తింటూ కాలం గడుపుతున్న పాండవులను వధించడానికి పూనుకున్నాడు నీ పుత్రరత్నం. నువ్వు కూడా అతన్ని వారించకుండా వూరుకున్నావు. అయినా యుద్ధం కోసం మీరింతగా ముచ్చటపడటం దేనికి? అన్నమాట ప్రకారం పన్నెండేళ్ళు అరణ్యవాసం, ఒక ఏడాది అజ్ఞాతవాసం పూర్తయ్యాక వాళ్ళే యుద్ధానికి సిద్ధమవుతారు. అప్పుడు చూపించమను నీ కొడుకు ప్రతాపం! వనవాసులూ, తాపసులూ నిరాయుధులు కదా! వాళ్ళమీదకు దండెత్తి వెళ్తే అవమానం తప్ప మరేం మిగలదు. ఇది ఉచితం కాదని నీ కొడుకుతో చెప్పు" అని వ్యాసభగవానుడు ధృతరాష్ట్రుణ్ణి మందలించాడు.

"మహాత్మా! దుర్యోధనుడి దుర్మార్గ ప్రవర్తన వల్ల నేనూ, గాంధారీ, విదురుడూ, ద్రోణుడూ, కృపుడూ బాధపడని క్షణం లేదు. వాడు దుర్బుద్ధి అని తెలిసి కూడా పుత్రప్రేమ వల్ల వాణ్ణి విడిచిపెట్టలేకపోతున్నాను. ఏం చెయ్యమంటారు?" అని ధృతరాష్ట్రుడు దుఃఖిస్తూ అడిగాడు.

"నాయనా! సంతానం మీద విపరీత మమకారం నీ ఒక్కడికే కాదు వున్నది– అది లోక సహజం. మానవులు తమ బిడ్డలను ప్రేమించినట్టు మరెవ్వరినీ ప్రేమించలేరు. ఎంత డబ్బున్నా బిడ్డలు లేకపోతే సంతోషం లేదు. పూర్వం సకల గోవులకూ తల్లియైన సురభి సురేంద్రుడి దగ్గరకు వెళ్ళి ఒకసారి జాలిగా ఏడ్చింది.

'అమ్మా! ఎందుకింతగా ఏడుస్తున్నావు? అందరూ క్షేమమే కదా!' అని ఇంద్రుడు విస్మితుడై అడిగాడు.

'దేవేంద్రా! త్రిభువనాలూ నీ వజ్రాయుధ రక్షణలో సుఖంగా వున్నాయి. ఒక్క నా సంతానానికి మాత్రమే కష్టం మిగిలింది' అంది సురభి గద్గద స్వరంతో.

'అదెలా సంభవం తల్లీ?' అని అమరేంద్రుడు మరింత ఆశ్చర్యంతో అడిగాడు.

'దేవరాజా! బలమైన పశువులతో బలహీనమైన పశువులను కట్టి మనుష్యులు నాగళ్ళు తోలుతున్నారు. అవి ఆ భారం మొయ్యలేకపోతే ములుకోలతో కొట్టి పొడిచి హింసిస్తున్నారు. అది చూడలేకుండా వున్నాను నేను' అని వెక్కి వెక్కి ఏడ్చింది.

'అమ్మా! నీకు వేలకొలదీ సంతానం వుంది. అన్నిటికీ ఇలాంటి దుఃఖం సంభవించలేదు! ఎందుకు ఇంతగా బాధపడతావు?' అంటూ సురపతి ఆమెను ఓదార్చబోయాడు.

'అయ్యా! నీకు తెలియని ధర్మమేముంది? **తల్లికి బిడ్డలందరూ ఒకటే. కొందరిమీద ఇష్టం, మరికొందరి మీద అయిష్టం వుండదు ఏ తల్లికీ. ఎందరు బిడ్డలున్నా అందరూ సుఖంగా వుండాలనే కోరుకుంటుంది. నిజానికి దెబ్బతిన్న వాళ్ళనూ పడినవాళ్ళనే తల్లి మరింతగా ప్రేమిస్తుంది.** బలహీనులై దీనవదనాలతో బాధపడుతున్న నా బిడ్డలను కనికరించు' అని సురభి అర్థించింది.

ఆ మాటలు విని ఇంద్రుడు నవ్వుకున్నాడు. ఆమెను చూసి జాలిపడి వర్షం కురిపించాడు. అందువల్ల భూములన్నీ గుల్లబారి తృణసంపద పెరిగింది. పుష్కలంగా పశుగ్రాసం వుండటంతో పశువులు బలిష్టమయ్యాయి.

"మహారాజా! ఈ కథ వేదాలలో వుంది. పశువులలోనే సంతానంపై అంత ఆపేక్ష వున్నప్పుడు ఇంక మనుష్యుల సంగతి వేరే చెప్పడమెందుకు? నీకున్న విచారం నాకు తెలుసు. పుత్రమోహం సామాన్యమైనది కాదు. అయినా నీ నూరుగురు కొడుకుల మీద వున్నట్టే పాండవులపైన కూడా నీకు ప్రేమ వుండాలి. నీ కుమారులూ, పాండు కుమారులూ నీకు రెండు కళ్ళతో సమానం. ఏ కంటికి నొప్పి వచ్చినా బాధే! కాదంటావా?" అన్నాడు వేదవ్యాసుడు.

"నిజమే స్వామీ" అని చేతులు జోడించాడు ధృతరాష్ట్రుడు.

"సరే, కాసేపట్లో మైత్రేయ మహాముని వచ్చి నీ కొడుక్కి ధర్మోపదేశం చేస్తాడు..." అంటూ సాగిపోయాడు కృష్ణద్వైపాయనుడు.

తరువాత కొంచెం సేపటికి మైత్రేయుడు రానే వచ్చాడు. ధృతరాష్ట్రుడు ఆ యతిని అతిభక్తితో పూజించాడు. ఇంతలో దుర్యోధనుడు తండ్రి దగ్గరకు వచ్చి మైత్రేయుణ్ణి నిర్లక్ష్యంగా చూస్తూ నిలబడ్డాడు. మైత్రేయుడికి కోపం వచ్చినా అణచుకుని "నాయనా! దుర్యోధనా! పాండవులతో వైరం మంచిదికాదు. మీరూ, వాళ్ళూ కలిసివుంటే కురువంశానికి శుభమౌతుంది. యుద్ధమంటూ వస్తే పాండవులను నువ్వు జయించలేవు. వాళ్ళు వజ్రకాయులు. మహా పరాక్రమవంతులు. భీముడొక్కడే వెయ్యి ఏనుగుల బలం కలవాడు. నువ్వు పాండవులతో స్నేహం చేసుకో. నా మాట విను" అని అనునయించాడు.

దుర్యోధనుడు ఆ మాటలకు సమాధానం ఇవ్వలేదు సరికదా, కాలి బొటనవేలితో నేలను తాటిస్తూ చేతులెత్తి తొడలు చరుచుకుంటూ వెకిలిగా నవ్వాడు. అది చూసేసరికి మైత్రేయుడికి కోపం పెచ్చుమీరింది.

వెంటనే లేచి, "నీచుడా! మునులదగ్గర ఎలా ప్రవర్తించాలో తెలియని అవివేకివి. సంగ్రామరంగంలో భీమసేనుని గదాఘాతాలవల్ల నీ తొడలు తెగిపడును గాక" అని శపించాడు.

ధృతరాష్ట్రుడు భయపడిపోయి శాపం మరల్చమని మహర్షి పాదాలు పట్టుకున్నాడు. "వీడికి సమబుద్ధి కలిగితే నా శాపం తగలదు. లేకపోతే ఫలితం అనుభవించవలసిందే" అని పలికి మైత్రేయుడు వెళ్ళిపోయాడు.

ఆ తరువాత మైత్రేయుడు అన్నంతా జరిగింది.

కురుపాండవ సంగ్రామంలో భీముడు చేసిన ఊరుభంగమే సుయోధనుడికి మృత్యుహేతువయింది.

కొడుకును మందలించి సరియైన తోవలో పెట్టుకునేందుకు గుడ్డిప్రేమ అడ్డువచ్చిన ధృతరాష్ట్రుడు అప్పుడు వగచీ ప్రయోజనం లేకపోయింది. ●

## కాకి-హంస

పూర్వం ఒకానొక ద్వీపాన్ని ధర్మవర్తి అనే రాజు పాలించేవాడు. ఆ రాజుగారి పట్టణంలో ఒక వర్తకుడుండేవాడు. చాలా మంచివాడు. గొప్ప భాగ్యవంతుడు. ఓ రోజు ఒక కాకి అతని పంచన చేరింది. అతని కొడుకులు దానికి ఎంగిలి మెతుకులు పెట్టి పెంచారు. అది బాగా బలిసి కొవ్వెక్కి ఏ పక్షులూ తనకు సరిరావని విర్రవీగుతూండేది.

ఒకనాడు సముద్రతీరంలో కొన్ని రాజహంసలు విహరిస్తున్నాయి. వాటిని కాకికి చూపించి "అన్ని పక్షుల కంటే బలమైనదానివి నువ్వు! ఆ హంసల కంటె ఎత్తు ఎగరాలి. సరేనా" అన్నారు వర్తకుని పిల్లలు.

ఎంగిళ్లు తిని బలిసిన ఆ వాయసం తారతమ్యజ్ఞానం లేక హంసల దగ్గరకు వెళ్ళి తనతో పందానికి రమ్మంది. హంసలన్నీ పకపక నవ్వాయి.

"మానస సరోవరంలో ఉంటాం. మహా బలవంతులం. హంసలతో సరియైన కాకులు లోకంలో ఉన్నట్టు ఎప్పుడైనా, ఎక్కడైనా విన్నావా?" అన్నాయి.

"నూటొక్క గతులలో పరుగెత్తడం చేతనౌను నాకు! ఒక్కొక్క రకం గమనంలో నూరు యోజనాలు వెళ్తాను. మీరెలా కావాలంటే అలా ఎగురుదాం – కావాలంటే పందెం కాద్దాం" అంది కాకి.

"ఆ గతులూ గమనాలూ మాకు తెలీదు! మామూలుగా సముద్రం మీద నిటారుగా ఎగురుదాం. మేమంతా రావటం వృథా. మాలో ఏదో ఒక హంస నీతో పోటీకి వస్తుంది" అన్నాయి మరాళాలు.

అనటమే తడవు ఒక హంస గుంపులోంచి బయటకు వచ్చింది. కాకి కూడా దాని వెనకాలే వెళ్ళింది. రెండూ సముద్రం మీదుగా ఎగరటం మొదలుపెట్టాయి. హంస నెమ్మదిగా వెళుతుంటే కాకి దానికి తన విన్యాసాలను చూపిస్తోంది. హంసను దాటిపోయి, మళ్ళీ వెనక్కి వచ్చి ఎగతాళిగా పిలవడం, ముక్కుమీద ముక్కు మోపడం, జుట్టు రేపుకుని తిరగడం, ఈకలు ఈకలతో రాయడం, నవ్వడం మొదలైన పనులన్నీ చేసింది. హంస చిరునవ్వు నవ్వి ఊరుకుంది. కాసేపటికి కాకి అలసిపోయింది. అప్పుడు పొడుగ్గా ఎగసి పడమరకు పరుగెత్తింది రాయంచ. కాకి ఇంక ఎంతమాత్రం ఎగరలేక రొప్పుతూ బిక్కమొహం వేసింది. హంసను మించలేకపోగా ప్రాణభీతితో వ్యాకులపడింది. 'అయ్యో! నా అవయవాలన్నీ వికలమైపోయాయి. కాసేపు ఎక్కడైనా ఆగుదామంటే పర్వతాలూ, చెట్లూ, లతలూ ఏవీ లేవిక్కడ. ఈ సముద్రంలో పడితే మరణమే గతి' అనుకుంటూ భయపడుతూ కళ్ళు తేలేసింది కాకి.

అది చూసి హంస "నీకు చాలా గమనాలు వచ్చన్నావే. గొప్ప గొప్ప విన్యాసాలు చేస్తానన్నావు. ఒక్కటీ చూపవేం వాయసరాజమా?" అంది.

కాకి సిగ్గుపడింది.

అప్పటికే అది సముద్రంలోకి దిగబడి పోవటానికి సిద్ధంగా వుంది. "ఎంగిళ్లు తిని కొవ్వెక్కి గర్వంతో కన్నూ మిన్నూ గానక నా కెదురెవరూ లేరనీ, ఎంతటి బలవంతుల్నయినా గెలవగలననీ అనుకునేదాన్ని. నా సామర్థ్యమేమిటో

నాకిప్పుడు తెలిసివచ్చింది. నా యందు దయచూపి నన్ను రక్షించు" అంటూ ఆర్తనాదం చేసింది కాకి. నీళ్ళలో మునిగిపోతూ "కావుమని" దీనంగా అరుస్తున్న కాకిని చూసి జాలిపడిన హంస తన కాళ్ళతో దాని శరీరాన్ని పైకి లాగింది. చావు తప్పించింది.

"ఇంకెప్పుడూ గొప్పలు పోకు" అని మందలించి దానిని తీరానికి విసరి, ఎగిరిపోయింది రాజహంస.

కాకి లెంపలేసుకుంది.

"అలాగే–వైశ్యపుత్రుల ఎంగిళ్ళు తిన్న కాకిలాగ నువ్వు కూడా కౌరవుల ఎంగిళ్ళు తిని అర్జునుణ్ణి ధిక్కరిస్తున్నావు. దీనివల్ల చేటు కలుగుతుంది సుమా!! హెచ్చులకు పోకు" అని యుద్ధభూమిలో డాంబికాలు పలుకుతున్న కర్ణుడికి హితవు చెప్పాడు శల్యుడు. ●

# మాంధాత

ఇక్ష్వాకు వంశంలో పుట్టిన యౌవనాశ్వుడికి చాలాకాలం వరకూ పిల్లలు కలగలేదు. తరణోపాయం చెప్పమని మునిపుంగవులందర్నీ పేరుపేరునా ప్రార్థించాడు. వారు 'ఇంద్రదైవత యాగం' చెయ్యమని రాజుకు సలహా ఇచ్చారు.

యౌవనాశ్వుడు సంతోషించి యాగానికి కావల్సిన సంబారాలన్నీ తెప్పించాడు. మునులు ఓ కలశం నిండా నీరు తెచ్చి ఆ ఉదకాన్ని మంత్రించి యజ్ఞశాలలో ఒకచోట భద్రంగా వుంచారు. యాగం పూర్తయ్యాక రాజపత్నుల చేత మంత్రజలాన్ని తాగించాలని సంకల్పించిన కారణంగా మహర్షులు ఆ చషకాన్ని భద్రపరిచారు.

ఒకరోజు రాత్రి రాజుగారికి విపరీతంగా దప్పిక వేసింది. ఆ సమయంలో అందరూ గాఢనిద్రలో వున్నారు. నిద్రపోతున్న వారిని లేపటమెందుకని రాజుగారు స్వయంగా మంచినీటి కోసం వెదికారు. యాగశాలలో ఓ మూల కలశం నిండా నీరు కనిపించింది. కలశం ఎత్తి చుక్క కూడా మిగల్చకుండా గటగట తాగేశారు.

మరునాడు మహర్షులు వెళ్ళి చూసేసరికి ఖాళీగా వున్న పాత్ర కనిపించింది. మహర్షులు మంత్రజలమేమైందా అని విచారించారు. అప్పుడు రాజుగారు ఆ ముందు రాత్రి దాహం వేసి కలశంలోని నీరు తానే తాగినట్టు చెప్పారు. మహర్షులు చేసేదిలేక యాగం పూర్తయిందనిపించి ఎవరి ఆశ్రమాలకు వారు తిరిగి వెళ్ళిపోయారు.

కొన్నాళ్ళకు యౌవనాశ్వుడు గర్భం ధరించాడు. పదినెలలూ గడిచాక అతని శరీరంలో వామభాగాన్ని చీల్చుకుని పసిపిల్లవాడు బయటకు వచ్చాడు. రాజుగారికి ఏం చేయాలో పాలుపోక మంత్రుల్ని సంప్రతించాడు. వారి సలహా మేరకు పుట్టిన పిల్లవాణ్ణి అడవుల్లో వదిలేశాడు. కాని వాడు అదృష్టంకొద్దీ దేవతలకు దొరికాడు. ఈ పిల్లవాడు ఏమి తాగి జీవిస్తాడని వాళ్ళల్లో వాళ్ళు తర్కించుకున్నారు. అప్పుడు ఇంద్రుడు 'మాం(నన్ను) ధాతా (తాగుతాడు)' అని చెప్పి తన చూపుడువేలు ఆ పసివాడి నోటికందించాడు. వాడు ఆ వేలి నుంచి పాలు జుర్రుకోవడం ప్రారంభించాడు. అలా పెరిగి పెద్దవాడైన ఆ పిల్లవాడికి 'మాంధాత' అని దేవతలు పేరుపెట్టారు. మాంధాత దేవతల కనుసన్నల్లో మెలుగుతూ సమస్త వేదవేదాంగాలూ, శాస్త్రాలూ, ధర్మపురాణాలూ ఆమూలాగ్రం నేర్చుకుని ముల్లోకాలకూ పూజ్యుడైనాడు.

యౌవనాశ్వుడు కన్ను మూశాక మాంధాత రాజ్యాధికారానికి వచ్చాడు. అతను అనేకమంది రాజులను ఓడించి జైత్రయాత్ర చేసి పెక్కు యజ్ఞయాగాలు నిర్వహించాడు. శశిబిందురాజు కుమార్తె బిందుమతిని వివాహం చేసుకున్నాడు. ఆయనకు పురుకుత్సుడు, ముచుకుందుడు అని ఇద్దరు పిల్లలు కలిగారు.

మాంధాత పాలనలో అన్యాయానికీ, అక్రమానికీ తావుండేది కాదు. రాజ్యం కళకళలాడుతుండేది. అలాంటిది ఒకసారి వర్షాలు లేక తీవ్ర అనావృష్టి ఏర్పడింది. రాజు దిగులుపడ్డాడు.

అడవులకు వెళ్ళి, అనావృష్టికి కారణమేమిటని మునులను ప్రశ్నించాడు. మునులు ఆలోచించి, "ఓ రాజా! అన్ని యుగాల్లోకీ కృతయుగం ఉత్తమమైనది. ఈ యుగంలో ధర్మం నాలుగు పాదాలమీద నడుస్తుంది. విజ్ఞులు మినహా మరెవరూ తపస్సు చేసేందుకు ఈ యుగంలో అర్హులు కారు. కానీ నీ దేశంలోనే ఒక సామాన్యుడు తపస్సు చేస్తున్నాడు. అందుకే మేఘాలు వర్షించడం మానేశాయి. వెంటనే నువ్వు వెళ్ళి అతన్ని శిక్షించు. అరిష్టం తొలగిపోతుంది" అన్నారు.

న్యాయస్వరూపుడు మాంధాత ససేమిరా ఒప్పుకోలేదు. నిష్కారణంగా ఎవరినీ

హింసించడానికీ, చంపడానికీ మహారాజుకైనా సరే అధికారం లేదన్నాడు. మాంధాత సమాధానానికి మహర్షులు సంతోషించి "రాజా! ప్రతిమాసం ఏకాదశి రోజున వ్రతం ప్రారంభించు. దీనిని పద్మనాభవ్రతమంటారు. ఈ వ్రతం చేయడం వలన నీ దేశం సుభిక్షమౌతుంది. సస్యశ్యామలమౌతుంది" అని సలహా ఇచ్చారు.

మహర్షులు చెప్పినట్టే మాంధాత ఆ వ్రతం చేశాడు.

మేఘాలు వర్షించాయి.

నేలతల్లి పులకించింది.

పంటసిరిని ప్రసాదించింది.

కురుక్షేత్రంలో మాంధాత చేసిన యాగాలకు లెక్కలేదని చెబుతూ రోమశుడు ధర్మరాజుకు అతని జన్మవృత్తాంతం వివరించాడు. ●

# మరుత్తుడు

యవనాశ్వుడు, భగీరథుడు, కార్తవీర్యుడు, భరతుడు, మరుత్తుడు పంచ మహాసామ్రాట్టులుగా ప్రసిద్ధి పొందారు.

మరుత్తుడు కృతయాగానికి చెందినవాడు. ధీశాలి. ఆదర్శ చక్రవర్తిగా వెయ్యేళ్ళు రాజ్యపాలన చేశాడు. ఆయన చేసిన యజ్ఞయాగాలకు లెక్కే లేదు. యజ్ఞమంటపాలన్నీ బంగారంతో చేయించాడు. ఆయన చేసిన యాగాలను చూసేందుకు దేవతలే దిగివచ్చేవారు.

మరుత్తుడు రాజ్యాధికారానికి రాగానే బ్రహ్మాండమైన ఒక యజ్ఞం తలపెట్టాడు. దానికి బోలెడంత డబ్బు అవసరమైంది. యాగ నిర్వహణకు అవసరమైన నిధులు ఎలా సమకూర్చుకోవడమా అని మరుత్తుడు సతమతమయ్యాడు. దానికితోడు యాగాన్ని భగ్నం చేసేందుకు ఇంద్రుడు కాచుకుని వున్నాడు. మరుత్తుడికి ఏం చేయాలో పాలుపోక నారదమహర్షిని సంప్రదించాడు.

"బృహస్పతి సోదరుడు సంవర్తకుడు అడవుల్లో తపోదీక్షలో వున్నాడు. నీవు కనక ఆయనను అర్థిస్తే యాగనిర్వహణకు అవసరమైన ధనాన్ని ఆయన నీకు ఇస్తాడు" అని నారదుడు సలహా ఇచ్చాడు.

మరుత్తుడు సంవర్తకుణ్ణి వెతుక్కుంటూ అడవులకు వెళ్ళాడు. సంవర్తకుడు శివుణ్ణి అర్థించమని మరుత్తుడికి సలహా ఇచ్చాడు. మరుత్తుడు కైలాసానికి వెళ్ళి పరమశివుణ్ణి ప్రార్థించాడు. శివుడు ప్రత్యక్షమై యాగ నిర్వహణకు కావల్సిన బంగారం, వస్తు వాహనాలూ ఇచ్చాడు. మరుత్తుడు అమితానందంతో తన దేశానికి తిరిగి వెళ్ళి యాగం ప్రారంభించాడు. ఆ యాగం చివరికంటా కొనసాగకుండా వుండేందుకు ఇంద్రుడు ఎన్నో ఆటంకాలు కల్పించాడు. అయితే అవేవీ ఫలించలేదు. యాగం నిర్విఘ్నంగా సాగిపోయింది. యాగానికి ఖర్చుపెట్టగా మిగిలిన సొమ్మును మరుత్తుడు హిమాలయపర్వతప్రాంతంలోని తన రాజధాని నగరంలో భద్రపరిచాడు. అప్పటినుంచి ఆయన ఐశ్వర్యవంతుడైన మహారాజుగా పేరు పొందాడు.

భారతయుద్ధం పరిసమాప్తమయ్యాక ధర్మపుత్రుడికి రాజ్యాభివృద్ధి చేసుకునేందుకూ, పట్టణాలూ, నగరాలూ నిర్మించేందుకూ, అశ్వమేథయాగం చేసేందుకూ అమితంగా సంపద అవసరమైంది. ఎవరిదగ్గరా యాగ నిర్వహణకు కావల్సినంత ధనం లేదు. కాని, అఖిలపాపాలనూ హరించే అశ్వమేథయాగం చెయ్యమని వ్యాసభగవానుడు తనని ఆజ్ఞాపించాడు. ధర్మజుడు సంకటంలో పడ్డాడు. దిక్కుతోచక మాధవుణ్ణి ప్రార్థించాడు. 'దామోదరా! నీవే గతి. మాకు తల్లీ, తండ్రీ, గురువూ, మంత్రీ, మిత్రుడూ సమస్తం నువ్వే మహాత్మా! అయినా నువ్వు మమ్మల్ని ఎప్పుడు రక్షించలేదు కనుక?! అంతా నీ దయవల్ల జరగవల్సిందే' అని మనసులోనే కృష్ణుడికి అంజలిపట్టాడు ధర్మరాజు.

వ్యాసమహర్షికి పరిస్థితి అర్థమైంది. ధర్మరాజుని దగ్గరకు పిలిచి "నాయనా! మరుత్తుడు గతంలో బ్రహ్మాండమైన యజ్ఞం చేశాడు. ఆ యాగం చూసేందుకు దేవతలూ, మునులూ వెళ్ళారు. ఆయన చేసిన దానాలు అన్నీ ఇన్నీ కావు. ఆ యాగ నిర్వహణకు అవసరమైన ధనాన్నంతటినీ పరమేశ్వరుడు సమకూర్చాడు గనుక సరిపోయింది. లేకపోతే మానవ మాత్రులవల్ల అయ్యే పనేనా? ఆ యాగ నిర్వహణకు ఖర్చు చేసింది పోను మిగిలిన సొత్తునూ బంగారాన్నీ మరుత్తుడు హిమాలయాలలో దాచివుంచాడు. మీరు వెళ్ళి అవి తీసుకురండి. అశ్వమేథయాగం నిర్విఘ్నంగా సాగుతుంది. మీరొచ్చేలోగా నేనూ, యాజ్ఞవల్క్యుడూ యాగానికి కావల్సిన పనులన్నీ

జరిపిస్తాం. కావల్సిన సంబారాలన్నీ తెప్పిస్తాం" అన్నాడు మహర్షి వుపాయం చెబుతూ.

పాండవులు సంతోషించి హిమాలయాలవైపు కదిలి వెళ్ళారు. ఆ ధనరాసులతోనే అజాతశత్రుడు అశ్వమేధయాగం నిర్వహించాడు. ఆ డబ్బుతోనే బంగారు యజ్ఞశాలలూ, వేదికలూ, యూపస్తంభాలూ, తోరణాలూ, వివిధపాత్రలూ చేయించి దానం చేశాడు ధర్మరాజు. ●

# నలదమయంతులు

**పాం**డవులు అరణ్యవాసం చేస్తున్నప్పుడు కిరీటి అన్నగారి అనుమతితో దివ్యాస్త్రాల కోసమని కైలాసం వెళ్ళాడు. నలుగురు అన్నదమ్ములూ అర్జునుడి కోసం ఎదురుచూస్తూ దిగులుగా దుర్భరంగా కాలం గడిపారు. ఆ సమయంలో బృహదశ్వుడనే మహర్షి పాండవుల దగ్గరకు వచ్చాడు. యుధిష్ఠిరుడు ఆయనకు అర్ఘ్యపాద్యాలతో స్వాగతం పలికి "మునీశ్వరా! నావలె కష్టాలు పడిన రాజులు ఇంతకుముందు ఎవరైనా వున్నారా?" అని అడిగాడు. అందుకు బదులుగా బృహదశ్వుడు నిషధాధిపతి నలుడి కథ చెప్పాడు.

నిషధ దేశపు రాజకుమారుడు నలుడు. బహు చక్కనివాడు. అశ్వశాస్త్రం బాగా తెలిసినవాడు. విలువిద్యలో మేటి. ఆడినమాట తప్పనివాడు. ఔదార్యం విషయంలో సరేసరి. మనసు వెన్నపూస.

ఆ కాలంలోనే విదర్భ దేశాన్ని భీమరాజు పరిపాలిస్తుండేవాడు. అతనికి సంతానం లేదు. బిడ్డలకోసం ఆయన చెయ్యని పూజ లేదు. ఒకరోజు దమనుడనే

మహర్షి ఆయన కొలువుకు వచ్చాడు. భీమరాజు, ఆయన భార్యా ఆ మునికి ఘనంగా స్వాగతం చెప్పి సకలోపచారాలూ చేశారు. ముని సంతోషించి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె కలిగేటట్టు ఆ దంపతుల్ని దీవించాడు. దమన మహర్షి వరం వల్ల కలిగిన సంతానం కాబట్టి–మగపిల్లలకు దమ, దాంత, దమన అనీ, ఆడపిల్లకు దమయంతి అని పేరు పెట్టారు. దమయంతి చాలా చక్కనిది. గుణవతి. శీలవతి.

దమయంతి నిషధ దేశపు రాజు వీరసేనుడి కుమారుడు నలుణ్ణి గురించీ, అతని రూపం గురించీ, ధైర్యసాహసాల గురించీ విని అతనిమీద ప్రేమ పెంచుకుంది. అలాగే నలుడు కూడా దమయంతి అందచందాల గురించి విని తప్పనిసరిగా ఆమెనే పరిణయమాడాలనుకున్నాడు. ఒకరోజు నలుడు ఉద్యానవనంలో విహరిస్తుండగా ఆకాశమార్గాన వెళ్తున్న బంగారుహంసలు కొన్ని కిందకు దిగి నేలమీద వాలాయి. నలుడు వాటిలో ఒక రాజహంసను పట్టుకున్నాడు. మిగిలినవి భయపడి పైకి ఎగిరిపోయాయి. పట్టుబడిన రాజహంస వణికిపోతూ "మహారాజా! నేను చిన్న ప్రాణిని. నా తల్లికి నేను ఒకే పిల్లను. నా తల్లిదండ్రులకు ఆహారం వెతుకుతూ ఇక్కడికి వచ్చాను. నన్ను చంపకుండా విడిచిపెట్టు. ప్రత్యుపకారంగా నేను నీ ప్రేయసి దమయంతి దగ్గరకు వెళ్ళి నీ గురించి గొప్పగా చెప్తాను. నిన్నే వరించేట్టు చేస్తాను" అంది.

నలుడు సంతోషించి మరాళాన్ని విడిచిపెట్టాడు. అది విదర్భపురం వెళ్ళి దమయంతి ముందు వాలింది. దమయంతి ఆ రాయంచను చేతుల్లోకి తీసుకుంది. "రాకుమారీ! నేను నలమహారాజుని చూసి వస్తున్నాను. ధైర్య సాహసాలూ, రూపరేఖావిలాసాలూ, సద్గుణసంపత్తిలో ఆయనకు సాటివచ్చే రాజుంటాడని నేను అనుకోను. నువ్వు అతన్ని వివాహమాడు. మీ జంట చూడముచ్చటగా వుంటుంది. మీ దాంపత్యం అన్యోన్యంగా వుంటుంది" అని సలహా చెప్పింది. రాయంచ మాటలకు రాకుమారి పొంగిపోయింది.

"నలమహారాజు గురించి నాకు చెప్పినట్టే నాగురించీ నాలుగు మంచిమాటలు ఆ ప్రభువుకు చెప్పి నాపై మరులుగొనేటట్టు చెయ్యి" అని బ్రతిమాలి హంసను హృదయానికి హత్తుకుని గాలిలోకి ఎగరేసింది. హంస రివ్వున వెళ్ళిపోయింది. నిషధదేశం చేరుకుంది. నలుణ్ణి కలుసుకుంది. పూసగుచ్చినట్టు జరిగిన కథంతా చెప్పింది. ఆ విధంగా నలదమయంతులు ఒకరి పట్ల ఒకరు ప్రేమనూ, మోహాన్నీ పెంచుకునేటట్టు చేసింది రాయంచ. దమయంతి నలుణ్ణి మనస్సులో నిలుపుకుని

అనుక్షణం అతని ధ్యాసలోనే గడుపుతోంది. వరధ్యానంలో చిక్కిసగమైంది. భీమరాజుకీ సంగతి తెలిసింది. కూతుర్ని సముదాయించి స్వయంవరానికి చాటింపు వేయించాడు. దమయంతి స్వయంవరానికి ఎక్కడెక్కడి రాజులే కాకుండా దిక్పాలకులు కూడా విదర్భకు వచ్చారు.

ఇంద్రుడు, అగ్ని, వరుణుడు, యముడు కూడా స్వయంవరంలో పాల్గొనేందుకు భూలోకానికి వెళ్ళారు. మార్గమధ్యంలో వాళ్ళు నలమహారాజును చూచారు. ఆపి మాటలు కలిపారు. "నిషధేశ్వరా! నువ్వు మాకు దూతగా వుండి ఒక కార్యం సాధించిపెట్టాలి" అన్నాడు ఇంద్రుడు.

చేయవలసిన పనేమిటో చెప్పమన్నాడు నలుడు.

"మా నలుగురికీ దమయంతిపై మనసుంది. మాలో ఎవరో ఒకరిని ఆమె వరించేటట్టు నువ్వు చెయ్యాలి" అన్నాడు ఇంద్రుడు. నలుడు ఇంద్రాది దిక్పాలకులకు నమస్కరించి–

"సురవరులారా! నేనూ స్వయంవరానికే వెళుతున్నాను. అలాంటప్పుడు నన్నీ కార్యానికి మీరు నియోగించడం ఉచితం కాదు" అన్నాడు.

"నిషధ రాజా! నువ్వు గుణవంతుడవనీ, సత్యసంధుడవనీ తెలిసి మా అభిమతం తీర్చమని కోరాం. నువ్వు మాత్రమే ఈ పని సాధించగలవు. మా మాట కాదనకు" అని దేవతలు బలవంతపెట్టారు.

నలుడు మెత్తబడ్డాడు.

అదృశ్యరూపుడై దమయంతి మందిరానికి వెళ్ళగలిగేటట్టుగా దేవతలు అతనికి వరం అనుగ్రహించారు. దేవతల వరప్రభావం వల్ల నలుడు ఎవరికంటా పడకుండా అంతఃపురంలోకి ప్రవేశించి దమయంతి ఎదుట నిలిచాడు. ఆమె సౌందర్యానికి ముగ్ధుడయ్యాడు. తన ఎదుట నిలబడిన మన్మథాకారుణ్ణి చూసి ఎవరూ రావడానికి అలవికాని ఈ రాజప్రాసాదంలోకి ఇతడెలా వచ్చాడా అనుకుంటూ దిగ్గున లేచి నిలబడింది దమయంతి. అతని అందం, ఠీవి, తేజస్సు, ధైర్యసాహసాలు ఆమెను అబ్బురపరిచాయి. ఆలోచనల్లోంచి తేరుకుని "అయ్యా! మీరెవరు? కట్టుదిట్టమైన ఈ రక్షణవలయాన్ని ఛేదించుకుని మీరెలా లోపలికి రాగలిగారు?" అని అడిగింది.

నలుడు మందహాసం చేస్తూ "సుందరీ! నేను నిషధాధిపతిని. నన్ను నలుడంటారు. దేవదూతగా ఇప్పుడు నేను నీ ముందుకొచ్చాను. ఇంద్రాగ్ని యమ

వరుణులు నీ స్వయంవరానికి వస్తున్నారు. వారికి నీమీద మనసుంది. వారిలో ఎవరో ఒకరిని భర్తగా స్వీకరించు. సురవరుల మహిమ వల్లనే అదృశ్యరూపంలో నీ దగ్గరకు రాగలిగాను" అని వచ్చిన పని చెప్పాడు.

దమయంతి నలుణ్ణి తదేకంగా చూస్తూ "స్వామీ! నేను సామాన్య స్త్రీని. ఇంద్రాది దేవతలతో నాకు పొత్తేమిటి? అయినా నా మనస్సు ఎప్పటినుంచో మీమీదే లగ్నమై వుంది. మిమ్మల్నే గాఢంగా ప్రేమించాను ప్రభూ! మిమ్మల్ని రప్పించేందుకే ఈ స్వయంవరం ఏర్పాటు చేసింది కూడా! నన్ను మీ సతిగా స్వీకరించి ధన్యురాలిని చేయండి" అని వేడుకుంది.

"కోమలీ! దేవతల అనుగ్రహం పొంది మహదైశ్వర్యాలు అనుభవించు. నాబోటి సామాన్యుణ్ణి వరించి నువ్వు పొందే అమర సుఖాలేమిటి?" అని వారించాడు.

దమయంతి వినలేదు. "రాజేంద్రా! ఇంద్రాది దేవతలను స్వయంవరానికి రానివ్వండి. అభ్యంతరం లేదు. వారి సమక్షంలోనే మిమ్మల్ని పతిగా స్వీకరిస్తాను. అలా చేయడం వల్ల దేవతలకు మీ మీద ఆగ్రహం వుండదు. మీరు దూతకృత్యం కావించి దేవతల కార్యం నిర్వర్తించిన వారూ అవుతారు. నేను దేవతలను కాదని మిమ్మల్ని వరించడం నా తప్పే కాని మీ తప్పు కాబోదు" అని ఉపాయం చెప్పింది దమయంతి.

నలుడు సంతోషించి వెళ్ళిపోయాడు. జరిగిన కథంతా దేవతలకు చెప్పాడు.

స్వయంవరం జరిగే రోజు వచ్చింది. రాజులూ, శూరులూ, వీరులూ, మన్మథకారులూ ఎందరెందరో వచ్చారు. సభాభవనమంతా కిక్కిరిసి పోయింది. అపర రతీదేవిలా దమయంతి సభలో ప్రవేశించి ఒక్కసారి కలయచూసింది. ఒకచోట ఐదుగురు నల మహారాజులు కనిపించారు ఆమెకు. అసలు నలుడికి తోడు ఇంద్రుడూ, అగ్నీ, వరుణుడూ, యముడూ కూడా నలమహారాజు రూపం ధరించారు. వారిలో తను ప్రేమించిన అసలు నలుడెవరో తెలుసుకోవడం ఎలా?

దమయంతి మనసు వ్యాకులపడింది. మనసులోనే దేవతలను శరణు వేడింది. "దేవ ప్రముఖులారా! మీరు మహనీయులు. పూజ్యులు. నా ప్రార్థన వినండి. నేను నిషధాధిపతి నలుణ్ణి మనసారా ప్రేమించాను. అతణ్ణే భర్తగా స్వీకరిస్తాను. అతన్ని తప్ప ఇతరులను వరించలేను. నన్ను కరుణించి నా నలుడెవరో నాకు తెలియచేయండి. మిమ్మల్ని అర్థిస్తున్నాను" అని ప్రార్థించింది.

దేవతలు ఆమె మొర ఆలకించి తమ అసలు రూపాలు ధరించారు. వెంటనే దమయంతి నలుణ్ణి గుర్తించి అతని మెడలో పూలమాల వేసింది. మంగళ వాయిద్యాలు మోగాయి. నల దమయంతుల వివాహం అతి వైభవంగా జరిగింది. ఇంద్రాగ్నియమవరుణులు వరాలు ఇచ్చారు నలుడికి.



"రాజా! నీవు చేసే యాగాలలో స్వయంగా నేను హవిర్భావం గ్రహిస్తాను. నీకు ఉత్తమ గతులు ప్రసాదిస్తాను" అన్నాడు ఇంద్రుడు.

"నీవు ఎప్పుడు ఎక్కడ తలుచుకుంటే అక్కడ ప్రత్యక్షమవుతాను. దివ్యలోకాలు అనుగ్రహిస్తున్నాను" అన్నాడు అగ్ని.

"నీకు ఆహారం పుష్కలంగా లభిస్తుంది. నీవు సదా ధర్మప్రవర్తనుడవై సంచరిస్తావు" అన్నాడు యముడు.

"నీకు దివ్య పుష్పమాల్యాలు ప్రసాదిస్తున్నాను. నీకు జలసమృద్ధి వుంటుంది" అన్నాడు వరుణుడు.

ఆ విధంగా వరాలిచ్చి దేవతలు తమ లోకాలకు వెళ్ళిపోయారు.

దమయంతికీ నల మహారాజుకీ వివాహం జరిగిందన్న సంగతి తెలియక కలి, ద్వాపరలు ఇద్దరూ విదర్భ దేశానికి బయలుదేరారు. మధ్యలో లోకపాలకులు కలిసి దమయంతీస్వయంవరం అయిపోయిందని చెప్పారు. కలి, ద్వాపరులకు కోపం వచ్చింది. కళ్ళెర్ర చేస్తూ "నలుడికి రాజ్యభ్రష్టత్వం కలిగిస్తాం. దమయంతికి పతీవియోగం కల్పిస్తాం. ఇద్దర్నీ ఘోరారణ్యాలపాలు చేస్తాం" అని తీవ్రంగా పలికారు.

ఇద్దరూ నిషధ దేశం వెళ్ళారు. కాని నలుడిలో ప్రవేశించడానికి కలికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కాలేదు. నలుడు ధర్మాత్ముడు, పుణ్యశ్లోకుడు, సత్యసంధుడు, తీవ్ర తపోమహిమ కలవాడు కనుక అతను అంత తేలిగ్గా కలి పన్నిన వలకు చిక్కలేదు. నిరంతరం పరోపకారచింతనలో కాలం గడుపుతూ, సత్కారాలు చేస్తూవుండే నలమహారాజును తన వశం చేసుకోవడమెలాగా అని కలి ఆలోచనలో పడ్డాడు.

పన్నెండేళ్ళు గడిచాయి. విధి వశాత్తూ నల మహారాజు ఒకనాడు పాదప్రక్షాళనం చేసుకోకుండా ఆచమనం చేసి సంధ్యావందనం చేశాడు. అదే అదననుకుని కలి నలుడిలో ప్రవేశించాడు. తరువాత కలి ప్రేరణతో నలమహారాజు చెడు మార్గాలు తొక్కాడు. తన తమ్ముడు పుష్కరుడి దగ్గరకు వెళ్ళి జూదానికి రమ్మని వత్తిడి చేశాడు. జూదం అనర్థాలకు మూలమని తెలిసి కూడా కలి ఆవహించడం వల్ల బుద్ధిహీనుడై పాచికలాడి ఒక్కొక్క సంపదనూ పోగొట్టుకున్నాడు. మంత్రులూ, హితులూ ఎంత వారించినా వినలేదు. దమయంతి బతిమాలినా లక్ష్యపెట్టలేదు. తమకు కానికాలం దాపురించిందని దమయంతి గ్రహించి రథసారథి వార్ష్ణేయుణ్ణి పిలిచి కుమారుడు ఇంద్రసేనుణ్ణి, కుమార్తె ఇంద్రసేనను విదర్భలో విడిచి రమ్మంది. వార్ష్ణేయుడు నలుడికి పట్టిన దుర్దశకు బాధపడుతూ పిల్లల్ని తాతగారికి అప్పగించాడు. తాను అయోధ్య వెళ్ళి అక్కడ ఋతుపర్ణుడి దగ్గర సారథిగా కుదిరాడు.

నలుడు రాజ్యవిహీనుడై చివరకు నిషధ దేశాన్ని వదిలి అరణ్యాలకు బయలుదేరాడు. దమయంతి అతన్ని అనుసరించింది. పళ్ళు, కందమూలాలు తింటూ కొన్నాళ్ళు గడిపారు. ఒకరోజు కొన్ని పక్షులు చేతికి అందేటంత దూరంలో మేత ఏరుకుంటూ కనిపించాయి నలుడికి. వాటిని పట్టుకుందామనుకున్నాడు. ఒంటిమీద వున్న ఒకే ఒక వస్త్రాన్ని తీసి వాటిమీద వలలా విసిరాడు. అవి ఆ వస్త్రాన్ని కూడా తీసుకుపోయాయి. నలుడు జూదమాడేందుకు ప్రయోగించిన పాచికలే ఆ పక్షులు. కలి ప్రేరణ వలన ఇప్పుడవి పక్షుల రూపంలో వచ్చి కట్టుబట్టను కూడా తన్నుకుపోయాయి.

సిగ్గిల్లి నిలిచిన నలుడి దురవస్థకు కృంగిపోతూ దమయంతి తన చీర కొంత చింపి అతనికి ఇచ్చింది. ఆ ముక్కనే ఒంటికి చుట్టుకున్న నలుడు "దేవీ! ఈ ఫల వృక్షాల వెంట వెళ్తే అవంతీ దేశం చేరుకుంటావు. అది వింధ్య పర్వతం. ఆ తరువాత మున్యాశ్రమాలున్నాయి. అది విదర్భకు చేరే మార్గం. ఇటుగా వెళితే కోసల వస్తుంది" అని దమయంతికి చెప్పాడు. నలుడి మనస్సులో మాట దమయంతికి అర్థమైంది. "స్వామీ! మిమ్మల్ని వదిలి నేను ఏ దేశమూ వెళ్ళను. కష్టకాలంలో భార్యాబిడ్డలే ఎవరికైనా చిత్తశాంతి కలిగిస్తారు. విదర్భకు వెళదామంటే రండి. ఇద్దరం కలిసే వెళదాం. లేదా ఇక్కడ ఇలాగే కాలం గడుపుదాం. అంతేకాని నన్ను మాత్రం దూరం చేయకండి" అని కన్నీళ్ళతో ప్రార్థించింది దమయంతి.

మారు మాట్లాడలేదు నలుడు. అలసిపోయి ఒకచోట పాడుబడిన మంటపం కనిపిస్తే అక్కడ విశ్రమించాడు. దమయంతి గాఢనిద్రలోకి జారుకుంది. నలుడికి నిద్ర పట్టలేదు. 'అయ్యో! నా మూలంగా ఈ కుసుమ కోమలి కష్టాలు అనుభవించవలసి వచ్చిందే! నేనెంత దుర్మార్గుణ్ణి! ఈమెను ఇక్కడే విడిచిపెట్టి వెళితే మంచిదేమో! నాకోసం వెతికి వెతికి పుట్టింటికి వెళ్తుంది. అక్కడైనా సుఖంగా వుంటుంది' అని మనస్సులో మథనపడి ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆమెను వదిలి కొంతదూరం వెళ్ళాడు. మళ్ళీ మనసు రాక వెనక్కి వచ్చాడు. కొంత కాలయాపన చేసి చివరకు గుండె రాయి చేసుకుని వెళ్ళిపోయాడు.

కాసేపటికి దమయంతికి మెళకువ వచ్చింది. నలుడు కనిపించలేదు. దుఃఖంతో వణికిపోయింది. అమితవేదనను అనుభవిస్తూ భర్తను వెతుక్కుంటూ ఘోరారణ్యంలో నడవలేక నడుస్తోంది దమయంతి. అప్పుడొక పెద్ద కొండచిలువ ఆమెను పట్టుకుంది. ఆమె ఆర్తనాదాలు చేస్తూ "స్వామీ! ఇప్పుడైనా వచ్చి నన్ను కాపాడండి" అని బిగ్గరగా వేడుకుంది. అది ఒక కిరాతకుడు విన్నాడు. వెంటనే వెళ్ళి చురకత్తితో కొండచిలువను హతమార్చాడు. తరువాత ఆ బోయవాడు దమయంతి సౌందర్యానికి కన్ను చెదరి బలాత్కరించబోయి ఆమె శాపాగ్నికి నిలువునా కాలి బూడిదయ్యాడు.

దమయంతి ఏడుస్తూ కనిపించిన చెట్టునూ, పుట్టనూ, మృగాలనూ, పర్వతాలనూ, నదులనూ తన భర్త జాడ చెప్పమని ప్రార్థించింది. అలా వెళ్ళి వెళ్ళి ఉత్తరదిక్కున వున్న ఒక మున్యాశ్రమం చేరుకుంది. ఆశ్రమంలోని మహర్షులు దమయంతిని ఓదార్చి "తల్లీ! నీ కష్టాలు గట్టెక్కుతాయి. సర్వశుభాలూ చేకూరుతాయి.

నీ భర్తను కలుసుకుంటావు. దుఃఖించకు" అని ఆశీర్వదించారు.

దమయంతి మహర్షులకు నమస్కరించి భర్తను అన్వేషిస్తూ మళ్ళీ బయలుదేరింది.

దారిలో ఆమెకు కొందరు వర్తకులు కనిపించారు. వారివెంట ఏనుగులూ, గుఱ్ఱాలూ, రథాలూ వున్నాయి. ఒంటిమీద మురికిపీలిక ఒకటి వేలాడుతుంటే వెఱ్ఱిచూపులు చూస్తూ, ఆకలితో నకనక లాడుతూ చిక్కి శల్యమై, ముంగురులూ, కేశపాశం చెదిరిపోయి, అడవిలో చచ్చులూ, పుచ్చులూ ఏరుకుంటూ దయ్యమో భూతమో అన్నట్టు వున్న దమయంతిని చూసి వర్తకులు మొదట భయపడ్డారు. తరువాత వాళ్ళలో వొకడు సాహసించి "తల్లీ నీవెవరు? ఎందుకీ కారడివిలో వొంటరిగా తిరుగుతున్నావు?" అని అడిగాడు.

దమయంతి దుఃఖపడుతూ తన దీనగాథ చెప్పింది.

వర్తకులు జాలిపడి ఆమెను అడవి నుంచి తప్పించి చేది దేశపు పొలిమేర వరకు తోడుగా వచ్చి వెళ్ళారు.

ఆమెను చూసి ప్రజలు మతి చెడిందనుకున్నారు. పిల్లలు గేలి చేస్తూ ఆమె వెంటపడ్డారు. ఇదంతా ఆ దేశపు మహారాణికి తెలిసింది. వెంటనే ఆమెను తీసుకురమ్మని దాసీజనాన్ని పురమాయించింది. వారు దమయంతిని మహారాణి దగ్గరకు తీసుకువెళ్ళారు. ఉన్మాదిలా కనిపిస్తున్నా, ఆమెను చూడగానే సామాన్య స్త్రీ కాదని రాణి గ్రహించింది. దమయంతి తన భర్త పేరు, ఆయన వివరాలు తప్ప మిగిలిన కథంతా చెప్పింది. రాణికి జాలి వేసింది. "కష్టాలు కలకాలం వుండవు. అధైర్యపడకు. సేవకులను పంపి నీ భర్తను వెతికిస్తాను. అతని ఆచూకీ తెలిసేవరకు నువ్వు నాతోనే వుండొచ్చు" అంది.

అందుకు దమయంతి "తల్లీ! నీ ఔదార్యానికి కృతజ్ఞతలు. అయితే నాకు కొన్ని నియమాలున్నాయి. నేను ఉచ్ఛిష్టం భుజించను. పరుల పాదాలు కడుగను. పరపురుషులతో మాట్లాడను. నన్నెవరైనా చెడు దృష్టితో చూసినా, కామించినా, అసభ్యంగా మాట్లాడినా వాళ్ళు సజీవులై వుండడానికి వీల్లేదు. నా భర్తను అన్వేషించేందుకు వెళ్ళేవారితో మాత్రమే అవసరం మేరకు నేను మాట్లాడతాను. ఇందుకు మీరు సమ్మతించాలి" అంది.

మహారాణి ఆ నియమాలన్నిటికీ ఒప్పుకుని ఆమెను తన కూతురు సునంద దగ్గర సైరంధ్రిగా నియమించింది. దమయంతికి రోజులు యుగాల్లా గడుస్తున్నాయి.

అడవిలో భార్యను ఒంటరిగా విడిచివెళ్ళిన నలుడు అరణ్యాలలో తిరుగుతుండగా ఒకచోట భయానకమైన కార్చిచ్చు కనిపించింది. ఆ చిచ్చులో నుంచి ఎవరో అరుస్తూ ఆర్తనాదాలు చేస్తూ నలుణ్ణి పేరుపెట్టి పిలిచారు. నలుడు సాహసించి ఆ మంటల దగ్గరకు వెళ్ళేసరికి అగ్నిజ్వాలల మధ్య కాలసర్పం కర్కోటకుడు కుతకుతలాడిపోతున్నాడు.

"నల మహారాజా! నారద మహర్షి ఇచ్చిన శాపంవల్ల నాకీ దుస్థితి సంభవించింది. కదలలేక పడి వుండమని ఆ మహర్షి నన్ను తీవ్రంగా శపించాడు. ఇప్పుడీ కార్చిచ్చు నన్ను చుట్టుముట్టింది. నువ్వు నన్ను ఇక్కడినుంచి మరెక్కడికైనా తీసుకువెళ్తే నాకు శాప విమోచనం కలుగుతుంది. త్వరగా నన్ను రక్షించు. నువ్వీ మేలు చేస్తే నీకు శుభం కలుగచేస్తాను" అని ప్రాధేయపడ్డాడు కర్కోటకుడు. నలుడు సరేనని మంటల మధ్యనున్న నాగరాజును పట్టుకోగానే అది బరువు తగ్గిపోయి చాలా తేలికైంది. దాన్ని తీసుకువెళ్ళి నలుడు ఒక జలాశయంలో విడిచి పెట్టబోతుంటే, "రాజా! లెక్కపెట్టుకుంటూ ఇక్కడనుంచి సరిగ్గా పది అడుగులు ముందుకు వెళ్ళు. నీకు మంచి జరుగుతుంది" అన్నాడు కర్కోటకుడు.

'ఏకం, ద్వే, త్రీణి' అనుకుంటూ చివరకి 'దశ' అనగానే కర్కోటకుడు నల మహారాజుని కాటు వేశాడు. దానితో ఆయన నల్లగా, అసహ్యంగా, అందవిహీనంగా తయారయ్యాడు. వెంటనే సర్పరాజు అతని ఎదుట ప్రత్యక్షమై "మహారాజా! విచారించకు. కావాలనే నిన్ను కురూపిగా తయారుచేశాను. ఈ రూపంలో నిన్నెవరూ గుర్తుపట్టలేరు. నా విషం నీ శరీరంలో వుండడం వల్ల నువ్వు అనాకారిగా తయారయ్యావు. చాటుగా నీలో ప్రవేశించిన 'కలి' మీద నా విషప్రభావం వుంటుంది. నీకు చేసిన అన్యాయానికి అతను అనుభవించాల్సిందే! నా విషం నీలో వున్నంతవరకూ నిన్నెవరూ ఏమీ చెయ్యలేరు. నువ్వు వెంటనే అయోధ్య వెళ్ళి ఋతుపర్ణ మహారాజును కలుసుకో. బాహుకుడని పేరు పెట్టుకుని అతనికి రథసారథిగా వుండు. నీవు అతనికి అశ్వహృదయ మంత్రాన్ని బోధించు. అతని వద్దనుంచి అక్షహృదయమంత్రాన్ని నువ్వు నేర్చుకో. ఆ తరువాత అంతా మేలే జరుగుతుంది. నీవు ఎప్పుడు నీ అసలు రూపం కావాలనుకుంటావో అప్పుడు నన్ను తలుచుకుని ఈ దివ్య వస్త్రాలు ధరించు" అని పలికి నలుడికి రెండు వస్త్రాలు ఇచ్చి అంతర్హితుడయ్యాడు.



నాగరాజు చెప్పినట్టే చేసి ఋతుపర్ణుడి దగ్గర కొలువు సంపాదించాడు నలమహారాజు.

ఇలావుండగా విదర్భలో భీమరాజు, కూతురు అల్లుడి కోసం విచారిస్తూ వాళ్ళు ఎక్కడ వున్నారో తెలుసుకునిరమ్మని సేవకులను పంపాడు. నల దమయంతుల జాడ తెలిపినవారికి వెయ్యి గోవులూ, కావల్సినంత బంగారం, వెండి, అగ్రహారాలు, ఊళ్ళు ఇస్తానని భీమరాజు ప్రకటించాడు. సుదేవుడనే విప్రుడు ఆ ప్రకటన విని భీమరాజు పుత్రికను వెతికేందుకు బయలుదేరాడు. వెతికి వెతికి అతను చివరికి చేదిపురం చేరుకుని సునంద చెంత సైరంధ్రిగా వున్న దమయంతిని చూశాడు. ఆమెను గుర్తుపట్టి ఆమె ఒంటరిగా వున్నప్పుడు ఆమె దగ్గరకు వెళ్ళి "వైదర్భీ! నేను విదర్భ నుంచి వచ్చాను. నీ సోదరుడి స్నేహితుణ్ణి. నీ కోసం దేశ దేశాలూ గాలిస్తూ చివరికి ఇక్కడికి వచ్చాను" అన్నాడు. సుదేవుణ్ణి దమయంతి గుర్తించింది. అందరి క్షేమసమాచారం అడిగి కన్నీళ్ళు పెట్టుకుంది. ఇదంతా సునంద చూసింది. వెళ్ళి తన తల్లితో చెప్పింది. ఆమె సుదేవుణ్ణి పిలిపించి వివరాలు అడిగి తెలుసుకుంది. సునంద దగ్గర సైరంధ్రిగా వున్నది దమయంతి అని తెలిశాక మహారాణి బాధపడుతూ "తల్లీ! మీ అమ్మా, నేనూ అక్కచెల్లెళ్ళం, దశార్ణరాజైన సుదాముని కుమార్తెలం. మీ అమ్మను విదర్భను పాలించే భీమరాజుకు, నన్ను చేది దేశం పాలించే వీరబాహుకూ ఇచ్చి మా తండ్రి పెళ్ళిళ్ళు చేశాడు. నువ్వు పసిపిల్లగా వున్నప్పుడు చూశాను" అని దమయంతిని కౌగలించుకుంది. ఆ తరువాత ఆమె దమయంతిని పల్లకిలో ఎక్కించి సగౌరవంగా విదర్భకు పంపించింది.

దమయంతి తల్లిదండ్రుల వద్దకు క్షేమంగా చేరుకుంది. పిల్లలిద్దరినీ ముద్దులలో, కన్నీళ్లలో ముంచెత్తింది. కుమార్తెను చూసి కొండంత సంతోషం పొందాడు భీమరాజు. అల్లుణ్ణి అన్వేషించడానికి మళ్ళీ అనేక వందలమందిని వివిధ దేశాలకు పంపాడు.

కొన్నాళ్ళకు పర్ణాదుడనే విప్రుడు భీమరాజు దగ్గరకు వచ్చి "అయ్యా! అయోధ్యనేలే ఋతుపర్ణుడి కొలువులో బాహుకుడు అనే సారథి వున్నాడు. చాలా కురూపి. వంకర శరీరం, పొట్టి చేతులు, గూని మెడ, కారుమేఘచ్ఛాయ. కాని గుర్రాలను నడపడంలో మొనగాడు. వంటలు చేయడంలో కూడా నేర్పరి. గుర్రాలను పరుగెత్తించాలన్నా, అదుపు చేయాలన్నా అతని తరువాతే ఎవరైనా! మంచి అశ్వ శిక్షకుడు. సభలో నేను నలుణ్ణి గురించి చెప్పినవన్నీ విని ఒంటరిగా వచ్చి నన్ను కలుసుకున్నాడు. మీ యోగక్షేమాలు అడిగి తెలుసుకున్నాడు. దమయంతీదేవిని గురించి పదే పదే అడిగాడు" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఇది విన్న దమయంతి బాహుకుడే నలుడై వుంటాడని అనుమానించింది. తల్లి అనుమతితో సుదేవుణ్ణి పిలిపించి "సుదేవా! తక్షణం నువ్వు అయోధ్యకు వెళ్ళి నలమహారాజు జాడ తెలియని కారణంగా దమయంతికి ద్వితీయ స్వయంవరం జరుగుతోందని రాజసభలో ప్రకటించు. ఆసక్తివుంటే మరునాటి సూర్యోదయంలోగా ఋతుపర్ణుణ్ణి స్వయంవరానికి రమ్మని చెప్పు" అని ఆజ్ఞాపించింది.

సుదేవుడు అయోధ్య చేరాడు. దమయంతికి మళ్ళీ పెళ్ళి అని తెలియగానే ఆ ఉత్సవానికి వెళ్ళాలని ఋతుపర్ణుడికి ఆశ కలిగింది. వెంటనే బాహుకుణ్ణి పిలిచి "రేపు తెల్లవారేలోగా మనం విదర్భలో వుండాలి. రథం సిద్ధం చెయ్యి" అని ఆజ్ఞాపించాడు. తేరు ఆయత్తమైంది. వార్ష్ణేయుడితోపాటు ఋతుపర్ణుడు రథం అధిరోహించాక బాహుకుడు పగ్గాలు చేతుల్లోకి తీసుకుని గుర్రాలను అదిలించాడు. అశ్వాలు ఆఘమేఘాలమీద పరుగెత్తాయి. బాహుకుడు గుర్రాలను నడుపుతున్న తీరుకు రాజుగారు ఆశ్చర్యపోయారు.

అలా కొంత దూరం వెళ్ళేసరికి ఒకచోట దట్టంగా ఆకులతోను, పళ్ళతోనూ వున్న తాండ్రచెట్టు కనిపించింది. ఋతుపర్ణుడు "బాహుకా! అశ్వహృదయంలో నువ్వు దిట్టవైతే అక్షహృదయంలో నేను దిట్టని. ఈ చెట్టుకి ఎన్ని ఆకులూ ఎన్ని పళ్ళూ వున్నాయో లెక్కపెట్టకుండానే చెప్పగలను. ఆ రెండు పెద్దకొమ్మలకూ కలిపి మొత్తం ఐదుకోట్ల ఆకులున్నాయి. రెండువేల తొంభైఅయిదు పళ్ళున్నాయి. కావాలంటే

లెక్కపెట్టుకో" అన్నాడు. బాహుకుడు రథం నిలిపి తాండ్ర చెట్టుకున్న ఆకులూ పళ్ళూ లెక్కించాడు. ఋతుపర్ణుడు చెప్పిన లెక్క ఖచ్చితంగా సరిపోయింది.

ఈసారి విస్తుపోవడం బాహుకుడి వంతైంది. బాహుకుడి అభ్యర్థన మేరకు ఋతువర్ణుడు అక్కడికక్కడే అతనికి అక్షహృదయ విద్యను నేర్పాడు. ఆ ఉపదేశం పొందుతూ వుండగానే దాని ప్రభావం వలన ఇన్నాళ్ళూ నలుడి లోపలవున్న కలి కర్కోటక కాలకూటాన్ని కక్కుతూ ప్రచ్ఛన్నంగా బయటకు వచ్చాడు. తనను క్షమించమని రహస్యంగా నలుణ్ణి వేడుకుని తాండ్రచెట్టుని ఆశ్రయించాడు. నలుడు ఆ విధంగా కలినుండి విముక్తుడై ఒక్క దేహ సౌందర్యం తప్ప తక్కిన తన పూర్వపు గుణాలన్నీ పొందాడు.

మళ్ళీ రథం సాగింది. ఆ సాయంత్రానికే విదర్భ చేరుకున్నారు. రథఘోష చెవిన పడగానే దమయంతి మనసు సంతోషంతో నిండిపోయింది. భీమరాజు ఋతుపర్ణుడికి ఘనంగా స్వాగతం చెప్పాడు. అయితే స్వయంవర సన్నాహాలేవీ ఋతుపర్ణుడికి కనిపించలేదు.

దమయంతి కేశిని అనే పరిచారికను పిలిచి అశ్వశాలలో వున్న బాహుకుడి వివరాలు తెలుసుకురమ్మని పంపింది. కేశిని వెళ్ళివచ్చింది. "దేవీ! బాహుకుడి ప్రవర్తన చాలా చిత్రంగా వుంది. అతను పొట్టి ద్వారంగుండా నడిచి వెడుతూ కూడా తల వంచడు. తాను వంగడు. అతను దాటబోయే సమయానికి ద్వారాల పైభాగాలు పొడుగై అతని మార్గం సుగమమవుతుంది. ఎంతటి జనసమూహమున్నా అతనికి తోవ లభిస్తుంది. వంట చేయడానికి నిప్పు, నీళ్ళు తెచ్చుకోడు. అతను ముట్టుకున్నా అగ్ని అతన్ని దహించదు. పిడికెడు గడ్డి చేతపట్టుకుని సూర్యుడివైపు విసురుతాడు. వెంటనే అందులో అగ్ని పుడుతుంది. అతను పూలను తాకితే అవి మరిన్ని సుగంధ పరిమళాలు వెదజల్లుతున్నాయి. ఏ వస్తువూ లేకుండానే కమ్మటి భోజనం క్షణాలమీద సిద్ధం చేస్తున్నాడు. చూడటానికీ, వినటానికీ కూడా చోద్యంగా వుంది" అని చెప్పింది. కేశిని ఇలా చెప్పగానే అతను తప్పకుండా నలమహారాజే అని నిర్ణయించుకుంది దమయంతి. అతను వండిన వంటకాలు తీసుకునిరమ్మని మళ్ళీ కేశినిని పంపింది. ఆమె తెచ్చిన మాంసం వాసన, రుచి చూసి ఇది ఖచ్చితంగా నలపాకమే అనుకుంది. తరువాత పిల్లలిద్దర్నీ బాహుకుడి దగ్గరకు పంపించింది. బాహుకుడు ఆ బిడ్డల్ని ఆత్రంగా ఎత్తుకుని ముద్దాడాడు. 'ఈ పిల్లలు అచ్చం నా పిల్లల్లాగే వున్నారు. అందుకే వీళ్ళను చూడగానే ప్రాణాలు లేచొచ్చాయి" అన్నాడు

కేశినితో. దమయంతికి తన భర్త అతనేనని రూఢి అయింది. తల్లిదండ్రుల అనుమతితో బాహుకుణ్ణి తన అంతఃపురానికి రప్పించింది.

దమయంతిని చూడగానే బాహుకుడు కన్నీళ్ళు పెట్టుకున్నాడు. దమయంతికి కూడా దుఃఖం పొంగుకొచ్చింది.

"బాహుకా! అడవిలో ప్రక్కన నిశ్చింతగా నిద్రిస్తున్న భార్యను విడిచివెళ్ళిన ధర్మాత్ముణ్ణి ఎక్కడైనా నువ్వు చూశావా? అగ్నిసాక్షిగా పెళ్ళాడి తననే ప్రాణప్రదంగా ఆరాధించే సాధ్విని విడిచివెళ్ళే తెగువ నలమహారాజుకి తప్ప ఎవరికుంటుందిలే!" అన్నది.

"వైదర్భీ! కలిపురుషుడు నన్ను ఆవహించి వుండటం వల్ల ఈ కష్టాలన్నీ మనకు సంభవించాయి. అంతేకాని నేను ఉద్దేశపూర్వకంగా చేసినవి కావు. అయినా పతితో వియోగం వచ్చినప్పుడు సాధ్వీమణులు తమను తాము రక్షించుకుంటారు కానీ, మళ్ళీ పెళ్ళికి ఇలా చాటింపు వేయిస్తారనుకోను" అన్నాడు. దమయంతి చేతులు జోడించి "మహారాజా! మీ కోసం దేవతలనే తిరస్కరించినదాన్ని. మీ జాడ తెలుసుకోవడం కోసమే నా ద్వితీయ స్వయంవరానికి మా తండ్రి ఏర్పాట్లు చేశాడు. ఋతుపర్ణుడి సభలో నా స్వయంవరం గురించి మీకు తెలిసేలా గట్టిగా ప్రకటించమని నేనే సుదేవుణ్ణి పంపాను. కలలోనైనా నేను పరపురుషుణ్ణి కోరినట్టయితే సూర్యచంద్రాది దేవతలు ఈ క్షణానే నన్ను నిర్జీవిని చేస్తారు" అని తీవ్రంగా పలికింది.

దమయంతి ఈ మాటలు అనగానే "నలభూపాలా! దమయంతి చెప్పింది అక్షర సత్యం. అనుమానించక ఆమెను స్వీకరించు" అని వాయుదేవుడు పలికాడు. అది నలుడికి శిరోధార్యమయింది. కర్కోటకుడు ఇచ్చిన వస్త్రాలు ధరించి నాగరాజును తలుచుకున్నాడు. అతని వికృతరూపం పోయింది. దమయంతిని సంతోషంగా స్వీకరించాడు. తరువాత నిషధ దేశానికి వెళ్ళి పుష్కరుణ్ణి ఓడించి సకల మహీరాజ్యాన్ని తన వశం చేసుకున్నాడు. ద్విగుణీకృత వైభవంతో శోభించాడు. ●

# బంగారు ముంగిస

ధర్మరాజు వదిలిన యాగాశ్వం పార్థుడి సంరక్షణలో సమస్త భూమండలాన్నీ దిగ్విజయంగా చుట్టి వచ్చింది. దక్షప్రజాపతి యాగవైభవాన్ని గుర్తుచేస్తూ ధర్మతనయుడు నిర్విఘ్నంగా అశ్వమేధయాగాన్ని ముగించాడు. వ్యాసమహాముని, దేవతలు, మునులు అజాతశత్రుణ్ణి ఆశీర్వదించారు. ఋత్విజులకు ఒక్కొక్కరికీ కోటివేల బంగారునాణాలను ఇచ్చి తన రాజ్యమంతటినీ వేదవ్యాసమహామునికి దక్షిణగా సమర్పించాడు ధర్మరాజు.

"ధర్మతనయా! నువ్వు నాకు దక్షిణగా రాజ్యమంతా ఇచ్చావు. కాని, నాకు బంగారం కావాలి. భూమి అక్కర్లేదు. కనుక ఈ భూమికి వెలకట్టి దానికి తగిన బంగారం ఇచ్చి ఈ భూమిని నువ్వే తీసుకో" అన్నాడు మహర్షి.

"స్వామీ! అశ్వమేధయాగానికి భూమి దక్షిణ అంటారు. అందుకే తమకు భూమిని సమర్పించుకున్నాను. నేను అరణ్యానికి వెళ్ళి సుఖంగా వుంటానిక. అంతేకాని

బ్రహ్మధనాన్ని తీసుకుంటానా?" అన్నాడు ధర్మరాజు.

"రాజా! మేము అమ్ముతామంటే నువ్వు భూమిని కొనుక్కోవడంలో తప్పేముంది? ఇందులో ఏ దోషం లేదు, తీసుకో" అన్నాడు వ్యాసముని.

"సరే అయితే!" అంటూ కోటికోట్ల మాడలు కుప్పగా పోసి "ఇది ఈ భూమికి వెల" అని చెప్పి ఆ ధనాన్ని వ్యాసమహర్షికి అర్పించాడు ధర్మరాజు. ఆయన అదంతా విప్రులకు, మిగతావాళ్ళకు పంచిపెట్టాడు. బంగారు పాత్రలు, యూపస్తంభాలు, తోరణాలను అందరికీ దానం చేశాడు ధర్మరాజు.

"రండి! మీకేం కావాలో చెప్పండి. ఇవిగో వస్త్రాలు! ధరించండి! రకరకాల బంగారు పాత్రలివిగో–స్వీకరించండి" అంటూ అందర్నీ పిలిచి పిలిచి ఇచ్చాడు భీముడు.

ఉపాధ్యాయుడు కానివాడు, వేదవేదాంగ నిరతుడు కానివాడు, వ్రతనిష్ఠ లేనివాడు ఆ సదస్సులో లేనేలేరు. మునులందరూ ఆ యాగాన్ని మెచ్చుకున్నారు. సిద్ధులూ విప్రులూ అక్షింతలు జల్లుతూ ఆశీర్వదించారు.

తన భాగానికి వచ్చిన బంగారమంతా కుంతీదేవికి ఇచ్చాడు వ్యాసుడు. ఆమె దాన్ని అందరికీ దానం చేసింది. యజ్ఞానికి వచ్చిన రాజులందరికీ మణి భూషణాలు, ఏనుగులు, గుర్రాలు ఇచ్చాడు ధర్మరాజు. కృష్ణుణ్ణి విశేషంగా సత్కరించాడు. ఆనాడు ధర్మరాజు చేసిన దానాల వల్ల సమస్త ప్రజలూ తృప్తి పొందారు. అయితే, అప్పుడొక చిత్రం జరిగింది.

ఒక కలుగులోంచి ఒక ముంగిస బయటికి వచ్చి "అబ్బ! ఎంత గొప్పగా పొగుడుతున్నారు! ఎంత దానం చేస్తే మాత్రం మరీ అంతగా మెచ్చాలా! సక్తుప్రస్థుడు చేసిన ధర్మంలో ఏ వంతు ఈ అశ్వమేథయాగం?!" అంటూ మూతి విరిచింది.

ఆ మాటలు విని అంతా ఆశ్చర్యపోయారు. "అదేమిటి అలా అంటున్నావు. ఈ యాగంలో నీకేం లోటు కనిపించింది?" అని విప్రులు ముంగిసను ప్రశ్నించారు.

"అయ్యా! ఆకలిని, తృష్ణను జయించినవాడు సక్తుప్రస్థుడు. అతనొక బీద బ్రాహ్మణుడు. ఉంఛవృత్తితో జీవించేవాడు. నా, నేను అన్న ప్రీతిని త్యజించి సంపూర్ణార్పణతో అతిథిపూజ చేసిన మహానుభావుడు. భక్తి, వినయం, శ్రద్ధ, ఓర్పు, కరుణ అతనియందు స్థిరంగా వున్నాయి. నెల్లాళ్ళుగా కరువు వల్ల కడుపునిండా

తిండి లేక ఆకలితో అలమటిస్తూ ఒకసారి ఎవరి దయవల్లనో కుంచెడు పిండి తెచ్చుకున్నాడు. అతనూ, భార్యా, కొడుకూ, కోడలూ ఆవురావుమంటూ తినడానికి కూర్చోబోతుండగా అనుకోకుండా ఒక అతిథి వచ్చాడు. ఆ అతిథికి వాళ్ళంతా సపర్యలు చేసి 'ఆరగించండి స్వామీ' అంటూ తెచ్చుకున్న ఆ కాస్త పిండినీ భక్తితో సమర్పించారు. నాటి అతని దానదక్షతను దేవతలే స్తుతించారు. ధర్మదేవత సంతసించింది. బ్రహ్మదేవుడు మణిమయ విమానం పంపి సక్తుప్రస్థుణ్ణి స్వర్గలోకానికి పిలిపించుకున్నాడు. అదంతా చూశాక కలుగులోంచి బయటకు వచ్చాను నేను. ఆ సక్తుప్రస్థుడు తయారుచేసిన పిండి వాసనా, అతిథి కాళ్ళు కడిగిన నీళ్ళూ సోకి నా తలా, శరీరంలో ఒక భాగమూ బంగారుమయమయ్యాయి! ఇదీ ఆ సక్తుప్రస్థుడి ధర్మమహిమ!!

"మిగిలిన శరీరం కూడా బంగారుమయం చేసుకుందామని ఎన్ని యజ్ఞ ప్రదేశాలకో వెళ్ళాను. లాభం లేకపోయింది. సక్తుప్రస్థుడి దాననిరతికి దీటైన దయాశీలత నాకు ఇంతవరకూ తారసపడలేదు. ఈనాడు అజాతశత్రుడు యాగం చేస్తున్నాడుకదా, నా కోరిక తీరకపోతుందా అనుకున్నాను. కాని నా ఆశ నిరాశ అయింది. అందుకే ధర్మరాజు యాగం సక్తుప్రస్థుడి ధర్మానికి సరిపోలదని అన్నాను" అని చెప్పి ఆ ముంగిస ఎవరికీ కనబడకుండా మాయమయింది. ●

# ఉన్నతపథం

ఒకసారి బళ్ళు పోయే మార్గంలో, గబగబ పరుగిడుతున్న ఒక కీటకం వ్యాసభగవానుడికి కనిపించింది.

"ఎందుకలా భయపడి పారిపోతున్నావ్" అని అడిగాడాయన.

"మహాత్మా! కుప్పతెప్పలుగా బళ్ళు వస్తున్నాయి. అందుకని ప్రాణభయంతో పారిపోతున్నాను" అని కీటకం సమాధానం చెప్పింది.

"నీ జన్మ ఏం గొప్పది? ఏ ఇంద్రియ సుఖానుభవం లేదు నీకు. ఇలాంటి బతుకు కోసం ఎందుకింత తాపత్రయం? నీవంటి కీటకం పోవడమే మంచిది కదూ?" అన్నాడు కృష్ణద్వైపాయనుడు.

"కీటకాలకు ఇంద్రియ సుఖాలు లేవని ఎవరన్నారు? వాటి వాటికి తగినట్టు సకల ప్రాణులూ సుఖాలనుభవిస్తాయి. మహానుభావా! నేనేం చెబుతానో అని అలా అన్నావు గాని ఇదంతా నీకు తెలీదు గనుకనా! నేను పూర్వజన్మలో ఒక కడజాతివాణ్ణి. చాలా ధనవంతుణ్ణి. చాలా దుర్గుణాలు కూడా వుండేవి. అయినా నా తల్లిని భక్తితో పూజించేవాణ్ణి. ఆమె పట్ల నాకు విపరీతమైన ప్రేమ, గౌరవం, అభిమానం వుండేవి.

ఆమె మాటంటే నాకు వేదం. ఆవిడ చెప్పిన పని ఎప్పుడూ చెయ్యకుండా లేను నేను. ఒకసారి మా ఇంటికి వచ్చిన ఒక అతిథిని భక్తిశ్రద్ధలతో పూజించాను. ఆ రెండు పుణ్యకర్మల వల్లసుఖం వస్తుందని పెద్దలు చెప్పగా విన్నాను. అయ్యా! నాకు వాటిని గురించి చెప్పవా?" అని అడిగింది కీటకం.

వ్యాసుడు నవ్వి "నువ్వు చేసిన పాపాల వల్లే నీకీ జన్మ వచ్చిందని నాకు తెలుసు. నువ్వు నీ తల్లిని పూజించినందుకు సంతోషించే ఇప్పుడు నేను నీతో మాట్లాడాను. నా తపశ్శక్తిచేత నీ కీటక జన్మ పోగొడతాను. తపోబలాన్ని మించినది లేదు. **ఈ లోకం కర్మభూమి. పరలోకం భోగభూమి. ఇక్కడ చేసిన సత్కర్మలకు ఫలితం అక్కడ లభిస్తుంది. ఉత్తమ గుణాలు లేనివారికి ఆ లోకంలో స్థానం లేదు. ఈ లోకంలో పుట్టింది మొదలు చచ్చేదాకా దుఃఖమే!** ఆ లోకంలో నిరంతరం సుఖమే!! అతిథుల్నీ, స్త్రీలనూ, గోవులనూ పూజించేవాళ్ళకి పుణ్యలోకం ప్రాప్తిస్తుంది. అతిథిపూజ చేసినందువల్ల నీకు పూర్వజన్మస్మృతీ, సత్పురుషుల దర్శనం కలుగుతున్నాయి. ఉన్నత పథమిస్తాను విచారించకు. నీకు ముందు ముందు ఉత్తమ జన్మలు వరుసగా లభిస్తాయి. ప్రతి జన్మలోనూ పూర్వస్మృతి వుంటుంది" అని అనుగ్రహించాడు.

మహర్షి భూతదయను సమస్తజీవాలూ కీర్తించాయి. ఆ కీటకం వ్యాస భగవానుడి పాదాలమీద శిరస్సు మోపి నమస్కరించి మరణించి వరుసగా ముని అనుగ్రహించిన అన్ని ఉత్తమజన్మలూ పొందింది. చివరకు రాజై పుట్టి రాజ్యం వహించింది.

ఒకనాడు ఆ రాజు ఏనుగునెక్కి దివ్య వైభవంతో వ్యాసమహర్షి ఆశ్రమానికి వెళ్ళి ఆయనకు నమస్కరించాడు. మహర్షి రాజును దీవించి "నాయనా! వ్యవహారశుద్ధి వుంటేనే ప్రజలకు చేరువవుతావు – మరచిపోకు. అదే నీకు కీర్తి కలిగిస్తుంది. నరకడం, చెరలో పెట్టడం, బంధించి బాధలుపెట్టడం, ప్రాణాలు తీయడం, సంపదలన్నీ లాగేసుకోవడం మొదలైన శిక్షలు న్యాయాన్ననుసరించి అమలుచేయాలి. పదవి కోసం చేసే ప్రయత్నాలు ధర్మమార్గాన్ని అతిక్రమించనివిగా చూసుకోవాలి. గర్వం చాలా చెడ్డది. ఆ గుణం వుంటే దేవతలైనా, మునులైనా కూడా క్షయమౌతారు. కనుక ముందు ఆ అహాన్ని గెలవాలి. ఈ జన్మలో తపస్సు చేసి గోవుల కోసమో, పుణ్యాత్ముల కోసమో యుద్ధం చేసి ప్రాణాలు విడిచిపెట్టు. వచ్చేజన్మలో ముక్తి పొందుతావు" అన్నాడు. రాజు అలాగే చేసి ముక్తి పొందాడు. ●

# సైంధవ వధ

సూర్యుడు మెల్లగా ఎ(రబడడం చూసి దుర్యోధనుడు కర్ణుడి దగ్గరకు వచ్చాడు. "రాధేయా! సాత్యకీ, భీముడూ సహాయంగా అర్జునుడు సైంధవుణ్ణి తరుముకొస్తున్నారు. ఇంకొంచెంసేపు వాణ్ణి ముందుకు వెళ్ళకుండా నిలబెట్టగలిగావంటే సూర్యుడు అస్తమిస్తాడు. అర్జునుడు చస్తాడు. వాడితోపాటే మిగిలినవాళ్ళూనూ! 'పద్మవ్యూహంలో అభిమన్యుణ్ణి చంపడానికి సహాయపడిన సైంధవుణ్ణి రేపు సూర్యాస్తమయం లోగా చంపుతాను' అని డాంబికాలు పలికాడు. చేటుకాలం వచ్చే ఇలాంటి ప్రతిజ్ఞ చేశాడు. ఇప్పుడు కాస్త శ్రమకోర్చి నిలబడ్డామంటే ఇంక రాజ్యమంతా మనదే" అన్నాడు.

కర్ణుడు సరేనని విల్లందుకున్నాడు.

కర్ణుడికీ, అర్జునుడికీ మధ్య ఘోరయుద్ధం జరిగింది.

అందరినీ తరిమికొట్టి సైంధవుడి దగ్గరకు చేరాడు అర్జునుడు.



అతనిని చంపబోయే లోపల కౌరవదొరలంతా సైంధవుడికి అడ్డంగా నిలబడ్డారు. పొద్దుగుంకే లోపల వాళ్ళను జయించి సైంధవుణ్ణి చంపే వ్యవధి కనిపించక దిక్కులు చూస్తున్నాడు అర్జునుడు.

అది చూసి "అర్జునా! ఇంక వీళ్ళతో ఇలా యుద్ధం చేస్తూ కూర్చుంటే లాభం లేదు. సూర్యుడు అస్తమించబోతున్నాడు. దీనికి నేనో ఉపాయం చేస్తాను! దాంతో కాని సైంధవుడు చావడు. సూర్యుణ్ణి మబ్బులతో కప్పేస్తాను. ఆ చీకటి చూసి అందరూ సూర్యాస్తమయమైందనుకుని సంతోషంతో ఒకరినొకరు పొగుడుకుంటూ విచ్చిపోతారు. అప్పుడు నీ ప్రతిన చెల్లించుకో" అన్నాడు కృష్ణుడు. "బావా! ఇంత పరాక్రమం వుండి కూడా ఇలాంటి మిషతో ప్రతిజ్ఞ తీర్చుకోమంటావా?" అర్జునుడు బాధగా అన్నాడు.

"దుర్మార్గుల్ని దుర్మార్గంతోనూ, మోసగాళ్ళను మోసంతోనూ చంపడం తప్పు కాదు! నువ్వేం బాధపడకు" అంటూ మాధవుడు మాయాతిమిరంతో మార్తాండ మండలాన్ని మరుగుపరచాడు. అది చూసి సూర్యుడు అస్తమించాడనుకుని కౌరవ సైన్యాలన్నీ సింహనాదాలు చేస్తూ చెదిరిపోయాయి. సైంధవుడు సంతోషం పట్టలేక రథమెక్కి నిలబడ్డాడు. "అర్జునా! అడుగో సైంధవుడు. ఆలస్యం చెయ్యకు" అని కృష్ణుడు తొందరపెట్టాడు.

తక్షణం బాణం సంధించాడు అర్జునుడు. దాంతో సైంధవుడి తల తెగింది.

"పార్థా! ఆ తల కింద పడనియ్యకు! అలాగే ఆకాశంలో ఆడించు. దానిసంగతి తరువాత చెబుతా నీకు" అన్నాడు కృష్ణుడు కంగారుపడుతూ. వెనక్కీ ముందుకీ కిందికీ పైకీ బాణాలు వేసి ఆ తలను ఆకాశంలో బంతిలా ఆడించాడు అర్జునుడు. ఇంతలో మాయచీకటి తొలగి సూర్యబింబం ప్రకాశించింది. కౌరవులు దిక్కుతోచక పరుగులంకించుకున్నారు.

"బావా! వీడి తలకాయ ఇలా ఎంతసేపు వుంచమంటావు? దీన్ని ఎక్కడ పడెయ్యాలి? అసలు కథేమిటో చెప్పు?" అని అర్జునుడు అడిగాడు.

వృద్ధక్షత్రుడనే సింధురాజు పుత్రులకోసం ఎన్నెన్నో పూజలూ, తపస్సులూ చేసి చివరకు జయద్రథుణ్ణి కన్నాడు. వీడి చిన్నతనంలో ఒకనాడు 'వీడు యుద్ధంలో ఏమరి వున్నప్పుడు చంపబడతాడు' అని అశరీరవాణి పలికింది. వృద్ధక్షత్రుడు అది విని ఎంతో విచారించాడు. 'సైంధవుడి (జయద్రథుడు) తల ఎవడు నేల పడేస్తాడో వాడి తల నూరు చెక్కలగు గాక' అని అతడు తన తపోబలంతో పలికాడు. అతనిప్పుడు శమంతపంచక సమీపంలో తపస్సు చేసుకుంటున్నాడు. ఈ తల వెళ్ళి ఇప్పుడతని తొడమీద పడాలి. పాశుపతాస్త్రాన్ని ప్రార్థించు" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడు వేసిన పాశుపతం అనేక బాణాల ఆకారం ధరించి ఆ శిరస్సును తీసుకువెళ్ళి వృద్ధక్షత్రుడి తొడమీద పడేసింది. తపస్సులో వున్న వృద్ధక్షత్రుడు స్పర్శకు ఖంగారుపడి దానిని కిందకు తోశాడు. వెంటనే అతని తల నూరు చెక్కలైంది. చిత్రమేమిటంటే సైంధవుడి తల నేల పడేవరకూ అతని మొండెం అలా రథం మీద నిలబడే వుంది.

ఇదంతా చూసి కౌరవ సేనలు కొయ్యబారిపోయాయి. తమ్ముడి ప్రతిజ్ఞ నెరవేరినందుకు ధర్మరాజు సంతోషించాడు. ●

# ఉత్తరకుమార ప్రజ్ఞలు

విరాటరాజు గోవులను కౌరవులు దొంగతనంగా వచ్చి తరలించుకుపోయారు. రాజు నగరంలో లేని తరుణం చూసి దుర్యోధనుడు ఈ దుర్మార్గానికి ఒడిగట్టాడు. విరాటరాజు కుమారుడైన ఉత్తరుడికీ విషయం తెలిసింది. "నా రథాన్ని నడపగలిగే సారథి కనక దొరికితే నేనొక్కణ్ణే దండెత్తివెళ్ళి ఆ గోవులను మళ్ళించుకుని రాగలను. నా యుద్ధం చూసి వాళ్ళు తోక ముడవాల్సిందే" అన్నాడు ఉత్తరకుమారుడు.

ఉత్తరుడీ మాటలు చెపుతూన్నప్పుడు ద్రౌపది అక్కడే వుంది. గబగబ విరాటరాజు కూతురు ఉత్తర దగ్గరకు పరుగెత్తుకుని వెళ్ళి "బృహన్నలను ఉత్తరకుమారుడికి సారథిగా పంపించండి. మన బృహన్నల పూర్వం అర్జునుడికి సారథ్యం చేసింది. అతనివద్ద విలువిద్య రహస్యాలు తెలుసుకుంది. అందువల్ల కార్యసాధన అవుతుంది" అని ఆలోచన చెప్పింది.

ఉత్తర ఈ విషయం అన్నగారితో చెప్పింది.

ఉత్తరకుమారుడు సరే అన్నాడు.

రథం బయలుదేరింది. ఉత్తరుడు ఉత్సాహంగానే నగరం నుండి బయలుదేరాడు.

"రథం వేగంగా పోనీ! కౌరవులు గోవులను తరలించుకుపోతున్న దిక్కుగా పోనిస్తే వారిని పారిపోకుండా పట్టుకుందాం" అన్నాడు బృహన్నలతో.

గుర్రాలు ఆఘమేఘాలమీద పోతున్నాయి. కౌరవసేన కనుచూపు మేరలో వుంది. మహాసముద్రంలా కనిపిస్తోంది. అది చూడగానే ఉత్తరకుమారుడికి గుండెలు ఝల్లుమన్నాయి. బెదురు పుట్టింది. కళ్ళు బయర్లు కమ్మాయి. చేతులతో కళ్ళు మూసుకున్నాడు. రథంమీద నిలవలేకపోయాడు. "అయ్యయ్యో! ఇంతపెద్ద సేనను నేనెలా ఎదిరించగలను? నావెంట సైన్యమూ లేదు, సేనాపతీ లేదు. బృహన్నలా! నావల్లకాదు. రథం మరల్చు. తిరిగిపోదాం" అన్నాడు.



అది విని బృహన్నల నవ్వింది. "ఉత్తరకుమారా! నీవు రాకుమారుడివి. ఆడవాళ్ళ ముందు ఏవేవో ప్రజ్ఞలు పలికి నన్ను కూడా యుద్ధభూమికి తెచ్చావు. ఆవుల్ని తీసుకుని పోకుండా వట్టిచేతులతో వెడితే మనల్ని చూసి అందరూ పరిహాసం చేస్తారు. కనుక ధైర్యంతో నిలచి పోరాడు" అని రథం ఆపకుండా ముందుకు పోనిచ్చింది బృహన్నల.

"నావల్ల కానేకాదు. ఆవుల్ని వాళ్ళు తోలుకుపోతే పోనీ. ఆడవాళ్ళు నన్ను చూసి ఎగతాళి చేస్తే చేయనీ! నేను మాత్రం క్షణం కూడా ఇక్కడ వుండను. రథం వెనక్కి తిప్పు. లేకపోతే నేనే నడచిపోతాను" అని ఉత్తరుడు విల్లూ, అంబులూ అక్కడే పారేశాడు. రథంమీద నుంచి కిందకు దూకి పిచ్చివాడిలా ఊరివైపు ఉరకడం మొదలుపెట్టాడు.

"రాకుమారా! నిలునిలు! పారిపోకు! క్షత్రియుడవు. ఇలా యుద్ధభూమి నుంచి పారిపోకూడదు" అని బృహన్నల వెంటపడింది.

"నన్ను పట్టుకోవద్దు. వదులు. నీకు పుణ్యం వుంటుంది. నీకు కావలసినంత ధనం ఇస్తాను. కానుకలు ఇస్తాను. చీరలు పెడతాను. ఏం కావాలంటే అది ఇస్తాను. నన్ను విడిచిపెట్టు. మా అమ్మకు నేనొక్కణ్ణే కొడుకును. నేను కుర్రవాణ్ణి. తల్లిచాటు బిడ్డను. నాకు భయం వేస్తోంది. నన్ను పోనీ" అని కేకలు పెడుతూ పరుగెత్తుతూనే ఉన్నాడు ఉత్తరకుమారుడు.

కాని బృహన్నల విడిచిపెట్టలేదు.

పట్టుకొని రథంమీద కూర్చోపెట్టింది.

కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు ఉత్తరుడు.

"రాకుమారా! భయపడకు. ఈ కౌరవులతో నేను యుద్ధం చేస్తాను. గుర్రాలను మాత్రం నీవు పట్టుకో. నీవు రథం తోలగలిగితే మిగతా కార్యమంతా నేను నడిపిస్తాను" అని ఉత్తరుడికి పగ్గాలు అందించింది బృహన్నల.

తరువాత రథాన్ని దూరంగా కనిపించే జమ్మిచెట్టు వద్దకు పోనిమ్మంది.

అక్కడికి చేరాక "విరాటపుత్రా! ఈ చెట్టెక్కి పైన వున్న ఆయుధాలు పట్టుకురా" అంది బృహన్నల.

ఉత్తరుడికి ఇదేమీ అర్థం కాలేదు. బిత్తరచూపులు చూస్తుంటే "ఉత్తరకుమారా! చెట్టెక్కి చూడు! అది పాండవుల ఆయుధాల మూట!! అనవసరంగా భయపడకు, ఆలస్యం చేయకు" అంది బృహన్నల.

ఉత్తరుడు బృహన్నల చెప్పినట్టే చేశాడు. ఆయుధాల మూటను చూసి సంభ్రమాశ్చర్యాలతో కళ్ళు మూసుకున్నాడు. "బృహన్నలా! ఆశ్చర్యంగా వుంది నాకు. పాండవులు సర్వం పోగొట్టుకుని అడవులపాలయ్యారు కదా! వాళ్ళ ఆయుధాలు ఇక్కడికి ఎలా వచ్చాయి? వాళ్ళు ఎక్కడున్నారో నీకు తెలుసా?" అని అడిగాడు.

అప్పుడు బృహన్నల తానెవరైందీ చెప్పి తన అన్నదమ్ములను గురించీ, ద్రౌపదిని గురించీ చెప్పింది.

ఉత్తరుడు నమస్కారం చేశాడు. బృహన్నల రూపంలో వున్న అర్జునుడు కౌరవ సేన వేపు రథాన్ని మళ్ళించి గాండీవం ఎత్తిపట్టాడు. మూడుసార్లు నారి సారించాడు. తన శంఖం దేవదత్తాన్ని గట్టిగా పూరించాడు.

అంతే! కౌరవసేనంతా ఆ గంభీరఘోషకు చెల్లాచెదరైంది. ప్రాణాలు అరచేత పట్టుకుని పరుగెత్తారు.

గోవుల్ని తీసుకుని ఉత్తరుడూ, అర్జునుడూ నగరానికి తిరిగి వచ్చారు.

అదీ కథ!

అంతఃపురకాంతల ముందు గొప్ప వీరుడులాగా బీరాలు పలికి తీరా యుద్ధభూమికి వచ్చిన తరువాత బెదిరిపోయి తిరుగుముఖం పట్టి పారిపోయిన ఉత్తరకుమారుడి కథ మహాభారతంలో చెప్పడం కేవలం హాస్యం కోసమే కాదు, **గుణాలు కలవాళ్ళు గుణహీనులను చూసి గేలిచేయడం స్వభావసిద్ధం. అలాగే శక్తి సామర్థ్యాలు కలిగినవాళ్ళు అవి లేనివాళ్ళను చూసి కించపరచడం పరిపాటి. కాని ధనుంజయుడు మాత్రం అలా చేయలేదు. వీరాధివీరుడు అయిన అతడు యుద్ధభూమిలో ఉత్తరుడు నిర్వీర్యుడు కావడం చూసి, అతణ్ణి నిలబెట్టి ధైర్యం చెప్పి చేరదీసి వీరుణ్ణి చేశాడు.** ధైర్యం కోల్పోయిన ఉత్తరుడికి చేయవలసిన సహాయం చేసి, ధైర్యం నూరిపోసి వీరుడిగా నిలిపి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టాడు.

అర్జునుడి మూలంగా వీరుడైన ఉత్తరుడు కురుక్షేత్ర యుద్ధంలో శల్యుడితో తలపడి వీరస్వర్గం అలంకరించాడు. ●

# గదాయుద్ధం

భీముడూ, దుర్యోధనుడూ గదాయుద్ధానికి సిద్ధమయ్యారు.

ఇద్దరూ బరిలోకి దిగారు.

వాళ్ళిద్దరూ తన శిష్యులే కాబట్టి వాళ్ళ పోరు చూడాలని వచ్చాడు బలరాముడు.

అందరూ ఆయనకు గౌరవంగా నమస్కరించారు.

భీముడూ, దుర్యోధనుడూ గదాహస్తాలతోనే మొక్కారు.

"మహాత్మా! అన్నదమ్ములు పోరాడుతున్నారు చూడు!" అన్నాడు ధర్మరాజు.

బలరాముడు మాట్లాడలేదు. చిరునవ్వు నవ్వి, వెళ్ళి దూరంగా కూర్చున్నాడు.

భీమదుర్యోధనులు యుద్ధం మొదలు పెట్టారు.

భూమి గడగడ వణికింది.

గ్రహణసందర్భం కాకపోయినా రాహువు సూర్యుణ్ణి పట్టాడు.

నక్కలు భయంకరంగా అరిచాయి.

ఆకాశంలో మబ్బు లేకుండా పిడుగు పడింది.

గదాఘాతాల చప్పుళ్ళతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది.

కాసేపటికి ఇద్దరి శరీరాలూ నెత్తురుతో తడిసి మోదుగువృక్షాల్లా ఉన్నాయి.

భీముడు రెండుసార్లు మూర్ఛపోయాడు. అది చూసి అర్జునుడు భయపడి "బావా! దుర్యోధనుడితో మనవాడు చాలలేడంటావా?" అని కృష్ణుణ్ణి అడిగాడు.

కృష్ణుడు నవ్వి "గురూపదేశ సమన్వయం ఇద్దరికీ సమానమే. భీముడికి బలం ఎక్కువ. దుర్యోధనుడికి చాతుర్యం ఎక్కువ. బలం కలిగి కూడా భీముడు దుర్యోధనుడి ఒడుపులకు చాలలేకపోతున్నాడు. ధర్మయుద్ధంలో భీముడు జయించలేడు. మోసంగానే చంపాలి. దుర్మార్గుల్ని మోసంచేసి చంపడం తప్పుకాదు. అయినా ఇంతకంటే తెలివితక్కువతనం ఉంటుందా! అందరూ చచ్చి రాజ్యంమీద ఆశ విడిచి, మడుగులో దాక్కున్నవాణ్ణి వెతికి పిలిచి ఒంటరి కయ్యానికి రమ్మంటారా ఎవరైనా? మీరు లేని పదమూడు సంవత్సరాలూ భీముణ్ణి జయించాలనే దుర్యోధనుడు గదాయుద్ధపరిశ్రమ చేశాడు. ధర్మరాజుకు కౌరవుల మీద అనుగ్రహం ఎక్కువై ఆలోచన అడుగంటింది. ఆఖరికి ఇది పందెపు యుద్ధమైంది" అన్నాడు.

అర్జునుడి మనస్సు చివుక్కుమంది.

హిడింబ బకాసురులను చంపి, జరాసంధుణ్ణి సంహరించి, కిమ్మీరుని వధించి, కీచకుణ్ణీ వాడి నూటైదుగురు తమ్ముళ్ళనీ ఒకేఒక్క రాత్రిలో శవాలను చేసిన భీమసేనుడు ఇప్పుడు దుర్యోధనుడి గదాఘాతాలకు తట్టుకోలేక బిక్కుబిక్కుమంటూ తమ్ముళ్ళవైపు చూస్తున్నాడు.

"ఇప్పుడేం చెయ్యటం" అన్నాడు అర్జునుడు ఎటూ పాలుపోక.

"గదాయుద్ధంలో నాభికి దిగువ భాగాన కొట్టకూడదు. కాని అంతకుమించి మార్గం కనబడటంలేదు" అన్నాడు కృష్ణుడు.

ఆ మాటలు విని, భీముడు తనవైపు చూసినప్పుడు చేత్తో తొడలు చరిచాడు అర్జునుడు. ఆ సంజ్ఞ తెలుసుకున్నాడు భీముడు.

గద తిప్పుతూ దుర్యోధనుడు పైకి ఎగిరేసరికి అదే అదననుకుని బలం కొద్దీ

అతని తొడలమీద మోదాడు. తొడలు విరిగి దుర్యోధనుడు కుప్పకూలాడు.

అంతటా గందరగోళం చెలరేగింది.

"పాంచాలిని సభలోకి ఈడ్చి, చీరలు విప్పి అవమానించినట్టు లేదూ..." అంటూ భీముడు ఎడంకాలితో దుర్యోధనుడి తలమీద బలంగా తన్నాడు.

బలరాముడు ఇదంతా చూస్తూనే వున్నాడు.

పట్టలేనంత ఆగ్రహం వచ్చిందాయనకు.

కోపంతో ముఖం ఎరబ్రడింది.

"ఓ మహారాజులారా! చూశారా భీముడు చేసిన అన్యాయం! గదాయుద్ధంలో నాభికి దిగువ భాగాన్ని నొప్పించరాదనే నియమం మీరు వినలేదా? భీముడు ఎంత అన్యాయానికి తెగించాడో చూడండి" అంటూ ఎలుగెత్తి అరిచాడు హలాయుధుడు.

గబగబ తన రథం దగ్గరకువెళ్ళి నాగలి భుజాన వేసుకుని భూమి అదిరిపోయేటట్లు భీమసేనుడి వైపు నడిచాడు. కృష్ణుడు ఒక్క క్షణం వూరుకుని "దుర్యోధనుడి తొడలు విరగ్గొడతానని భీముడు ప్రతిజ్ఞ చేసిన సంగతి నీకు తెలుసు. చేసిన ప్రతిజ్ఞ చెల్లించుకోవడం రాజులకు పరమధర్మమని నువ్వే ఒకసారి నాతో అన్నావు. అదీగాక దుర్యోధనుని తొడలు భీమునివల్ల విరిగి పడతాయని మైత్రేయ మహాముని శపించాడు. ఇప్పుడదే జరిగింది. ఇందులో తప్పేముంది?" అన్నాడు.

బలరాముడు మండిపడ్డాడు.

"**ధర్మార్థ కామాలు ఒకదాన్నొకటి నశింపచెయ్యకుండా వాటిని జాగ్రత్తగా అనుభవించాలి. అదీ గొప్పతనం! ధర్మాన్ని విడిచి, అర్థకామాల్ని కోరే పురుషుడు నిందలకు గురి అవుతాడు.** మునిశాపం, ప్రతిజ్ఞ వుంటే వుండుగాక, అవన్నీ ధర్మం తప్పకుండా తీర్చుకోవాలి గాని ఇంత అన్యాయమా?" అన్నాడు.

"ఇందులో అధర్మమేముంది? ఎదిరించినప్పుడూ నడిచేటప్పుడూ కాదు, ఎగిరినప్పుడు కొట్టాడు భీముడు. అదేం రణనీతికి విరుద్ధం కాదే! అదీకాక ప్రాణం రక్షించుకోవడానికి ఏం చేసినా తప్పులేదని పెద్దలంటారు. తన తల పగలకొట్టడానికి దుర్యోధనుడు ఎగిరితే, నాభి కింది భాగం కొట్టకూడదని ధర్మసూత్రాలు వల్లె వేసుకుంటూ ప్రాణాలు పోగొట్టుకుంటాడా భీముడు? కలియుగం దగ్గర పడింది. ధర్మాధర్మాల స్వరూపమే మారబోతోంది. అందుకే దుర్యోధనుడు అన్ని పాపపు

పనులు చేశాడు” అన్నాడు కృష్ణుడు.

ఆ మాటలు అంటున్నపుడు ‘ధర్మక్షేత్రాధిపతిని నేనే’ అన్నట్లు ఆయన వెనక క్షణకాలం ఒక మెరుపు మెరిసి మాయమైంది.

బలరాముడు ఆ వెలుగు చూడలేక కళ్ళు నులుముకుని వెంటనే మళ్ళీ బుసకొట్టాడు కోపంతో.

‘‘ఇటువంటి తుచ్ఛపు గెలుపు పొందిన భీముడు తగిన సత్కారాలే పొందుతాడు” అని రథమెక్కి వెళ్ళిపోయాడు.

ధర్మరాజు స్థాణువై నిలబడ్డాడు. ఇంతలో వెనుకనుంచి చేతులమీద పాక్కుంటూ దుర్యోధనుడు వచ్చాడు.

అతన్ని చూడగానే ధర్మరాజు కళ్ళవెంట గ్రున నీళ్ళు తిరిగాయి.

“...నాకు ఎవరి సానుభూతీ అక్కర్లేదు. కంసుడికి దాసుడైన వసుదేవుడి కొడుకు నన్ను దొంగదెబ్బ కొట్టించాడు కనక మీరంతా బతికిపోయారు. సరిగ్గా యుద్ధం చేస్తే మీతోపాటు ఈ కృష్ణుడికి కూడా యమదర్శనం చేయించి వుండేవాణ్ణి. శిఖండిని చాటుచేసుకుని భీష్మణ్ణి అర్జునుడు చంపేటట్లు చేశాడు. ధర్మరాజుచేత అబద్ధమాడించి ద్రోణుణ్ణి చంపించాడు. రథం భూమిలోకి దిగబడినప్పుడు కర్ణుణ్ణి చంపించాడు. భూరిశ్రవుణ్ణీ, సైంధవుణ్ణీ కూడా అన్యాయంగానే హతమార్చాడు. ఇప్పుడు యుద్ధనీతికి వ్యతిరేకంగా భీముడి చేత నా తొడలు విరగగొట్టించాడు. ఇంకా సిగ్గులేకుండా ఈ కృష్ణుడేదో కర్మ ధర్మ చక్రవర్తని మీరంతా చాటింపేస్తున్నారు” అన్నాడు దుర్యోధనుడు ఉక్రోషంతో.

కృష్ణుడు నవ్వాడు. “గదాయుద్ధంలో నీ తొడలు విరగ్గొడతానని ప్రతిజ్ఞ చేసిన భీముడు పోన్లే పాపం అని పిడికిటితో పొడుస్తాడనుకున్నావా? నువ్వు చేసిన ఘనకార్యాలు ఒక్కొక్కటే గుర్తుకు తెచ్చుకుంటూ ఇక్కడే ఏడుస్తూ పడివుండు” అని పాంచజన్యం పూరించేసరికి పాండవులంతా రథాల మీద బయలుదేరి కౌరవ నగరం చేరుకున్నారు.

“గాండీవం, అమ్ములపొదులూ అవతల పెట్టించి ముందు నువ్వు రథం దిగు. తరువాత నేను దిగుతాను” అన్నాడు కృష్ణుడు అర్జునుడితో.

విజయుడు ధనువూ, అమ్ములపొదులూ తీసుకుని దిగిన తరువాత కృష్ణుడు

పగ్గాలు మడిచిపెట్టి రథం దిగాడు. జెండాలో వున్న కపి తన భూతగణాలతో సహా తొలగిపోయింది. వెంటనే ఆ రథం గుర్రాలతో సహా చురచుర కాలిపోయింది.

"దేవా! ఇది చాలా ఆశ్చర్యంగా వుంది. ఈ రథం ఎందుకిలా కాలిపోయింది?" అని అర్జునుడు అడిగాడు.

"ద్రోణ కర్ణ అస్త్రాగ్నులలో ఇదివరకే కాలవలసింది. యుద్ధం అయిపోయేదాకా కావాలని నేనే రక్షించాను" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడు కృష్ణ ప్రభువుకు వందనం చేశాడు. నడుస్తున్న స్వామిపై పుష్పవృష్టి కురిసింది. ●

# అశ్వత్థామ

చీకటి పడింది. చుక్కలు పొడిచాయి. రాత్రివేళ సంచరించే జంతువుల కలకలం వినపడుతోంది. కురు కులం నాశనమైనందుకు అశ్వత్థామ, కృపుడు, కృతవర్మ విచారిస్తూ అలసిపోయి నేలమీద శరీరాలు వాల్చారు. ఆచార్యుడూ, కృతవర్మా నిద్రపోయారు. కాని అశ్వత్థామ మాత్రం క్రోధంతో రోజుతూ మండిపడుతున్నాడు.

చెట్లకొమ్మల్లో పక్షులు హాయిగా ఆదమరిచి నిద్రపోతున్నాయి. ఇంతలో ఒక ఆకారం అక్కడికి మెల్లిగా వచ్చింది. ఎర్రగా భయంకరమైన మిడిగుడ్లు, నడుస్తుంటే రాగిరంగు రెక్కలు కదిలి వస్తున్న వికారమైన శబ్దం! వికృతంగా వున్న ముఖం నాలుగు వైపులకూ తిప్పి చూసింది. నిద్రపోతున్న పక్షులు కనిపించాయి. మెల్లిగా వాటి దగ్గరకు వెళ్ళి కొన్నిటికి కంఠాలు కొరికింది! కొన్నిటికి కాళ్ళు విరగ్గొట్టింది!! కొన్నిటికి రెక్కలు పీకేసింది! కొన్నిటికి పొట్టలు చీల్చింది! అలా అన్నిటినీ తలొక రకంగానూ చిత్రవధ చేసింది. అదంతా చూశాడు అశ్వత్థామ.

'ఆహా! ఓ గుడ్లగూబా! నీ పని ఎంత చక్కగా నిర్వహించావు! పాండవులను ఎలా నాశనం చెయ్యాలో తెలీక సతమతమవుతున్న నాకు చాలా చక్కని ఉపదేశమిచ్చావు. నేను కూడా నీలాగే శత్రువులు నిదురిస్తున్నప్పుడు సంహరించి కక్ష తీర్చుకుంటాను. దొరికిన ఉపాయాన్ని అవలంబించి శత్రువుల్ని చంపడం ధర్మమని శాస్త్రాలే చెబుతున్నాయి. పాండవుల్ని భుజపరాక్రమంతో జయించడం ఎలాగూ సాధ్యం కాదు' అనుకుంటూ కృపుడు, కృతవర్మలనిద్దరినీ నిద్రలేపాడు అశ్వత్థామ. 'ఇలాంటి ఆపద సమయంలో ఏమిటిలా నిద్రపోయాం' అనుకుని సిగ్గుపడ్డారు వాళ్ళిద్దరూ.

"నా తండ్రిని ధృష్టద్యుమ్నుడు అన్యాయంగా చంపాడు. వాడింకా ప్రాణాలతో వున్నాడంటే నేనెలా తలెత్తుకుని తిరగగలను? వాణ్ణీ, మిగిలిన శత్రువుల్నీ చంపడానికి నేనొక మార్గం నిశ్చయించాను. ఇంక శత్రువులెవరూ లేరు కదా అని పాండవులు ఈ రాత్రి ఆనందంతో ఆదమరచి నిద్రపోతుంటారు. ఆ సమయంలో వెళ్ళి అందర్నీ చిత్రవధ చేస్తాను. ధృష్టద్యుమ్నుడి శవం చూసేదాకా నాకీ పరాభవదుఃఖం పోదు. వాణ్ణి పట్టి పశువును చంపినట్టు చంపితేగాని నా మనస్సు ఊరట చెందదు" అన్నాడు అశ్వత్థామ ఆవేశంగా.

"ఆగ్రహావేశాలకు లోబడి నీతిమాలిన పనులు చేస్తే ఒకవేళ అవి ఫలించినా వాటివల్ల భయం, అసహ్యం తప్ప మరేం లభించవు. అనాలోచితంగా తొందరపడవద్దు. నిదానించు" అన్నాడు కృపాచార్యుడు. "పడినవాడు పగ తీర్చుకోవాలనుకోవడం సబబే. అది మాకూ ఇష్టమే! మేము నీతో ఏకీభవించి సహాయం చేస్తాం. కాని నువ్వు ఇప్పుడు బాగా అలసిపోయి వున్నావు. కాసేపు నిద్రపో! తెల్లవారగానే పాండవులను కడతేర్చే ఉపాయం ఆలోచిద్దాం" అన్నాడు.

"మామా! అలిగిన వాడికీ, చింతించే వాడికీ, ఆతురతతో వున్నవాడికీ, కోరికలు ముసిరిన వాడికీ నిద్రరాదు. వీటిలో ఒక్కటున్నవాడే నిద్రపోలేడంటే నాలుగు రకాల బాధలూ వున్న నాకు నిద్ర ఎలా పడుతుంది? పాండవులూ, పార్థసారథీ, సాత్యకీ లేని సమయమిది. నిద్రపోయే సమయంలో పాండవ పాంచాల బలాలన్నిటినీ చంపి అప్పుడు హాయిగా విశ్రమిస్తాను" అన్నాడు అశ్వత్థామ.

ఇక చేసేదిలేక ముగ్గురూ రథాలెక్కారు. మూడు రథాలూ పాండవ శిబిరం వైపు బయలుదేరాయి.

అశ్వత్థామ శిబిరద్వారంలోకి అడుగుపెట్టగానే రక్తం ఓడుతున్న పులిచర్మం ధరించి, విషనాగుల్ని కంఠాన దాల్చి కోరలతో భయంకరంగా వున్న నోరు తెరచుకుని, సహస్రనేత్రాలతో భీషణంగా చూస్తున్న భూతం ఒకటి అతనికి అడ్డంగా నిలబడింది. ఆ భయంకర ఆకారం చూస్తే కొండ అయినా భయంతో రెండుగా చీలిపోవాల్సిందే! దాని నోట్లోంచి, కళ్ళల్లోంచి, ముక్కుల్లోంచి, చెవుల్లోంచి మంటలు వస్తున్నాయి. దాని శరీర కాంతుల్లోంచి శంఖచక్రధారులైన విష్ణువులు అనేకమంది వెలువడుతున్నారు. అశ్వత్థామ ఆ భయంకరమైన భూతాన్ని చూసి బెదిరిపోయాడు. క్రమేపీ కాళ్ళలోకి సత్తువ తెచ్చుకుని దానిమీద అనేక అస్త్రశస్త్రాలు ప్రయోగించాడు. వాటన్నిటినీ ఆ భూతం అవలీలగా మింగేసింది. అశ్వత్థామ ఇంకేం చెయ్యలేక దిక్కులు చూస్తూ వుండిపోయాడు. ఆకాశంనిండా విష్ణురూపాలు కనిపించేసరికి వణికిపోయాడు. తరువాత మనస్సు స్థిరం చేసుకుని, ఆ సమయంలో పరమేశ్వరారాధన తప్ప మరో గత్యంతరం లేదని నిశ్చయించుకుని రథం దిగి నేలమీద కూర్చుని శివధ్యానం చేయడం మొదలుపెట్టాడు.

'ప్రభూ! చంద్రమౌళీ! ఈ ఆపద గడిస్తే నీకు భూతబలి ఇస్తాను. నేనే నీకు ఉపాహారమవుతాను' అనుకున్నాడు మనస్సులో. వెంటనే అతనిముందు ఒక బంగారు వేదికా, దానిమీద మండుతూన్న హోమాగ్నీ ప్రత్యక్షమయ్యాయి. చిరునవ్వు నవ్వుతూ అశ్వత్థామ అగ్నికి చేరువగా వెళ్ళాడు. కాని తన శరీరాన్ని ఆహుతి చేయడానికి ఆ కాస్త అగ్నీ సరిపోదనిపించి రథంమీద వున్న ధనువూ బాణాలూ తెచ్చి దాంట్లో ఇంధనంగా వేశాడు. అగ్ని ప్రజ్వరిల్లింది. ''మహానుభావా! నేను నీకు ఉపాహారమవుతున్నాను. శత్రువుల్ని జయించే శక్తి నాకు ప్రసాదించవలసిందిగా కోరుతున్నాను" అని ప్రార్థిస్తూ అగ్నిలోకి దూకాడు. అయినా అతని శరీరం కసుగంద లేదు. తెలివి నశించ లేదు. కళ్ళు తెరిచేసరికి ఎదురుగా పరమేశ్వరుడు కనిపించాడు.

అశ్వత్థామ సాగిలపడ్డాడు.

"బ్రాహ్మణోత్తమా! నీ సాహసానికి మెచ్చుకున్నాను. పాంచాలకులానికి కాలం సమీపించింది. ఈ రోజున పాండవ కుమారులందరూ మరణిస్తారు. నా అనుగ్రహం పొందావు నువ్వు'' అంటూ ఒక మహనీయ ఖడ్గాన్ని అందించాడు శివుడు. అది ఇస్తూనే తాను తేజోరూపంలో అశ్వత్థామ శరీరంలోకి ప్రవేశించాడు. వెంటనే ఇదివరకు భూతం మింగేసిన శస్త్రాస్త్రాలన్నీ యథాప్రకారం రథంమీద కనిపించాయి. వాటిని అందుకుని అశ్వత్థామ పాండవ శిబిరంలోకి వెళ్ళాడు.



నిద్రపోతున్న ద్రుపదకుమారుణ్ణి జుట్టు పట్టుకుని కిందపడేసి వింటినారితో అతని కంఠానికి ఉచ్చు బిగించాడు. గురగురమంటూ శబ్దాలు చేస్తూ ధృష్టద్యుమ్నుడు కాలం చేశాడు. తరువాత పాండవ వంశస్థులనందర్నీ ఒక్కడు కూడా మిగలకుండా నరికి పారేశాడు. పాండవశిబిరాలన్నిటినీ నెత్తుటిమడుగులు చేశాడు.

రాక్షసావేశం వదిలిపోయాక తను చేసిన ఘనకార్యం చెబుదామని దుర్యోధనుడి దగ్గరకు ఆదరా బాదరా వెళ్ళాడు అశ్వత్థామ. అప్పటికే చివరిదశలో వున్నాడు దుర్యోధనుడు. అశ్వత్థామ చెప్పిన మాటలు విని ఆరిపోయేముందు వెలిగే దీపంలా వెలిగాడు. ఆ పైశాచిక ఆనందంలోనే ప్రాణాలు విడిచాడు. ●

# ఉదంకుడు

**కు**రు పాండవ యుద్ధం ముగిశాక ద్వారకకు బయలుదేరాడు కృష్ణుడు.

రథం బయలుదేరింది. కొంచెంసేపట్లో ఉదంకుడి ఆశ్రమాన్ని సమీపించింది. కృష్ణుడు అక్కడ దిగి ఉదంక మహామునికి వినయంగా నమస్కరించి ఆయన ప్రక్కనే దర్భాసనం మీద కూర్చున్నాడు.

"మాధవా! పాండవ కౌరవుల యుద్ధం చక్కబెట్టి వచ్చావా? అనుకున్న పని నెరవేరింది గదా! అయినా నువ్వు తలచుకుంటే కానిదేముందిలే!" అన్నాడు ఉదంకుడు ఎత్తిపొడుపుగా.

"నయానా భయానా చెప్పాను. బ్రతిమాలాను. కానీ, ఆ దుర్యోధనుడు నా మాట వింటేనా? భీష్మ ద్రోణులు కూడా ఎంతో చెప్పారు. ఊఁహుఁ! అతగాడికి చెవికెక్కితేనా! గర్వంతో, లోభంతో కళ్ళుమూసుకుపోయి యుద్ధం చేశాడు. బంధుమిత్ర పరివార సమేతంగా మరణించాడు. విధిని ఎవరు దాటగలరు?" అన్నాడు కృష్ణుడు.

ఉదంకుడు కోపం ఆపుకోలేకపోయాడు. "నువ్వు వట్టి మోసగాడవు! చేతనై ఉండి కూడా సంధి చెయ్యకుండా నిష్కారణంగా కౌరవకులాన్ని నాశనం చేశావు. నీకు శాపమిస్తాను" అన్నాడు.

"అయ్యా! నువ్వు మహర్షివి. తొందరపాటు తగదు. కోపం కూడదు. నన్ను శపిస్తే నువ్విన్నాళ్ళనుంచీ సమకూర్చుకున్న తపస్సంపదా, బ్రహ్మచర్యం వృథాగా నశించిపోతాయి. ముందు నేను చెప్పేది విను. తరువాత నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి" అన్నాడు కృష్ణుడు. ఉదంకుడు అంగీకరించాడు.

"ఓ తపస్వీ! బ్రహ్మస్వరూపం ధరించి అన్ని లోకాలనూ నేనే సృష్టిస్తాను. విష్ణురూపం ధరించి రక్షిస్తాను. శివస్వరూపం ధరించి సంహరిస్తాను. ధర్మం నశించి అధర్మం ప్రబలినప్పుడు అవతరించి, దుర్మార్గులను నాశనం చేసి ధర్మస్థాపనం చేస్తాను. అలాంటివాడినై వుండి కూడా అధర్మపరులైన కౌరవులను ధర్మపరులైన పాండవులతో కలపాలని చూశాను. ఫలితం లేకపోయింది. కౌరవులు తమ దుర్మార్గం వల్ల ధర్మయుద్ధంలో పాండవుల చేతుల్లో చచ్చారు. ఇందులో నువ్వు నన్ను శపించవలసిందేముంది?" అని ప్రశ్నించాడు కృష్ణుడు.

తల వంచుకున్నాడు ఉదంకుడు. "మహాత్మా! నా ఆగ్రహం, తొందరపాటు నీ అమృత వాక్కులు వినటం వల్ల పోయాయి. ప్రభూ! నీ దయకు నేను పాత్రుడనైతే, అనుపమానమైన నీ స్వరూపం నాకు చూపించవా? నా చూపులు సార్థకం చెయ్యవా?" అని నమస్కరించి ప్రార్థించాడు.

కృష్ణుడు ఆ ప్రార్థన ఆలకించి తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. ఆశ్చర్యంతో చలించిపోయాడు ఉదంకుడు. "బహు పాదాలు, బహు శిరస్సులు, బహు గర్భాలు, బహు భుజాలు, సర్వం నువ్వే అయి కన్పిస్తున్నావు. భయమేస్తోంది. ప్రభూ! ఈ రూపం ఉపసంహరించి ఎప్పటిలా సౌమ్యాకారం ధరించి కనిపించు!" అని అర్థించాడు ఉదంకుడు.

"ఉదంకా! నీకేం వరం కావాలో కోరుకో" అన్నాడు వాసుదేవుడు.

"దేవా, ఇది మరుభూమి. ఇక్కడ నీళ్ళు దొరకవు. నాకు నిరంతరం జలం లభించేట్టు అనుగ్రహించు."

"అలాగే! నన్ను తలచుకోగానే జలం లభిస్తుంది నీకు!" అని వాసుదేవుడు ఉదంకుడికి వరమిచ్చాడు.

ఆ తరువాత ఒకసారి ఉదంకుడికి దాహం వేసింది. కృష్ణుడ్ని తలచుకున్నాడు. వెంటనే భుజాన తోలుసంచితో నల్లటి మనిషొకడు ప్రత్యక్షమయ్యాడు. అతడిచుట్టూ వేటకుక్కలున్నాయి. దిగంబరుడు. చేతిలో విల్లూ, బాణాలు ఉన్నాయి.



“ఉదంకా! ఈ నీళ్ళు తాగి నీ దాహం తీర్చుకో” అన్నాడతను.

“ఛీ! ఆ నీళ్ళు నా కక్కరలేదు” అన్నాడు ఉదంకుడు అసహ్యించుకుంటూ.

“చూడు! నువ్వు దాహంతో బాధపడుతూంటే, నీమీద దయతో వచ్చాను. కాదనకుండా తాగు!” అన్నాడు దిగంబరుడు.

“నువ్వు నాకేం సలహా చెప్పనక్కరలేదు. దయచెయ్యి” అన్నాడు ఉదంకుడు.

వెంటనే ఆ దిగంబరుడు కుక్కతోసహా అంతర్థానమయ్యాడు. ఇంతలో కృష్ణుడక్కడికి రానే వచ్చాడు. “మాధవా! మా మంచి వరం ఇచ్చావులే! ఎంత దాహమైనా నిషాదుడిచ్చిన నీళ్ళు నేను తాగుతానా?” అని నిష్ఠూరంగా అడిగాడు ఉదంకుడు.

“అయ్యో! నీ కోసం నేనుపడ్డ శ్రమంతా వృథా అయింది. నేను ఇంద్రుడి దగ్గరకు వెళ్ళి నీకోసం అమృతం ఇమ్మని అడిగాను. మానవులకు అమృతమెందుకు, ఇంకోటేదైనా అడగమన్నాడు. నేను ససేమిరా కాదన్నాను. ‘నా మీద ఉన్న ప్రేమతోనైనా ఉదంక మహామునికి అమృతం ఇవ్వాలి’ అని ప్రార్థించాను. ‘సరే అయితే! నేను

మారురూపంలో వెళ్ళి అతనికి అమృతం ఇస్తాను. అతను కనుక సిగ్గుపడో, అసహ్యించుకునో ఆ అమృతం తాగకపోతే మాత్రం నేను దానికి బాధ్యుడ్ని కాను' అన్నాడు ఇంద్రుడు. నేను సరేనన్నాను. అతడి రూపానికి రోసి నువ్వు ఆ అమృతాన్ని తిరస్కరించావు. పోనీలే! ఏం చేస్తాం! నేనిచ్చిన వరం వృథా కాకుండా చేస్తాను. నీకు నీరు కావలసివచ్చినప్పుడు మేఘాలు ఈ మరుభూమిలోకి వచ్చి వర్షిస్తాయి. అవి ఉదంక మేఘాలనే పేరుతో ఇక్కడే సంచరిస్తూ మానవాళికి ఉదకం ప్రసాదిస్తూ నీ కీర్తిని చాటుతూ ఉంటాయి" అని పలికి కృష్ణభగవానుడు అంతర్హితుడయ్యాడు. ఇప్పటికీ ఆ ఉదంక మేఘాలు ఒక్కొక్క పుణ్యతిథిలో ఆ మరుభూముల్లో వర్షిస్తుంటాయి.

●

# ధృతరాష్ట్ర పరిష్వంగం

**కు**రు పాండవ యుద్ధంలో కౌరవ సైన్యం మొత్తం మంటగలిసిపోయింది. పద్ధెనిమిది అక్షౌహిణుల సైన్యం నేలకూలింది. సుయోధనచక్రవర్తి భీమసేనుడి గదాఘాతం వల్ల తొడలు విరిగి దుమ్ములో ధూళిలో దొర్లి దిక్కుమాలిన చావు చచ్చాడు.

“హా! నాయనా! ఎంత అనుచితంగా అస్తమించావురా!” అంటూ ధృతరాష్ట్రుడు ఏడ్చాడు. గాంధారీ, కోడళ్ళూ స్పృహతప్పి పడిపోయారు. హస్తినాపురంలో ఆడవాళ్ళూ పిల్లలూ యుద్ధంలో చనిపోయిన వారికోసం ఆక్రందనలు చేస్తూ, కేకలు వేస్తూ వుంటే ఆ ధ్వనులు ఎక్కడచూసినా ప్రతిధ్వనిస్తున్నాయి.

“తమ్ముడా! విదురా! అనాథనయిపోయాను! అందరూ పోయారు! ఇంక నువ్వే నాకు దిక్కు” అంటూ దుఃఖించాడు గుడ్డిరాజు.

‘‘మహారాజా! అజాత శత్రుడి మంచితనాన్ని బలహీనతగాను,

చేతగానితనంగాను భావించి నిష్కారణవైరం కొనితెచ్చుకున్నారు. **తాటాకు మంటలాంటి కోపం వల్ల హాని లేదు. దీర్ఘక్రోధం వల్ల కీడు కలుగుతుంది. తమకు బలం ఎక్కువగా వుంటే యుద్ధం చెయ్యాలి. శత్రువులకు బలం ఎక్కువగా వుంటే సంధి చేసుకోవాలి.** అది రాజనీతి. పైగా పాండవులను కంటికి రెప్పలా కాపాడుతున్నాడు హరి. అది తెలిసి కూడా మూర్ఖంగా పౌరుషానికి పోయారు. కృష్ణార్జునుల బలం తెలుసుకోలేకపోయారు. ఇప్పుడు చింతించి ఫలమేమిటి?" అన్నాడు విదురుడు. ఇంతలో వ్యాసుడు కూడా వచ్చాడు. "నాయనా! నీకు తెలియనిదీ, నీకు కొత్తగా చెప్పవలసినదీ ఏదీ లేదు. భూభారం కొంత తగ్గటానికే ఈ యుద్ధం జరిగింది. ఇకమీదట ధర్మరాజునే నీ కుమారుడిగా భావించుకో. పాండవులందరినీ ప్రేమాభిమానాలతో చూడు" అని ధృతరాష్ట్రుడికి హితవు చెప్పాడు.



ఇలా అంటూ వుండగానే కృష్ణుడు, ధర్మరాజు వచ్చారు. ధర్మరాజు పిన తండ్రికి వంగి నమస్కరించాడు. శోకంలో వున్న ధృతరాష్ట్రుడు ధర్మరాజు శరీరమంతా తడిమి చూసి కౌగిలించుకున్నాడు. మరి కాసేపటికి భీమసేనుడు వచ్చాడు. "రారా తండ్రీ! రా" అని భీముణ్ణి రెండు చేతులతోనూ దగ్గరకు తీసుకోబోయాడు ధృతరాష్ట్రుడు. భీముణ్ణి వద్దని సైగ చేసి ఇనుముతో చేసిన ఒక బొమ్మను ఆ గుడ్డిరాజు ముందు

నిలబెట్టాడు కృష్ణుడు. ఇనుపమయంగా వున్న ఆ బొమ్మను భీమసేనుడే అనుకుని ధృతరాష్ట్రుడు రెండు చేతులతోనూ గట్టిగా నొక్కి, తన ఉక్కు కౌగిలిలో బిగించి అమితమైన కోపంతో అలాగే హతమార్చబోయాడు. తీరా నొక్కాక "అయ్యో! నా ప్రేమాతిశయం వల్ల ఏమీ తెలీలేదు. నా కౌగిలిలో భీముడు మరణించలేదు కదా" అని కల్లబొల్లి విచారాన్ని నటించాడు.

"ప్రభూ! మీ వల్లమాలిన ప్రేమ ఇంతపని చేస్తుందని నేను ముందే గ్రహించాను. భీముణ్ణి మీ పరిష్వంగంలోకి వెళ్ళవద్దని కళ్ళతోనే హెచ్చరించాను. మీ కౌగిలిలో విరిగిముక్కలైంది భీమసేనుడు కాదు, ఒక ఇనుప విగ్రహం! దైవానుగ్రహం వల్ల భీముడు క్షేమంగానే వున్నాడు" అన్నాడు కృష్ణుడు. గత్యంతరం లేక కోపాన్ని దిగమింగుకున్న ధృతరాష్ట్రుడు పాండుపుత్రులందరినీ దగ్గరకు తీసుకుని ఆశీర్వదించాడు. ●



# గాంధారిశాపం

**కు**రు పాండవ యుద్ధంలో ధృతరాష్ట్ర పుత్రులు అందరూ హతమయ్యారు. ఐశ్వర్యం పోయింది. బంధువులంతా నాశనమయ్యారు. "ఇంత దారుణం జరిగినా చావురాలేదు నాకు" అని వాపోయాడు గుడ్డిరాజు.

వ్యాసమహాముని ధృతరాష్ట్రుణ్ణి ఓదారుస్తూ, "నాయనా! ఎవ్వరి ప్రాణాలూ శాశ్వతం కాదు. ఈ సత్యాన్ని మనస్సుకు బాగా పట్టించుకున్నావంటే ఇంక నీకే దుఃఖం వుండదు. ఇప్పుడు విచారిస్తున్నావు కాని, జూదమాడేనాడు విదురుడెంత చెప్పినా విన్నావా? దైవకృత్యాన్ని మనుషులు తప్పించగలరా?" అన్నాడు.

"రాజా! ఒకనాడు దేవసభకు వెళ్ళాను నేను. దేవతలతో, మహామునులతో మాట్లాడుతున్న సమయంలో భూదేవి ఏడుస్తూ వచ్చిందక్కడికి.

'నా భారం తొలగిస్తామని మీరంతా బ్రహ్మసభలో ప్రతిజ్ఞలు పలికారు. ఇప్పుడిలా ఎందుకు ఆలస్యం చేస్తున్నారో తెలీడం లేదు. ఇంక నా భారం తొలగే

మార్గమేమిటి?' అని దేవతలను ప్రశ్నించిందామె.

'ధృతరాష్ట్రుడనే రాజుకు నూరుగురు కొడుకులు పుడతారు. వాళ్ళలో పెద్దవాడైన దుర్యోధనుడివల్ల నీ భారమంతా నశిస్తుంది. వాణ్ణి చంపడానికీ, రక్షించడానికీ ముందుకు వచ్చి భూమిమీద వున్న రాజులంతా సేనలతో సహా కురుక్షేత్రంలో హతులవుతారు. ఆ దుర్యోధనుడు కూడా తమ్ములతోపాటు మరణిస్తాడు. అంతటితో నీ భారం తీరిపోతుంది. వెళ్ళు! నిశ్చింతగా భూతధారణం చెయ్యి' అన్నాడు నారాయణుడు చిరునవ్వుతో.

"విన్నావు కదా రాజా! మరి కౌరవులు నాశనమయ్యారంటే ఆశ్చర్యమేముంది! విధిని ఎవరు తప్పిస్తారు?"

ధృతరాష్ట్రుడు ధైర్యం తెచ్చుకుని గాంధారినీ, కుంతినీ, కోడళ్ళనూ వెంటపెట్టుకుని యుద్ధభూమికి బయలుదేరాడు.

పెదతండ్రి వస్తున్నాడని తెలిసి ధర్మనందనుడు ముందే అక్కడికి వెళ్ళాడు. అతనివెంట తమ్ములూ ద్రౌపదీ కృష్ణుడూ కూడా వున్నారు.

ధర్మరాజు కంటపడగానే ధృతరాష్ట్రుడి కోడళ్ళందరూ బిగ్గరగా ఏడ్చారు. దుఃఖంతో, ఆవేశంతో పేరుపేరునా పాండవులందర్నీ నిందించారు.

కళ్ళనీళ్ళు కారుస్తూ మౌనంగా తల వంచుకున్నాడు ధర్మరాజు. ధృతరాష్ట్రుడి పాదాలకు నమస్కరించాడు. తరువాత పాండవులు కృష్ణసహితంగా వెళ్ళి గాంధారికి నమస్కరించారు.

కోపంతో మండిపడిందామె.

"శత్రువుల్ని చంపొచ్చు. కాని ఈ గుడ్డివాళ్ళిద్దరికీ ఊతకర్రగా ఒక్కణ్ణయినా మిగల్చకుండా అందర్నీ నాశనం చేశారే! మీకు అపకారం చెయ్యనివాడు వందమందిలో ఒక్కడైనా లేకపోయాడా? ఒక్కణ్ణి అట్టేపెడితే మీ ప్రతిజ్ఞ భంగమౌతుందా? ఆ ఒక్కడూ మిమ్మల్ని రాజ్యం చెయ్యనివ్వకుండా అడ్డగిస్తాడా? ఇంతకూ ఏడీ మీ మహారాజు?" ఎర్రబడిన ముఖంతో ప్రశ్నించింది.

అజాతశత్రుడు మోకరిల్లాడు. గాంధారి తలవంచి దీర్ఘంగా నిట్టూర్చింది. నేత్రాలను బంధించిన వస్త్రం సందులోంచి ఆ మహాసాధ్వి దృష్టి లిప్తపాటు ధర్మరాజు కాలిగోళ్ళ మీద పడింది. ఆ గోళ్ళు వెంటనే ఎర్రగా కందిపోయాయి. అది చూసి హడిలిపోయి కృష్ణుడి వెనకాల దాగాడు అర్జునుడు.

మహాజ్ఞానీ, సంయమనం కలదీ కనుక గాంధారి కోపాన్ని శమింప చేసుకుని "నాయనా! వెళ్ళి కుంతీదేవిని చూడండి" అంది.

కానీ ఇంతటికీ కారణమైన కృష్ణుడిపట్ల ఆమె క్రోధం కట్టలుతెంచుకుంది.

"వాసుదేవా! ఇలా రావయ్యా" అని పిలిచింది గాంధారి.

"కృష్ణా! కౌరవ పాండవ కుమారులు తమలో తాము కలహించుకున్నప్పుడు నువ్వు నచ్చచెప్పకపోయావు. కదనరంగాన కాలూనినప్పుడూ నువ్వు అడ్డుపడకపోయావు. సమర్థుడవై వుండి కూడా ఉపేక్ష చేశావు. అందర్నీ చంపించావు. దేశాలన్నీ పాడుబెట్టావు. జనక్షయానికి కారకుడవైన జనార్దనా! దీని ఫలం నువ్వు అనుభవించవలసిందే. నా పాతివ్రత్యపుణ్యఫలతపశ్శక్తితో పలుకుతున్నాను–నువ్వు వీళ్ళందర్నీ ఇలా చంపావు కనుక ఈనాటికి ముప్ఫై ఆరో సంవత్సరంలో నీ జ్ఞాతులు కూడా వీళ్ళలాగే పరస్పరం కలహించుకుని చస్తారు. అదే సమయాన నువ్వు దిక్కులేక నీచపు చావు చస్తావు. మీ కుల స్త్రీలు కూడా ఇలాగే అందర్నీ తలుచుకుని ఏడుస్తారు. ఇది ఇలాగే జరుగుగాక" అని శపించింది గాంధారి.

సమ్మోహకరంగా చిరునవ్వు నవ్వాడు కృష్ణుడు.

"అమ్మా! ఈ శాపం యాదవులకు ఇదివరకే ఇచ్చారు కొందరు మునులు. నువ్విప్పుడు చర్వితచర్వణం చేశావు. యదువంశీయులను దేవతలు కూడా చంపలేరు. అందుచేత వాళ్ళల్లో వాళ్ళే కొట్టుకుచస్తారు. పోనీలే కానీ అందువల్ల నీకేం వస్తుంది చెప్పు?" అన్నాడు నవ్వుతూనే.

పుత్రశోకంతో పరితపిస్తూ అవధులెరగని ఆక్రోశంలో అచ్యుతుని శపించిన గాంధారి జవాబు చెప్పలేక మౌనం వహించింది. ●

# యాదవ ముసలం

**క**ణ్వ, విశ్వామిత్ర, నారద మహర్షులు ముగ్గురూ కృష్ణభగవానుణ్ణి చూడటానికని ద్వారకానగరానికి బయలుదేరారు. వాళ్ళు రాజవీధిని వస్తూండడం చూసిన యాదవులకు దుర్బుద్ధి పుట్టింది. కృష్ణుడి కొడుకు సాంబుడికి ఆడపిల్ల వేషం వేసి తీసుకువచ్చి ''అయ్యా! ఇది భద్రుడి భార్య. దీనికి సంతానం కలుగుతుందా?" అని అడిగారు మునుల్ని యదుకుమారులు.

అంతమాత్రం తెలుసుకోలేరు గనుకనా ఆ మహర్షులు!

"వీడు కృష్ణుడి కొడుకు సాంబుడని తెలుసు మాకు. వీడికి యాదవవంశాన్ని నాశనంచేసే ముసలం పుడుతుంది! కృష్ణుడూ, బలరాముడూ తప్ప తక్కిన యాదవులంతా ఆ రోకలి వల్ల చస్తారు. బలరాముడు అధికనిష్ఠతో శరీరం విడిచి సముద్రంలో ప్రవేశిస్తాడు. నేలమీద పడుకుని వుండగా కృష్ణుణ్ణి 'జర' అనే రాక్షసి పుట్టి ఆక్రమిస్తుంది. పొండి" అన్నారు వాళ్ళు కోపంగా.



ఇంత చేసి ఇంక మనం వాసుదేవుణ్ణి చూడడం మంచిది కాదనుకుని మహర్షులు ముగ్గురూ వెనక్కి తిరిగి వెళ్ళిపోయారు.

తరువాత కృష్ణుడు ఇదంతా తెలుసుకుని జరగవలసింది జరిగే తీరుతుందనుకుని ఉదాసీనంగా వూరుకున్నాడు.

ఆ మర్నాడు సాంబుడి కడుపులోంచి భయంకరంగా వున్న ఒక రోకలి పుట్టింది. యాదవులందరూ భయంతో పరుగెత్తుకు వెళ్ళి ఆ సంగతంతా వసుదేవుడికి చెప్పారు. ఆయన అదంతా విని కొయ్యబారిపోయాడు.

"ఆ రోకలిని పిండి పిండి చేసి సముద్రంలో కలిపిరండి" అని ఆజ్ఞాపించాడు. యాదవులంతా వెళ్ళి ఆయన చెప్పినట్టే చేశారు. కాని గాంధారి శాపం, మహర్షుల ఆగ్రహం ఎక్కడికి పోతాయి?

ద్వారకాపట్టణంలో అనేక ఉత్పాతాలు కనిపించాయి. రాత్రివేళల్లో చిలుకలు గుడ్లగూబల్లా అరవసాగాయి. పగలు మేకలు నక్కల్లా కూశాయి. ఆవులకు గాడిదలూ, ముంగిసలకు ఎలుకలూ, కుక్కలకు పిల్లులూ పుట్టాయి. కృష్ణబలరాములు తప్ప మిగిలిన యాదవులందరూ సజ్జనులను బాధపెట్టటం మొదలుపెట్టారు. గురువులను

అవమానించారు. స్త్రీలు ఇష్టం వచ్చినట్టు సంచరించారు. కూడూ కూరలూ అప్పుడే పొయ్యిమీద నుంచి దింపినాసరే– పురుగులు పట్టడం మొదలెట్టాయి. ఈ అశుభ సూచనలన్నీ చూసి గాంధారి శాపం ఫలించే సమయం ఆసన్నమైందనుకున్నాడు కృష్ణుడు. యాదవులు తీర్థసమీపంలో చావడం మంచిదని భావించాడు కృష్ణుడు. ఇంక తెల్లవారితే వాళ్ళంతా కాలం చేస్తారనగా అంతకు ముందురోజే కొలువుతీర్చి "సముద్రానికి జాతర చెయ్యాలి. అందరూ బయల్దేరండి" అని ఆజ్ఞ ఇచ్చాడు.

రాబోతున్న ప్రమాదం గ్రహించుకోలేక పానీయాలూ, భక్ష్యభోజ్యాలు, మాంసాహారాలూ సమకూర్చుకుని, అందంగా అలంకారాలు చేసుకుని చతురంగ బలాలతో బయలుదేరారు యాదవులు.

నిర్వికారుడై బయలుదేరాడు కృష్ణుడు.

అందరూ సముద్రతీరాన వున్న పందిళ్ళ దగ్గరకు చేరుకున్నారు. బలరాముడు మాత్రం అరణ్యాలకు వెళ్ళాడు. యాదవులు తెచ్చుకున్న భక్ష్యాలన్నీ తిన్నారు. ప్రభువైన కృష్ణుడి ఎదురుగానే మత్తుపానీయాలు సేవించారు. అసంబద్ధపు ప్రేలాపనలు సాగిస్తూ నవ్వడం మొదలుపెట్టారు.

"ప్రద్యుమ్నా! అడుగో కృతవర్మ! చూశావా! నిద్రపోతున్న వాళ్ళను చంపాడు. ఏంపౌరుషంరా! ఎంత నీచుడైనా అలాంటి పని చేస్తాడా?" సాత్యకి కృతవర్మను ఎగతాళి చేశాడు.

"అర్జునుడు చెయ్యి నరికితే శాంతించిన భూరిశ్రవుణ్ణి చంపావు నువ్వు. అది మరిచిపోయావా? నువ్వు చేసింది రణనీతి కాబోలు!" కృతవర్మ ఆక్షేపించాడు.

ఆ ఎకసెక్కానికి సాత్యకికి కోపం వచ్చి కత్తి దూసి గబగబ వెళ్ళి కృతవర్మ కంఠం నరికేశాడు. సముద్రతీరాన తుంగగా మొలిచిన రోకలి ప్రభావం ఆ నిమిషంలో ఆ కత్తిని ఆక్రమించి వుంది. అంతటితో వూరుకోక సాత్యకి భోజులందరిమీదా విజృంభించాడు. వారించడానికి కృష్ణుడు వెళ్ళేలోగానే భోజులంతా సాత్యకిని చుట్టుముట్టారు. అయితే జరగబోయేదంతా తెలిసిన వాడవడం వల్ల కాలస్వరూపుడైన కృష్ణుడు సాత్యకిని రక్షించే ప్రయత్నం చెయ్యలేదు.

సాత్యకిని కాపాడడం కోసం ప్రద్యుమ్నుడు విజృంభించాడు. ఈ విధంగా వాళ్ళల్లో వాళ్ళకు కయ్యం ప్రారంభమైంది. ఆ సముద్రతీరంలో మొలిచిన తుంగ పీకి దాంతో ఒకరినొకరు కొట్టుకుని హతులయ్యారు వాళ్ళందరూ.

ఆనాడు వాళ్ళు అరగదీసి సముద్రంలో కలిపిన రోకలే అక్కడ తుంగగా మొలిచింది! అదే వాళ్ళ యుద్ధానికి సాధనమై చావుకు కారణమైంది!!

చావకుండా మిగిలినవాళ్ళను కోపంతో తుంగతో మోది చంపాడు కృష్ణుడు. ఆయనకు ఆ కోపం కూడా మునుల శాపంవల్లే కలిగింది. దారుకుడూ బభ్రుడూ తప్ప మిగిలిన యాదవులంతా నాశనమయ్యారు. వాళ్ళిద్దర్నీ వెంటబెట్టుకుని బలరాముడు వెళ్ళినమార్గానే సాగాడు కృష్ణుడు. ●

# యదువంశ క్షయం

**కృ**ష్ణుడి ఆజ్ఞ మేరకు అర్జునుణ్ణి వెంటబెట్టుకొచ్చేందుకు దారుకుడు పాండవుల దగ్గరికి వెళ్ళాడు. ఏడుస్తున్న దారుకుణ్ణి చూసేసరికి పాండవుల గుండెలు ఝుల్లుమన్నాయి. యాదవులందరూ మరణించారని దారుకుడు చెప్పగానే కన్నీళ్ళు కార్చారు అన్నదమ్ములు అయిదుగురూ.

"కృష్ణుడు నిన్ను తీసుకురమ్మని పంపాడు నన్ను" అన్నాడు దారుకుడు అర్జునుడితో. అర్జునుడు ధర్మరాజు ఆజ్ఞ తీసుకుని ద్వారకకు బయలుదేరాడు.

చంద్రుడు లేని రాత్రీ, దినమణి లేని ఆకాశం ఎలా వుంటాయో అలాగ వుంది కృష్ణుడు లేని ద్వారక. తమ విభుని ప్రియసఖుణ్ణి చూడటంతోనే కృష్ణుడి భార్యలు పదహారువేలమందీ గట్టిగా ఏడుస్తూ చుట్టూ నిలబడ్డారు. దైన్యం స్త్రీల రూపాలు ధరించి వచ్చినట్టున్న వాళ్ళను చూసి అర్జునుడు మరింతగా దుఃఖపడ్డాడు.

ఏడ్చి ఏడ్చి కృశించి శయ్య మీద పడివున్న వసుదేవుడు అర్జునుణ్ణి చుట్టేసుకుని బావురుమన్నాడు. "మనుష్యమాత్రులు కారు యదుకుమారులు! దేవ పరాక్రములు! దానవులనైనా చంపి ప్రకాశించే దర్పంగలవారు! అకారణంగా వైరం పెంచుకుని తమలో తాము కొట్టుకుని మరణించారు. అయినా వాళ్ళననడమెందుకులే! ముని శాపం అలా పరిణమించింది. చచ్చిన పరీక్షిత్తుని బతికించిన శౌరి జరిగిన ఘోరమంతా చూస్తూనే ఉపేక్షించాడు" అన్నాడు వసుదేవుడు కన్నీళ్ళు కారుస్తూ.

"బావ ఎక్కడ వున్నాడు!" అని అడిగాడు అర్జునుడు.

"పార్థా! 'అర్జునుడు వస్తాడు, నీ ఆజ్ఞలన్నీ అతడు నెరవేరుస్తాడు. కార్యజ్ఞుడూ శౌర్యశాలీ కూడా అతడు! కిరీటీ నేనూ ఒకటే! నువ్వు శోకం విడిచి అతన్ని చేతపట్టి అందర్నీ రక్షించుకో. ఇంక కొద్దిరోజుల్లో ఈ నగరాన్ని సముద్రం ముంచేస్తుంది' అని చెప్పి నన్ను ఊరడించి, అన్నతోపాటు తపస్సు చేసుకోవటానికి కృష్ణుడూ వెళ్ళిపోయాడు" అన్నాడు వసుదేవుడు.

అర్జునుడు దారుకుణ్ణి పిలిచి "కృష్ణుడు వెళ్ళిన దిక్కుగా వెళ్దాం మనం. ఇక్కడ చెయ్యవలసిన పనులన్నీ మంత్రులకు అప్పగిద్దాం. మంత్రుల్నీ, పౌరుల్నీ పిలిపించు" అన్నాడు.

దారుకుడు వెంటనే ఆజ్ఞ పాటించాడు.

వాళ్ళందర్నీ ఒక్కసారి కలయచూసి "ఈనాటికి ఏడవరోజున ఈ పట్టణాన్ని సముద్రం ముంచేస్తుందని దేవతల వాక్కు! కనుక మనమందరం త్వరగా ద్వారకను విడిచివెళ్ళాలి. ఇంద్రప్రస్థానికి వసుదేవుడి మనుమడైన వజ్రుణ్ణి రాజుగా చేస్తాను. మీరందరూ వెళ్ళి అక్కడ అతని పరిపాలనలో సుఖంగా వుండండి. మొయ్యగలిగినన్ని సరుకులు మోయించండి. బళ్ళు సిద్ధం చెయ్యండి. ఇదివరకు గోవిందుని నీడన యాదవవీరులంతా ఎలా సుఖంగా వున్నారో, అలాగే ఇప్పుడు ఈ దేశపు ప్రజలంతా ధర్మరాజు ఆదర గౌరవాలందుకుంటూ వుంటారు" అని ఆజ్ఞాపించాడు అర్జునుడు.

ప్రజలు వెళ్ళిపోయారు.

ఆ రాత్రంతా భారమైన మనస్సుతో కృష్ణమందిరంలోనే గడిపాడు అర్జునుడు.

తెలతెలవారే సమయంలో వసుదేవుడు యోగనిష్ఠతో శరీరం విడిచిపెట్టాడు.

అంతఃపురమంతా రోదన ధ్వనులతో మారుమోగిపోయింది.

వసుదేవుడి భార్యలు దేవకి, రోహిణి, భద్ర, మదిర సహగమనం చేశారు.

'నన్ను పిలిపించి తన తండ్రికి కావలి పెట్టాడు మాధవుడు. అలాంటివాడికి తండ్రి మరణవార్త ఎలా చెప్పను? ఈ చావుకబురు చెప్పి తపోనిష్ఠలో వున్న నారాయణుడికి బాధ కలిగించడమెందుకు?' అనుకున్నాడు అర్జునుడు. అంతలోనే 'అయ్యో! పెదతల్లి గాంధారీదేవి శాపం ఎందుకో అస్తమానం జ్ఞాపకం వస్తోంది. ఏకాంత ప్రదేశంలో దిక్కులేని చావు చావమని కృష్ణుణ్ణి శపించిందామె. ఎలా వున్నాడో ఏమో!' అనుకుంటూ త్వరత్వరగా బయలుదేరాడు అర్జునుడు. కలతపడిన హృదయంతో కృష్ణుడి కోసం అరణ్యమంతా గాలించసాగాడు. ఒకనాడు అతనికొక బోయవాడు ఎదురయ్యాడు.

"ఎక్కడకు వెళ్ళాలి దొరా?" అని ప్రశ్నించాడు.

"కృష్ణభగవానుడు తపస్సు చేసుకుంటున్న చోటికి!" అర్జునుడు జవాబు చెప్పాడు.

"ఆ మహానుభావుణ్ణి ఒకనాడు ఒకచోట చూశాను. మరి ఇప్పుడు అక్కడున్నాడో లేడో తెలీదు. అయినా ఆ చోటు చూపిస్తాను రండి" అని బోయవాడు బయలుదేరాడు. ఇద్దరూ కలిసి తిన్నగా అచ్యుతుడు వున్న చోటుకు వెళ్ళారు. అక్కడ నేలమీద పడివున్న జగదేకవంద్యుడి మృతదేహాన్ని చూసి మూర్ఛపోయాడు అర్జునుడు.

'ఈ మహానుభావుడికి ఈ గతి ఎలా సంభవించింది?' అనుకుంటూ శరీరమంతా కలయచూశాడు అర్జునుడు. పాదంలో గుచ్చుకున్న బాణపు గాయం కనిపించింది. అది చూస్తూనే దుర్వాసుడి మాటలు గుర్తుకు వచ్చి ఆశ్చర్యపోయాడు అర్జునుడు. 'కృష్ణుడి కళేబరాన్ని నగరానికి తీసుకుపోవడమా? లేకపోతే బంధువులందర్నీ ఇక్కడికే పిలిపించడమా?' అని ఆలోచిస్తూ వుండగా సముద్రం పట్టణాన్ని ముంచబోతున్న విషయం జ్ఞాపకం వచ్చింది అర్జునుడికి.

వెంటనే చితి పేర్చి మృతదేహానికి అగ్ని సంస్కారం చేశాడు. గబగబ ద్వారకకు బయలుదేరాడు. తెల్లవారేలోపల బలరామకృష్ణుల భార్యలనూ, మిగిలిన ప్రజలనూ పురం దాటించాడు పార్థుడు. అందరికీ తానే దిక్కై ముందుకు నడిచాడు. ఇంతలో కిరాతకుల గుంపొకటి యాదవ స్త్రీలపై దాడి చేసింది. సవ్యసాచి ఆగ్రహావేశాలతో అస్త్రప్రయోగం చెయ్యబోయాడు. చిత్రం- ఒక్క మంత్రం కూడా గుర్తు రాలేదు! ఆశ్చర్యం, విషాదం కూడా కలిగాయి విజయుడికి. గాండీవంతోనే ఆ దొంగలను మోదసాగాడు. చివరకు ఎలాగైతేనేం- కృష్ణుడి ఎనమండుగురి భార్యలనూ,

బలరాముడి భార్యలనూ, ఇంకా కొంతమంది స్త్రీలనూ మాత్రం రక్షించగలిగాడు. వాళ్ళను వెంటబెట్టుకుని కురుక్షేత్రానికి చేరుకున్నాడు.

అక్కడ తాను కృష్ణుణ్ణి వెదకడానికి వెళ్ళింది మొదలు, మళ్ళీ ద్వారకకు వచ్చేవరకూ జరిగినదంతా అందరికీ దీనంగా వివరించాడు అర్జునుడు. రామకృష్ణుల భార్యలు మొదలు నరికిన మానుల్లా నేలకొరిగారు. ●



# శ్రీకృష్ణ నిర్యాణం

దారుకుణ్ణి, బభ్రుణ్ణి వెంటపెట్టుకుని బలరాముడిని వెతుకుతూ బయలుదేరాడు కృష్ణుడు. కొంచెం దూరం వెళ్ళేసరికి ఒక చెట్టుకింద అన్న కనిపించాడు.

"దారుకా! నువ్వు వెళ్ళి పాండవులతో యాదవనాశనం గురించి చెప్పి అర్జునుణ్ణి తీసుకురా. బభ్రూ! నువ్వు ఆడవాళ్ళనందర్నీ పట్టణానికి చేర్చి మళ్ళీ రా" అని ఆజ్ఞాపించాడు కృష్ణుడు. ఇద్దరూ బయలుదేరారు. కనుచూపు మేరలోనే ఒక బోయవాడు బభ్రుణ్ణి తుంగతో మోది చంపాడు.

అది చూసి మునివర్యుల శాపశక్తికి ఆశ్చర్యపడ్డాడు కృష్ణుడు.

బలరాముని దగ్గరకు వెళ్ళి "అన్నా! నేను ఈ వాహనాలనూ, వనితలనూ మన పురానికి తీసుకువెళ్ళి విడిచి, తండ్రి ఆజ్ఞ తీసుకుని వస్తాను. అందాకా నువ్వు ఇక్కడే వుండు" అని చెప్పి ద్వారకానగరానికి వెళ్ళాడు.

వసుదేవుణ్ణి చూశాడు. "తండ్రీ! ఇంతవరకు కౌరవ నాశనం, ఇప్పుడు యాదవ నాశనం చూశాను. బంధుమిత్రులెవరూ లేని ఈ నగరంలో వుండబుద్ధి కావడంలేదు నాకు. అన్న ఎలాగూ అరణ్యాల్లోనే వున్నాడు. నేను కూడా వెళ్ళి అన్నతోపాటు తపస్సు చేసుకుంటాను. ఇక అన్ని విషయాలూ మీరే సమర్థించుకోండి. రేపోమాపో అర్జునుడు వస్తాడు, మీ ఆజ్ఞలను పాటిస్తాడు" అంటూ తండ్రి పాదాలకు నమస్కరించాడు కృష్ణుడు. ఆ వృద్ధమూర్తి మాటలు రాక, చేష్టలు దక్కి మూగబోయాడు.

యాదవస్త్రీలంతా గొల్లున ఏడ్చారు. కృష్ణుడు కరిగిపోయి "ఇప్పుడే వస్తాడు అర్జునుడు, మీ కష్టాలన్నీ తీరుస్తాడు. ఊరుకోండి" అని వాళ్ళందర్నీ ఊరడించాడు. అందరికీ నచ్చచెప్పి తండ్రి దగ్గర సెలవు తీసుకుని బలరాముడి దగ్గరకు వచ్చాడు కృష్ణుడు.

"అన్నా! తపస్సు చేసుకోవటానికి తండ్రిగారి అనుమతి తీసుకుని వచ్చాను" అన్నాడు.

ఆ సమయంలో బలరాముని ముఖంలోంచి ఒక మహాసర్పం బయటకు వచ్చింది. ఎర్రటి తలలు వెయ్యి వున్నాయి దానికి. పడగలు మణులతో వెలిగిపోతున్నాయి. తెల్లని శరీర ఛాయ! పర్వతమంతటి దేహం! అలా బలరాముడు యోగబలంతో శరీరం విడిచి తన నిజరూపం ధరించి సముద్రమార్గాన సాగిపోతుండగా సర్పసమూహాలన్నీ వచ్చి భక్తితో సేవించాయి. గంగానది మొదలుగా గల మహానదులన్నీ ఆకారాలు ధరించి వచ్చి ఆయనను ఆరాధించాయి. అదంతా కృష్ణుడు దివ్యదృష్టితో చూస్తుండగానే అనంతుడు తన అంశ అయిన ఆ మహాసర్పాన్ని తనలో లీనం చేసుకున్నాడు.

ఛత్రమూర్తి తనను విడిచి వెళ్ళగానే కర్తవ్యచింత ఆవహించింది కృష్ణుణ్ణి. భూలోకంలో చెయ్యవలసిన పనులన్నీ అయిపోయాయి. శరీరం విడిచిపెట్టడానికి ఏ కారణం దొరుకుతుందా అని ఆలోచించసాగాడు అచ్యుతుడు. ఒకప్పుడు రుక్మిణీ సహితంగా దుర్వాసుని సేవించిన సందర్భంలో తను ఆయన అరికాలిలో పాయసం రాయకపోవడం, అందువల్ల "నీకు అరికాలి ద్వారా అపాయం కలుగుతుంది" అని ఆ మహర్షి అనడం గుర్తుకు వచ్చాయి. వెంటనే ఒక చెట్టునీడన పవళించి సమాధిగతుడయ్యాడు జలధిశయనుడు.

అప్పుడు జర భయపడుతూ మెల్లమెల్లగా అక్కడికి రాసాగింది. ఆ చుట్టుపక్కల తిరుగుతున్న వేటగాడొకడు కనిపించాడు దానికి. వాడికి కృష్ణుడిపాదం లేడిపిల్ల ముఖంలా భ్రమ గొలిపేటట్టు చేసింది జర. అల్లంతదూరం నుంచి చూసి ఆ వేటగాడు మా మంచి లేడి దొరికిందనుకుంటూ గురి చూసి బాణం విడిచాడు. అది వెళ్ళి హరి అరికాలిలో గుచ్చుకుని పాదంపైనుంచి దూసుకుపోయింది.

ఆ బోయవాడు దగ్గరకు వచ్చి పరమాత్ముణ్ణి చూసి, తన తప్పు తెలుసుకుని ఆయన పాదాలమీద పడి పెద్దగా ఏడవడం మొదలుపెట్టాడు. నిరాకరుడూ, నిర్గుణుడూ అయిన వేదమూర్తి వాణ్ణి ఓదార్చి పంపేసి ఆ వంకతో మానవదేహాన్ని విడిచిపెట్టాడు.

ఊర్ధ్వలోకాలకు వెళ్ళగానే ఆదివిష్ణువుకు ఇంద్రాది దేవతలంతా భక్తితో ప్రణమిల్లారు.

"ఆదిపురుషా! ధర్మరక్షణకోసం లీలామానుషరూపుడవై పుట్టావు. శత్రువు లందర్నీ చంపావు. ప్రతి యుగంలోనూ ఇలాగే అవతరించి ధర్మరక్షణ చేస్తూ వుండు" అంటూ ప్రార్థించాడు ఇంద్రుడు. మహావిష్ణువు మీద పుష్పవర్షం కురిసింది. బ్రహ్మదేవుడు హరి పాదాలకు నమస్కరించి వేదవాక్కులతో స్తుతించాడు. వాళ్ళ భక్తికి ప్రీతి పొంది "అనిరుద్ధ, ప్రద్యుమ్న, సంకర్షణ, వాసుదేవ భావాలు కలిగే సిద్ధిని పొందాను. నా స్థానాన్ని నేను చేరుకుంటాను. మీరు సుఖంగా వుండండి" అని అంతర్హితుడయ్యాడు మహావిష్ణువు.

ఇంద్రియాలకు కనిపించని ఆ పరమాత్ముణ్ణి బుద్ధితో చూస్తూ ఆయన అద్భుత కృత్యాలను వర్ణించుకుంటూ బ్రహ్మాది దేవతలంతా తమ తమ స్థానాలకు వెళ్ళిపోయారు. ●

# మహాప్రస్థానం

రక్తపుటేరుల మధ్య కురుక్షేత్రసంగ్రామం ముగిసింది. ఆ తరువాత యదునాశనమూ జరిగింది. అంతటి బీభత్సాన్నీ, మృత్యునృత్యాన్నీ కళ్ళారా చూసాక సకలకర్మలూ త్యజించి మహాప్రస్థానం చెయ్యాలనే బుద్ధి పుట్టింది ధర్మరాజుకు. తక్షణం ఏకైక వంశాంకురం పరీక్షిత్తుకు పట్టాభిషేకం చేసి సామ్రాజ్యభారం అప్పగించారు పాండవులు.

అన్నదమ్ములైదుగురూ ఆభరణాలన్నీ తీసేసి, నారచీరలు కట్టుకున్నారు. ద్రౌపది కూడా అలాగే చేసింది. ముందు ధర్మరాజు, ఆయన వెనుక భీముడు, తరువాత అర్జునుడు, అతనివెంట నకులసహదేవులు, వాళ్ళననుసరించి ద్రౌపది కదిలి వెళ్ళారు.

వారి వెంట ఒక కుక్క కూడా బయలుదేరింది. యోగబలంతో అనేక నదులూ పర్వతాలూ అరణ్యాలూ దాటి వాళ్ళు తూర్పు సముద్రతీరం చేరారు. ఇంతలో

ప్రకాశవంతమైన శరీరంతో ఒక మహారూపం వాళ్ళ ఎదురుగా నిలిచింది.

"అర్జునా! నేను అగ్నిని. దేవకార్యం కోసం వరుణదేవుణ్ణి అడిగి నీకు గాండీవాన్ని తెచ్చియిచ్చాను. అనుకున్న పని నెరవేరింది కనుక నీ వద్ద వున్న దివ్యధనువును ఆ మహానుభావుడికి యిచ్చెయ్యి" అన్నాడు అగ్నిదేవుడు.

వెంటనే సవ్యసాచి గాండీవాన్ని సముద్రానికి సమర్పించాడు. అగ్నిదేవుడు అంతర్హితుడయ్యాడు.

అక్కడి నుంచి బయలుదేరి మేరుపర్వతాన్ని సమీపించారు పాండవులు. యోగసాధనాపరులై ఆ పర్వతంపై వెళ్తూ వుండగా యోగబలాన్ని కోల్పోయి పాంచాల పుత్రిక కింద పడిపోయింది.

"అన్నా! అన్నా! ద్రౌపది పడిపోయింది" అరిచాడు భీముడు.

"పడనీ" అన్నాడు ధర్మరాజు నిర్లిప్తంగా. లిప్తకాలమైనా ఆగలేదు. "పాంచాలి యందు ఎన్నడూ అధర్మం లేదే! అయినా ఎందుకిలా అయింది?" భీముడు విషాదంతో ప్రశ్నించాడు.

"ఆమెకు అర్జునుడంటే ప్రేమ ఎక్కువ. ఆ పక్షపాతబుద్ధివల్ల ఆవిడ సుకృతాలు ఫలించలేదు" అన్నాడు ధర్మరాజు.

కొంచెం దూరం వెళ్ళాక, "అన్నా! సహదేవుడు పతనమయ్యాడు" అని కేకపెట్టాడు భీముడు.

"తనకంటే ప్రాజ్ఞుడెవడూ లేడని అహంకారం వాడికి" అన్నాడు ధర్మరాజు.

మరికొంచెం దూరం సాగారు. భార్య, తమ్ముడు పడిపోవడం చూసి ధైర్యం పోయినవాడిలా కూలిపోయాడు నకులుడు.

"అన్నా! నకులుడు నేలకూలాడు!" ఆర్తనాదం చేశాడు భీముడు.

"తనంత అందగాడెవడూ లేడని మిడిసిపాటు వాడికి. అదే కీడైంది" అన్నాడు ధర్మరాజు.

ఇంకొంచెం దూరం వెళ్ళారు. అంతలో అర్జునుడు ఒరిగిపోయాడు. "అన్నా! అర్జునుడు..." అని అరిచాడు భీముడు.

"కౌరవులందరినీ కలిపి ఒక్కనాడే చంపుతానన్నాడు. అలా చేయలేకపోయాడు. ధనుర్ధరులైన వాళ్ళకు మాట ఒకటీ, చేత ఒకటీ కాకూడదు. అది మహాదోషం"

అన్నాడు ధర్మరాజు.

ఆప్తుల మరణాల్ని చూసేసరికి ధైర్యం జారిపోయింది భీముడికి. కుప్పగా కూలిపోయాడు. "అన్నా! నేనూ పడిపోయాను" అన్నాడు హీనస్వరంతో.

"నువ్వు తిండి తెగ తింటావు. ప్రచండమైన భుజశక్తి కలిగి, ఎవరినీ లక్ష్యపెట్టవు. అందుకే యీ గతి పట్టింది నీకు" అని చెప్పి నిర్వికారంగా ముందుకు సాగిపోయాడు ధర్మరాజు. శునకం మాత్రం అతనిని భక్తితో అనుసరించి వెళ్ళింది.

కొంతదూరం వెళ్ళేసరికి దశదిశలూ దివ్యకాంతులతో వెలగసాగాయి. దేవేంద్రుడు స్వయంగా వచ్చి "ధర్మరాజా! ఉత్తమ పురుషుడవు నువ్వు. రా! ఇదిగో దివ్యరథం! ఎక్కు" అంటూ ఆహ్వానించాడు.

దుఃఖం ముంచుకువచ్చింది ధర్మరాజుకు. "తమ్ములంతా పోయారు. పాంచాలకుమారి దప్పితో కూలిపోయింది. శోకం అగ్నిలా దహిస్తోంది నన్ను. వాళ్ళు లేకుండా నేను మీతో రాలేను" అన్నాడు.

"పాండవాగ్రజా! విచారించకు! శరీరాలు విడిచి నీవాళ్ళందరూ యిదివరకే స్వర్గానికి వచ్చారు. వాళ్ళను అక్కడ చూద్దువుగాని. నువ్వు శరీరం విడిచిపెట్టనక్కరలేదు. రా" అన్నాడు ఇంద్రుడు.



"నేను ఊరు విడిచింది మొదలు, భక్తితో నా వెంటే వచ్చింది యీ జాగిలం. మరి దీనికి కూడా స్వర్గ ప్రవేశం కావాలి. అందుకు అనుమతించాలి" అన్నాడు ధర్మజుడు.

"ధర్మరాజా! జాగిలానికి దేవభావం ఎలా వస్తుంది! దీన్ని నీతో తీసుకురావడం సాధ్యం కాదు. పద. రథం ఎక్కు" అని దరహాసం చేశాడు ఇంద్రుడు.

"మహానుభావా! నీ వంటి దివ్యపురుషుడు తలుచుకుంటే సాధ్యం కానిదేముంటుంది! ఆశ్రయించిన వాళ్ళకోసం ఆ మాత్రపు కార్యం నెరవేర్చడం నీకు భారమా? ఆశ్రితుల్ని విడిచిపెట్టి పొందే సంపద నాకేం యింపుగా వుంటుంది?" అని దీనంగా ప్రార్థించాడు ధర్మజుడు.

"ధర్మజా! ఇదెక్కడి తెలివితక్కువతనం! శునకాలకు స్వర్గవాసం సంభవిస్తుందా? దీన్ని వదలడం కాఠిన్యమెంత మాత్రం కాదు. నా మాట విను."

"భక్తుడైన వాణ్ణి విడిచిపెడితే బ్రహ్మహత్యాపాతకం కలుగుతుందని పెద్దలంటారు. అందువల్ల దీన్ని విడిచిపెట్టను. దివ్యసుఖం కోసం పాపం మూట కట్టుకోలేను."

"నీకింత పట్టుదల ఎందుకు? తమ్ములనూ, భార్యనూ విడిచావా లేదా! జీవితాంతం అన్ని ఒడిదుడుకుల్లోనూ నీకు తోడుగా నిలిచినవారిముందు యీ శునకం ఎంత? దీన్ని విడవలేనంటావు. ఇదేమైనా బాగుందా?"

"స్వామీ! అఖిల లోకాలకు అధిపతివి నువ్వు. నీకు తెలీని ధర్మం లేదు. పైగా పెద్దలతో వాదించకూడదు. అయినా మీకొక విన్నపం చేసుకుంటున్నాను. తమ్ములూ, భార్యా ఎలాగో చచ్చిపోయారు. ఇప్పుడు వాళ్లకోసం దుఃఖిస్తే మాత్రం ప్రయోజనమేమిటి? చావకుండా నాతో వచ్చిందీ కుక్క. శరణన్నవాణ్ణి ఉపేక్షించడం, సన్మిత్రుడికి ద్రోహం చెయ్యడం, స్త్రీని చంపడం, బ్రాహ్మణార్థం దొంగిలించడం అనే మహాపాపాలెలాంటివో నిరపరాధి అయిన భక్తుణ్ణి విడిచిపెట్టడం కూడా అలాంటి పాపమే. నన్ను మన్నించు. నేనిక్కడే వుండి తపస్సు చేస్తూ నిన్ను సేవిస్తూ వుంటాను" ధర్మరాజు దృఢంగా చెప్పాడు.

ఉత్తరక్షణమే శునకం ధర్మదేవతగా మారింది. అదిచూసి సంభ్రమానందాలతో నమస్కరించాడు ధర్మతనయుడు.

"కుమారా! నీ భూతదయకు మెచ్చుకున్నాను. నీపై విశ్వాసం చూపి నీతో భక్తిగా వచ్చిందని ఒక కుక్కను చేపట్టి ఇంద్రుడు తెచ్చిన దివ్యరథాన్ని కూడా ఎక్కనన్నావు! నీ ఉదాత్తత ఇంద్రుడు కళ్ళారా చూశాడు. ఇంక శరీరంతో పుణ్యలోకాలకు వెళ్ళు. అవ్యయపదాన్ని పొందు" అన్నాడు ధర్మదేవుడు ఆదరంగా.

●

# స్వర్గారోహణం

**శ**రీరంతో స్వర్గానికి వెళ్ళాడు ధర్మరాజు. "నా తమ్ముల్నీ, భార్యనూ, పుత్రమిత్రుల్నీ చూసి వచ్చి, తరువాత స్వర్గలోక సుఖాలన్నీ హాయిగా అనుభవిస్తాను" అన్నాడు.

"సరే! అయితే వీళ్ళ వెంట వెళ్ళు. నీకు నీ బంధువులందర్నీ చూపిస్తారు" అని చెప్పి అందుకు తగినవాళ్ళను చూపించాడు ఇంద్రుడు. నారదమహర్షి కూడా వాళ్ళను అనుసరించాడు.

మార్గమధ్యంలో ఒకచోట ఉదయసూర్యునిలా ఉన్నతాసనం మీద ప్రకాశిస్తున్న దుర్యోధనుణ్ణి చూశాడు అజాతశత్రుడు. "వీడు వట్టి లోభి! వీడి మూలానే మా కులమంతా నాశనమైంది. రాజులంతా చచ్చారు. పరమ సాధ్వి పాంచాలిని అవమానించిన తుచ్ఛుడు వీడు. ఇక్కడినుంచి నన్ను తక్షణం తీసుకువెళ్ళండి" అని తనకు మార్గం చూపిస్తున్న దేవతలతో అన్నాడు ధర్మరాజు. అతడు ముఖం తిప్పుకోవడం చూసి నవ్వాడు నారదుడు.

"ధర్మనందనా! యుద్ధంలో శరీరం విడిచిపెట్టి వచ్చాడు దుర్యోధనుడు. క్షాత్రధర్మంతోనేగదా ఇతడు రాజులను చంపింది! అది దుర్మార్గమెందుకౌతుంది? పాంచాలిని అవమానించడం మొదలైన ఎగ్గులన్నీ ఇక్కడ అనుకోకూడదు. ఇది దేవలోకం. మానవ సహజ వికారాలేవీ ఇక్కడ పనికిరావు!" అన్నాడు.

మహర్షి మాటలు ధర్మరాజుకు రుచించలేదు. "ముందు నన్ను నా వాళ్ళ దగ్గరకు పంపించండి. వాళ్ళు లేని స్వర్గం నాకు సహ్యం కాదు" అన్నాడు ధర్మరాజు.

అతని ఆనతి ప్రకారం దేవదూతలు ముందుకు కదిలారు. వారివెంట వెళ్ళాడు ధర్మరాజు. కొంతదూరం వెళ్ళేసరికి మార్గమంతా తల వెంట్రుకలతోనూ, ఎముకలతోనూ నిండి అసహ్యంగా వుంది. ఈగలూ దోమలూ ముసురుతున్నాయి. దుర్గంధం వీస్తోంది. ఇంకొంచెం దూరం వెళ్ళేసరికి ఉడుకుతున్న నూనె వంటి నీళ్ళతో నిండివున్న ఒక ఏరు కనిపించింది. అది వైతరణీనది. దాని ఒడ్డున ఇనుప ముళ్ళున్నాయి. కత్తులవంటి ఆకులతో ఒక వనం కూడా కనిపించింది. అది అసిపత్ర వనం. అక్కడ అనేక రకాల బాధలు అనుభవిస్తున్న పాపాత్ములున్నారు.

"అబ్బ! ఇదంతా చాలా అసహ్యంగా వుంది. వీళ్ళ బాధలు చూడలేకుండా వున్నాను. పదండి పోదాం" అని వెనక్కి తిరిగాడు అజాతశత్రుడు.

"మహాత్మా! దివ్య సువాసనలు గల నీ శరీరపు గాలి సోకి యిక్కడంతా పరిమళభరితమయింది. నిన్ను చూడటం వలన మా నరకయాతనలన్నీ తొలగిపోయాయి. ఇంకొంచెంసేపు దయతో ఇక్కడే నిలబడవా?" అని అక్కడ పాపకూపంలో బాధలనుభవిస్తున్న కొన్ని కంఠాలు దీనంగా అర్థించాయి. ఆ ప్రార్థనకు కరిగిపోయాడు ధర్మరాజు. 'పాపం! ఎంత కఠినమైన బాధలు అనుభవిస్తున్నారో వీళ్ళు' అని కాసేపు అక్కడే నిలబడ్డాడు.

ఆయన తిరిగి వెళ్ళబోయేసరికి మళ్ళీ అలాంటి మాటలే వినిపించాయి.

"ఎవరు మీరు?" ధర్మరాజు ప్రశ్నించాడు.

"నేను కర్ణుణ్ణి"

"మేము పాండుపుత్రులం"

"నేను ద్రౌపదిని"

– అన్నాయి కంఠాలు.

"అయ్యయ్యో! ఇలాంటి ఘోరం అనుభవించడానికి వీళ్ళేం పాపం చేశారు? ఒక్క మంచిపని కూడా చెయ్యని దుర్యోధనుడు సకల సుఖాలూ అనుభవిస్తున్నాడు. ఇతరులకు ఎన్నడూ ఇసుమంతైనా పాపం తలపెట్టని వీళ్ళు కష్టాలు పడుతున్నారు. ఏమిటీ తేడా! ధర్మదేవతకెందుకీ పక్షపాతం?" అంటూ దుఃఖించాడు ధర్మరాజు. "నా తమ్ములు ఇక్కడ బాధల్లో మునిగివున్నారు. కనుక ఇంక నేను ఇక్కడే వుంటాను. ఈ విషయం ఇంద్రుడితో చెప్పండి" అన్నాడు దేవదూతలతో.

వాళ్ళు వెంటనే వెళ్ళి ఆ సంగతంతా ఇంద్రుడితో చెప్పారు. ఇంద్రుడు వచ్చాడక్కడికి. ధర్ముడు కూడా వచ్చాడు. అప్పుడు పాపాత్ములు బాధలు అనుభవించడం, దుర్గంధం, వైతరణీనది, అసిపత్రవనం అన్నీ అదృశ్యాలయ్యాయి. దిక్కులన్నీ వెలిగాయి. "ధర్మతనయా! ఒక్క సంగతి చెబుతాను విను. రాజైనవాడు ప్రతివాడూ నరకాన్ని చూసితీరాలి. వేదాల్లో వుందిది. పుణ్యం వల్ల స్వర్గం, పాపం వల్ల నరకం అనుభవించాలి. అల్పపుణ్యం చేసినవాడు ముందు అమర సుఖం అనుభవిస్తాడు. అధికంగా పుణ్యం చేసినవాళ్ళు ముందు కొద్దికాలంపాటు నరకయాతనలు అనుభవించి ఆ తరువాత మిగిలిన కాలమంతా సుఖపడతారు. ఇప్పుడు నిన్నిక్కడికి పంపడం కూడా ఉత్తరోత్తరా నువ్వు సుఖపడటానికే" అన్నాడు ఇంద్రుడు.

వికసించిన ముఖంతో వినయంగా నమస్కరించాడు ధర్మరాజు. "ధర్మజా! విధివశం వల్ల తప్పింపరానివైన అల్పదుఃఖాలు అనుభవించావు నువ్వు. ఇదిగో! ఆకాశగంగ! ఇందులో మునిగి సకల సుఖాలనూ అనుభవించు. కర్ణుడితో సహా నీ తమ్ములందరూ వాళ్ళ వాళ్ళ స్థానాలలో ప్రకాశిస్తున్నారు" అన్నాడు ఇంద్రుడు.

"నాయనా! ఇదివరకు మూడుసార్లు పరీక్షించాను నిన్ను. ఇది నాలుగోసారి. నీ మనస్సులో ధర్మం ఎన్నడూ చలించలేదు. నా మీద భక్తి ఎక్కువ నీకు. మీ అన్నదమ్ముల అన్యోన్యత అపారం. నీ సోదరులు బాధలు పడడం మేము కల్పించిన మాయ! వాళ్ళు పుణ్యలోకాలలో వున్నారు. నువ్వూ అక్కడ హాయిగా వుందువుగాని పద" అన్నాడు ధర్ముడు.

వెంటనే ఆకాశగంగలో మునిగాడు ధర్మరాజు. మానుషదేహం పోయి దివ్యశరీరం వచ్చింది. ఆ తరువాత ఉత్తమగతులు పొందిన అన్నదమ్ముల్నీ, ఉదయ సూర్యప్రభతో వెలుగుతూన్న ద్రౌపదినీ చూసి పరమానందభరితుడయ్యాడు అజాతశత్రుడు. ●



# శుకమహర్షి

**పు**త్రుణ్ణి పొందాలన్న కోరికతో వ్యాసమహర్షి మేరుపర్వతం చేరి అక్కడ మహాదేవుణ్ణీ, మహాదేవినీ ఏడాదిపాటు తపస్సు చేశాడు. మహర్షి తపః ప్రభావం వల్ల జడలు కట్టిన ఆయన జుట్టు అగ్నిజ్వాలల్లా ప్రజ్వరిల్లింది. అప్పుడు శివుడు ప్రత్యక్షమై "చాలా తెలివైనవాడూ పరోపకారబుద్ధి కలిగినవాడూ విశేషమైన కీర్తిప్రతిష్ఠలు ఆర్జించేవాడూ నీపుత్రుడౌతాడ'ని వ్యాసమహర్షిని దీవించాడు. మహర్షి సంతోషించి మహాదేవుడికి కృతజ్ఞతలు చెప్పుకుని తన ఆశ్రమానికి తిరిగి వెళ్ళిపోయాడు.

ఒకరోజు అగ్నిహోత్రానికి సమిధలు సిద్ధం చేస్తూ వుండగా మహర్షికి కొడుకుని గురించిన ఆలోచనలు మళ్ళీ తలెత్తాయి. భార్య లేకుండా బిడ్డల్ని కనటమెలా అన్న ప్రశ్న వచ్చింది. ఆలోచనల్లో తలమునకలుగా వున్న మహర్షికి తన పక్కనే ఒయ్యారాలు ఒలకబోస్తూ ఘృతాచి కనిపించింది. మహర్షి కోపోద్రిక్తుడయ్యాడు. మునుల తపస్సును

తన అందచందాలూ, నాట్యవిలాసాలతో భగ్నం చేస్తూ వుంటుంది ఆ అప్సరస. అదీ కోపం ఆయనకు. ఘృతాచి భయపడిపోయింది. వెంటనే చిలక రూపం ధరించి ఎగిరి పారిపోయింది.

ఘృతాచి అందం, చిలకగా మారి ఆమె ఎగిరిపోయిన వైనం మహర్షిలో శృంగార భావనలు ప్రోదిచేశాయి. ఫలితంగా ఆయన ఒడిలో వున్న సమిధలు మలినమయ్యాయి. ఆ సంగతి మహర్షి గుర్తించలేదు. వాటినే ఆ తరువాత అగ్నిహోత్రానికి ఉపయోగించాడు. అగ్నిజ్వాలల మధ్యనుంచి దివ్యప్రభలతో ఒక బాలుడు బయటకు వచ్చాడు. అతనే ఆ తరువాత శుకదేవుడుగా ప్రసిద్ధి పొందాడు. చిలుకను చూసి మోహపడిన ఫలితంగా తనకు పిల్లవాడు పుట్టడం జరిగింది కనుక ఆ బాలుడికి శుకుడు అని పేరు పెట్టాడు మహర్షి. బృహస్పతి దగ్గర శుకదేవుడు అన్ని విద్యలూ పరిపూర్ణంగా నేర్చుకున్నాడు. విద్యాభ్యాసం పూర్తయిన తరువాత తండ్రి ఆశ్రమానికి తిరిగి వెళ్ళాడు.

విద్యాబుద్ధులు నేర్చిన కొడుకుని చూసి తండ్రి మహదానందపడ్డాడు. అనుకూలవతి అయిన కన్యను చూసి కొడుక్కి పెళ్ళి చేయాలనుకున్నాడు. కాని శుకదేవుడు అందుకు ఒప్పుకోలేదు. తండ్రి ఎంత నచ్చచెప్పినా ససేమిరా పెళ్ళి ఇష్టం లేదన్నాడు. సన్యాసిగానే మిగిలిపోయాడు. శుకదేవుడు వ్యాసమహర్షి ఆశ్రమంలో గీతాపఠనం ప్రారంభించాడు. కాని అందులోనూ ఆనందం కనిపించలేదతనికి. అది గ్రహించి వ్యాసమహర్షి కుమారుడికి ఆధ్యాత్మిక తత్త్వ రహస్యాలు బోధించాడు. ఆ తరువాత మిథిలానగరాన్ని ఏలే జనక మహాప్రభువు దగ్గరకు పంపాడు.

కాలినడక ప్రయాణం– కొండలూ కోనలూ దాటుకుంటూ యోగులు, శైవులు, వైష్ణవులు, తాపసులతో గోష్ఠులు జరుపుతూ, జ్ఞానసంపదను వృద్ధి చేసుకుంటూ రెండేళ్ళకు శుకుడు మిథిలానగరం చేరాడు.

సకలసంపదలతో శోభిల్లుతున్న మిథిలను చూసి శుకుడు అబ్బురపడ్డాడు. అక్కడ జనకుడు ఆయనకు ఘనంగా స్వాగతం చెప్పి ఉచితరీతిన పరిచర్యలు చేశాడు. అయినా అవేవీ శుకుడికి గిట్టలేదు. ఆ రాత్రల్లా తపస్సమాధిలో మునిగిపోయాడు. మరునాడు రాజయోగి జనకుణ్ణి తనకు మోక్షమార్గం ఉపదేశించమని అర్థించాడు.

"ఉపనయనం తరువాత ప్రతిఒక్కరూ వేదాలు పఠించాలి. ఆ తరువాత

తపస్సు, బ్రహ్మచర్యం, గురుపూజల ద్వారా దేవ, పితృ రుణాలు తీర్చుకోవాలి. ఇంద్రియ నిగ్రహం అలవరచుకోవాలి. ఆ తరువాత ఆచార్యుని అనుమతితో గృహస్థాశ్రమం స్వీకరించాలి. వానప్రస్థాశ్రమంలో జ్ఞానజ్యోతిని వెలిగించుకోవాలి. ద్వైదీభావాన్ని విడనాడాలి. కాంక్షని జయించి చివరికి బ్రహ్మాశ్రమాన్ని సాధించాలి. ఇదీ మోక్షమార్గం" అని జనకుడు ప్రబోధించాడు.

జనకుడి ఆదేశం మేరకు శుకుడు పినారిని పెళ్ళి చేసుకుని కృష్ణుడు, గౌరప్రభుడు, భూరి, దేవశృతుడు అనే నలుగురు కుమారుల్ని, కీర్తి అనే కుమార్తెను పొందాడు.

వానప్రస్థాశ్రమంలో శుకుడు వ్యాసమహర్షి వద్ద మహాభారతాన్ని అధ్యయనం చేశాడు. ఆ తరువాత యక్ష, గంధర్వ, రాక్షసులకు శుకమహర్షి వేద వేదాంగాల్నీ, పద్నాలుగు లక్షల శ్లోకాలతో కూడిన భారతాన్నీ బోధించాడు. ●

# పరీక్షిత్తు

**ఉ**త్తర, అభిమన్యుల కుమారుడు పరీక్షిత్తు. చంద్రవంశ కులదీపకుడు.

కురుక్షేత్రంలో కురు పాండవ సంగ్రామం ప్రారంభమైనప్పుడు ఉత్తర గర్భవతిగా వుంది. ద్రోణుని కుమారుడు అశ్వత్థామ ఒక రాత్రి పాండవుల శిబిరాలలోకి ప్రవేశించి దొరికినవారిని దొరికినట్టు హతమార్చాడు. అది చాలక బ్రహ్మ శిరోనామకాస్త్రాన్ని ప్రయోగించాడు. ఆ అస్త్రం వెళ్ళి ఉత్తర గర్భాన్ని తాకింది. శ్రీకృష్ణుడికి తెలిసిందీ సంగతి.

"అశ్వత్థామా! నువ్వు ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా ఉత్తర గర్భంలోని బిడ్డ బతికితీరుతాడు. గర్భస్థ శిశువును చంపజూచిన నేరం నిన్ను వెంటాడక మానదు. మూడువేలసంవత్సరాలు ఎటువంటి గౌరవం, ఆదరణ లేకుండా ఈ భూమి మీద నీచంగా బతుకుతావు. అన్నిరకాల వ్యాధులూ నిన్ను పట్టి పీడిస్తాయి. కాని ఈ బిడ్డ పునరుజ్జీవితుడై సకలవిద్యలూ నేర్చుకుని అరవైఏళ్ళపాటు ప్రజారంజకంగా

రాజ్యపాలన చేస్తాడు" అని పలికాడు.

భారత యుద్ధం పరిసమాప్తం కావస్తున్నప్పుడు ధర్మపుత్రుడు అశ్వమేధయాగం చేశాడు. హస్తినాపురంలో జరిగిన ఆ యాగానికి శ్రీకృష్ణుడితో సహా ఎందరో ప్రముఖులు వచ్చారు. ఆ సమయంలో ఉత్తర నెలలు నిండకుండానే మృతశిశువుని కన్నది. శ్రీకృష్ణుడికీ వార్త తెలిసింది. "నేను పరిహాసానికైనా అసత్యమాడనివాడనైతే, యుద్ధం నుండి మరలనివాడనైతే ఈ శిశువు జీవించుగాక! నాకు ధర్మమే ప్రియమైతే, విప్రుల పట్ల గౌరవం కలిగినవాడనైతే, అర్జునుడి పట్ల ప్రేమాభిమానాలు వుంటే, సత్యం, ధర్మం నాయందు నిశ్చలంగా వుంటే నా మేనల్లుడి కుమారుడు పునరుజ్జీవితుడగు గాక" అని మృతశిశువును స్పృశించాడు.

పిల్లవాడు మెల్లిగా కదిలాడు.

వంశం పరిక్షీణం కాగా అభిమన్యుడికి జన్మించినవాడు కాబట్టి ఆ పిల్లవాడు 'పరీక్షిత్తు' అయ్యాడు.

పరీక్షిత్తు పెరిగి పెద్దవాడయ్యాడు. రాకుమారి మాద్రవతిని పెళ్ళి చేసుకున్నాడు. ఆ దంపతులకు జనమేజయ, శృతసేన, ఉగ్రసేన, భీమసేన అనే నలుగురు కుమారులు కలిగారు.

పరీక్షిత్తుకి వేటంటే ప్రాణం. ఒకసారి జంతువులను వేటాడేందుకు అడవికి వెళ్ళాడు. అక్కడో లేడిపిల్లను చూసి ముచ్చటపడి బాణం వదిలాడు. అది తప్పించుకుని పారిపోతూండగా దాని వెంటపడ్డాడు. పరిగెత్తి పరిగెత్తి అలసిపోయాడు. కాని కనిపించలేదది. అక్కడికి దగ్గరలోనే ధ్యాననిష్ఠలో మునిగిన ఒక ముని కనిపించాడు. ఆయన దగ్గరకు వెళ్ళి లేడిపిల్లను గురించి అడిగాడు. తపోదీక్షలో వున్న మునికి ఆ మాటలు వినిపించలేదు. ఆయన సమాధానం ఇవ్వలేదు.

మహారాజు కోపగించి ఆ పక్కన నేలమీద పడివున్న మృతసర్పాన్ని ముని మెడలో వేసి వెళ్ళాడు.

ఆ మునికో కుమారుడు వున్నాడు. అతని పేరు గవిజాతుడు. స్నేహితులతో అతను ఆడుకుంటూ వుండగా మరో ముని కుమారుడు అతని దగ్గరకు వచ్చి "గవిజాతా! నీ తండ్రి అచ్చు శివుడిలా వున్నాడు. ఇద్దరి మెడల్లోనూ పాములు వున్నాయి. అయితే తేడా ఏమిటంటే శివుడి మెడలో సజీవసర్పాలుంటాయి. నీ తండ్రి మెడలో చనిపోయిన పాములున్నాయి'' అన్నాడు. స్నేహితుడలా

వెక్కిరించినందుకు గవిజాతుడు నొచ్చుకున్నాడు. వెంటనే ఆశ్రమానికి వెళ్ళి చూసి, తన తండ్రి మెడలోకి మృతసర్పమెలా వచ్చిందని ఆరా తీశాడు. సమాధానం దొరకలేదు. ఆగ్రహం వచ్చి "నా తండ్రి మెడలో మృతసర్పాన్ని ఎవరైతే వేశారో వారు ఏడు రోజుల్లోగా విషసర్పం తక్షకుడి వాతపడి మరణింతురు గాక" అని తీవ్రంగా పలికాడు. ఆ తరువాత ఆ పని చేసింది సాక్షాత్తూ పరీక్షిత్తు మహారాజేనని గవిజాతుడికి తెలిసింది. పుణ్యాత్ముడైన పరీక్షిత్తు ఇంత కూడనిపని ఎలా చేశాడా అని విచారించి వెంటనే తను ఇచ్చిన శాపం గురించి మరో ముని కుమారుడు గురుముఖుడి ద్వారా రాజుకి తెలియబరిచాడు.



పరీక్షిత్తు భయపడి మంత్రులందర్నీ సమావేశపరచి, తక్షకుడి బారినుండి బయటపడి శాపాన్ని తప్పించుకునే మార్గం చెప్పమని అడిగాడు. వారు అతిపెద్దదైన ఒక ఒంటి స్తంభాన్ని నిర్మించి దానిమీద ఒక భవనాన్ని కట్టారు. దాని చుట్టూరా రక్షణ ఏర్పరిచారు. విషానికి విరుగుడు కల్పించే విద్య నేర్చిన పెద్దలందర్నీ పిలిపించి ఆ స్తంభం చుట్టూరా కూర్చోపెట్టి విషవైద్య మంత్రాలు పఠించనున్నారు. ఒంటిస్తంభం

మేడమీది గదిలో చీమ కూడా చొరబడటానికి వీలులేకుండా తలుపులన్నీ బంధించుకుని కూర్చున్నాడు రాజుగారు. ఆరు రోజులు గడిచాయి. ఏడోరోజున పరీక్షిత్తు మహారాజు కబురంపగా విష వైద్య నిపుణుడు కశ్యప మహర్షి ఒంటిస్తంభం మేడ దగ్గరికి బయలుదేరాడు. తక్షకుడు కూడా విప్రుడి వేషంలో వెళ్తున్నాడు. ఇద్దరూ మార్గమధ్యంలో కలుసుకున్నారు.

"కశ్యప మహర్షీ! నేను తక్షకుణ్ణి. ఘోర విషసర్పాన్ని. మహారాజును రక్షించేందుకు నీవు చేసే ప్రయత్నాలేవీ ఫలించవు. నా విషపు కోరలకు గురైన తరువాత మొక్కయినా మనిషైనా ఎవరూ బ్రతకడానికి వీల్లేదు" అని ఎదురుగా వున్న పచ్చటి అరటిచెట్టును కాటు వేశాడు. అది తక్షణం నిలువెల్లా నల్లబడి నిర్జీవమయింది. కశ్యపుడు నవ్వి విషహారి మంత్రం పఠించి చేతిలో నీళ్ళు తీసుకుని ఆ మృతవృక్షంపై చిలికాడు. మళ్ళీ పచ్చటి చెట్టుగా నిలిచిందది. తక్షకుడు నివ్వెరపోయాడు. సొమ్ము ఎరచూపి మునిని మళ్ళించి మేడ చేరాడు. మహారాజు ప్రాణాలు కాపాడేందుకు మంత్రులు చేసిన కట్టుదిట్టం చూసి తక్షకుడు ఆశ్చర్యపోయాడు. చివరికి ఒక ఉపాయం ఆలోచించి తన మిత్రులందర్నీ బ్రాహ్మణుల వేషాల్లో రప్పించి రకరకాల పళ్ళూ, పూలూ రాజుగారికి బహుమానాలుగా ఆయన సేవకుల ద్వారానే లోపలికి పంపాడు. మిసమిసలాడే ఒక పండులో క్రిమి రూపాన తనూ దాక్కున్నాడు.

రాజుగారి భటులు ఆ పళ్ళు, పూలు తీసుకుని లోపలికి వెళ్ళారు. రాజుగారు వాటిలోంచి మిసమిసలాడుతున్న ఆ పండుని తీసుకుని కత్తితో రెండు ముక్కలు చేశారు. వాటి మధ్యలో ఆయనకు ఎర్రటి క్రిమి ఒకటి కనిపించింది. చేతితో దానిని తీసేయబోయారు. వెంటనే అది కాలకూట సర్పంగా మారి రాజుగారిని కాటేసింది. మరుక్షణం మాయమైపోయింది. ●

# జనమేజయుడు

**సూ**ర్యవంశ ప్రభువుల్లో పరీక్షిత్తు మహారాజు గొప్పవాడు. ప్రజలను కన్నబిడ్డల్లా పాలించాడు. ఆయనకు వేటంటే చాలా ఇష్టం. ఒకసారి అడవికి వేటకు వెళ్ళాడు. జంతువులను వేటాడి వేటాడి అలసిపోయాడు. బాగా దప్పికయింది. మంచినీటి మడుగుకోసం వెతుకుతూంటే శమీక మహర్షి ఆశ్రమం కనిపించింది. లోపలికి వెళ్ళి "దాహంగా ఉంది. తాగేందుకు మంచినీళ్ళు కావాలి" అని అడిగాడు. మహర్షి ధ్యానసమాధిలో ఉండడం వలన ఆశ్రమం లోపలికి ఎవరు వచ్చింది కూడా ఆయనకు తెలీలేదు. అందుకని సమాధానమివ్వలేదు.

శమీకుడి మౌనాన్ని పరీక్షిత్తు తప్పుగా అర్థం చేసుకున్నాడు. ఈ మహర్షి కింత అహంకారమా అనుకుని చచ్చిన పాము నొకదాన్ని ఆయనమీదకు విసిరేశాడు. అది తెలిసి కోపించిన శమీకుని కొడుకు గవిజాతుడు "తపోనిష్ఠలో ఉన్న నా తండ్రిపైకి ఎవరైతే పామును విసిరారో వాళ్ళు సర్పరాజు తక్షకుడి కాటుతో ఏడు రోజుల్లోగా మరణిస్తారు" అని తీవ్రంగా శపించాడు.

గవిజాతుడు దేవీభక్తుడు. అతని మాటకు తిరుగులేకుండా పోయింది.

తక్షకుడి కాటుతో పరీక్షిత్తు మరణించాడు. అప్పటికి మహారాజు కుమారుడు జనమేజయుడు చిన్నవాడు. మంత్రులే మహారాజుకు అంతిమసంస్కారం చేశారు. రోజులు గడుస్తున్నాయి. జనమేజయుడికి యుక్తవయస్సు వచ్చింది. మంచి ముహూర్తాన రాజ్యపాలన స్వీకరించాడు. అనతికాలంలోనే సమర్థుడైన రాజుగా పేరు పొందాడు. కాశీరాజు సువర్ణవర్మకు జనమేజయుణ్ణి గురించి విన్నప్పటినుంచీ అతన్ని తన అల్లుడుగా చేసుకోవాలని కోరికగా ఉండేది.

సువర్ణవర్మ కుమార్తె వపుష్టకు కూడా జనమేజయుడే భర్త కావాలని ఉండేది.

అనుకున్నట్టే జరిగింది.

జనమేజయుడికీ, వపుష్టకీ ముల్లోకాలూ మురిసిపోయేలా వైభవంగా పెళ్ళి జరిగింది.

ఒకసారి జనమేజయుడు కొలువుతీరి వుండగా ఉత్తాంక మహర్షి వచ్చాడు. జనమేజయుడు చేతులు జోడించి ఆయనకు నమస్కరించి, పద్మసింహాసనంలో ఆయనను కూర్చోబెట్టి, బంగారుపళ్ళెంలో ఆయన కాళ్ళు కడిగి మధుపర్కం సమర్పించి సత్కరించాడు.

రాజుగారి ఆదరోపచారాలతో ఉత్తాంకుడు సంతృప్తి చెందాడు.

ఆ తరువాత వాళ్ళమధ్య చాలాసేపు కుశలప్రశ్నలు జరిగాయి. మాటల మధ్యలో పరీక్షిన్మహారాజు ఎలా మరణించిందీ చెప్పాడు ఉత్తాంకుడు.

రాజు అగ్గిమీద గుగ్గిలమయ్యాడు.

సర్పాలన్నిటినీ సమూలంగా నాశనం చెయ్యాలని నిర్ణయించాడు.

"పాములు ఎక్కడ కనబడితే అక్కడే మట్టుపెట్టండి" అని ఆజ్ఞ జారీ చేశాడు.

అంతటితో ఆగక ఋత్విక్కులందర్నీ సమావేశపరిచి పాముల మీద కక్ష తీర్చుకునే విధం తెలియచెప్పండని అడిగాడు. సర్పయాగం చెయ్యమని వాళ్ళంతా సలహా ఇచ్చారు. క్షణాలమీద యాగానికి కావాల్సిన ఏర్పాట్లన్నీ జరిగిపోయాయి.

ఉత్తాంక, చండభార్గవ, ఉద్దాలక, ఆత్రేయ, శ్వేతకేతు, నారద, దేవల, దేవశర్మ, మౌద్గల్య మహర్షులు యాగానికి ఆధ్వర్యం వహించారు.

సర్పయాగం ప్రారంభమైంది. నల్లటి వస్త్రాలు ధరించి మంత్రగానం చేస్తున్న

మునులు పాములు పాలిట యమదూతల్లా ఉన్నారు.

యజ్ఞగుండంలో ఆజ్యం పోస్తున్నప్పుడల్లా మంటలు ఉవ్వెత్తున లేస్తున్నాయి.

తాపసుల మంత్రోచ్చారణకు పాములు నిలవలేకపోతున్నాయి. ఎగిరొచ్చి ఒకదాని వెంట ఒకటి మంటల్లో పడుతున్నాయి. అన్నీ అగ్నికి ఆహుతవుతున్నాయి. తక్షకుడు అగ్నికి భయపడి ఇంద్రుణ్ణి ఆశ్రయించాడు. ఇంద్రుడు అతనికి అభయమిచ్చాడు.

ఈ సంగతి ఋత్విక్కులకు తెలీక అసలైన శత్రువు తక్షకుడు చావునుంచి తప్పించుకుంటున్నాడని యాగాన్ని ఉధృతం చేశారు. దానితో తక్షకుడికి ఒళ్ళంతా మంటలు లేచాయి. ఇక చావు తప్పేట్టు లేదనుకున్నాడు.

తన చెల్లెలు జరత్కారుప్రియను పిలిచి ఈ ఆపద నుంచి గట్టెక్కే ఉపాయమేదో ఆలోచించమన్నాడు. తక్షకుడి చెల్లెలు నాగేశ్వరి జరత్కారుమహర్షిని పెళ్ళాడినందువల్ల జరత్కారుప్రియ అని కూడా ఆమెను పిలుస్తారు. ఆమె ఆ బాధ్యతను తన కొడుకు ఆస్తీకుడికి అప్పగించింది. అతను యాగం జరిగేచోటికి బయలుదేరాడు. తక్షకుడి జాడ తెలీక ఈలోగా ఉత్తాంకుడు కోపోద్రిక్తుడై తనకున్న దివ్యశక్తులతో లోకాలన్నీ గాలించాడు. తక్షకుడు అమరావతీ పట్టణంలో ఇంద్రుడితోపాటు సగం సింహాసనాన్ని అధిష్టించి ఉన్నాడు. అది చూసి ఉత్తాంక మహర్షికి మరీ కోపం వచ్చింది. 'ఇంద్రుడు నిన్ను రక్షించేవాడా' అనుకుని ఇంద్రుడూ, ఇంద్రసింహాసనమూ, తక్షకుడూ అందరూ యాగగుండంలో మాడి మసైపోవాలని ఉత్తాంకుడు దర్భలు చేతబట్టుకుని మంత్రాలు పఠించాడు.

ఇంద్రసింహాసనం కదిలింది.

ఇంద్రుడూ, తక్షకుడూ నిలువెల్లా వణికిపోయారు. అదే సమయానికి ఆస్తీకుడు యాగశాలను చేరుకున్నాడు.

యాగశాలలోకి ప్రవేశించిన ఆస్తీకుడికి జనమేజయుడు ఉచితరీతిన మర్యాదలు చేసి "కార్యార్థులై వచ్చినట్టున్నారు. నావల్ల కాదగిన సహాయమేమిటో చెప్పండి. తప్పకుండా చేస్తాను" అన్నాడు వినయంగా.

"సర్పయాగాన్ని తక్షణమే నిలుపుచెయ్యాలి."

జనమేజయుడు నిశ్చేష్టుడయ్యాడు. అయినా ఆడినమాట తప్పడానికి వీల్లేదు. తనవల్ల కాదగిన సాయమేదైనా సరే చేస్తానన్నాడు. చేసి తీరవల్సిందే!

సర్పయాగం ఆగిపోయింది.

యాగంలో మృతిచెందిన పాములన్నిటికీ ముక్తి లభించి జన్మరాహిత్యం కలిగేలా దీవించాడు ఆస్తీకుడు. **“జీవహింసకు మించిన పాపం లేదు. మనస్సులో చీకట్లు ముసిరిన వాడే హత్యలు చేస్తాడు. కక్షాకార్పణ్యాలు నిండిన మనస్సులోకి వెలుగు చొరబడదు. బుద్ధినీ, అంతరంగాన్నీ విశాలం చేసుకో”** అని ఆస్తీకుడు జనమేజయుడికి ఉపదేశించాడు.

జనమేజయుడికి జ్ఞానోదయమైంది.

జనమేజయుడు సర్పయాగం నిలుపుచేసిన తరువాత అశ్వమేధయాగం చేశాడు. వేదవ్యాసుడు ఆ యాగానికి హాజరై జనమేజయుడికి జీవన్మరణ రహస్యాలను బోధించాడు. “నీ తండ్రిని నీకు చూపిస్తానుండమ”ని స్వర్గంలో ఉన్న పరీక్షిత్తుని కిందకు దిగిరమ్మని మహర్షి ఎలుగెత్తి పిలిచాడు.

అంతే!

పరీక్షిత్తు మహారాజు దివ్యదేహంతో ప్రకాశిస్తూ జనమేజయుడి ముందు ప్రత్యక్షమయ్యాడు.



జనమేజయుడి ఆనందానికి అవధుల్లేవు. వినయంగా వంగి తండ్రి పాదాలను తాకాడు. తండ్రి బిడ్డను ప్రేమగా దగ్గరకు తీసుకుని గుండెలకు హత్తుకున్నాడు. వెనువెంటనే అంతర్హితుడయ్యాడు.

వ్యాసమహర్షి మహిమకు అందరూ ఆశ్చర్యపోయారు.

ఇదీ జనమేజయుడి కథ.

ఈ జనమేజయుడికే వ్యాసమహర్షి శిష్యుడు వైశంపాయనుడు మహాభారత కథను వినిపించాడు.

కురుక్షేత్ర మహాసంగ్రామం ముగిసాక దాదాపు ముప్ఫయి ఆరేళ్ళు పాండవులు రాజ్యపాలన చేశారు. అనంతరం పరీక్షిత్తుకి రాజ్యభారం అప్పగించి పాండవులు అరణ్యాలకు తపస్సు చేసుకునేందుకు వెళ్ళారు. పరీక్షిత్తు సుమారు అరవై సంవత్సరాలు రాజ్యాన్ని ఏలాడు. ఆ తరవాత జనమేజయుడు పరిపాలించాడు. ●